# శిల్ప దర్శనము






శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

శ్రీ వీరరాఘవ గ్రంథావళి :

# శిల్ప దర్శనము

(పరివర్ధిత సంస్కరణము)

*

శిల్పసాహిత్యములు నాకు జీవ గఱ్ఱలు—
ఔపనిషదవనాలు విహార వీధులు—
ఈ చరాచరాత్మక జగద్ధితము వ్రతము
నడపు మిటు నాదు జీవితనాటకమ్ము.

*

దర్శనాచార్య, కళాప్రపూర్ణ
డాక్టర్ కొండూరు వీరరాఘవాచార్యులు
తెనాలి.

ప్రథమ ముద్రణము 1946

ద్వితీయ ముద్రణము 1978



ప్రకాశకులు :

శ్రీమతి కె. రాజేశ్వరమ్మ

ప్రతులకు :

గ్రంథకర్త, గాంధినగరం - తెనాలి.

గుంటూరుజిల్లా.



మూల్యము రు. 12-00

ముద్రణ :

సర్వోదయ ప్రింటర్స్, తెనాలి.

# అభిజ్ఞుల అభిప్రాయములు

## కీ॥ శే॥ వేలూరి శివరామశాస్త్రిగారు

శ్రీ వీరరాఘవాచార్యుల వారు లలితకళలలో అందెవయిచినవారే కాక ఆనందకుమారస్వామి, ఒ. సి. గంగూలి, మొదలగువారి కోవకు చెందినవారు. తెలుగువారు నిలుపేదలగుటచే ఈశిల్ప మంతయు విరటుని ఓలగమున ద్రౌపదివలె నున్నది. ఆంధ్రప్రభుత్వము ఎప్పుడో కన్ను తెఱచునని నా విశ్వాసము.

చిరివాడ
29—10—64

(సం) వేలూరి శివరామశాస్త్రి
శతావధాని

## కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

సంస్కృతమునను ఆంగ్లాది భాషలయందును గల శిల్పశాస్త్ర గ్రంథములను బరిశీలించి, దేశమునగల శిల్ప, తద్రచయితల గణ్యతను గుర్తించి రచియించిన మీ శిల్పదర్శనము నాకు చాల వేడ్కగొల్పినది. ఇట్టి గ్రంథమును ఇంతవఱ కెవ్వరును తెల్గున రచించి యుండలే దను కొందును. మీరు గట్టిప్రయత్నముతో నిట్టి గ్రంథమును నేడు రచించితిరి. దివ్యశిల్పములు, వాని శిల్పులు సర్వదా పూజార్హులు. మీ గ్రంథము తత్పూజనము కొంత జరిపినది. ప్రాచీన భారతశిల్ప, తద్రచయితల చరిత్ర మింక నెంతో అవ్యక్తముగా నడగి యున్నది. (కొంత అఱుగారి పోయినదికూడ.) మీరందు కొంతవఱకైనను తద్రచనము జరిపితిరి. నేను శిల్పశాస్త్ర రహస్యముల నెఱుగనివాడను. మీ గ్రంథము తద్రహస్యముల నెన్నింటినో నాకెఱింగించినది. మీ వచనరచన చాల హృద్యము. ఇట్టి గ్రంథము లింకను రచింప గలుగునట్లు భగవదనుగ్రహము మీ యెడ పరగు గాక !

తిరుపతి
5—4—1947

చిత్తగింపుడు.
(సం) వే. ప్రభాకరశాస్త్రి

కవిసమ్రాట్ డాక్టర్

# కీ॥ శే॥ విశ్వనాథ సత్యనారాయణగారు

ఈ రచయిత ఇంతకు పూర్వము బహుగ్రంథములను రచించిరి. అందులో "శిల్ప దర్శన" యొక విలక్షణమును, సుప్రసిద్ధమునయిన గ్రంథము. ఈ శిల్పదర్శనము, వీరు వ్రాసిన "ఆత్మదర్శన" మను మరి యొక గ్రంథము - ఈ రెంటిని జదివినచో వీరియొక్క పాండిత్యము విస్పష్టము కాగలదు. వీరియొక్క ఆత్మజిజ్ఞాస, ఆత్మతత్త్వ పరిజ్ఞానము, భారతదేశముయొక్క సర్వవిద్యలకు ఓంకారము మూలమగుట, అన్ని విద్యలు వేదమునుండి పుట్టుట వీరికి తెలిసిన విషయములని తెలియును. వీరు ఉపనిషత్తులను జాగ్రత్తగా చదివి బహుస్థలములందు వానినుండి మంత్రముల ననువదింతురు. "శిల్పోపనిషత్తు" "సమరాంగణ సూత్ర ధారము" "యజుర్వేదీయ - విశ్వకర్మ సూక్తము" "కాశ్యపశిల్పము" "మయవాస్తు" "మయశిల్పము" "మానసారము" "విశ్వకర్మ పురాణము" - మొదలైన మహాగ్రంథములను పఠించి వానిలోని అనేక విషయముల నుదాహరించిరి, ఇది సామాన్యమైనపని గాదు. పాండిత్య ముతో కూడినపని. శ్రద్ధయు,జిజ్ఞాసయు లేనిచో ఇట్టివి చేయుట సాధ్యము కాదు. అన్ని దర్శనములతో పాటు యోగదర్శనమును వీరు పఠించిరి. దానిని చక్కగా తెలిసికొని అనుష్ఠించిరి. వీరి "ఆత్మదర్శనము" "శిల్ప దర్శనము" అను రెండు గ్రంథములను చదివినచో వీరు సర్వవిద్యలకు మూలభూతమైన వస్తువేదియో తెలిసికొని, అది ఎట్లు పరిణమించినదో గ్రహించి, అనుభవించి, వివరించి వ్రాసినట్లు తెలియగలదు. ఈయన గొప్ప తాత్త్వికులు. అన్ని విషయములకు మూలవస్తువునుండియే జరిగిన ప్రవాహమును గుర్తింప శక్తిగలవారు. ఇది భారతీయ విద్యారహస్యము ;

ఈ రచయిత సచ్ఛీలుడు. వేదశాస్త్రాదులు, లౌకికవిద్యలు బాగా చదువుకొన్న మంచిపండితుడు. బహువిషయ పరిజ్ఞానము కలవాడు. భారతదేశ శిల్పవిద్యయందు మహాదరము కలవాడు. పాండిత్యమునందు వలె కవితయందుగూడ అందెవేసిన చేయియే! ప్రసన్నమైన శైలితో గుణోదారమై వీరి కవిత ఒప్పుచుండును. ఇందుకు వీరి "అమరావతి, తోరణము" – అను కావ్యములు చక్కని నిదర్శనములు. ఇన్ని లక్షణ ములు ఒకే వ్యక్తిలో నుండుట యరిది. ఇది ఈయనభాగ్యము ఈయనను కన్నదేశపు భాగ్యముకూడ. కనుకనే ఈయననుండి కవిపండితులుకూడ నేర్చుకొనవలసిన విషయములు చాల కలవనుచున్నాను. ముఖ్యముగా వీరి శీలము, సత్ప్రవర్తన ఎల్లరికి అనుసరణీయములు. వీరి "శిల్ప దర్శనము" "శిల్ప కళాక్షేత్రములు" అను గ్రంథములు ఆంధ్రులు ప్రత్యేకముగా చదువదగినవి.

"ఆ రోజులు పోయినవి. ఇప్పు డివి యక్కరలే" దనువా రుండ వచ్చును. నీ విశ్వాసమెట్లైన నుండనిమ్ము. బహు విషయములు తెలిసి కొనుట విజ్ఞానములోని భాగముకదా! బహుదేశములలోని యాచారము లను, సంప్రదాయములను తెలిసికొని ఎట్టివారైన సంతోషించుట కలదు. "ఓహో, ఆ దేశమునం దిట్లుండును కాబోలు." అనుకొనుట బుద్ధియందు కలిగెడి ఒక చమత్కృతి. అది మనస్సునకు ఉత్తేజ(క)ము కాగలదు. అందుకొఱకు దేనినైన తెలిసికొనవచ్చును. తెలిసికొనుటలో తప్పు లేదు. ఏదో లాభ ముండకపోదు. అందులో మన మే దేశమునందు పుట్టినామో, ఏ గాలిని పీల్చుచున్నామో, ఏ నీటిని త్రాగుచున్నామో–ఆదేశముయొక్క పూర్వచరిత్ర – శిల్పాదులను తెలిసికొనుట మఱియు నావశ్యకమైన విషయము. అందుచేత నీ గ్రంథ మవశ్యపఠనీయ మనుచున్నాను. ఈ

గ్రంథమును రచించిన శ్రీ వీరరాఘవాచార్యులుగారు మిక్కిలి ప్రశంసింప దగినవారు.

కవిసమ్రాట్

(సం.) విశ్వనాథ సత్యనారాయణ

(శ్రీ విశ్వనాథవారు వీరరాఘవాచార్యులుగారిని గూర్చి ఆంధ్రప్రభలో వ్రాసిన వ్యాసములోని భాగము)



## "రామకృష్ణప్రభ"

'ఆత్మదర్శనము' 'నిరంజన విజయము' మున్నగు తమ గ్రంథ రాజముల వలన ఆంధ్రదేశము నంతటిని ఆకర్షించిన మహారచయితలగు శ్రీ ఆచార్యులవారి "శిల్పదర్శనము" ను రచించుట బ్రహ్మానంద దాయకము. కేవల శాస్త్రపాండిత్యమే కాక, సాధనసంపదయు, భావప్రదీపకమగు భాషయు పట్టువడి యుండుటచే వీరిట్టి యుత్కృష్ట గ్రంథములను రచింపగలుగుచున్నారని చెప్పనొప్పును.

మహోన్నత విషయములను పండితపామర రంజకముగా సులలిత శైలిలో ప్రదర్శింపగల్గుట సామాన్యరచయితల కలవికాని పని. ఈ మహా కార్యమును శ్రీ ఆచార్యులవారు అవలీలగా నిర్వహింపగల్గి యున్నారని గ్రంథమందలి యే పుట తీసి చదివినను తేటతెల్లము కాగలదు. భారతీయ నాగరికత, భారతీయ సంస్కృతి, భారతీయ మతధర్మములును—నిజముగా నెంతటి ప్రభావోపేతములో తెలియుటకిట్టి గ్రంథము లత్యంతావశ్యకములై యున్నవి. తెలుగుభాష తెలిసిన ప్రతివ్యక్తియు నీ గ్రంథమును పఠించి లబ్ధి నొందుఁగాక!

## "అరుణోదయం"

**1-1-1947**

గ్రంథమునందే ప్రకరణమున ఏపుట తీసి చదివినను విమర్శ నాత్మకమగు శిల్పచర్చ కానవచ్చుచున్నది. మొదటి ఆరు ప్రకరణములలో శిల్పతత్త్వమునుగూర్చిన హృదయభావోద్గారము ప్రవాహమువలె పర్వులెత్తినది. ఇందలి ఉత్కటభావములు ఉద్ధుర ధారాతరంగములై పాఠకుని శిల్పతత్త్వముయొక్క అగాధపు లోతులలోనికి గొంపోయి ముంచివేయుచున్నవి. ఈ ఆరు ప్రకరణములు — నిశితబుద్ధి, శిల్పతత్త్వజిజ్ఞాస గల ఊర్జితభావ సంపన్నులకే వేద్యమగునంతటి భావైకమయ జగత్తులోని బాటలుగా ఉన్నవి. గ్రంథకర్తకుగల వేదవేదాంగపాండిత్యము, శిల్పశాస్త్ర వైదుష్యము, సాహితీప్రౌఢిమ గంగా యమునా సరస్వతులవలె కలసి పరువులు పెట్టుచున్నవి.

సమరాంగణుని రసయంత్రమునుగూర్చి సందేహించువారు అమెరికాలోని బఫెల్ బాంబర్లు (MERCURIAL VAPOUR) పాదరసపుటావిరితో తయారు చేయబడినట్లు వారి LITERARYDIGEST లోని వ్యాసమును చదివి తెలిసికొని, తమ అజ్ఞతకు తల వాల్చుకొనగలరు. .... "స్థాపత్య వేదము"నకు పూర్వాధ్యాయములు ప్రాచీనార్షదృష్టిని, ఈవలి అధ్యాయములు నేటికాలపు పరిశోధనాదృష్టిని వెలయించి శిల్పదర్శనములో శిల్ప మహిమదర్శనమును అందించుచున్నవి. గ్రంథకర్త "ఆత్మదర్శనము"న జ్ఞానమును, శిల్పదర్శనమున విజ్ఞానమును ఆంధ్రలోకమునకు పంచి త్రిలింగభారతికి అపూర్వరమణీయమైన సేవ చేసియున్నారు. వీరి కృషి చిరాభినందనీయము. విద్యాలయములు, గ్రంథాలయములు, ప్రజలు, పండితులు ఉపయోగించుకొనవలసిన గ్రంథము —

# తిలకము

"ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, తరతి శోక మాత్మవిత్ ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" ఇ మొదలగు ఉపనిషత్సూక్తులు చిన్ననాటనుండియు హృదయమును ఆ కర్షించినవి. జగత్సంతరణమునకు ఆత్మదర్శనము హేతువు కావు మానవుని దృష్టిని అవి ఆకర్షించుట వింతకాదు. సచ్చిదానంద సుంద మగు ఆత్మ విలాసమును చూడలాడకున్న జన్మకు ధన్యత్వము లేదుకదా ఆత్మక్రీడ, ఆత్మరతి మానవునకు అవశ్యానుష్ఠేయము లై సద్వ్రతములు.

జగత్తు నామరూపములతో కూడినది కావున, మనుష్యుని జగత్క్రీ డకు నామరూపములు కేళీరంగము లయినవి. జగత్క్రీడకే కాదు, ఆత క్రీడలో పరాకాష్ఠను అందుటకును నామరూపోపాసన సాధనమై ఒప్ప చున్నది. అనిర్వచనీయమగు శబ్దబ్రహ్మమును ఉపాసించి, పరావాక్తత్త్వమ నెఱింగి పరబ్రహ్మప్రాప్తి నందునని "శబ్దదర్శనము" చాటుచున్నది సుందరమగు రూపబ్రహ్మమును ఆరాధనము చేసి నిరాకార నిత్యపరిపూ శాశ్వత చిద్రసమున ప్రాణి రసీభవించునని రూప (శిల్ప) దర్శనమ వక్కాణించుచున్నది. ఈ యుభయదర్శనముల మార్గములును వేని క వేఱుపడియే లేవు. ఒకదానితో వేఱొకదానికి ఘనిష్ఠమగు సంబం మున్నది. ఉత్తమోపాసనలో రెంటికిని చక్కని యనుసంధాన మున్నద "దేవాలయశిల్పము"లో సూచితమైనది. సాంప్రదాయిక సుసిద్ధాంతము ఖిలములై, సద్గ్రంథములు కఱవైనవి కావున, ఈనాడు నామరూపదర్శ సాహిత్యమునుగూర్చి నచ్చజెప్పుట సులభము కాకపోవచ్చును. అయిన "నాన్యః పంథా విద్యతేఽయనాయ" అన్నట్లు జగత్సంతరణమున నామరూపోపాసనకన్న వేఱుమార్గము సుగమముకాదు. సంతరణహేతు

లైన సాధనము లన్నియు వీనిలో నంతర్భూతములగుట వీనికున్న ప్రత్యేకత. మానవుని ఐహికలీలకును, పారమార్థిక ప్రయాణమునకును వైరములేని రీతిగా ఈ యుభయదర్శనములు దారిచూపుచున్నవి. ఆత్మ క్రీడను మఱచి, జగత్క్రీడయందే తగుల్కొన్నచో చార్వాకము నెత్తి కెక్కి పాతిత్యము కలుగును. ఆత్మదృష్టి కలిగి జగత్క్రీడయొక్క యర్థము నెఱింగి, నామరూపసాధన ప్రణాళికలో నిమగ్నుడైనచో అది ముక్తి హేతువై లోకసంగ్రహకారక మగును. ఇదియే సనాతనమగు ఆర్షదృష్టి. ఈ దృష్టితోడనే సానగాదులగు శిల్పఋషులు జగదాత్మ తత్త్వమును వ్యక్తీకరించిరి.

జగత్క్రీడలో నామమునుండి వ్యక్తమయినది శబ్దదర్శనము, లేదా సాహిత్య దర్శనము. రూపతత్త్వమును చాటునది శిల్పదర్శనము. పరమతత్త్వ ప్రకాశకమగు ఆత్మదర్శనము మూడవది. ఆర్షహృదయమును అర్థము చేసికొని, ఈశ్వరాదేశముగా ఈ దర్శనత్రయము విరచితమైనది. అగ్రతత్త్వమాత్మ కావున, ఆత్మదర్శనము ముందు వెలువడెను. జగద్విభుడు రూపములను సృజించి నామకరణ మొనర్చెను గావున (సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వా ఽభివదన్ యదాఽస్తే.) శిల్పదర్శ రెండవదగుట సముచితముకూడ.

శిల్పదర్శనములో ముఖ్యముగా శిల్పతత్త్వమే దర్శనఫక్కికలో ప్రతిష్ఠాపిత మొనర్చు ప్రయత్నము స్వీకృతమైనది. ఇది స్వోపజ్ఞము కాదుగాని, ప్రకృతమున నష్టమైన మహర్షులగు శిల్పాచార్యుల హృదయమును ఆలోచనా విశితమగు దృష్టితో ఆవిష్కరించుట అనదగును ఇందలి కృతకృత్యతకు తజ్ఞులగు సహృదయులే ప్రమాణము. ఈ దృష్టితో శిల్ప దర్శనము ప్రవర్తిల్లినది కావున, ఇందు శిల్పతత్త్వమే ప్రాధాన్యమునంది

నది. దానిని బలపఱచుటకే "సర్వం శిల్పమయం జగత్" అనునట్ల భావ వాఙ్మయాది శిల్పరహస్యములు స్థాపత్యవేద, శిల్పబ్రహ్మల హృదయ ములు ఇందు ప్రస్తావింపబడినవి.

శిల్పదర్శనములో సుందరములగు చిత్తరువులో, ప్రతిమలో అజంతా మున్నగు శిల్పక్షేత్రముల వివరములో, శిల్పాభివృద్ధికి తోడ్పడి రాజుల ఉదంతములో, వారి వారి కాలములందలి శిల్పాభివృద్ధిమార్గములో శైలిలో తెలిసికొందమని వేడుకపడువారికి ఈ గ్రంథము ఆశాభంగమ కలిగింపవచ్చును. ఆ యా అంశములను సూచించుటకు ప్రత్యేక ప్రత్యేక గ్రంథములు కలవు. శిల్పదర్శనోద్దేశ్యము మాత్రము అది కాదు. అయి వను అట్టి అంశములకు దిఙ్మాత్రముగా ఇందు ప్రశంస లేకపోలేదు పాఠకులు ఈ గ్రంథమును చక్కగా చదివి శిల్పమహిమను అర్థమ చేసికొన్నయెడల నాకృషి సార్థకమైనదని భావింపగలను.

పత్తేనపల్లి
వ్యయ ఆశ్వయుజ
మహానవమి. 1946

గ్రంథకర్త

నాగపుర విశ్వవిద్యాలయమున ఇంగ్లీషు ప్రొఫెసరుగానున్న
డాక్టర్ పోతుకూచి

# సుబ్రహ్మణ్య శాస్త్రి M. A. PH. D. గారి

## ఉపోద్ఘాతము

లలిత కళలలో నతిప్రాచీన కాలముననే భారతీయు లద్వితీయ ప్రతిభను చూపినారు. ద్యావాపృథివీ దేవతలు మహాశిల్పులని వైదికఋషు లనినారు. దేవశిల్పములను భావించి, అనుభవించి, తదనుకార తుల్యము లగు శిల్పములను మానవుడు సృష్టించుచున్నాడని ఐతరేయ మనినది. శిల్పకళతో బాటు నృత్తనాట్యములు, సంగీతము, వాస్తువిద్య, కవిత యను లలితకళ లానాడే వాసి కెక్కినవి. ఈ కళలలో చక్షుర్గ్రాహ్యమైనది శిల్పము. విశ్వకర్మ, త్వష్ట, ఋభువులు మొదలగు శిల్పులు వైదిక వాఙ్మయముననే కన్పించసాగినారు నేడుగూడా లభించు కాశ్యప శిల్పము ఈ విద్య సంప్రదాయ సిద్ధమైనది, అన్యదేశములనుంచి దిగుమతియైనది కాదని తెల్పుచున్నది.

సాంచీలోని ముఖద్వారములు, వివిధ చైత్యములు, స్తూపములు, ఆలయములు మొదలైన వన్నియు మన ప్రాచీనశిల్పుల ప్రతిభ కుదాహరణములు. మధ్యమక దార్శనికుడగు ఆచార్య నాగార్జునుని ప్రశిష్యు డొక బుద్ధ ప్రతిమను చెక్కినట్లు జగ్గయ్యపేటలో లభించిన శాసన మొకటి యున్నది. దార్శనికు లానాడు శిల్పమును హేయముగా పరిగణించలేదు. పైగా పరమార్థ తత్త్వమును సచ్చిదానందమని ఉపనిషత్తులు పేర్కొనినవి. సత్, చిత్ అను శబ్దములద్వారా తత్త్వము సద్వస్తువని, చైతన్యమని తెలియనగును. జ్ఞానమును, సత్యమును, అనుభూతిని, ధర్మప్రవృ

త్తిని సూచించునవీ రెండు శబ్దములు. ఆనందశబ్దము కేవలము లలిత కళలకు మాత్రమే చెందినది. అందుచేతనే అర్వాచీనాలంకారికులు రస ప్రతీతిని బ్రహ్మాస్వాదసహోదర మనిరి. తైత్తిరీయమందలి 'రసో వైసః' అను పంక్తి లలితకళలలో భాసించు రసప్రతీతినే సూచించునదని జగన్నాథపండితు డనినాడు.

ఇట్టిశిల్పముయొక్క వాస్తవస్వరూపమును నేడు విస్మరించినాము. శిల్పమునకు దార్శనిక సిద్ధాంతములకు గల సంబంధమును గుర్తించ లేకున్నాము. ఈ విషయముల నవగాహన చేసికొనవలసిన బాధ్యత మన పైన గలదు. కేవల ముదరపోషణతోగాని, ఆముష్మిక చింతనతోగాని కాలము గడుపుట నిష్ప్రయోజనమని మనము గుర్తించవలసిన దినములు వచ్చినవి. మనముండు పరిసరములు జుగుప్సాకరములైనచో ఐహిక విషయములలోగాని, పారమార్థిక తత్త్వముపైనగాని మనసు నిలుపలేము. కణ్వాశ్రమము రమ్యముగా దుష్యంతునకు గోచరించినదని కాళిదాస మహాకవి పలుకగల్గినాడు. తపోభూములు శిల్పకళా సమన్వితములైన పుడే తత్త్వావగతి సులభము కాగలదు. స్వతంత్ర భారతమున మన మిట్టి శిల్పకళలను వీడలేము మన కందరకును శిల్పకళతో చక్కని పరిచయ మవసరము. ఇట్టి పరిచయమును బాగుగా కలుగజేయజాలిన "శిల్పదర్శ నము"ను మన కొసగిన శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారికి మన మందరము కృతజ్ఞులమై యుండక తప్పదు.

శిల్పికి భావన, సమాధి అవసరము. శిల్పమున కన్పించు భావ లావణ్య యోజనకు ప్రధానమైన ఆశ్రయమీజగము. భావమునకు లావణ్య మును తెచ్చి, ఈ రెంటిని ఏకముగా చూపవలెననిన రూప మవసరము. రూపమును మనకు ప్రసాదించునది నామరూపాత్మకమైన జగము. నామ రూపములతో నీ జగ మావిర్భవించిన సమయముననే మహాశిల్పము

బయలు దేరినది ఈ నామరూప విచారణ చేసిననేగాని దార్శనిక సిద్ధాంతములకు శిల్పమునకు గల అవినాభావసంబంధము బోధపడదు. కావుననే శిల్పదర్శనమునకు పునాదిగా శ్రీ ఆచార్యులుగారు సృష్టిని, నామరూప విలాసమును ముందు వివరించినారు.

రూపముతోబాటు శిల్పికి భావమవసరము. భావరహితమైన రూపమున రూపలక్షణమే కన్పించదు. భావలావణ్య యోజన నందుకే ప్రాచీనులు విధించినారు. ఈ భావరూప సంయోజన నీ గ్రంథమున నతివిపులముగా చర్చించి శిల్పస్వరూపమును విశదీకరించినారు. ఆ పైన శిల్పబ్రహ్మలు, దేవాలయశిల్పము అనువిషయములు వివరించబడినవి.

ఈ శిల్పదర్శనమున మన ప్రాచీన సంప్రదాయము పూర్తిగా కన్పించగలదు. ఆసంప్రదాయము ఇంకను సజీవమే యని చాటగల్గిన దీ గ్రంథము. ఆచార్యులుగారు వివరింపబూనిన ప్రతివిషయమును సోపపత్తికముగా, విపులముగా, అతిస్పష్టముగా చెప్పినారు. శాస్త్రీయమైన విషయములపై నిట్టి గ్రంథములు మనకు నేడు ముఖ్యముగా కావలసియున్నవి. మృదుమధురమైన భాషలో, లావణ్యనిష్యంది యగు వచఃశిల్పమున నీ గ్రంథము నడచినది. ఇతర లలితకళలకుగూడ నిట్టి గ్రంథములు బయలుదేరగలవను భావ మీ గ్రంథపర్యాలోకనమున ఎక్కువగుచున్నది. ఇట్టి రచనలను తెనుగువారికి అందజేయుచున్న శ్రీ వీరరాఘవాచార్యులుగారి కృషి సంస్మరణీయము.

సాగర్ విశ్వవిద్యాలయము,
సాగర్, 1–8–1956

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

# కృతజ్ఞతలు

నాన్నగారినీ, వారి రచనలనూ ప్రేమించే కీర్తిశేషులలో సర్వశ్రీ వేలూరి శివరామశాస్త్రీ, వేటూరి ప్రభాకరశాస్త్రీ, విశ్వనాథ సత్యనారాయణ గారలు మొదటగా చెప్పదగినవారు. ఈ కవిత్రయం నాన్నగారి ప్రతి రచననూ చదివి ఆనందించి తరువాతి రచనలకు ప్రోత్సాహం ఇస్తుండే వారు. అన్నిటికంటె నాన్నగారి దర్శన నిర్మాణం ఆ పెద్దలను అలరిస్తు వుండేది. నాన్నగారు – శిల్ప, సాహిత్య, యోగ, వేదాంత – శాఖలలో చేస్తున్న కృషికి శ్రీ వేలూరివారు మరీ ముగ్ధులవుతూ వుండేవారు ఇందుకు నాన్నగారికి శ్రీ వేలూరివారు వ్రాస్తూవుండే లేఖలే నిదర్శం 1962 సం॥లో "శిల్పకలాక్షేత్రాలు" మొదటిభాగం ముద్రితమయింది అంతకుముందే నాన్నగారి ఆత్మదర్శనం చదివి, దానికి "పీఠిక" వ్రాశారు వేలూరివారు. అప్పటికి శిల్పదర్శనంకూడ చదివేవున్నారు శాస్త్రిగారు "శిల్పకళాక్షేత్రాల" మీద అభిప్రాయం ఇవ్వండని శాస్త్రిగారికి నాన్నగారు వ్రాశారు. అప్పటికే శాస్త్రిగారి ఆరోగ్యం బాగా లేదు. అందువల్ల కొంత వ్యవధి తీసుకోవలసివచ్చింది. మళ్ళీ కొన్నాళ్ళకు జ్ఞప్తి చెయ్యగా శాస్త్రి గారు ఇలా వ్రాశారు—

"ఆశీః, కళాక్షేత్రములమాట – శ్రీ గంగూలీ [RUPAM అను పత్రికకు సంపాదకులు - పెద్ద వకీలు – వయో జ్యేష్ఠులు. 60 ఏండ్లు.] ఆంధ్రశిల్పములగూర్చి పెద్దగ్రంథము వ్రాసిరి. అది MANUSCRIPT లోనే మ్రగ్గుచున్నది; ఏ గవర్నమెంటు అయినా అచ్చు వేయదగినది. ఆంధ్ర GOVT వేయుటయే ఉచితము. దానిని, దీనిని – చూచి పెద్ద

వ్యాసము వ్రాయఁదలఁచితిని. ఇంతలో నా శరీరమున క్రొత్త అతిథులు ప్రవేశించిరి. ఇప్పుడు మఱియొకరు — BLOODPRESSURE చాలా ఎక్కువగా నున్నది. ఏమిచదువను, వ్రాయను పనికిరాను. అభిప్రాయము మాత్రము వ్రాయగలనేమో. అదియు పదినాళ్ళపైని. మీ కృషికి, విమర్శకు, సౌందర్యగ్రహణమునకు నా ప్రశంసయు, ఇంకెవరి ప్రశంసయు కడు నఁలతి. మీక్షేమము కోరుచుందును.

చిరివాడ
24-9-64

గ్రహించునది
వే. శివరామశాస్త్రి

నాన్నగారి శిల్పకృషిని, శ్రీ గంగూలీగారి శిల్పగ్రంథముతో పోల్చి సవిమర్శకవ్యాసం వ్రాద్దామనుకొన్న శాస్త్రిగారు అనారోగ్యంవల్ల వ్రాయలేక పోయినారు. అది ఒక దురదృష్టం. చివరకు 29—10—64 న అభిప్రాయం పంపారు. శాస్త్రిగారు ఎవరినిగూర్చిగానీ, ఏ పుస్తకాన్నిగూర్చిగానీ - ఏ రెండు ముక్కలు వ్రాసినా, అవి వేదవాక్కులే అనాలి. వారు ఋషితుల్యు లయిన పండిత ప్రకాండులు. అనృతం కానీ, మోమోటానికయిన పొగడ్తలుకానీ వ్రాయడు ఆ మహానుభావుడు। తనఅభిప్రాయంలో నాన్నగారినిగూర్చి వ్రాసిన మొదటిమాట ఇది——

"శ్రీ వీరరాఘవాచార్యులవారు లలితకళలలో అందె వయిచినవారే కాక, ఆనందకుమారస్వామి, గంగూలీ మొదలగువారి కోవకు చెందినవారు."

నిజంగా నాన్నగారి శిల్పకళాక్షేత్రాలమీద గంగూలీ రచనతోపోల్చి వేలూరివారు వ్రాస్తే, అది ఎంత గొప్పగా వుండేదో ఊహించలేము।

ఈ శిల్పదర్శనం ద్వితీయముద్రణలో "ప్రతిమాలక్షణ సౌందర్యములు, లింగతత్త్వ స్వరూపాదులు, దేవతామూర్తి భేదములు, కొన్ని శిల్పాగమములు, కొందఱు శిల్పాచార్యులు"—అనే అయిదు అధ్యాయాలు కొత్తగా చేర్పబడ్డవి. తక్కిన అధ్యాయాలలోకూడ అక్కడక్కడా విషయాలను విస్తరించడం అయినవి. ఇందుకుకారణం ఈమధ్యకాలంలో నాన్నగారు వేదశిల్పాగమాదుల పరిశీలనంవల్ల కొత్తవిషయాలను అనేకం సేకరించడమే. ఇందువల్ల మొదటిసారి 250 పుటలలో వున్న ఈదర్శనం ఈ ముద్రణంలో 350 పుటలకు పెరిగింది. అది కూడ 14 పాయింటు టైపులో! అయినా ఇంకా చేర్చవలసిన అంశాలు అనేకం ఉన్నాయని అంటున్నారు నాన్నగారు. ఇందులో కొన్ని శిల్పచిత్రాలుకూడ చేర్చబడ్డ మయినది. కవుల చరిత్రనువలె శిల్పాచార్యుల చరిత్రనుకూడ ప్రత్యేకమైన గొప్ప గ్రంథంగా వ్రాయాలని. నాన్నగారి అభిప్రాయం.

ఈనాడు భారతీయ శిల్పంమీద, శిల్పాగమ శాస్త్రాలమీద సాధికారంగా మాటాడగలవారూ వ్రాయగలవారూ ఎంతోమంది లేరు. ఉన్నవారిలో అగ్రపీఠం ఈ గ్రంథకర్తదే అని నేననడం ఆత్మీయతతో కాదు, అభిజ్ఞుల అభిప్రాయాలనుబట్టే! విజ్ఞానంలోనే కాదు. పంచశిల్పాలనూ శాస్త్రీయంగా చేయడంలోకూడ వీరు నేర్పరులన్న సంగతి చాలామందికి తెలియకపోవచ్చు. జీవనోపాధికి అధ్యాపకవృత్తిని అవలంబించడమే శిల్పిగా వీరికి ప్రశస్తి రాకపోవడానికి కారణం! ఇలాంటి వారికి మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏ ఆస్థాన శిల్పాచార్య పదవినో ఇచ్చి వీరి సేవలను గౌరవించడం సముచితం. కాని, ప్రభుత్వాలు ఇలాంటి నిరాడంబరులనూ, పదవులకు పాకులాడనివారినీ పట్టించుకోవుకదా! నేడు అంతస్సారాన్ని ఆరాధించేవారు ఎందరున్నారు?

ఈ గ్రంథం ద్వితీయముద్రణం కావడానికి ప్రధానకారకులు కరీంనగర వాస్తవ్యులూ, కళాసాహితీ రసికులూ, అనేక ప్రజాహిత కార్యాలను నిర్వహిస్తూ సంఘానికి బహుముఖ సేవలు చేస్తున్నవారూ అయిన శ్రీ గారోజు రంగాచార్యులుగారు. వీరు కరీంనగర్ "లయన్స్‌క్లబ్ చైర్మన్"గా ఉండి ఎంతో సేవ చేస్తున్నారు. ఇటీవల 1978 జూన్ నెలలో జపానులో అంతర్జాతీయంగా జరిగిన "లయన్స్ కాన్ఫరెన్సు" లో కూడ పాల్గొని ఆ సంస్థ అభివృద్ధికి అమూల్యమైన సూచనలు చేసి వచ్చిన మేధావులు। నాన్నగారి విద్యాపరిశ్రమకూ, నిరంతర గ్రంథరచనా వ్యాసంగానికీ, సంఘసేవాదీక్షకూ వీ రెంతగానో మురిసిపోతారు. శ్రీమదాచార్యులువారు నాన్నగారిని కరీంనగరుకు రప్పించుకొని, స్థానికులనే కాక, "సిరిసిల్లా" ప్రముఖులనుకూడ ఎంతమందినో ప్రోత్సహించి గ్రంథ ముద్రణకు సహాయం చేయించినారు. నాన్నగారుకూడ దాతలైన సహాయులకు తమ గ్రంథాలను ఇచ్చి కృతజ్ఞతను ప్రకటించు కొన్నారు. మరికొందరు మిత్రులు శిల్పదర్శన ముద్రణ జరుగుతుందని వ్రాయగానే రు. 116 లు పంపి తోడ్పడ్డారు. ఈ విధంగా శిల్పదర్శనం ద్వితీయ ముద్రణకు దోహదం చేసిన శ్రీ రంగాచార్యులగారినీ, తక్కిన దాతలనూ మేమెన్నటికీ మరువలేము. వీరందరికీ, అభిప్రాయాలిచ్చిన పెద్దలకూ హార్దికమైన కృతజ్ఞతలూ, నమస్సులూ।

ఒక "శిల్పవిజ్ఞాన సర్వస్వ సంగ్రహం" అని చెప్పదగ్గ ఈ పుస్తకం ఇతర భాషలలోనికి పరివర్తనం కావడంకూడ ఎంతో అవసరమని విజ్ఞులు గ్రహించే వున్నారు. ఇప్పటికే ఇందులోని కొన్ని అధ్యాయాలు కన్నడ భాషలోనికి అనువదించడం జరిగింది.

హైదరాబాద్
6—9—1978

కె. ఆనందవర్ధన
చీఫ్ సబ్ ఎడిటర్ 'ఆంధ్ర ప్రభ'

# అంకితము

సిరుల కిరవగు నెల్లూరి సీమ యందు
"కృష్ణయాచేంద్ర" భూపాల కీర్తనీయ
పాలనంబున వెలసెడు పత్తనంబు
కలదు "వెంకటగిరి" సౌఖ్యముల కొటారు.

శ్రీమహితంబగు నా పురి
ధామముగాఁ జేసికొని యుదారగుణుఁడు శ్రీ
రామస్వామి యనంగా
రామార్చనపరుఁడు వైశ్యరత్నము చెలఁగున్.

రామస్వామి యశోనుగామి యగుచున్ రాజిల్లి లక్ష్మమ్మయన్
రామారత్నముఁ బెండ్లియాడి జనతా నందానుసంధాయియై
ప్రేమన్ సుబ్బయ సెట్టియన్ సుతు గుణశ్రీయుక్తునింగాంచి తా
సీమం బొప్పఁగ నన్నదానమునఁదన్పెన్ బీదలన్ సాదులన్.

కామి సెట్ట్యన్వవాయంబు గౌరవ మిల
నన్నదానప్రసిద్ధిచే నతిశయింప
సుబ్బయాగ్రణి చేసె నస్తోకబుద్ధి
దవిలి బహుళాన్నదాన సంతర్పణములు.

ఆ సుబ్బయ్య గుణాగ్రగణ్యయగు కామాక్షమ్మఁ బెండ్లాడి వి
ద్యా సౌశీల్య గుణోత్తరుండగుచు నౌదార్యమ్ము దీపింపఁగాఁ
జేసెన్ సత్క్రియ లెన్నియేని భగవచ్ఛ్రీపాద పద్మార్చనా
ఖ్యాసోదంచిత పాణిపంకజము ధన్యత్వంబుఁ బ్రాపింపఁగన్.

ఆ పుణ్యదంపతుల కా
శ్రీపతికృపచే "మునయ్యసెట్టి" జననమై
చేపట్టె "కనకమన్" సతి
నే పడతులు సాటిరాని యిద్ధగుణాఢ్యన్.

అఖిలసద్గుణనికురుంబ యైన సాధ్వి
చేకుఱుటఁజేసి తన కామిసెట్టికులము
ధన్యమగునట్లు మునిసెట్టి తండ్రియట్లు
సలిపె మృష్టాన్నదానంబు సంతతంబు.

శ్రీలకులగోత్రమున సుప్రసిద్ధిఁ గన్న
దంపతులు వారు గని రత్యుదారులైన
సుతుల నేవుర ధర్మైకరతుల నందు
చిన మునిస్వామిసెట్టి సజ్జనహితుండు.

చేయించె నతిభక్తి శ్రీరామకోవెలన్
విఖ్యాతి నిత్య నైవేద్య సేవ,
అర్పించె మాత్మ దేవాలయమ్మునకునై
వలయునర్థము జనావళి నుతింప,

ఆహ్లాదపఱిచె నిత్యాన్నదానప్రౌఢి
పేదసాదుల మనఃప్రియ మెలర్ప,
ఆదరించె ననేకులైన విద్యార్థుల
వేతనాదు లొసంగి వివిధగతుల,

ఇన్నిటం బేరుగనుట నార్జించె తార
హార నీహార కర్పూర చారుకీర్తి
మా మునిస్వామిసెట్టి శ్రీరామకృష్ణ
పావనాంఘ్రి సరోరుహ బంభరమ్ము.

నిరతం బీశ్వరసేవ సల్పుసతి మాణిక్యమ్మ మాణిక్యమై
వరుఁడే దైవముగాఁ దలంచి తను తాత్పర్యంబునం గొల్వఁగా
సరసుండౌ మునిసామిసెట్టి విమలస్వాంతుండు దైవార్చనా
పరుఁడై కాలముపుచ్చు నాసుకృతి సౌభాగ్యంబుసామాన్యమే?

సత్యదయాశౌచ సంపత్తియే కాదు
కలదు ధర్మైకదీక్షావ్రతమ్ము
దుర్విషయాసక్తి దూరత్వమే కాదు
కల దీశ్వరార్చనా కలితబుద్ధి
వాణిజ్య సౌభాగ్య వాల్లభ్యమే కాదు
కలదు కావ్యవినోద గౌరవమ్ము
ధనసముపార్జనా తాత్పర్యమే కాదు
కలదు వదాన్యతా ఘనయశమ్ము

సత్క్రియాచార నిర్వాహ చణత యొకటె
కాదు కలదింక సుజనోపకారగరిమ
కామి సెట్టి కులాన్వయ సోముఁడైన
మా మునిస్వామి సెట్టికి మహితమతికి.

తనకుం గూర్చెడు మిత్రసత్తముఁడు విద్వత్ప్రీతిసంధాత స
జ్జనసమ్మాన్యుఁడు సత్క్రియాచరణదీక్షాదక్షుఁ డుద్యత్కవి
త్వనిధానుండగు వీరనార్యుఁడు గురుప్రాయుండు ప్రేరేచె "నో
మునిసామీ! భవదీయ కార్యములు సమ్మోదంబుచేకూర్చెడున్.

ఎన్ని సత్కార్యములు చేసియున్నఁగాని
కృతిని బొందకయున్న శాశ్వతయశంబు
గలుగ దొక కబ్బమును గృతిఁగా గ్రహించి
మాసిపోనట్టి కీరితి మనఁగదన్న!"

అను నుపదేశ మాయనకు హర్షముగూర్పఁగ నస్మ "దాత్మద
ర్శనము"ను మున్నె కాంచి వివశత్వము నందినవాఁడు కాన వీ
రనహితబోధ తోడ్పడఁ గరమ్మనురాగము గౌరవంబు నె
మ్మనమున నుబ్బ నన్నుగవిమాన్యుఁగనుంగొని భక్తినిట్లనున్.

"భువనకల్యాణదము జగత్పూజ్యమైన
శిల్పతత్త్వముఁ దెల్ప రచించినట్టి
"శిల్పదర్శన" మను నీ విశిష్టకృతిని
నంకిత మొసంగు నాకు నాహ్లాదమెసఁగ."

అని తాంబూలము గౌరవాదృతులతో నర్పించి ప్రార్థించినన్
గని సద్వంశ్యుఁడు సద్గుణోత్తరుఁడు శ్లాఘాపాత్రుఁ డీతండు గా
వున నస్మత్కృతి నంకితంబొసఁగితిన్ బూర్ణాయురారోగ్యశో
భన సౌఖ్యమ్ముల నందుఁగావుతఁ గృతిప్రాణేశుఁ డిద్దానిచేన్.

శ్రీమద్వైశ్యకులాబ్ధిసోము వినయశ్రీధాము నౌదార్యల
క్ష్మీమాన్యోరుచరిత్రు సూరిజన సంసేవాపవిత్రున్ వణిక్
స్తోమస్తుత్య మతిప్రభావుఁ గృతినాథున్ సజ్జనున్ శ్రీ ముని
స్వామిశ్రేష్ఠిని బ్రోచుతన్ భువనశిల్పస్వామి ప్రేమమ్మునన్.

"శిల్పదర్శన" మను నీ ప్రసిద్ధకృతిని
నంకితంబంది యాతారకార్కమైన
శాశ్వతయశంబు దిక్కుల సాఁగిపోవ
వర్ధిలెదుఁగాత శ్రీమునిస్వామిసెట్టి.

ప్రోత్సాహకులు :

కీ. శే. సారంపాటి వీరన్నాచార్యులుగారు

తన్నుం జూచిననాఁటనుండియు ననన్యప్రేమ సౌహార్ద సం
పన్నస్వాంత మిగుర్ప మద్రచిత కావ్యశ్రేణి ముద్రింపఁగా
నెన్నోరీతులఁ దోడుసూపిన క్రియాహృద్యైకచారిత్రు వీ
రన్నాచార్య సదుద్యమాభిరతు నిస్వార్థాత్మ నగ్గించెదన్.

# విషయ సూచిక



గ్రంథకర్త:

1939 సం॥ న మైసూరులో సమ్మానింపబడినప్పటి ఛాయాచిత్రము



LION శ్రీ గారోజు రంగాచార్యులుగారు బి. కాం.
చైర్మన్, లయన్స్‌క్లబ్, కరీంనగర్

రంగాస్వచ్ఛ యశస్వి, అ
భంగుర సత్కార్య కరణ భాసి, నిజ మనో
రంగ ద్రాముఁడు రాజిలు
రంగాచార్యుఁడు ప్రజానురాగ మహితుఁడై.



అలంకరణము

అజంతా 17వ గుహ.



కైలాసనాథాలయ ధ్వజస్తంభం

ఎల్లోరా 16వ గుహ



అజంతా 26వ గుహ
ముఖభాగం



అజంతా సుందరి - నల్లరాణి

అజంతా గుహ – 1

# శిల్పదర్శనము

## మంగళాచరణమ్

యేనా త్యద్భుత దివ్య శిల్పరచనా యోగేన విస్తారితం
నానా భూతవితాన మణ్డిత మిదం బ్రహ్మాణ్డయన్త్రి మ్మహత్
సోఽయం వేద వచస్సమీడిత జగచ్ఛిల్పీ జగత్పాలకో
లోకానా ముదయాయ దీవ్యతు సదా శ్రీ విశ్వకర్మ ప్రభుః.

నానా శిల్పకలా కలాప గురుణా ప్యాసీ చ్ఛిలాశిల్పకం
భూయిష్ఠం ప్రకటీకృతం త్రిజగతీ మోక్షాయ దైవాత్మకం
దైవజ్ఞాపర నామక స్స భగవాన్ గోత్రాధినేతా మమ
ప్రత్నబ్రహ్మ ఋషీశ్వరో విజయతాం స్వాన్తే నితాన్తోజ్జ్వలః.

శ్రీ వీరరాఘవ మభీష్టవరప్రదం యా
సంపూజ్య దుశ్చర తపో నియమోపవాసైః
మా మభ్యసూత సమధీత సమస్త విద్యం
తాం పార్వతీం హృది భజామి నిజాం సవిత్రీమ్.

అభ్యస్య విద్వ దభినన్దిత శిల్పయోగౌ
విజ్ఞాయ జన్మ తరణోచిత మాత్మ తత్త్వం
పర్యాప్త కామనతయా పితరం కృతార్థం
కోటీశ్వర స్థపతి కోవిదముఖ్య మీడే.

త్రిలింగోర్వీ మాతృ ప్రియతనయ మాద్యర్షి సదృశం
దృఢ ప్రజ్ఞా దీక్షా చరిత బహుళాధ్యాత్మ నియమం
చర న్తం లోకానుగ్రహ ధిషణయాత్మజ్ఞ నిపుణం
మన స్తత్త్వా సన్ద ప్రథిత యతిరాజం భజతు మే.

విశ్వకర్మాదికాన్ దేవాన్ సానగాదీన్ ఋషీం స్తథా
పూర్వా నాధుని కాం శ్చైవ నౌమి శిల్పోపదేశికాన్.

వేద వేదా న్త శాస్త్రాది విద్యాదేశిక స త్తమాన్
ప్రణమ్య విద్వ దామోద కరం బ్రహ్మ ప్రకాశకం
జ్ఞాత్వా స్థాపత్య వేదస్య త త్త్వం భువన తారకం
కృతాత్మదర్శనః కుర్వే రుచిరం శిల్ప దర్శనమ్.

# సృష్టి

"కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్
కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః".

ఈ సృష్టి యెటనుండి యెట్లు జరుగుచున్నది? మన మెద్దానినుండి ప్రభవించుచున్నాము? అని సృష్టి విషయములగు ప్రశ్నములు వేదములందు పలుతావుల తల ఎత్తినవి. మానవసంఘము ననాదినుండియు ఇట్టి ప్రశ్నము లెదుర్కొనుట వింతకాదు. సృష్టిస్వరూపము, సృష్టిత త్త్వము హృదయగోచర మైనగాని మానవుని జ్ఞానము కడపటి హద్దును ముట్టి నట్లు గాదు.

" న తం విదాథ య ఇదం జజాన "

"ఎవడు ఈ చరాచరాత్మక ప్రపంచమును ఉత్పాదించెనో, అట్టి విశ్వకర్తను ఓ మానవులారా ! మీ రెఱుంగరు." ఇట్లనుటచేత జగమునకొక సృష్టికర్త కలడనియు ఆతనింగూర్చి మానవు డెఱుంగ జాలకున్నాడనియు దెలియుచున్నది. జగత్కారణమగు నీ వస్తువును వేదములు, ఉపనిషత్తులు పలునామములతో వ్యవహరించినవి. సత్తనియు, విశ్వకర్మ యనియు, ప్రజాపతి యనియు, పురుషుడనియు, బ్రహ్మ మనియు, ఆత్మ యనియు, హిరణ్యగర్భు డనియు అనేక నామములతో విశ్వోత్పత్తి సూక్తముల యందును, ఇతర వేదవాఙ్మయము నందును, జగత్కారణ వస్తువు ప్రస్తావింపబడినది. ఈ జగత్కారణము సర్వశక్తము, సర్వజ్ఞము, సర్వేశ్వరము, సర్వవ్యాపకము, అజము, అనాది, అనంతము, అనిర్వచనీయము, సచ్చిదానంద సుందరము, నామరూపాత్మక జగదుత్పత్తికి మూలబీజము. దీనినుండియే సృష్టి, స్థితి, లయము. ఒకే వస్తువు నుండి యెట్లీ సృష్టి, స్థితి,లయములు ప్రవర్తిల్లుచున్నవి అను విచారణము, దానిచర్చ సంపూర్ణముగా బుద్ధి కందునదికాదు. కావుననే ఈ సృష్టిరహస్య మును ఎవ్వడెఱిగి ప్రవచనము చేయజాలునని వేదమంత్రము నుడువు చున్నది.

ఏకమాత్రమును నిర్వికారమును అగు అనంతసత్త యే విధమున అనేకమై సవికారమై నానాత్వమును తన అనిర్వచనీయ దివ్యశక్తిలో ద్యోతిత మొనర్చుచున్నదను ఆలోచనము సృష్టితత్త్వము నెఱుంగ జూచుచున్నది. సంచలన రహితమును నిష్పందమునునై పరగు సరోవరమున వాయుసంచారముచే కదలిక కలిగి చిఱుతరంగములు ఒకదానివెంట ఒండొకటి బయలుదేరునట్లు, వృత్తి రహితమైన మానసమున సంకల్ప

తరంగములు పొటమరించును. వ్యక్తి మానసమందేకాక, విశ్వసృష్టికి — విశ్వపురుషునికి సంబంధించిన విశ్వమానసమందును సంకల్పోదయ మీరీతినే యగుచున్నది. విశ్వమానసము లేదా విశ్వాత్మయందలి సంకల్ప లేశమే సృష్టికి హేతుభూతము. మానవ హృదయాంతరాళమున బయలు దేరు సంకల్పము సముచిత సిద్ధి నందుటకై కార్యరూపము నందునట్లే, విశ్వాత్మ యందలి స్పందము (కదలిక) ను ద్వైతమై కార్యరూపమున స్థూలముగా భాసించి తీరును. వృత్తిదూరమైన మానసముయొక్క విచిత్ర దశయు, తరంగశూన్యమైన హ్రదముయొక్క సౌందర్యమును ఊహాతీతములు. మేఘాదుల సంచారము లేని మహాకాశముయొక్క ప్రకృతిని మనము బుద్ధిలో చిత్రించుకొనగల్గినచో, పూర్వోక్తమైన మానసము యొక్క సౌందర్యమును సంభావింప గల్గుదుము. సంభావించితిమపో, మేఘాదిరహితమైన ఆకాశమునుగూడ అతిక్రమించి అటుపై ప్రకాశించు పరిపూర్ణచిద్విలాసమును — జ్యోతిర్వికాసమును అనుభూత మొనర్చు కొన్నచో నిష్పందమైన విశ్వాత్మయొక్క ప్రాథమికస్థితి విజ్ఞాతమగును.

ఈ ప్రాథమికసత్త సంవేద్య మగుటకే అసంఖ్యాకములైన ఆవరణములను భేదింప వలసియున్నది; అనంతములైన మాయ తెరలను జీల్చి వేయవలసియున్నది. వస్తుతః మన ఊర్ధ్వగమనమునకు అడ్డుతగులు ఈ ప్రావరణములుగాని, తెరలుగాని, పొరలుగాని మనయూర్ధ్వయాత్ర ముగిసిన పిమ్మట ఏ పరమ ప్రాప్యమును మనము చెందవలసి యున్నామో, ఆ పదార్థమున కంటె భిన్నములు కావు. తత్త్వదృష్టిలో ఇయ్యవి విభిన్నములు కాకున్నను, స్థూలరూపముననున్న యద్దాని పృథగ్గ్రింధులే కావున భిన్నములు నయి భాసించుచున్నవి. స్థూలత్వ సూక్ష్మత్వములనుబట్టి, నిత్యత్వా నిత్యత్వములనుబట్టి ప్రావరణములకుగాని, ప్రావరణముల కవ్వలను, వానియందును ఉండి వానికి హేతుభూతమై

యొప్పెడి పదార్థమునకుగాని భేదము సిద్ధమగుచున్నది. ఒకేవస్తువు నుండి వివిధావాంతర భేదజాతమును, అవ్వాని బాహ్యాంతరముల ప్రవేశించి ఆ కారణ వస్తువును వెలయుచున్నను, నానాకార భేదములతో తోచు ఆ సూక్ష్మతత్త్వమును సందర్శించిననే జీవికి భోజ్యపదార్థ సంసిద్ధి; స్వీయ జీవితయాత్రా పరిసమాప్తి. దీనిని ఈ దిగువ దృష్టాంతముతో గ్రహింప వచ్చును.

ధాన్యబీజము నుండి ప్రకాండమాదిగాగల పైరు పుట్టుచున్నను, దీని నంతయువీడి యీ ప్రకాండమునకు ఊర్ధ్వమున కంకి పండించెడు ధాన్యజాతమే మనకు భోగ్యమగుచున్నది. అయిన ఇచ్చట, ఆ ధాన్యమున కంటెను చెత్త మొదలగు పదార్థము వేఱైనదే; మనకు తినుటకు అర్హము కానిదే. అయినను ఈ ప్రకాండ మెటనుండి వచ్చినదను విచారణకు పూను కొన్నచో బీజమే మనకు శరణ్య మగుచున్నది. ఏకరూపమైన బీజము తనతో సమానరూపములైన అనంత బీజములను కనుచున్నది; తనకు విపరీతరూపములైన ప్రకాండమును, ఈనెలను, ఆకులను కనుచున్నది. ఈ సందర్భమున ముండకోపనిషత్తులోని దిగువ వర్ణనము ఆరయ దగి యున్నది—

"యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యా మోషధయ స్సంభవన్తి
యథా సతః పురుషా త్కేశ లోమాని
తథాఽక్షరా త్సంభవతీహ విశ్వమ్." — ముండకము

ఈ మంత్ర వ్యాఖ్యానావసరమున శంకరులు అక్షరమునుండి జరిగిన సజాతీయ విజాతీయ సృష్టినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు "సాలెపురు గెట్లు ఇతర కారణము నపేక్షింపకే తన శరీరమునుండి దారములను

విడుచుచు, మఱల వాటిని తనయందే లీనము చేసికొనుచున్నదో, ఎట్లు భూమినుండి నానావిధములగు ధాన్యాదులు భూమికంటె విలక్షణములైనవి పుట్టుచున్నవో, బ్రతికియున్న పురుషుని నుండి విలక్షణములగు కేశములు రోమములు ఎట్లు పుట్టుచున్నవో, అట్లే బ్రహ్మమునుండియు ఏ యితర కారణమును అపేక్షింపకయే తనతో సమానలక్షణము విపరీతలక్షణము గల చరాచరాత్మక విశ్వముకూడ జనించుచున్నది.''

ఇట్టిదే మఱియొక మంత్రము :—

''తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకా
ద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః;
తథాక్షరాద్వివిధాః సోమ్య భావాః
ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి.''

ప్రజ్వలించు నగ్నినుండి వేలకొలది నిప్పురవ్వలు పుట్టునట్లు అక్షరతత్త్వము నుండి వివిధములైన భావములు పుట్టి మరల అందే లీనమగుచున్నవి.

బీజము లేనిది మొక్కలేదు; మొక్కలేనిది బీజమురాదు. బీజములు మన కవసర పదార్థములైనను; మొక్కల ద్వారముననే వానివి పడయ జాలుట; మొక్కలను సైతము బీజమూలముననే పొందుట. ఇచ్చట ఆ కార్యకారణ పదార్థములచే ఉపయోగములు ప్రయోజనములు భిన్నములు. ఈ రహస్యమే జనసామాన్యమందు "విత్తుముందా, చెట్టు ముందా?' అను ప్రశ్నరూపమును తాల్చినది.

మఱియు బీజమునుండి వెడలిన మొక్కనుండి అంతః ప్రవాహముగా జాలువాఱిన బీజసారమే తిరిగి మొక్కయొక్క యగ్రమున బీజ

రూపము నందుంచుండుటయే గమనింప దగిన రహస్యము. ఈ బీజాంకుర న్యాయమందు, ఏకత్వ నానాత్వములు రెండును సిద్ధములు. అయిన ఈ యైక్యముగాని, నానాత్వ పృథక్త్వములుగాని యేకమునుండియే. ఏకము "ఏకమేవాద్వితీయ" మే! పరిణామక్రమమున సంకోచ వికాసముల నందు ఈ యేకమునందే హేయోపాదేయతలును, పునర్భవ వినాశములును పొడకట్టుచున్నవి.

బీజాంకురముల ననుసరించిన మన విచారణ ప్రయాణమును ఇంచుక దూరము సాగించి చూతము. బీజమునుండి పొటమరించి, పైరుగా పరిణమించి, అంతమునకు కారణరూపములైన బీజములనురాల్చి వృక్షము విరమించుచున్నది. విత్తనము తన మొక్కనుండి రాల్చిన బీజములనుండి తిరిగి పలు మొక్కలు సంభవించుచున్నవి. బీజములను గ్రహించిన పిమ్మట మిగిలిన మొక్క (పైరు లేక వృక్షము) యెండబారి వినాశము నందుచున్నది. దానిలో ఇక ప్రజననశక్తి లేదు. అది విత్తనములను సృష్టించు సామర్థ్యమును కోల్పోయినది. ఇక అది తన స్థూలరూపమును అగ్నిదగ్ధ మొనర్చుకొనవలసినదే. తిరిగి దానిని భూమియందు నాటినను విత్తనముల నీనదు. కావున స్థూలమైన వృక్షస్వరూపము జడప్రాయమై నశించుచున్నది. సూక్ష్మమైన బీజమో, ప్రాణశక్తి భరితమై పునస్సృష్టి సమర్థమై తనరారుచున్నది. భవవినాశములు ఇట్లు ఏకమునందు కలుగుట విపరీతము కానట్లే, హేయోపాదేయతలు సంభవించుటయు విరుద్ధములు కావు. ధాన్యము మనకు ఉపాదేయము. చెత్త మొదలగు తుక్కు హేయము. కావున ఒక్కవస్తువు నుండియే సృష్టి స్థితి లయములు జరుగుచున్నట్లు ఈ వివరణము తెలుపుచున్నది.

ఇక దీనింబట్టి విశ్వాత్మధర్మమును ఊహించి చూతము. అఖండా ద్వితీయ చైతన్య సత్తనుండి ఖండమును, ద్వైతభేద భిన్నమును అగు

జడశక్తియొక్క ప్రాదుర్భావము. అంతర్భూత చైతన్యము—లేదా అనభివ్యక్త చైతన్యమగు జడశక్తినుండి తిరిగి అనంత చేతనుల (ప్రాణుల) ఉత్పత్తి. ఇట చిత్—జడముల సంయోగముచే కలుగునవి చేతనములు కాని, జడమునుండి పరిణతము లయినవి కావని ఒక ఆశంక యేమో! ఇచ్చట జడము అన్నంత మాత్రమున నిశ్చైతన్యము అని కాదు. చైతన్య గర్భితమయిన, లేక 'చిత్' వికాసమును పొందని జడమని ఆశయము. కావున "భూతాన్యేవ చేతయన్తే" అను నాస్తికవాదముతో దీనివి పోల్ప జనదు. ఈ జడములోని చేతనా ధాతువు వ్యక్తము కానిది. కాలాంతరమున ఇయ్యది స్వాంతర్గర్భితమైన చైతన్యశక్తిని వ్యక్తము చేసితీరును. ఆ కాలాంతరమే తమోబహుళమైన తన స్వాపావస్థను వీడిన-తేజస్స్ఫూర్తమైన జాగరణము నందలి క్రీడా విలాసము. దీనినే భగవానుడు "అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే" అని ఈ అహరాగమమున వ్యక్తులు తమ ప్రావరణములను భేదించుకొని బయటపడునని నుడివి యున్నాడు. కావున శుద్ధ జడమనునదిలేదు. పోగా, చైతన్యము యొక్క పరిణతి విలసనమగు పృథగ్రూపము — స్థూలధాతువు; తనలో చేతనాధాతువు నిముడ్చుకొని వ్యక్తము కానీయక మందవిలాసము నెఱపు అయ్యాదిమ పదార్థమే జడమని పిలువ బడుచున్నది. జన్మాంతర సిద్ధాంతమునందు కొన్ని ప్రాణులు స్థాణువులై పుట్టుచున్న విషయము కూడ చైతన్య గర్భితమైన జడశక్తి విలాసమునకు ప్రేరకమై ఒప్పుచున్నది. • .అగుగాక

---

• "యోని మన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః
స్థాణు మన్యేఽను సంయాన్తి యథా కర్మ యథా శ్రుతమ్."
— కాఠకము.

జీవులు వారు చేసికొన్న కర్మములను, సంపాదించిన జ్ఞానమును అనుసరించి, కొందఱు నానావిధములగు దేవ తిర్యఙ్మనుష్యాది యోనులందు జన్మింతురు. మఱికొందఱు వృక్షాది స్థావరములను పొందుదురు.

అనాదిసిద్ధమై "ఏకమేవాద్వితీయ"మై పరగిన సద్వస్తువునుండి—చైతన్య తేజమునుండి లేదా పరమ పురుషునినుండి ఆకాశాది భూతజాతమును, ఆతత్త్వములనుండి నానావిధ స్థావర జంగమ భూతకోటియు ఉదయించుచున్నది. ఆకాశాది వికారములు మూలభూతమైన పరాప్రకృతి, లేదా చైతన్యమునుండి సంజనితములైనవే. వీనిని బీజమునుండి వెలువడిన ప్రకాండాదికము (వృక్షాది)తో పోల్చవచ్చును. తిరిగి ఈ తత్త్వశాఖల నుండియే వీటికి ప్రకృతియైన చైతన్యము ఫలముగా సైతము వ్యక్తము కావలసి యున్నది. ఆ పండే మఱల అనేక బీజములను ప్రసవించుచున్నది. ఈ బీజములనే మనము విశ్వాత్మ పరిభాషలో జీవులని పేర్కొనుచున్నాము. వీనియందును కొన్ని నిద్రాణ చైతన్యములు (స్థావరాదికము), మఱికొన్ని జాగృత చైతన్యములు. వీని అన్నింటను చిత్—జడ ద్రవ్యముల సమ్మేళనము కలదు. బీజములందు ప్రకాండాదికముగా పరిణమించు కార్యకారణ ద్రవ్యవిశేషము నిగూఢమై యున్నట్లు, వీనియందును ఉభయ ద్రవ్యముల సమ్మేళనము ఒప్పుచున్నది. జడములని పిలువబడు ఆకాశాది భూతములు, అవ్వాని సంయోగముచే ఏర్పడిన శరీరము, ఇంద్రియజాతము, ప్రాణశక్తి జడములగు భౌతిక పదార్థముల పరిణామము. మనస్సును, బుద్ధితత్త్వమును, ఈ శరీరేంద్రియ కరణజాతమును ప్రకాశింప జేయుచు క్రియాసమర్థమొనర్చు విశిష్టశక్తి వేఱు. అదియే కారణశక్తి; మనము బీజముతో ఉపమించుకొనదగిన అఖండ చైతన్య సత్త. పూర్వోక్తమైన కరణజాతమగు జడద్రవ్యము, ఈచైతన్యశక్తి—ఈ రెంటియొక్క సమ్మేళనమే ప్రాణిసమూహము. ఈ చేతనము నుండియే పునస్సృష్టి; ఈ శరీరముయొక్క ప్రదీప్తి. శరీరమునందలి చేతనాధాతువు తొలగినచో, బీజము రాలినపిమ్మట నిర్వీర్యమును, నిస్తేజమును అగు ప్రకాండముయొక్క దగ్ధస్థితియే దీనికిని కలుగును. ఒకే

వృక్షమున సంభవ వినాశములకు అనువగు బీజ ప్రకాండములు వెలయు నట్లే, స్థూలమునందును సృష్టి ప్రళయములను వెలయించు చైతన్య జడ శక్తులు సంగతములు. ఇయ్యది సామాన్య ప్రాణి శరీర పక్షముననేకాక, విశ్వపురుష దేహమునందును అన్వయించుచున్నది. అఖండాద్వితీయమగు చైతన్యశక్తి ప్రవాహము, ఖండము సద్వితీయము అగు జడశక్తి ప్రవాహమును విరాడ్విగ్రహమున వెలయుచున్నవి. మొదటిది వ్యక్తావ్యక్తము సర్వపరిపూర్ణమునైన తేజము. రెండవది బుద్ధీంద్రియ గోచరమై ప్రత్యక్షమున భాసించు ఆకాశాది తత్త్వ సంగ్రహము.

ఈ నానాభేదములుగాని, పృథగ్రూపములుగాని ఆ యేకమునుండియే సంభవించు చున్నవనుట మఱువరాదు. ఏకమాత్రమును, అద్వితీయమును అగు ఆ వస్తువు, అందు ఉదయించెడి స్పందముచే సద్వితీయమై ఏకమును అనేకముగా భాసింపజేయుచున్నది. చెఱువులో వెలువడిన మొదటి అల అనేక తరంగ మాలికలకు కారణమయి_నురుగులను, బుడగలను కలిగించునట్లు ఈశ్వరునియందలి సంకల్పము (స్పందము)ను బహు భేదజాతమునకు కారణమై ఒప్పుచున్నది. మానసములోని సంకల్పముల వరుసలు ఎట్లు నిరవధికములై నానారీతుల సంబంధాసంబంధములతో బుద్ధిని శంకాసంకులము ఒనర్చి నిశ్చయత్వమును దూరము చేయు చున్నవో, అట్లే విశ్వాత్మయందలి స్పందమును అనంతస్పందములకు కారణమై అనంత భేదభిన్నమగుచున్నది. అయినను ఈ భేదములందు అన్నింటను ఆదిమవస్తువుయొక్క ఉనికి నువ్వులలోని నూనెవలె వ్యాపించియే ఉన్నది. అది ఒక్కొకచోట తన్ను తాను ప్రత్యక్షించుకొనియు ఒక్కొకచోట అభివ్యక్తము కాకయు, ప్రకాశా ప్రకాశములతో ఈ విశ్వ లీలను నెఱపుచున్నది.

"తదేజతి, తన్నైజతి, తద్దూరే, తద్వన్తికే,
తదన్తరస్య సర్వస్య, తదు సర్వ స్యాస్య బాహ్యతః."

"జగత్కారణమగు ఆ ఆత్మతత్త్వము కదలును, కదలదు. స్వయముగా నిశ్చలమయ్యు ఉపాధిసంయోగముచే కదలినట్లు పొడకట్టు చున్నది. అది (అజ్ఞానులకు) దూరమున, (జ్ఞానులకు) దగ్గరనే; అయ్యది నామరూప క్రియాత్మకమగు ఈ జగత్తునకు లోపల వెలుపల నిండి వెలుంగుచున్నది." అని ఈశావాస్యము అద్దాని మహిమను పొగడినది. ఇంకను—

"అనేజ దేకం మనసో జవీయో,
నైన ద్దేవా ఆప్నువ న్పూర్వ మర్శత్,
తద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠత్
తస్మి న్నపో మాతరిశ్వా దధాతి."

ఈ మంత్రముకూడ ఆత్మయొక్క అతీతాద్భుతశక్తులనే వ్యక్త పఱచుచున్నది. ఎట్లైనను దాని లీలారహస్యము విజ్ఞాతమగుట దుర్ఘటమే! కత మేమన, ఏకము నెఱుగుట సుకరము. అనేకమును గ్రహించుట దుష్కరము. ఈ అనేకమునందు, ఈ సాంతమునందు, ఈ పృథక్త్వము నందు మాటుమణగినట్లుండి ప్రకారాంతరమున భాసించు తత్త్వము దురూహము కాదా! వేదర్షులు ఇద్దానినే—

"తిలేషు తైలం, దధినీవ సర్పి, రాపః స్రోత, స్స్వరణీషు చాగ్నిః"

నువ్వులలో నూనెవలె, పెరుగునందు నేయివలె, అరణులయందు (కొయ్యలలో) అగ్నివలె తత్త్వము ఒప్పారుచున్నదని అంతస్తత్త్వ సాక్షాత్కారమును పడసిన తన్మయత్వముతో గానము చేసిరి.

## రూ ప ము

నిష్పందమైన విశ్వాత్మసత్త అనుభూతమగుటకు ఏ ప్రావరణములు మనకు అడ్డు తగులుచున్నవని తెలిసికొంటిమో, అవియే ప్రకృతమున విచారణీయములైన నామ రూపములు. విశ్వాత్మని అమేయ విభూతి విశ్వరంగమున నామ రూపముల ద్వారముననే అభివ్యక్త మగుచున్నది. మానవుడు ప్రపంచములోని వస్తువులను ఆరయుటకు పూనుకొన్నయెడల మొట్టమొదట చక్షుర్గోచరము లగునవి అసంఖ్యాకములగు రూపవత్పదార్థములు. తదుపరి ఆలోచనావీధిని సంచారము చేయునని రూప రహిత వస్తుసమూహములు. సరూపముగాని నీరూపముగాని • వస్తుమాత్ర వ్యప దేశము అర్థానికి విరుద్ధము కాదు. ఈ విశాల బ్రహ్మాండము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, భూమిపైనున్న నదీ నద సముద్ర పర్వతారణ్య క్షేత్రములు, ఆకాశమునందున్న గ్రహమండలములు, కోటిశః కల ప్రాణిజాతములు - ఒక్కటేమి, సమస్త శక్తులును రూపమను కంచుకమును ధరించియే ప్రత్యక్ష మగుచున్నవి. సూక్ష్మానంత దివ్యశక్తి స్థూలముగను, అంతవంతముగను, అదివ్యముగను భాసించినప్పుడు, రూపమును ధరింపక ఎట్లు తప్పును! సూక్ష్మమై జగద్రూపమును తాల్పక అచింత్యాద్భుత శక్తియుక్తమై ఉన్నప్పుడే నిరాకారమయ్యును నిర్నామము కాలేదు

నిరాకారమైన యేకైక సద్వస్తువు సాకారముగా తన్ను తన ఒండొక ప్రకారమునకు విషయము చేసికొని భాసించుట దానికి సహజ సిద్ధము. (దేవస్యైష స్వభావోయం— ఈ సృష్టి దేవుని స్వభావము) అట్లు

• వసతి (అనగా ఉనికి) గలది వస్తువు. ప్రత్యక్షములుకాని భావాదులు సైతము ఉనికిని గలిగి యుండుటచే వస్తువు లంటిమి.

నానాభంగుల వ్యక్తమగుటకు రూపమే ప్రథమ సాధనము. అనేకము లయిన శ్రుతులును, శ్రుత్యంతములగు ఉపనిషత్తులును ఈ వాదమునే, ఈ విధానమునే అనుభవైక వేద్యముగ నిరూపించుచున్నవి. ఈశ్వరశక్తి రూప రూపముననే ప్రప్రథమమున వ్యక్తమయిన దనుటకు పురుష సూక్తములో ఈ వర్ణనము పొడకట్టుచున్నది. జగత్కర్త బ్రహ్మాండ గర్భములైన విశ్వములను సృజించి నామకరణముచేసినాడని ఈ మంత్రము యొక్క భావము —

"సర్వాణి రూపాణి విచిత్య ధీరః,
నామాని కృత్వాఽభివదన్ యదాస్తే."

దీనినిబట్టి విశ్వాంతర్గత పదార్థరాశి సాకారముగ వ్యక్తమయినదని తెలియుచున్నది ఉపనిషత్తులయందు ఈవివరణము, వర్ణనము విపుల ముగను, గూఢముగను చేయబడి యున్నది. అందును ముండకోపనిషత్తు నందలి ఈ వర్ణనము భావించి తీరదగినది. అనాదియగు ఏకమాత్ర సత్తను నిర్దేశించుచు—

"దివ్యో హ్యమూర్తః పురుషః, సబాహ్యా భ్యంతరో హ్యజః,
అప్రాణో హ్యమనాః శుభ్రో, హ్యక్షరా త్పరతః పరః."

ఆదిమపురుషుడు, (పురి—హృదయగుహాయాం శయనాత్పురుషః లేక తత్త్వము దివ్యుడనియు, ఆకారరహితుడనియు, బాహ్యాభ్యంతర సంచారము కలవాడనియు, ప్రాణ మనోవికారములు లేని అక్షరుడును, పరునకంటె పరుడనియు చెప్పుచు - ఆ ఏకైక పదార్థమునుండియే నానా భూతధాతువుల ఆవిర్భావము వర్ణింపబడినది.

"ఏతస్మా జ్జాయతే ప్రాణో, మన స్సర్వేంద్రియాణి చ,
ఖం వాయు ర్జ్యోతి రాపః, పృథివీ విశ్వస్య ధారిణీ."

ఆ యద్వితీయ సత్తనుండియే ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, అగ్ని, జలము, భూమి, ప్రాదుర్భూతములయినవి.

ఇందు మనోబుద్ధులవంటి సూక్ష్మతత్త్వములను వీడినచో అన్నియు ఇంద్రియ గోచరములగు రూపములు కలవియే.

అఖండాద్వితీయ నిత్యపరిపూర్ణమైన ఆదిమతత్త్వము బహునామములతో వ్యవహృతమైనది. ఋషులు అనేక నామములను దానికి చెల్లునట్లు భావించి యున్నారు. ఒకచోట 'సత్' అనియు, ఒండొకచో 'పురుషు' డనియు, వేఱొకచో 'ప్రజాపతి' యనియు, ఇంకొకచో 'విశ్వకర్మ' యనియు, ఒండొకచో 'హిరణ్యగర్భు'డనియు, బహునామములచే దానిని పేర్కొని చిట్టచివరకు 'ఏకం సత్' అని అట్టిదానినే "విప్రా బహుధా వదన్తి" అని చెప్పి నామవైరూప్యముచే కలిగెడు విరోధమును పరిహరించి యున్నారు. భాషామాత్ర సహజములగు స్త్రీ పుం నపుంసక లింగ భేదములును దానిపట్ల నిరుపయోగములు. లింగత్రయ విలక్షణమైన అనిర్వచనీయశక్తిని నిర్దేశింపవలసివచ్చినప్పుడు, లింగాది సంకుచిత లక్షణ లక్షితములైన పదములకు యథాప్రయోగముగాక గత్యంతర మేమి? అందుకే శక్తి, చైతన్యము, సత్, చిత్, ఆనందము, పురుషుడు, విశ్వకర్మ, ప్రజాపతి—ఇత్యాది పదములు యథాసంభవముగ ప్రయోగింప బడినవి. కాని ఆశబ్దముల స్థూలరూపములను (లింగాది సంజ్ఞలు) బట్టి జగత్కారణునకు స్త్రీత్వ పుంస్త్వములను, ఇష్టమగు నామరూపములను అంటగట్టుట మౌర్ఖ్యము. తత్త్వద్రష్ట యెవ్వడును అట్లు చేయబూనుకొనడు. అగుగాక. ఇది అవాంతర విషయము.

విశ్వసృష్టి విషయము వేదములలో ఇట్లు ప్రస్తావింపబడినది.

"స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః"

జగత్కారణుడగు ఆ విశ్వకర్మ సంకల్ప మాత్రముచే జగద్రూప ధనభోగమును ఆపేక్షించెను.

"అజాయమానో బహుధా విజాయతే"

ఆ ప్రజాపతి పుట్టకుండగనే పలు విధములుగా అగుచున్నాడు.

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"

ఆ పరమైశ్వర్యశాలి మాయావశమున అనేకరూపముల నందును. ఈ అర్థము ఉపనిషత్తులలో ఈ రీతిని ప్రపంచింపబడినది.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్"

—ఛాందోగ్యము.

ఏకమైన సత్పదార్థము అనాది సిద్ధము. ఇదియే బ్రహ్మము, ఆత్మ, సచ్చిదానందము, ఇంకను వ్యవహృతములైన నానాశబ్దముల చేతను నిర్దిష్టము.

'త దైక్షత బహు స్యాం ప్రజాయేయేతి'

ఆ సద్వస్తువు అనేకము కావలయునని చూచెను. ఇట్లే ఐతరేయోపనిషత్తునందును—

'ఆత్మావా ఇద మేక ఏ వాగ్ర ఆ సీత్.
నాన్య త్కించన మిషత్. స ఈక్షత,
లోకాన్ను సృజా ఇతి. స ఇమాన్ లోకా నసృజత '

ఈ జగదుత్పత్తికి పూర్వము ఆత్మ ఒక్కటియే కలదు. తదితరము ఏదియు లేదు. ఆ ఆత్మ లోకములను సృజింపవలయునని చూచెను. అట్లు ఈక్షణ మొనర్చి ఈ లోకములను సృజించెను. ఈ మంత్రమును వ్యాఖ్యానించుచు శంకరులు "ఎట్లు లోకములో బుద్ధిమంతుడగు శిల్పి ఈ విధము లగు ప్రాసాదాదులను నిర్మించుదునని పర్యాలోచించుకొని తరువాత ఆ మేడలు మొదలగువానిని నిర్మించునో, అట్లే ఆత్మయు ఈ లోకములను సృజించెను'' అని వ్రాసియున్నారు.

'సోఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి.
స తపోఽతప్యత, స తప స్తప్త్వా. ఇదం సర్వ
మసృజత.య దిదం కించ.'

—తైత్తిరీయోపనిషత్తు.

ఆ ఆత్మ అనేకము కావలయునని సంకల్పించుకొన్నది. ఈ సంకల్పమునే మనము విశ్వాత్మయందలి ప్రథమ స్పందమని చెప్పికొన్నాము. తరువాత అది తపస్సుచేసి ఈ జగము నంతటిని సృష్టి చేసినది. బీజము భూమియందు సంస్థితమయి వృక్షమును సృజించినదని భావము.

"తత్ సృష్ట్వా తదే వానుప్రావిశత్''

ఈ జగమును (శరీరము; విశ్వశరీరముగాని, ప్రాణిమాత్రశరీరము గాని) సృజించి అందే ప్రవేశించినది. స్వశరీరమధ్యంగత హృత్పుండరీకమున జీవరూపమున ప్రవేశించినదని భావము. బీజమో, మొక్కను కల్పించి అందే మరల బీజరూపమున ప్రవేశించినది. అనగా మొక్క నుండి తిరిగి బీజము కలుగుచున్నది. ఈ అంశమునే యజుర్వేదములోని విశ్వకర్మ సూక్తముకూడ నుడువుచున్నది.

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి
ర్హోతా నిషసాద పితా నః. స ఆశిషా
ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదోవర ఆవివేశ."

....ఆ విశ్వకర్మ పరమేశ్వరుడు సంకల్పమాత్రము చేతనే జగత్సృష్టి చేయ నెంచి జగమును (పిండాండమును, బ్రహ్మాండమును) సృష్టించి, అందే ప్రవేశించెను.

"త దనుప్రవిశ్య సచ్చ త్యచ్చా భవత్."

సృజింపబడిన ఆ శరీరమునందు ప్రవేశించి మూర్తమును, అమూర్తమును అయినది. బీజము మూర్తమే. కాని అందలి పునరుత్పాదకశక్తి అమూర్తము. అనగా దృగ్గోచరముకానిది. నిప్పుమీద వేపబడిన విత్తు తన రూపముతోనే ఉన్నను, తనయందలి ఉత్పాదకశక్తిని కోల్పోవు చున్నది. కావున శక్తి అమూర్తము. ఇట్లు మూర్తామూర్తములు అందే నెలకొని యున్నవి.

విశ్వకర్మ మున్నగు పదములచే పేర్కొనబడిన జగత్కారణము సంకల్పించె నన్నను, ఈక్షణమొనర్చె నన్నను అది ఇంద్రియములతో గూడిన శరీరి కావలయునని శంకించినయెడల వేదోపనిషత్తుల సమాధాన మిది.

"కిగ్ంస్వి దాసీ దధిష్ఠాన మారంభణం
కతమత్స్విత్ కిమాసీత్ యదీభూమిం జనయన్.
విశ్వకర్మా విద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షః
కింస్విద్వనం క ఉస వృక్ష ఆసీ ద్యతో
ద్యావా పృథివీ నిష్టతక్షుః, మనీషిణో మనసా
పృచ్ఛతే దు త ద్య దధ్యతిష ద్భువనాని ధారయన్."

సర్వద్రష్టయగు విశ్వకర్మ స్వర్లోక భూలోకములను సృష్టించినవా డగునేని అతనికి నివాసస్థాన మేది? ఏ ఉపాదాన కారణముతో ఈభూమి మొదలగు వానిని సృష్టించెను? కుండను చేయదలంచిన కుమ్మరి ఒక గృహమును ఆధారముగా చేసికొని మట్టియను ద్రవ్యముతో దానిని నిర్మించునట్లు, భగవంతుడును విశ్వమును ఎట్లు దేనితో సృజించెను? అని ప్రశ్నింతురేమో. సర్వశక్తియగు ఈశ్వరునకు సాధనాంతరములతో పని లేదు. ఒక నివాసము అక్కఱ లేదు ఒక ఆధారము అవసరము కాదు. ఆతడు అనిర్వచనీయమగు తన మహిమచేతనే స్వర్గమును భూమిని కప్పెను. అచింత్యశక్తి కదా ఆతడు! లోకములో ఒక శిల్పి ఒక భవనమును కట్టనెంచినచో, ఒక అడవికేగి అందలి వృక్షాదికముతో వలసిన సామగ్రిని చేసికొని భవనమును నిర్మించును. అట్లే పరమేశ్వరుడగు విశ్వకర్మ ద్యావాపృథువులను (విశ్వమును) నిర్మించునపుడును వన వృక్షాదు లేవి? అని ప్రశ్నించునెడల - ఓ విద్వాంసులారా, ఆ విశ్వకర్మ భువనములను సృజింప ఎట్లు సంకల్పించిన అట్లు జరిగినది. అనగా ఆతనికి తన స్వరూపమునకు భిన్నమైన వనవృక్షాది స్థానీయమగు ఇతర పదార్థముతో పని లేదని అభిప్రాయము. నిమిత్తోపాదాన కారణములు రెండును ఆతడే।

మఱియు అవిద్యాయుక్తుడగు వానికి ఆ యా పనులొనర్చుటకు శరీరము, ఇంద్రియములు కావలయునుగాని, సర్వజ్ఞుడును, సర్వశక్తియు, సర్వేశ్వరుడు అగువానికి శరీరేంద్రియాదులతో పని లేదు. ఈ అంశమును రుజువు చేయుటకు అనేక ప్రమాణములు కలవు —

"అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్య త్యచక్షు స్స శ్రుణో త్యకర్ణః

న వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహాన్తమ్."

"న తస్య కార్యం కరణం చ విద్యతే
న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే
పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబల క్రియాచ."

— శ్వేతాశ్వతరము.

ఆ పరమాత్మ పాదములు లేకున్నను వేగముగా నడువగలడు. చేతులు లేకున్నను పట్టుకొన గలడు. కన్నులు లేకున్నను చూడగలడు. చెవులు లేకున్నను వినగలడు. ఇంత యేల, తెలియదగినదాని నంతయు ఆతడు తెలిసికొన గలడు. కాని అట్టి సర్వశక్తియగువానిని మాత్రము ఎవ్వడును ఎఱుంగజాలడు. అట్టి పురుషునే మొదటివానిగను, గొప్పవాని గను నుడువుదురు. ఆతనికి శరీరముకాని, ఏ యితర సాధనముకానిలేదు. ఆతనితో సమానుడుకాని, అధికుడు గాని లేడు. అతనికి స్వాభావిక మగు పరాశక్తి (మాయ) వివిధ రీతులు గలదై జ్ఞాన బల క్రియలు గలదై ఒప్పుచున్నది.

ఇట్లనుటచేత పరమాత్మ సాధనాంతర నిరపేక్షుడై సృష్టిక్రియను నిర్వహించునట్లు తెలియుచున్నది. అట్లు కాకున్న నిఖిలజీవుల పుణ్యాపాప ములను, అనుక్షణము చేయు సంకల్పములను పరమాత్మ ఏ కన్నులతో చూచి, ఏ చెవులతో విని, ఏ మనస్సుతో భావించును?

అందుకే విశ్వపురుషుని 1. "విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో విశ్వతో హ స్త ఉత విశ్వతస్పాత్'' అనియు, 2. సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్'' అనియు 3. ''సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం'' అనియు, 4. ''సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షి శిరో ముఖం, సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి'' అనియు శ్రుతి స్మృతులు గానము చేసియున్నవి. పై వాక్యములందు దేవునికి వేయి తలలు, వేయికన్నులు, వేయిచెవులు కలవని మాత్రమే గ్రహింపతగదు. సహస్రశబ్దమున కిక్కడ అనేకమని అర్థము. అనంతశక్తియగు ఈశ్వరుడు వేయికన్నులు, వేయిచెవులు కలవానివలె అమేయకౌశలముతో ఆ యా అర్థములను తెలిసికొని విశ్వసృష్టిధర్మమును నెఱపుచున్నాడను మహత్తరమగు గంభీరార్థమును గ్రహింపవలయును. దీనికిని ''అపాణి పాదో'' అన్నమంత్రవాక్యమునకును సముచితమగు సమన్వయమును కుదుర్చుకొన్నగాని, కవితాపూర్ణమగు వేదర్షుల తాత్త్వికహృదయము మనకు గోచరింపదు

ఇంకను సద్వస్తువునుండి అసత్తులైగాని, సత్తులైగాని పుట్టిన నామ రూపములను గూర్చి ఉపనిషత్తులు—

''య స్సర్వజ్ఞ స్సర్వవిద్ యస్యైష మహిమా భువి
తస్మా దేత ద్బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే.''

—ముండకోపనిషత్తు.

---

1. విశ్వకర్మ సూక్తము. 2. పురుష సూక్తము. 3. మంత్ర పుష్పము. 4. భగవద్గీత. 13—14.

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః
ఆకాశా ద్వాయుః. వాయో రగ్నిః. అగ్నే రాపః.
అద్భ్యః పృథివీ. పృథివ్యా ఓషధయః.
ఓషధీభ్యోఽ న్నం. అన్నా త్పురుషః."

సర్వజ్ఞము సర్వవేది సర్వశక్తియుక్తము అగు తొల్లింటి పదార్థము నుండి నామరూపాన్నము ఉద్భవించినవి. ఆ యాత్మనుండియే ఆకాశాది పంచభూతములు, ఓషధులు, వాటినుండి యన్నము,అ న్నరసమునుండి పురుషుడు (ప్రాణి) ఉద్భవమందిరని తైత్తిరీయమును వాకొనుచున్నది.

మఱియు ఉపనిషత్తులయందు ఒకచోట స్వనామనిర్దేశము చేసి నామ రూపములను కంఠతః చెప్పినను చెప్పకున్నను, వ్యత్యస్తముగా చెప్పినను సృష్టిలో అద్వితీయసత్త యొక్క విలాసక్రీడ నామరూపముల ద్వారము ననే జరుగుచున్నదనుట వేదహృదయము. ఛాందోగ్యములో —

'అనేన జీవేనా త్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి'

ఆ సత్తు "నేను జీవాత్మరూపముగా ప్రవేశించి నామరూపముల నేర్పఱతును" అన్నదని అనుటచే నామరూపముల సృష్టి వినబడు చున్నది.

ప్రకృత గ్రంథమునగాని, వ్యవహారమునగాని నామశబ్దము ముం దును, రూపశబ్దము తర్వాతను ఉన్నను రూపమే మొదటిదని గ్రహింప వలయును. ఇది స్వకంఠోక్తి కాదు. వ్యవహార సౌకర్యమునకో, శ్రవణ సౌఖ్యమునకో "నామరూప" సమస్త పదములో నామశబ్దమునకు పూర్వ నిపాతము కలిగినను రూపమే తొల్లింటిదని గ్రహింపవచ్చును. అందుకే వేదము సృష్టి ప్రకారములను వర్ణించి వర్ణించి కడపట "సర్వాణి రూపాణి

విచిత్య ధీరః నామాని కృత్వాఽభివదన్" (పురుషసూక్తము) అని సృష్ట్యనంతరమే నామకరణ మొనర్చినది. లేకున్న అనుత్పన్న పుత్ర నామకరణము వలె (ఆలూ లేదు చూలూ లేదు కొడుకుపేరు సోమలింగము) ముమ్ముందొనరించు నామకరణమును హాస్యాస్పదమగును.

ఇచ్చట ఒక ఆశంక— "లోకమున శిల్పులగువారు ఏదో ఒక వస్తువును చేయ సంకల్పించుకొని తన్నిర్మాణమునకు పూనుకొందురు. అట్టితఱి వారు పాత్రమునో, వస్త్రమునో, బొమ్మనో, మఱి దేనినో చేయ నెంచినపుడు ముమ్ముందుగా వస్తునామమునే గ్రహించుచున్నారుకదా. 'కుండ చేయవలయు'నను సంకల్పము కుమ్మరవానికి ఉండిననేగాని కుండ యనెడి ఆవస్తువు సిద్ధమగుట లేదు నామగ్రహణపూర్వకముగా నిర్దిష్టము గాక చేయబడుటకును ప్రకృతవస్తు వెట్టిది చేయవలసియుండునను సందేహము కలుగవచ్చును కావున ముమ్ముందుగనే నామసృష్టియనుట పరమౌచిత్యముగా కన్పట్టుచున్నది."

ఆపాతమధురమగు ఈ ఆశంక స్థూలదృష్టికి సమంజసముగా తోచవచ్చును. కాని మన యాలోచనమును సృష్ట్యారంభ కాలమునకు దీసికొని వెళ్ళినచో దెబ్బ తినగలదు. అనేక నామరూపోపాధులు సృష్టములైన పిమ్మట, లోకమనునది ఒకటి ఏర్పడగా, ఆలోకమునందు ఒక సామాన్య శిల్పి, లేదా కర్మకారుడు పూర్వమే లబ్ధసత్తాకము (స్వరూపము) లైన వస్తువులను సృజింపవలసివచ్చినచో సంజ్ఞార్థము ముమ్ముందుగా నామతః నిర్దేశము చేసికొనవలసియుండుట తప్పనిదే. లేకున్న, అనిర్దిష్టమైన ఆ వస్తువునకు రూపే యేర్పడక పోవును. ఒకవేళ ఉన్మాదకృత్యమువలె ఏర్పడినను అయ్యది ప్రయోజనకారి కాజాలక పోవచ్చును. కాని అప్పటి స్థితి ఇట్టిది కాదు. నిరామయమును, సర్వశక్తమును అగు పారమేశ్వర కళావిభూతి జగత్సర్జనాక్రీడకు పూనునప్పటి యవస్థలో సామాన్య

మానవునికివలె నామనిర్దేశ పూర్వకముగా పదార్థనిర్మాణము చేయవలసిన ఆవశ్యకత లేదు. అట్లే అగునేని పరబ్రహ్మము యొక్క సర్వశక్తిమత్త్వము, అఘటనా ఘటనా సామర్థ్యము శంకితము లైనట్లే. ఆతని ఇచ్ఛా (ఈ ఇచ్ఛనే ఈ క్షణమనియు, స్పందమనియు, సంచలన మనియు, సంకల్పమనియు ఉపనిషత్తులును, వేదాంతులును పలుమాటలతో పేర్కొందురు) మాత్రమున చరాచర విశ్వసృష్టి దానియంతట అది ప్రవర్తిల్లుచున్నది కాని, మనవలె ఆతడు పేరును, దానికున్న యర్థమునుబట్టి కాలు సేతులు మున్నగు సాధనములతో భూతసృష్టి ఒనర్పలేదు. అట్లొనర్చుటకును మనకువలె ఈశ్వరునికి పూర్వభావులైన ఆదర్శ పదార్థములు లేవు కదా! కావున ఈ ప్రశ్నము అనాలోచిత రమణీయము.

మఱియు లోకోత్తర నిర్మాణ చాతుర్యముగల శిల్పి పూర్వసిద్ధము గాని క్రొత్తరకపు వస్తువు నేదైన నిర్మించిన, అపూర్వమగు అట్టి వస్తువు నిర్మితమైన పిమ్మటనే దానికి తగినపేరు పెట్టునుగాని, మున్ముందుగా నామకరణము చేసి నూతనవస్తు సృష్టికి పూనుకొనడు. కాబట్టియు ఈ భావము దెబ్బ తినదు. ఇంకను నామమునుగూర్చి ఒనరింపబోవు చర్చనుబట్టియు ప్రస్తుత సందేహము దూరీకృతము కాగలదు.

కావున ఉదాహృత శ్రుత్యుక్తిని బట్టియు, లౌకిక దృష్టాంతమును బట్టియు కూడ రూపోపాధులనే మున్ముందు ఈశ్వరుడు సృజించె ననుట యుక్తము. అంశపంచకమునుబట్టి చూచినను ఈ విషయమే సువ్యక్తమగుచున్నది.

"అస్తి, భాతి, ప్రియం, రూపం, నామ చేత్యంశ పంచకమ్"

'అస్తి' సత్తా (ఉనికి) మాత్ర లక్షణమైనది. 'భాతి' చిదేక రస పంపన్నము. అనగా స్వయంప్రకాశ స్వరూపమగు జ్ఞానము. 'ప్రియం'

ఆనందాత్మకము. ఈ మూటినే మనము వ్యవహార సౌకర్యమునకై సచ్చిదానంద మనుచున్నాము. పరబ్రహ్మ లక్షణమగు ఈ సచ్చిదానందము ఇంద్రియగోచరము కాని ప్రజ్ఞానఘనము. సత్తామాత్రమని చెప్పికొన్న ఉనికి అతీంద్రియమైన ఉనికియే కాని ఒండొకటి కాదు. అట్లే చిత్తుగూడ మనోగ్రాహ్యముగా తోచినను, మనస్సుచే గ్రహింపజేయు సామర్థ్యము కలది. అట్లే ఆనందమును. ఈ మూడును తమ ఒండొక ప్రకారమునకు విషయము కావలసి వచ్చినప్పుడు ఏర్పడునదే చతుర్థమగు రూపము. సచ్చిదానందము రూపమున విహరించినపుడే కదా దానివిలాసము ఇంద్రియగోచరమగునది. అయిదవది నామము. కాబట్టి ఈ మీమాంసను అనుసరించి చూచిన నామమునకన్న రూపమే తొల్లింటిదని రూఢి యగుచున్నది. ఈ యర్థమును ఇంతకంటె విస్తరింపక జిజ్ఞాసువులు సునిశిత సత్యానుభూతి యోగమున సుగ్రహము చేసికొందురని వదలుట యగుచున్నది.

జగదంతస్స్థిత పదార్థములకు కల ఈ రూపమే జగదంతః ప్రవిష్టుడు ఐనాడు కనుక జగత్కర్తకును నిరాకారుడైనను తప్పినది కాదు ఆర్షకవులు విశ్వవ్యక్తిని భావన చేసికొని విశ్వాతీతస్థితిని పడయుటకు ఆ విశ్వమయుని విశ్వస్వరూపమును హృద్యముగను, సత్యముగను చిత్రించుకొనియున్నారు.

"అగ్ని ర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః,
వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా."

— ముండకోపనిషత్తు.

ఆ విశ్వమయునకు ద్యులోకమే శిరస్సు; సూర్యచంద్రులు నేత్రములు; దిక్కులు చెవులు; వాగ్వివృతులు వేదములు; వాయువు ప్రాణము; విశ్వమే హృదయము; పాదములు భూమి. ఇట్టి విశ్వాకారుడు సర్వభూతములకు అంతరాత్మ. ఆహా! ఎంతటి తత్త్వవర్ణనము!! ఎంత హృదయంగమము!!! ఎంతటి నిశ్చలసమాధిచే భావనీయము.

పుడమిపైనున్న మానవుడు భూమ్యాకాశములను తప్ప తదతీత రూపవత్పదార్థములను ఎఱుంగని సంకుచిత బుద్ధితో ఇంతకంటెను బృహత్తరములగు ఏ వస్తువులతో విశ్వపురుషుని విలోకింప కలడు? వైదిక యుగమునాటి దివ్యర్షుల విజ్ఞానానుభవముల మహత్త దీనితో సర్వంకషమైనది. ఒక్కొక్క పదమునందు ఒక్కొక్క తత్త్వ విభూతిరహస్యము ఉద్ఘాటింపబడినది. ఒక్కొక్క పోలికతో పరమేశ్వరుని చిద్విలాసము వివరింపబడినది.

ద్యులోకమునకు పైని వేఱొక లోకమున్నట్లు వేదము చెప్పుట లేదు. ఉన్నను అయ్యది అనూహ్యము, అనిర్దిష్టమును. కావున అట్టి ద్యులోకమే పరమేశ్వరుని శిరమనుట ఉచితము. శరీరమున పరమోన్నతమైన అగ్రము శిరస్సే కావున దానితో స్వర్గమును ఉపమించుట సమంజసము. లోకదీపకులై ఆలోకమును ప్రసాదించు సూర్యచంద్రులు కాక ఆ సహస్రాక్షునకు నేత్రస్థానీయు లెవ్వరు? తదితరములైన తేజోగోళములు ఉన్నను, అవి మర్త్యలోక విషయములు కాకపోవుటచేత, మర్త్యప్రాణుల ఈ వర్ణనము విజ్ఞానదూరము కాదు. దిక్కులు చెవులనుటచేత దిక్పద సంవేద్యమానమగునది ఇచ్చట ఆకాశము. శబ్దగుణకమైన ఆకాశము శ్రోత్రేంద్రియమునకు ఉపాదాన కారణము కదా! దిక్కాలాద్యనవచ్ఛిన్నుడైన వానికి దెసలు చెవులుగాక, అంతకంటెను పార్శ్వవర్తులు ఎయ్యవి? ఆయన వాగ్విలాసములే వేదములు. జ్ఞానప్రధానము

లైన వేదములు అమ్మహనీయునికి వాక్యానములు కావా మఱి! అనంత మైన వేదరాశి ఆ మహాకవి నిఃశ్వసితమని చదువలేదా! నభోమండల సంచారి యగు గాలి ఆతని నాసికయందలి వాయువు. దీనిచేత నాసికయు చెప్పబడినట్లే. ఇక హృదయమో, విశ్వమే! పరమేశ్వర హృదయము నెఱుంగవలెనన్న, విశ్వవిజ్ఞానము నందుటయే అని దీని భావమైనట్లు ఉపాసకు లెఱుంగుదురు. ఇక ఈ విశ్వహృదయుని పాదములో, భూమియే యట ఈ మంత్రమునందలి తత్త్వార్థమును, ఆ యా అంగప్రత్యంగముల భావనచే ఎఱుంగదగిన రహస్యములను ఉపాసకైక వేద్యములు. విపుల తర భాష్యమున కాని యవ్వి ప్రవచింప వీలుకానివి.

కావున రూపవత్త్వము విశ్వకృత్తునకే కలదు. ఇంతటి సురూపిచే సృష్టములైన రూపముల మహిమాతిశయము వాచామగోచరమగుట వింత కాదు. శ్రీ శంకరాచార్యులు విశ్వకృద్రూప విచారమును 'రూపోపన్యా పాచ్చ' (1–2–23) అను బ్రహ్మసూత్ర భాష్యరచనా సందర్భమున కొంత వఱకు చేసియున్నారు.

ఈ సూక్ష్మవిచారణచేత రూపరహస్యమును ఈషత్తుగా తెలిసి కొంటిమి. ఇంక నామమునుగూర్చియు కొంత పర్యాలోచింతము.

## నా మ ము

రూపకల్పనము ఎప్పుడు సిద్ధమో దానివెంటనే నామ నిరూపణ మును ఏర్పడినది. విశ్వాత్ముడే సర్వరూపములను విరచించి నామకర ణము చేసినాడని శ్రుతి వచించెనని చదివి యుంటిమి. స్థూల రూపవత్ప దార్థములకుగాని, నీరూపములకు గాని నామములు మాత్రము ఉండి తీర వలయును. హృదయమున తోచు భావములకు ఆకారము లేకున్నను పేరులు పెట్టనిది వ్యవహారము సాగదు. కాగా నామరూపోపాధులు

రెండును కలవి కొన్నియు, కేవల నామోపాధులు కొన్నియు అని జగదంతర్గతపదార్థరాశి ద్వివిధ మగుచున్నది. నామరూపోపాధులు రెండును కలవి చక్షుర్గోచరములగు పృథివ్యాది నానావిధ పదార్థములనియు, కేవల నామోపాధులు నిరాకారములై మనస్సుచే మాత్రము తెలియదగిన కామ క్రోధాది భావములును, అనేకములగు తలపుగుంపులును, స్పర్శము, రసము, గంధము మున్నగు విషయములు అనివ్యవహరింపబడు చున్నవి.

ఈ అనంత నామప్రపంచము శబ్దమునుండియే పుట్టినది. కావున అనంత నామములకు కారణభూతమైన శబ్దమును ఎప్పుడు ఈశ్వర సృష్టముగా గ్రహింప గల్గితిమో, అప్పుడే నామకారుడు ఈశ్వరుడనియు గ్రహింపగల్గుదుము. లేకున్న, భాష మానవ కల్పితమైనది, అట్టి భాష నుండి కలిగిన నామ సమూహమునకు ఈశ్వర కర్తృత్వము ఎట్లు చెల్లును ? అను సందేహము కలుగ వచ్చును.

వేదము ఈశ్వరునినుండి వచ్చినదనియు, అందుచేతనే అపౌరుషేయమై స్వతఃప్రమాణ మగుచున్నదనియు నుడువు శ్రోత్రియ మతమునుబట్టి చూచినచో, వేదాంతర్భూతములైన వాక్కులకు ఈశ్వర కర్తృత్వము నిర్బాధము. కాని, భాషాశాస్త్రకారుల దృష్టినిబట్టి, భాష మానవ కల్పితము కాన, భాషాంతర్భూతములైన వాక్కులకు ఈశ్వర కర్తృత్వము హాస్యాస్పదముగ కన్పట్టును. వేదము ఈశ్వరాగత మనుటకు—

"యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్."

తై.బ్రా. 2–8–25–2.

"అస్య మహతో భూతస్య నిఃశ్వసితమే తద్య దృగ్వేదో
యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః

పురాణం విద్యా ఉపనిషదః శ్లోకా స్సూత్రాణ్యను
వ్యాఖ్యానాని వ్యాఖ్యానా న్యస్యైవై తాని నిఃశ్వసితాని.''

—బృహ. 4_5_11.

"ప్రజాపతి ఏ కర్మకౌశలములచేత వాక్కును నానావిధ రూపములచే సుందరమైన దానినిగా ఒనర్చెనో'' అని వేదమును "ఈ పరమాత్మ యొక్క నిశ్వాసమే జ్ఞానప్రధానమగు వేదరాశియు, తదంతర్భూతములగు ఇతర విద్యలును'' అని బృహదారణ్యకోపనిషత్తును నుడువుచున్నవి. అనగా పురుషునినుండి నిశ్వాస మెట్లు అప్రయత్నముగా అబుద్ధిపూర్వకముగా వెలువడుచున్నదో, అట్లే పరమాత్మనుండి వేదము ను అప్రయత్నముగా అవిష్కృతమైనదని భావము. ఇచ్చట శంకరులు —

''నామరూపయో రేవ హి పరమాత్మోపాధిభూతయో
ర్వ్యాక్రియమాణయో స్సలిల ఫేనవత్తత్త్వాన్యత్వే
నా నిర్వక్త వ్యయో స్సర్వావస్థయో స్సంసారత్వ
మిత్యతో నామ్న ఏవ నిఃశ్వసితత్వ ముక్తమ్.''

అని వ్రాసిరి.

పై రెండు మతములకును ఒక సమన్వయ మార్గము కూర్చవచ్చును. దాని ననుసరించి చూచిన నామరూపోపాధులు రెంటికిని ఈశ్వర కర్తృత్వము సిద్ధము కాగలదు.

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్'' అను పరమనిర్గుణ తత్త్వమునుండి కలిగిన శబ్దగుణముయొక్క వివిధ వికారములే అనంత నామములు. శబ్దమును వర్ణవిభాగముచేత పలు వికారములు గల దానినిగా

ఒనర్చి అనంతనామములను సిద్ధ మొనర్చుటలో మానవబుద్ధి వినియోగ పడినను, నిత్యమగు (వైయాకరణ దృష్ట్యా) ఆ శబ్ద మెటనుండి వచ్చినది? అఖండ నిర్గుణ బ్రహ్మమునుండియే కదా! సృష్టిలో మృత్తు సిద్ధమై యుండగా కులాలుడు దానిని పలు వికారములతో తీర్చి ప్రజా ప్రయోజనమును సంపాదించును. అంతమాత్రమున ఘట (కుండ) శరావా (మూకుడు) ద్యాకారవికారములకే కుమ్మరి కర్త గాని, అవ్వానికి ఉపాదాన కారణమైన మట్టికి అతడు కర్త కాడు కదా! *అట్లే మానవుడు శబ్దవికారములయిన నామములకు కర్తయయిన కావచ్చునుగాని, శబ్దమునకు మాత్రము ఈశ్వరుడే స్రష్ట అగుచున్నాడు. మఱియు ఆ యా అక్షరములు సృష్టిలోనే సహజముగా మానవునినుండి పుట్టినవను విచారముకూడ అక్షరసృష్టికి ఈశ్వరుడు కారకుడని తెల్పును. ఈ అంశము సాహిత్య దర్శనవ్యాసములో చూడవచ్చును.

కావున ప్రస్తుతము మంత్రమధ్యగతమైన నామశబ్దముచేత నిఖిల నామములకు ఉపాదాన కారణమైన శబ్దతత్త్వమును, అక్షరరహస్యమును గ్రహించుట సమంజసముగా ఉండును.

మఱియు వేదమునందు ఉపదిష్టమైయున్న విజ్ఞానమంతయు పరమేశ్వరునినుండి మహర్షులకు అవగతమైనదనియు, మహర్షులు ఆభావములను దివ్య సమాధి సమయములయందు ఉపలబ్ధినంది ఈశ్వరప్రేరితులై అలౌకికమగు ఆకాలపు భాషలో ఇమిడ్చిరనియు కొందఱి తలంపు. ఎట్లైనను సనాతనవేద విజ్ఞానము మాత్రము ఈశ్వర ప్రాప్తమనుటకు సందేహములేదు. వేద ప్రామాణ్య వాదమును నా "ఆత్మదర్శనము" నందు ఇంక విస్తరముగా చూడవచ్చును.

---

*"వాచారంభణం నామధేయం వికారో మృత్తికే త్యేవ సత్యమ్"

అవ్యాకృతమగు జగత్తు నామరూపములచేతనే వ్యాకృత మైనదనియు, నామరూపములను వీడిన జగమునకు వేఱొక స్వరూపము లేదనియు బృహదారణ్యకోపనిషత్తు పలుకుచున్నది.

"తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీ త్త న్నామరూపాభ్యా మేవ
వ్యాక్రియతా సౌనామాయ మిదం రూప ఇతి.
తదిద మప్యేతర్హి నామరూపాభ్యామేవ వ్యాక్రియతేఽసౌ
నామాయ మిదం రూప ఇతి. స ఏష ఇహ ప్రవిష్టః.' '

బృహ. 1—4—7.

సృష్టికి పూర్వము పరోక్షమును, సృష్ట్యనంతరము ప్రత్యక్షమును అయి యున్న జగము నామరూపములు కలదిగనే వ్యక్తమగు చున్నది. నామరూపాత్మకమైన ఈ జగమునకు నిమిత్తోపాదాన కారణభూతుడు ఎవ్వడో, అట్టి ఆత్మదే-బ్రహ్మమే ఈ జగమును సృజించి అందు ప్రవేశించినాడు

దృష్టాదృష్ట జగల్లీల అంతయు నామరూపములనెడి ఈ రెంటిచేతనే మానవహృదయమునకు వ్యక్తమగుచున్నది. అసంఖ్యాక భేదములు, పృథక్త్వములు, వికారములు, విభ్రమములు ఈ నామరూపములే; ఈ ఆవరణముల కతముననే నిర్వికార దివ్యసత్త ముసుగు వేసికొని లీలా నాట్యము చేయుచున్నది. సత్యమును జిజ్ఞాస చేయు మానవహృదయముతో పోరాటము నలిపి, దానిని కలగుండు వెట్టి నిశ్చయత్వమును దూరమొనర్చునది వీటి నానాత్వమే. ఈ నామరూప విలాసరహస్యమే ప్రవృత్తికిని, నివృత్తికిని మూలభూతము. వస్తుతః ఇవి బ్రహ్మభిన్నములు కావు. సాక్షాద్బ్రహ్మ స్వరూపము లనుకొనుటకైనను నిర్వికార బ్రహ్మ

ప్రాప్తికి ఇవి ఆవరకములును, మఱి తత్ప్రాప్తికి సాధనములునై అల రారుచున్నవి. వీటినిగూర్చిన రహస్యము విచిత్రము, విజ్ఞేయమును. ఈ నామరూప విలాస రహస్యమును ఎఱింగిన తత్త్వజ్ఞుడు 'కశ్చిత్' (ఒకానొకడు మాత్రము).

"ఏకో వశీ సర్వ భూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి,
త మాత్మస్థం యేఽను పశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్."

—కఠవల్లి.



# నామరూప విలాసము

"అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య
నామ రూపే వ్యాకరవాణి."

— ఛాందోగ్యము.

* సత్యజ్ఞానానంతమగు బ్రహ్మము సోపాధిక నిరుపాధిక భేదము లచే ద్వివిధము. నిరుపాధిక బ్రహ్మము నిత్యపరిపూర్ణము; నిఖిల సిద్ధ యోగి జనులచేతను అసంప్రజ్ఞాత సమాధి సమయమున సంవేద్యము

---

* "ద్విరూపం హి బ్రహ్మావగమ్యతే. నామరూప వికార భేదోపాధి విశిష్టం, త ద్విపరీతం చ సర్వోపాధి వివర్జితమ్."

"యత్ర హి ద్వైతమివ భవతి. తదితర ఇతరం పశ్యతి. యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూత్. త త్కేన కం పశ్యేత్? (బృహదారణ్య కోపనిషత్తు 4. 5 15.) "యత్ర నాన్య త్పశ్యతి, నాన్య చ్ఛృణోతి, నాన్య ద్విజానాతి స భూమాఽథ యత్రాన్య త్పశ్య త్యన్య చ్ఛృణో త్యన్య ద్విజానాతి త దల్పం. యో భూమా త దమృత మథ య దల్పం త న్మర్త్యమ్" (ఛాందోగ్యోపనిషత్తు. 7. 24. 1.) "సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామా ని కృత్వాఽ భివదన్ యదాస్తే" (తై. ఆ. 3. 12. 7.) "నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనం, అమృతస్య పరం సేతుం దగ్ధేంధన మివానలమ్"(శ్వే. 6. 12.) 'నేతి నేతి' 'అస్థూల మనణు' (బృహ) 'న్యూన మన్యత్ స్థానం, సంపూర్ణమన్యత్' ఇతి చైవం సహస్రశో విద్యావిద్యా విషయ భేదేన బ్రహ్మణోద్విరూపతాం దర్శయన్తి వాక్యాని."

— బ్రహ్మసూత్ర శాంకరభాష్యము. ఆనందమయాధి కరణోపోద్ఘాతము.

ఆ అఖండ చిదేకరసము విహరించుటకు గల ఉపాధులు రెండు. అందొకటి రూపము, రెండవది నామము. రూపబ్రహ్మమునుండి అనంతరూపముల సృష్టి. శబ్దబ్రహ్మమునుండి అనేక నామముల ఉత్పత్తి. నామరూపోపాధి విశిష్టమైన ఈ పరబ్రహ్మము సకలజన సముపాస్యము; సంవేద్యము. అనగా జగన్నాటకము నామరూపోపాధుల నుండియే జరుగుచున్న దనుట. అఖండ నిరుపాధిక బ్రహ్మప్రాప్తికిని ఖండమైన ఈ నామరూప బ్రహ్మోపాసనమే సోపానము. శబ్దబ్రహ్మ నిష్ణాతృత్వము కలుగదేని, నిఖిలశబ్ద లక్ష్య నిరుపాధిక బ్రహ్మావగతి లభింపదు. అట్లే రూప బ్రహ్మ తత్త్వము సాక్షాత్కృతము కాదేని, నిరాకార నిత్య పరిపూర్ణానందాభివ్యక్తి కలుగదు. కారణ మేమన? సూక్ష్మానంత దివ్య సత్తయొక్క స్థూల బహిరుపాధులే యీ నామరూపములు. స్థూల స్వరూప విజ్ఞానము కలుగనిదే సూక్ష్మతత్త్వ పరిజ్ఞానము చిక్కుట దుర్ఘటము. కావున బ్రహ్మముయొక్క శరీరస్థానములే నామరూపములని యెఱుంగవలసి యున్నది.

ప్రపంచము నామరూపవ్యాకృతము కావున మానవ జీవితయాత్ర అంతయు ఈ నానావిధ నామరూపోపాధి భేదభిన్నమై వఱలుచున్నది. నిఖిల వర్ణాశ్రమాచార ధర్మకాండము, గుణ కర్మములు, భక్తి జ్ఞాన వైరాగ్యములు బాహ్యాంత ర్భేద భిన్నములైన యీ నామరూపోపాధుల నుండియే ప్రభవించినవి. నానావిధ భేదములు, రాగద్వేషములు, అహంకార మమకారములు, బంధముక్తులు-సర్వము వీనివలననే. జీవుని విలాస క్రీడ యీ రెంటిని వీడిన సాగదు. ఎవని ఆత్మ నామరూప భేదములను దాటి ఉపాధ్యతీతమై నిత్య నిరంజనునితో పరమసామ్యము నందుచున్నదో, వానికి ప్రపంచకేళితో సంబంధము తీఱినది. రాగద్వేషములు కాని, నానాత్వ పృథక్త్వములు కాని, అహంకార మమకారములు కాని,

సంకల్ప వికల్పములుకాని, సాధ్యసాధనములుకాని అతనికి లేవు. అట్టి విద్వాంసుడు గంగాగోదావర్యాది నదులు ప్రవహించి ప్రవహించి తుట్టతుదకు తమ నామరూపములను వీడి సముద్రములో అస్తమించి, తమ ఖండస్వరూప సత్తను, అఖండ సముద్ర రసస్వరూపముగా పరిణతమొనర్చుకొనునట్లు, నామరూపములనుండి, అనగా నామరూపవిలాస క్రీడాజన్యములైన పుణ్యపాపముల (కర్మబంధముల) నుండి విడివడి పరాత్పరుడగు దివ్యపురుషునిలో లీన మగుచున్నాడు. అట్టివాని జనన మరణ ప్రవాహము కట్టువడినదన్నమాట ! అట్టి పురుషోత్తముని దివ్యానుభూతి ముండకోపనిషత్తులో ఇట్లు వర్ణింపబడియున్నది.

"యథా నద్య స్స్యందమానా స్సముద్రే
అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ
తథా విద్వాన్ నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్."

విశ్వమునందలి నానావిధ నామరూపములను భేదమునకు త్రోవదీయు నట్టివానినిగ నెఱింగి, అవ్వాని పరిపాటిచే తనకు మృత్యువుతక్క అమృతస్థితి లేదనియు భావించుకొని, మఱియు నిర్వికల్పానందమునకు నిష్కళంకమగు సత్తుచిత్తుల అనుభూతికి అవి అడ్డు తగులుచున్నవనియు తలచి, అవ్వాని భేదోపాధులను సుదూరమున వర్జించుట ప్రజ్ఞానముయొక్క లక్షణము. నామరూపోపాధుల భేదములను అతిక్రమించు ఈ అతీతస్థితి నివృత్తిపరమైనది. ఇట్టి విజ్ఞాని ప్రపంచరంగమున ప్రారబ్ధకర్మవశమున సంసారిగా వర్తించుచున్నను, నామరూపముల బాహ్యాంతర రహస్యముల నెఱింగినవాడు కావున వాటి మాయాలీలను తెలిసి వ్యవహారమును నడుపుచున్నాడేకాని, వానికి వశుడై ఆత్మేశ్వరుడు కాక వర్తించుట లేదు. ఆతని లోకజీవన మంతయు ఒక నటన, అభినయము. నటుడు తాను

వహించిన పాత్రములకంటె తాను భిన్నుడని యెఱిగి, తత్పాత్రధారణ ముచే కలిగిన సుఖదుఃఖములను లీలామాత్రముగనే అనుభవించుచు, వస్తుతః అవ్వాని సంగము లేకయుండునట్లు, నామరూపోపాధులను దాటిన మనీషియు కర్మ భోగముకొఱకు మాత్రము లోకవ్యవహారములను నిస్సంగుడై జరుపుచు, ప్రతి క్షణమునను తాను ఆనందస్వరూపుడే కావున, నిర్వికల్పానందము అనుభవించుచు స్వస్వరూప జ్ఞానమున సంచరించుచు, అంతమున నిరుపాధిక దివ్య చిద్రసైశ్వర్యమున మగ్నుడై పోవును. ప్రాకృత జనులయొక్క చూచుట, తాకుట, పలుకుట, వినుట, తినుట, త్రాగుట, వర్తించుట మున్నగాగల చేష్టలకును, ఈతని ఇంద్రియకృత్యములకును స్థూలముగ భేదము కన్పట్టకున్నను సూక్ష్మమగు ఆంతరిక పరిశీలనమున, అయ్యవి విలక్షణములు. *ఆతని చూచుట చేయుటలు మర్త్యత్వము (మరణధర్మము) నుండి అమర్త్యత్వము (అమృతధర్మము) న కుద్ధరింపబడినవి అట్లే ఆతని ఆలోచనలకును, సంకల్పములకును, మర్త్యజగములోని ప్రాకృతుల ఆలోచనములకు, తలపులకు, సంకల్పములకు సుదూరము. ప్రజ్ఞాన సమన్వితుడు బాహ్యోపాధులగు నామరూపములను మాత్రమే వర్జించి ఆంతరంగికముగ భావవ్యభిచారము సలుపునని తలంపకూడదు. నామరూపముల తత్త్వము యథార్థముగ గోచరించినచో, ఇక అట్టివాని మనోవ్యాపారమును నిరుద్ధ మగుడు, వికారములేని, ఏకాగ్రము—కాదు, ఏకాగ్రమని చెప్పుటకును వలనుపడని అనిర్వచనీయ దశలో ఆతడు ఉండి తీరును బాహ్యమునకు చెప్పకున్నను, మానసికముగనైన నామరూపధ్యానము మానకున్న ఆతడు అవ్వానికి అతీతుడని

---

* ఇదియే గీతలో ఈ ప్రకారముగా వర్ణింపబడినది.

"నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్."

చెప్పుట కెట్లు వీలు చిక్కును? కావున మిథ్యాచారము వేఱు; యథార్థమగు పరిశుద్ధ విజ్ఞానానుభూతి వేఱు. శివ విష్ణ్వాది దేవతా రూపములను, తన్నామములను, మంత్ర తంత్రాది సాధనసంపత్తిని ఖండముకాని అఖండరూప సంపత్తిగను, వర్ణభేదములేని అనంతశబ్ద బ్రహ్మముగను సాధ్యసాధనాతీతమైన అనిర్వచనీయ సచ్చిదానందముగను రసీభవింపచేసి కొన్న పూర్ణయోగము అతిమానసమై, అతిబౌద్ధమై, అమనస్కమై కేవలాత్మరూపముతో తేజరిల్లును. బంగారమును కోరువాడు నగయొక్క నామరూపములకు ప్రాధాన్యము నొసగక స్వర్ణమునందే దృష్టినుంచునట్లు ఈ సిద్ధుడును నామరూపము లనెడి వికారములకు లోనుగాక అవ్వానికి కారణమగు సచ్చిదానందమునే ఉపాసించి తన్మయుడగును.

ఇంతవఱకును నామరూపభేద పరిత్యాగముచే సిద్ధమైన నివృత్తి మార్గమునుగూర్చి విచారించితిమి. ఈ అతీతస్థితిని ఏ ఒకానొకడో తప్ప, బహుసంఖ్యాకులు విచారింపజాలరు. అట్టి మహనీయునకు వేయి నమోవాకములు పెట్టి, నామరూపోపాధి విశిష్టులమై, నామరూప ప్రపంచ పారావార తరంగాహతులతో ఉక్కిరి బిక్కిరియగు మనకు కర్తవ్యాంశమును వెదకికొందము. మన జీవనము ప్రవృత్త్యున్ముఖమైనది కావున, ప్రవృత్తి ధర్మపథమున నామరూపవిలాసము ఎట్లు విజృంభించినదో, ఎట్లు ఐహికాముష్మిక జీవన యాత్రను కొనసాగింప చేయూత నిచ్చుచున్నదో విచారింతము.

ఈ నామరూపములచే మన లోకము నిర్మితమయినది. మన ప్రపంచములో ఈ రెంటిచేతను లక్షితములుకాని పదార్థములుకాని, భావములుగాని లేవు. ఏయే పదార్థములు దృష్టి గోచరము లగుచున్నవో అవి యెల్ల సాకారములు; అనగా రూపము కలవి. ఏవేవి దృగ్గోచరములు

కాక, మనోమాత్ర గ్రాహ్యములై తనరారుచున్నవో, అవియెల్ల నామములచే మాత్రము నిర్దేశ్యములై శబ్దశక్తి ద్వారమున శ్రోత్రపేయములగుచున్నవి. రూపవద్వస్తువులు సైతము నిర్నామములు కాక, నామకరణము నందుచున్నవని గ్రహింపవలయును. కాఁగా_నామోపాధికమైన బ్రహ్మము, నామరూపోపాధికమైన బ్రహ్మము అని సోపాధికబ్రహ్మము రెండురీతులుగా సిద్ధమగుచున్నది. ఇప్పుడీ నామరూపములు రెంటిచేతనే మన ప్రపంచ క్రీడ ప్రచలితమగుచున్నదని గుర్తెఱింగితిమి ఆనందమునుగాని, దుఃఖమునుగాని వీటిచేతనే పడయుచున్నాము. భేదమును గాని ఐక్యసిద్ధినిగాని యీ పృథక్త్వము నుండియే పొందుచున్నాము. సృష్టికర్త మనపై విసరిన యీ మాయతెరలోని ఈ యాటవస్తువులతోనే క్రీడించి, సుఖదుఃఖములను బొంది, తుట్టతుదకీ నామరూపములనెడి రంధ్రములనుండియే బయట పడవలయును. కావున బంధముకాని, ముక్తికాని మనచేతిలోని పనియే; దుఃఖముకాని ఆనందము కాని, మన కల్పనమునుండియే.

యథార్థమునకు దుఃఖమనునది లేదు. అది జీవుడు కల్పించుకొన్న అధ్యాస; ఆనందసత్తను యథాస్వరూపముగ అనుభూత మొనర్చుకొనలేక మానవుడు చేసెడి పరిభ్రమణము. తన స్వార్థమును సంపాదించుకొను నుద్యోగములో అతడు పొందు బన్నమే దుఃఖరూపమున తోచుచున్నది. అఖండాత్మయొక్క ఉపలబ్ధికే అతడు ఉద్యోగించిన దుఃఖము ఉండదు. స్వశరీరమాత్ర పరిచ్ఛిన్నమైన అహంతను విశ్వవిరాట్ శరీరమువఱకు వ్యాప్తమయిన యహంతగా పరిణత మొనర్చుకొన్న దివ్యాత్ముడు ఆనందమును దప్ప దుఃఖము నెఱుంగడు. మఱియు ఆనందమయునిచే పన్నబడిన వల ఆనందమయమే కావలయునుగాని దుఃఖాలయ మెట్లగును? దానిని దుఃఖాలయముగా భావించుట, అట్లొనర్చుకొనుట అజ్ఞానము, తెలివి లేమి; అధీరత. ఈ ప్రాపంచికక్రీడ ఆనంద విలసిత

మగుటయే ఈశ్వరోద్దేశ్యము*. అందు కనువగు సాధనములే నామ రూపములు.

అనంత నామప్రపంచము శబ్దమునుండి వెలువడినది. ఈ శబ్దశాఖ పూచినపూలే అసంఖ్యాక వాఙ్మయములు. నిత్యమగు (వైయాకరణదృష్ట్యా) శబ్దమునుండియే వేద శాస్త్ర పురాణేతిహాస కావ్య విద్యాప్రపంచము ప్రవర్తిల్లినది. సప్తకోటి మహామంత్ర జాలమును ఈ యేబది అక్షరముల ద్వారముననే విజృంభించి ఇష్టానిష్టప్రాప్తికి హేతుభూత మైనది.

అఖండ సచ్చిదానంద సాగరములోని జలబిందు సందోహమే సర్వవిధ రూపప్రపంచమును. విశ్వశిల్పియొక్క శిల్ప నిర్మాణము (సృష్టి) నుండియే బహువిధ దేవ తిర్యఙ్మనుష్యాది జంగమ జీవ రూపములు, పృథివ్యాది భూతములు, వృక్ష లతా గుల్మ పర్వతాది నానావిధ స్థావర రూపములు కలిగినవి. అవ్వాని అనుకరణమే లౌకిక వైదిక భేదభిన్న మగు నానారూప శిల్పకల్పనమును. ఈ శిల్ప వాఙ్మయశాఖలు పూచిన పూలనుండి జాలువారెడు మధుర మధురసమే అమృతమై జీవితమును మర్త్యత్వమునుండి అమృతత్వమునకు ఉద్ధరింప వలసి యున్నది.

అనిర్వచనీయ మగు ఈశ్వరసౌందర్యము శబ్దప్రపంచమున కావ్య రూపముననును, రూపప్రపంచమున ప్రతిమ (విగ్రహము) యొక్క, లేక రమ్యవస్తువుయొక్క రూపముననును విలసిల్లుచున్నది. రసప్రచురమగు

* ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే. ఆనందేన జాతాని జీవన్తి. ఆనందం ప్రయన్త్యభిసం విశన్తీతి.

— తైత్తిరీయోపనిషత్తు.

చరాచరములైన భూతములన్నియు ఆనందమునుండియే పుట్టి, ఆనందము చేతనే జీవించి, కడకు ఆనందముననే లీనమగుచున్నవి.

కావ్యము వాఙ్మయ ప్రవిష్టము. చిదానంద ఘనమగు ఆకృతి (రూపవిశిష్ట ప్రతిమాదికము) శిల్పప్రవిష్టము. ఈ ఉభయ ప్రపంచములకును స్రష్టలగు కళాగురువులు ఇరువురున్నారు. విశ్వస్రష్ట ప్రతినిధులగు వీరలలో ఒక్కరుడు కవీశుడు, రెండవవాడు ఆకృతీశుడు (శిల్పి). సృష్టియలో ఇరువురి లక్ష్యము ఒక్కటే అయినను, సాధన సంపత్తి భేదించుచున్నది. రమణీయార్థ ప్రతిపాదకశబ్దములతో కవిబ్రహ్మ వాఙ్మయప్రపంచమును నిర్మించును. రమ్యభావాకారములతో శిల్పిబ్రహ్మ మృద్దారు శిలా లోహాది ద్రవ్యములయందు రూపప్రపంచమును సృష్టించును. శిల్పికిగాని కవికిగాని శిల్పము తెలిసి యుండవలసినదే; అద్భుత నిర్మాణ దక్షత అలవడి యుండవలసినదే. శిల్పి కళాకౌశలము హస్తనిష్ఠము. కవి కలాపై దగ్గి వాఙ్నిష్ఠము. శిల్పికి హస్తవశీకరణము—చేతి నేర్పు ఉండవలయును. కవికి వాగ్వశీకరణము—మాటల నేర్పు ఉండవలయును. ఇరువురి హృదయములును సౌందర్య రసవిభూతులకు, రమణీయ భావ భంగిమలకు, అఖండ జ్ఞానసంపత్తులకు ఆలవాలములే. నామరూపముల ద్వారమున ఇరువురును అభివ్యక్తము చేయవలసినది మానవసంతారకమైన యీశ్వర కళావిభూతినే, ప్రజాప్రయోజనకరమైన ఉత్కృష్ట సాధన సంపత్తినే; అనంత జ్ఞానమహిమమునే. బ్రహ్మము - సత్యము, శివము, సుందరము, శాంతము అగుటచేత, ఆ పరమేశ్వరుని జ్ఞానానంద స్వరూపములను జనాహ్లాదకరము లగునట్లు చిత్రించియు, గానము చేసియు శిల్పీశ్వర–కవీశ్వరులు చరితార్థ లగుచున్నారు. నిఖిల వైదిక లౌకిక నామరూపజాత మంతయు వీరి కళాయోగములో సంతప్తమయి కాని మానవ ప్రయోజనమును సంపాదింపజాలదు.

జగదీశుడు సమితము శిల్పియు కవియు అయినట్లు అతని వ్యాపారమే గాక, శ్రుతులును కంఠతః వక్కాణించు చున్నవి. "కవి ర్మనీషీ

పరిభూః స్వయంభూః, 'విశ్వకర్మా మనసా యద్విహాయాః, 'బ్రహ్మణ స్పతి రేతా సంకర్మార ఇవాధమత్'' మున్నగు వేదవాక్యములు ఇందుకు నిదర్శనములు. ఆతని ప్రతికృతియైన మానవుడును కవియును శిల్పియునై పితృకృత్యమునే నెఱపుచు లోకసంగ్రహముచే తరించుచున్నాడు. లోకమున, శిల్ప-కవిత్వ విద్యలు రెండును భిన్నపురుష సమాశ్రితములై యుండినను, ఆ రెంటికినిగల సాహిత్యము మాత్రము విడి పోవనిది.

కవివర్ణించిన వర్ణనమును శిల్పి ఱాలపై చెక్కగలడు. శిల్పి చిత్రించిన రూపమును కవి మాటలతో వర్ణింపగలడు. నిక్కమగు కవి పలుకునప్పుడు రూపసాక్షాత్కారము నందుదుము. శిల్పి చిత్రించినప్పుడును పలుకుల పాటవమును ఆలింపగలము, ఏ జ్ఞానరసాస్వాదమును, ఏ భావోన్మీలనమును, చిత్రశిల్పి రేఖావిన్యాసము ద్వారమున కల్పించుచున్నాడో, శిలాశిల్పి ఉలితో దిద్దెడు తీర్పు నేర్పుచేత ఉదయింప జేయుచున్నాడో, ఆ ప్రయోజనములనే కవి వాగ్విన్యాసము మూలమున నెలకొల్ప జాలును. అందుచేతనే శిల్పకవితా కళల సాహిత్యమే సాహిత్యమని సాహితీరసికుల తలంపు. కవిశిల్పు లిద్దరిలో ఒకరు ప్రపంచమునకు వాక్సందేశము నిచ్చుచుండ, వేఱొకరు కర్మయోగ కలాపముచే భూమిని, భూప్రజలను బలిష్ఠుల నొనర్చి ప్రశాంత భద్రమార్గమున పయనింప జేయుచున్నారు. సోపాధిక బ్రహ్మముయొక్క జ్ఞానానందలీలలను చిత్రించుట, గానము చేయుట తద్ద్వారమున ప్రకృతిదాస్యముక్తిని, ఆత్మముక్తిని, జాతివికాసమును సంపాదించి దివ్యైశ్వర్యము నెలకొల్పుట, ఈ యీశ్వరసేవకుల కర్తవ్యము.

ఈ కళాయోగమున భారతీయ శిల్పాచార్యులు కవితల్లజులు కృతకృత్యులైనారు. ప్రాచీన శిల్పఋషులు వేదద్రష్టలగు ఆర్షకవులను అతిలోక మహిమాతిశయమును ప్రదర్శించి శిల్ప సారస్వత శాఖలను సుపరి

పుష్టము లొనర్చిరి. ఒక్క భారత దేశమునకే కాక, దేశ దేశాంతరములకు కూడ తమ చూపిన మార్గములు, తమ చేసిన సిద్ధాంతములు త్రికాలము లందును శరణ్యము లగునట్లు విజ్ఞాన సూత్రముల విరచించుటేకాక, శిష్య ప్రశిష్య సంతానము ద్వారమున ఖండాంతరములందు కూడ అవ్వానిని రూపెత్తింపజేసిరి. ఇది ఆత్మస్తుతి కాదనుటకు అనసూయులైన పాశ్చాత్య కళావిదులు మన శిల్పసారస్వతములనుగూర్చి చేసిన ప్రశంసలే నిదర్శన ములు; ద్వీప ద్వీపాంతరములందు వెలసిన భారత సంప్రదాయ సిద్ద శిల్ప వాఙ్మయ కళాధర్మ విలాస విధానములే దృష్టాంతములు.

ఈ విధమున నామరూపోపాసనచే ప్రవృత్తి మార్గ ప్రదీప్తిని కలుగజేసి నిఖిల ప్రజాళిని ప్రవృత్త్యున్ముఖులను ఒనర్చి కల్యాణయోగ మును సాధించిన మన ఋషీంద్రులు మనకు త్రికాలములందును ఉపా స్యులు. వారి చేతల మహత్త్వముననే భారతదేశము జ్ఞానవిజ్ఞానములకు నిలయమై, ప్రపంచమున తన సభ్యతయే మొట్టమొదటి దను గౌరవము నకు పాత్రమై, అద్భుత శిల్పకళకు పుటినిల్లై ఒప్పినది. మధ్యయుగమున మన స్వయంకృతాపరాధముచే శిల్పశాఖ తన అఖండ శాస్త్ర సంపదను దేశాంతరగత మొనర్చుకొనియు, అతిలోక శిల్ప నిర్మాణములను ధరణీ గర్భమున రూపడజేసికొనియు ఉత్పన్నమైనది.

లలిత సారస్వతము శిల్పము
కలసి మును హైందవ మహస్సును
మిన్ను ముట్టఁగఁజేసె నిపుడే
మున్న దీ మనకు.

— తోరణము.



# శిల్ప తత్త్వము

"యేభి శ్శిల్పైః పప్రధానా మదృగ్ంహత్. యేభి ర్ద్యా మభ్యపిగ్ంశ త్ప్రజాపతిః. యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్. తేనేమ మగ్న ఇహ వర్చసా సమఙ్ధి".

—తై. బ్రా. అ. 2 ప్ర. 8, అను 25.

శిల్పము, ఆహా! ఎంత రమణీయమైన శబ్దము! ఎంత అర్థ సౌందర్యముగల మాట!! శిల్పమని వక్కాణించి నంతనే రమణీయత హృదయమున హత్తుకొని పోవుచున్నది. సౌందర్య రాజ్య రమాధి దేవత కన్నులయెదుట మధుర గీతములతో నాట్యము సేయుచున్నది. అనిర్వచనీయమైన నిర్వికల్పానంద రసవిభూతి హృత్తట భేదకమై పొరలు చున్నది, మోడువారిపోయిన చిత్తముకూడ అశబ్దమును విన్నంత సౌంద ర్యోజ్వలమయ్యెడిని మనోంబరమున స్వేచ్ఛావిహారము చేయు నానా విధ సంకల్ప మేఘములు చెల్లాచెదరై అంతరింప కొండొక జ్ఞాన ప్రభా పటలి హృదయ మాలిన్యమును పోకార్చి ఏ అమృత సందేశమునో కళా భావుకుడై దష్టకు ఒసంగు చున్నది. కర్తవ్య మూఢమైన అంతరంగము ఈ సందేశమున ప్రబుద్ధమై కళా కిరణముల తళతళలతో ఏ క్రియాయోగ నిర్వహణమునకో పనువు లెత్తెడిని. ఏమి యీ వింత! ఏమి యీ శిల్పమునందలి రహస్యము! విమూఢమైన హృదయమునుకూడ మేలు కొల్పుటకు ఎక్కడిది ఈ సామర్థ్యము ఈ శిల్పకళకు! సౌందర్య ఘన మైన సచ్చిదానందము క్రియాప్రవణమయి స్వాంతర్గర్భిత కర్మశక్తులను నానారీతుల ప్రకటీకరించి శిల్పశబ్దవాచ్యమైనది కావున, తన సందర్శన ముచే కర్మయోగ పాటవమును అలవఱచు చున్నది కాబోలును; ఉన్నత

భావ బాంధవ్యమును నెలకొల్పి కళారసికుని హృదయగ్రంథిని భేదించు చున్నదనవచ్చును. ప్రతి శిల్ప సౌదర్యార్చకుడును పొందెడు ఈ భావోన్మీలనము అద్భుతావహము కదా! శిల్ప సౌందర్యావలోకనముచే సిద్ధాంత మగు ఈ తత్త్వమును తొలుదొల్త విశ్వరంగమున ఉన్న ఈశ్వర శిల్పమును చూచి నిర్ధరించుకొందము.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్" అను శ్రుతి ప్రకారము అనాదికాలమున సన్మాత్రమై తదితరము లేక ప్రకాశించు ఏకైక తత్త్వమునందు, ఎప్పుడు తాను అనేకము కావలయునను సంకల్ప తరంగము లేచినదో, అప్పుడే శిల్పము అంకురించినది. జగచ్ఛిల్ప నిర్వహణమునకు ఆ శక్తి (బ్రహ్మ పదార్థము, ఆదిమశిల్పి) తపించెను. అట్లు తపస్సు చేసి ఈ విశ్వము నంతటిని సృజించి, అందే ప్రవేశించి ద్వైత సౌందర్య రసపానము చేయ మొదలిడెను. అనగా ఆత్మతత్త్వము నానావిధ తత్త్వములకు కారణమయి, ఆ తత్త్వముల పరిణామ మగు శరీరమునుకూడ సృజించి మరల ఆ శరీరమునందే జీవరూపమున ప్రవేశించి జగద్భోగమును చేయుచున్నదని యెఱుంగునది. ఈ అవస్థలోనే వివిధ తత్త్వాత్మకమైన శిల్పము వ్యాపించినది. స్థావరజంగమ ప్రపంచ విస్తరణము జరిగి అవ్యక్త రూపమున ఉన్న జగత్కర్త శిల్పకళా కౌశలము వ్యక్తమయిన ప్రత్యక్షదశ యిది. ఈ స్థితియే "సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాఽభివదన్ యదాఽస్తే" అను అర్థమునకు సరిపడునట్టిది. అన్నిరూపములు నిష్పన్నములై, నామములుకూడ ఏర్పడిన విచిత్రావస్థ యిది. సూక్ష్మరూపమున ఉన్న బీజము వృక్షాకారమున పరిణత మగుడు, శాఖా పల్లవ పుష్ప ఫల సౌందర్యము నానావిధములుగా గోచరించునట్లు, ఏకతత్త్వమే మాయాశక్తిచేత పృథక్కుగా తోచి పలు రీతుల ప్రకాశించెను. ఇప్పుడు విశ్వశిల్పము సమగ్రముగా వికసించిన

దన్నమాట. జగద్రూపమునందిన విశ్వకారణుని వేదమంత్ర మొకటి యిట్లు వర్ణించుచున్నది—

"విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో హ స్త ఉత విశ్వత స్పాత్
సంబాహుభ్యాం నమతి సంపతత్రై ర్
ద్యావా పృథివీ జనయ న్దేవ ఏకః."

—యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తము.

ఆ దేవదేవుడు ; అంతటను కన్నులు కలవాడు. అన్ని వైపులను ముఖములు కలవాడు. అంతటను బాహువులును అంతటను పాదములును గల స్వయంప్రకాశుడును, అద్వితీయుడును అగు ఆ విశ్వకర్మ ఒక్కడే స్వర్గ మ ర్త్య లోకములను సృజించుచు, ధర్మాధర్మములను బాహువులచే పతనశీలములగు ఉపాదాన కారణములచే జగత్తును స్వాధీనము చేసికొనుచున్నాడు. పరమేశ్వరుఁడు సర్వప్రాణులకు ఆత్మభూతుడు గనుక అందఱి కన్నులు, ముఖములు, ఆయనవే అయి ఆతనికి విశ్వచక్షువు, విశ్వముఖుడు అను శబ్దములను సార్థక మొనర్చు చున్నవి.

శిల్పమునకు తపస్సు, (సంకల్పము, తత్పూర్వకమైన ఆలోచన, ధ్యానధార, భావన—ఇవి అన్నియు పర్యాయ నామములే) హేతుభూతము కావుననే రుచిరార్థ బంధురమగు శిల్పశబ్దము "శీల సమాధౌ" అను సంస్కృత ధాతువునుండి ఉత్పన్నమైనది. సమాధ్యర్థకమైన 'శీల' ధాతువు తపస్సునే సూచించుచున్నది. తపః ప్రభావమున నిర్వహింపబడునది శిల్పమని ఒక అర్థము. సమాధిసౌఖ్యమును ఒడగూర్చునది శిల్పమని వేఱొక అర్థము. శిల్పి, తపశ్శక్తి (ఆలోచనాశక్తి) చేతనే శిల్ప నిర్మాణమున కృతకృత్యు డగుచున్నాడు కావున మొదటి యర్థము ఆతని పక్షమునను,

రెండవ అర్థము శిల్పకళా పిపాసువు పక్షమునను అన్వయింపనగు. శిల్పి యేకాగ్రభావనా నిమగ్నుడై యే శిల్పరచనమును చేయునో, అది ప్రేక్షకునికి, లేదా సౌందర్యారాధకునకు సమాధిగమ్యమగు ఆనందమును గూర్చుచున్నది. పరమేశ్వరుడు తపించి నామరూపాత్మకమైన యే జగమును సృజించినాడో, అది ప్రాణిజాతమునకు ఆనందమును గూర్చుచున్నది గదా! రమణీయమైన సృష్టి సౌందర్యమునుగూర్చి ముదితుడు కానివాడెవ్వడు! అట్లే శిల్పి యేకాగ్ర భావనచే రచించిన బింబము (ప్రతిమాదికము)ను చూచువాడును అందలి రసభావరామణీయకములకు ముగ్ధుడై ఆనందసాంద్రు డగును. కావున శిల్పశబ్దమే మహత్తరార్థ సంభరితము.

విశ్వశిల్పి జగద్రంగమును అంతయు శిల్పకళా విరాజితముచేసి, నిఖిలప్రాణి నటకోట్లను సూత్రధారుడై ఆడించుచు, సౌందర్యానందరసమును చవి సూపుచున్నాడు. ఆతని విశ్వశిల్ప ప్రాగల్భ్యము అనిర్వచనీయము. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అనునట్లు వన్నెకెక్కిన ఆ జగచ్ఛిల్పి నిర్మాణకౌశలమును మానవప్రాణి వర్ణింప పూనుకొనుట సాహసము. భూమ్యాకాశములయందును, సర్వదిక్కుల యందును, సర్వకాలముల యందును, సర్వవస్తువుల యందును, బాహ్యాభ్యంతరముల అన్నింటను ఆ భువనశిల్పి శిల్పకళ నిత్యవర్చస్వినియై తేజరిల్లి, దిక్కాలా ద్యనవచ్ఛిన్నమై, అద్వితీయమై, ఆనందమాత్రమై అలరారుచున్నది. వేదకాలపు ఋషులు ఆ జగన్నిర్మాత శిల్ప ప్రభావమును సహస్రముఖముల గానము చేసి శ్రుతివీథుల సూత్రించియున్నారు. గుణగ్రహణ పారీణమును, సౌందర్యారాధన శీలమును అగు హృదయము కల ప్రతి మానవుడును బ్రహ్మాండమునందు అంతటను, ప్రత్యణు పరమాణువులందును ఆ విశ్వకర్మ శిల్పవైదుష్యమును ఆరయ గలడు. ఆ

మహాశిల్పి భూమండలమును అనేకములైన పర్వతపంక్తుల చేతను, నదీనద సముద్రములచేతను, నానావిధ వన కాననములచేతను అలంకరించి వివిధ సస్య శ్యామలమొనర్చి యున్నాడు. ఆకాశమును సూర్యచంద్రాది గ్రహములచేతను, నక్షత్ర తారకలచేతను, భాసమాన మొనర్చినాడు. నిరవధికమగు కాలమును అహోరాత్ర పరిగణనముచే ఏర్పఱుపబడిన క్షణాది యుగాంతములగు విభాగములచే అమృతతుల్య మొనర్చియున్నాడు. వివిధార్థములు గల వాక్కులను శిల్ప విచిత్ర సుందరముగా చేసెను.

విశ్వ ప్రకృతిని పరిశీలించిన పిమ్మట, అందు అంతర్భూతములగు పదార్థ నికరములను అవలోకించినను, మన సూక్ష్మదృష్టి సృష్టిశిల్ప విషయమున కుంటుపడ గలదు. ఒక పూవును తిలకింపుడు, నిర్మైచితన్యమైన అద్దానియందు మూర్తీభవించిన పారమేశ్వర నిశ్చల సౌందర్యము ఎంతటిదో వ్యక్తము కాగలదు. అందలి పూరెమ్మలు, దళముల సౌకుమార్య సౌందర్యములు, పలురంగుల సమ్మేళనముచే తోచు శోభ, నయన మనో మోహనమైన కుసుమసౌందర్య సర్వస్వము భావించినచో మన ఆనందమునకు మేర యుండునా? అవ్యక్తరూపుడైన జగదీశుని మందహాసములును, అట్టహాసములును రూపాంతరమున మనకు దర్శన మిచ్చుచున్నవా అన నొప్పు పూవులయందలి శిల్పకళను ఏమని వర్ణింపగలము? వాటిని దర్శించి తత్సౌందర్యావలోకనముచే విశ్వవిధాత హృదయములోనికి చొఱబాఱ బూనుటకంటెను మనకు కర్తవ్యము పొడకట్టదు. భగవత్సౌందర్యమును వ్యక్తము చేయుటకు క్రియోన్ముఖమయిన యీ అనిర్వచనీయ రూపవిలాసము ద్వారమున విశ్వరూపుని భావించు అభిలాషమును రేకెత్తించునది శిల్పయోగమే కదా! అంతియే కాదు. నానావిధ ప్రాణుల శరీర సృష్టి విధానమునను విశ్వశిల్పి శిల్పవిభూతి అతిలోకమే. ఏమి విచిత్ర దేహయంత్రములు! జగములోని వస్తువుల

ననుభవింప ఎన్ని ద్వారములు! నానాభావములను మననము చేయుటకును, శబ్ద స్పర్శ రూప రస గంధములను ఉపభోగించుటకును నిర్మింపబడిన సాధనములు, వాటి అందచందములు ఏమని భావింపగలము! శరీర యంత్రము మూలమున జీవుడు ఎంతటి ఆనందయాత్రను ఒనర్చుచున్నాడో, ఈ క్షేత్రముచేత క్షేత్రజ్ఞుడు విశ్వక్షేత్రమును ఎట్లు స్వానుసంధానము చేయుచున్నాడో, అందులకు తగిన అవకాశములు కాయమున ఎట్లు విరాజిల్లుచున్నవో భావించుట యెంత దుర్ఘటము! మాతృగర్భమున ఈశ్వరేచ్ఛానుసారము ప్రవర్తిల్లు ఈ మహత్తర శరీరయంత్ర సృష్టి శిల్పము విశ్వకర్మ శిల్పమహత్తకు ఒఱపిడిఱాయి కాదా! కావుననే నానావిధ రూపవిలాసములను నిర్మించు ఈ దేవుని త్వష్టృతను వేదము సహస్రధా కీర్తించినది—"త్వష్టా రూపాణి పిగ్ంశతి" అని

"జవ్వనంపు ఫలము చవిగన్న సతులందు
ఒక్క యణువు కింత యూపిరి నిడి
కొన్ని నెలలఁ జిన్ని చిన్నారి పాపాయి
మలచిపోవు వీనిఁ దెలిసినారె?"

అని పై మంత్రార్థమును శ్రీ పులివర్తి శరభాచార్యకవి మధురముగా గానము చేసియున్నారు.

వేయేల? చేతనాచేతనముల నెల్ల విశ్వశిల్పి శిల్పసుందరములుగా ఒనర్చి ప్రాణిసమూహములకు అనుభోగ్యములుగా చేసినాడు. ఈశ్వర సృష్టిలో శిల్పములేని వస్తువు లేనేలేదు. గడ్డిపోచ మొదలు బ్రహ్మవఱకును గల పదార్థజాల మంతయు శిల్పకళా భాసమానమే. అనంతములగు రూపవద్వస్తుసంతతులు పరమేశ్వరుని అనిర్వచనీయ శిల్పవిద్యా కౌశలమున తేజరిల్లుచున్నట్లు ఎట్టి మందుడేని గ్రహింపగలడు. ఎట నెట సృష్టి

కర్మ మున్నదో, అందెల్ల శిల్పకర్మము ఉండి తీరును. శిల్పములేని సృష్టి లేదు. సృష్టి కర్మము శిల్పమే. ఈ అంశము శిల్పోపనిషత్తునందు మనోహరముగా విస్తరింపబడి ఉన్నది. కావున శిల్పమర్మజ్ఞానము సృష్టి రహస్య ప్రకాశకము. సృష్టి రహస్య పరిజ్ఞానము సృష్టికర్తృప్రాప్తికి హేతుభూతము.

ఆ జగన్నాయకుని శిల్పసామర్థ్యమే వేదదర్పణము (అద్దము)న ప్రతిబింబించి మానవ తారకమై ఒప్పినది. ప్రాథమిక ఋషిగణము విశ్వనియంత శిల్పసందేశమును శ్రుతి రంగముల యజ్ఞరూపమున గానము చేసినది. ఆనాటి భారతదేశమునకు—భారతదేశమునకే అననేల, జ్ఞాన విజ్ఞానములు కలిగి, * శ్రేయః ప్రేయములే జీవితమునందు సంపాదనీయములనెడి ఉత్కృష్టాదర్శమును ప్రాపించిన మానవకోటికెల్ల ఇహపర సాధనము యజ్ఞమే అయినది, వేదయుగమున యజ్ఞవిద్యకు ఉన్న ప్రాశస్త్యము, పూజ్యత శ్రౌతవాఙ్మయమును పరిశీలించిన తెలియగలదు. పరమపవిత్రమగు శిల్పసిద్ధాంతముచే ఎఱుగదగినది సృష్టిరహస్యమే ఐన, సృష్టి మర్మజ్ఞానము ఆత్మదర్శన హేతువే ఐన, ఆత్మసాక్షాత్కారమే జీవిత పరమార్థమైన తాదృశ శిల్పవిశిష్టమైన యజ్ఞ విద్య — అనగా వైదికముకాని, లౌకికముకాని, ఐహికముకాని, ఆముష్మికముకాని, ఆధ్యాత్మికముకాని నిష్కామముగా ఒనర్పబడు సత్కర్మము (సకామ కర్మముకూడ యజ్ఞమే ఐనను పవిత్రాధిక్యమును పురస్కరించుకొని నిష్కామ మనవలసివచ్చెను.) జన్మసంతరణోపాయమని వేదములు వాకొనుట సత్యదూరముకాదు. వైదిక భారతీయ ఋషులు యజ్ఞరహస్య

---

* పలు విధములగు ఐహిక ఫలము, స్వర్గాది పారలౌకిక ఫలము ప్రేయ మనబడును. దీనినే ఇష్టాపూర్తమనియు అందురు. జన్మరాహిత్య రూపమగు మోక్షఫలము శ్రేయ మనబడును.

మును, దానికి ఆధారమగు శిల్పతత్త్వమును ఇంతచక్కఁగా గ్రహించుటం బట్టియే 'యజ్ఞోవై విష్ణుః' అని యజ్ఞమును భగవద్రూపముగా భావన చేసి యున్నారు. అనాదికాలమునాడే భగవానుడు "దేవా న్భావయతా నేన తే దేవా భావయన్తు వః" పవిత్రమగు ఈ యజ్ఞముచే మీరు దేవతలను దేవతలు మిమ్మును భావించుకొనుచు మేలునందుడని ఉపదేశించియున్నాడు.

ఈ సందర్భమున శిల్పయజ్ఞములు వేఱనియు, యజ్ఞమునకు శిల్పముతో పనిలేదనియు దలంపరాదు. శిల్పములేనిది యజ్ఞము నిర్వహింపబడదు. యజ్ఞకర్మమునకు శిల్పకర్మమునకు స్థూల బుద్ధికి భేదము కన్పట్టినను, ఆ యా యజ్ఞ విధానముల విశేష పరిశీలనముచే వాటికున్న అన్యోన్యాశ్రయము తెల్లము కాగలదు. యజ్ఞక్రియా నిర్వాహకుడు మహాశిల్పియై యుండవలెననియు, యజ్ఞము శిల్పమనియు, శిల్పము యజ్ఞమనియు దెలియవచ్చు అంశములన్నియు శిల్పాగమములందును, రామాయణాది గ్రంథములయందును ప్రస్ఫుటములై యున్నవి. ఉపాసనాకాండమునుబట్టి చూచినను, శిల్పమునకు ఆత్మయజ్ఞములకును గల సంబంధము గోచరించును. వైదిక యజ్ఞక్రియా కలాపముల నిర్వహించు యాజకులు మహాశిల్పులను నంశము దశరథు డొనర్చిన పుత్రకామేష్టి సందర్భమున ఎట్లు నిరూపితమైనదో రామాయణమున కాంచవచ్చును.

> "కారితా స్సర్వ ఏవైతే, శాస్త్రజ్ఞై ర్యజ్ఞకోవిదైః,
> శోభార్థం తస్య యజ్ఞస్య, కాంచనాలంకృతాఽభవన్."
>
> —బాలకాండము 14 స. 24 శ్లో.

"శాస్త్రజ్ఞైః - శాస్త్రం - శిల్పశాస్త్రం, శుల్బశాస్త్రం చ"

— తిలకవ్యాఖ్య

ప్రధానయాజకుడగు వసిష్ఠుని ప్రేరణమున యూపములన్నియు శాస్త్రవేత్తలును, యజ్ఞపండితులును అగు శిల్పులచేత చేయింపబడినవి. యజ్ఞశోభార్థమై అవి బంగారు తొడుపులచేత అలంకరింపబడినవి.

"ఇష్టకాశ్చ యథా న్యాయం, కారితాశ్చ ప్రమాణతః,
చితోఽగ్ని ర్బ్రాహ్మణై స్తత్ర, కుశలై శ్శిల్పకర్మణి."
— 14 స. 28 శ్లో.

యజ్ఞకుండ నిర్మాణమునకు అవసరములగు అర్ధేష్టకలు, మండలేష్టకలు (ఇటుకలు) బంగారుతో శాస్త్రప్రమాణానుసారము శిల్ప కర్మ కుశలులైన బ్రాహ్మణులచే చేయింపబడి, అగ్ని సైతము నెలకొల్పబడినది.

"తతోఽబ్రవీ ద్ద్విజాన్ వృద్ధాన్, యజ్ఞకర్మసు నిష్ఠితాన్,
స్థాపత్యే నిష్ఠితాంశ్చైవ, వృద్ధాన్ పరమ ధార్మికాన్."
— 13 స. 7 శ్లో.

"అబ్రవీదితి వసిష్ఠోఽత్ర కర్తా. స్థాపత్యం స్థపతే రథకారస్య కర్మ. తత్ర నిష్ఠితాన్ ప్రవీణాన్." — వ్యాఖ్య

పిమ్మట వసిష్ఠుడు శిల్పకర్మ ప్రవీణులును, పరమధార్మికులును, యజ్ఞకర్మాసక్తులును అగు వృద్ధ ద్విజులనుగూర్చి పలికెను.

ఇట్లనుటచేత శిల్పాచార్యులకును, శిల్పమునకును యజ్ఞమునందు గల ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది. ఇంకను యజ్ఞమున శిల్పులున్నగు వారి నెట్లు పూజింపవలయునో దిగువ శ్లోకము తెల్పుచున్నది —

"న చావజ్ఞా ప్రయోక్తవ్యా, కామ క్రోధ వశాద పి,
యజ్ఞకర్మసు యే వ్యగ్రాః పురుషా శ్శిల్పిన స్తథా,
తేషా మపి విశేషేణ, పూజా కార్యా యథాక్రమమ్."
— బాల. 13 స. 15, 16 శ్లో.

యజ్ఞకర్మయందు కోపతాపములచే ఎవ్వరినిగాని చిన్నచూపు చూడగూడదు. యజ్ఞకార్య నిర్వాహకులైన శిల్పులయు, తదితర వ్యక్తులయు పూజ జ్యేష్ఠాను క్రమమున విధిగా జరుపవలయును. ఇక ప్రకృతమును అనుసరింతము.

ఏ జగత్కర్త ఈ విశాల విశ్వశిల్పమునకు విభుడై అన్నింటను పరిపూర్ణుడయ్యు దుర్విజ్ఞేయుడై కన్పింపరాక అవ్యక్తరూపమున ఉండెనో, ఆతని సాక్షాత్కారమునకును ఈ శిల్పసాధనమే ఉపకరించినది. ఒక్క బంగారమే నానాలంకారరూపముల నందినట్లు, సచ్చిదాత్మకమైన ఒక్క తత్త్వమే కర్మోపాధి భేదములనుబట్టి శివ విష్ణ్వాద్యాకారముల స్థూలముగా కన్పట్టుచున్నది గదా ! ఒక్కొక్క వ్యక్తి తనకు వలసిన భూషణములను మైనలంకరించుకొని యిష్టార్థసిద్ధి నందునట్లు, ఒక్కొక్క సాధకుడును తనకు అభిలషితమైన దేవతామూర్తిని ఆరాధించి, వ్యష్టితత్త్వము నుండి సమష్టితత్త్వమును దర్శించి కృతకృత్యుడగును. సాధకుడు తొలుదొల్త విశ్వాత్మని సాకారరూపమును సంప్రజ్ఞాత సమాధిలో సాక్షాత్కరింప జేసికొని, క్రమముగా అసంప్రజ్ఞాత సమాధిలో నిరాకార పురుషుని (పురి-హృదయగుహే శయనా త్పురుషః, అని పురుషశబ్దార్థ మిట ఆత్మపక్షము) దర్శించును. ఈ సందర్భమున 'దర్శన, శబ్దముకూడ ఆ దశను వర్ణించి చెప్పుటకు చాలదు. త్రిపుటి రహితమైన నిర్వికల్ప సమాధి స్థితి అనిర్వాచ్యము కదా ! సాధకుని సంప్రజ్ఞాత సమాధివఱకును గొనిపోయి సాకార దేవతా సాక్షాత్కారము కలుగజేయుటలో ప్రకృష్ట సాధనము శిల్పమే. అనేక దేవతామూర్తుల ఆకారములును శిల్పకళామండితములే కావున, శిల్పము ఈశ్వర సాక్షాత్కార సాధనము.

'ధ్యాత అంతర్ముఖుడై సమాధిదశలో ఉన్నప్పుడు, బాహ్యమున ఉన్న దేవతామూర్తిని చూచుటలేదు కదా, ఇక అప్పుడు శిల్పమునకు తావెక్కడ?' అని శంకింపవచ్చును. సాధకుడు తన అభ్యాసము గాఢమైన

కొలదిని వెలుపల ఉన్న రూపమును హృదయదేశమునందే భావించి ధారణ చేసికొని, ఆ దేవునందే వృత్తిరహితమైన తన మానసమును హత్తి యేకాగ్రావస్థను పొందును. అప్పుడు అతని ధ్యానధారకు విషయమైనది భావనాశిల్ప విరాజితమైన దేవతామూర్తి, అధవా దేవతయే కదా! ఈ దశలో శిల్పము లేకపోయినదా? సంకల్పరూపమయిన శిల్పమును లోకోత్తరమే అని పూర్వమే తెలిసికొంటిమి. భావనాశిల్ప ప్రశంస సందర్భమునను ఈ అంశము తెల్లము కాగలదు.

మఱియు విశ్వస్రష్ట ఐన దేవుడు మహాశిల్పి కావున అతని సాక్షాత్కారమును కోరు సాధకుడును శిల్పియై శిల్పారాధనము చేయ కున్న, విశ్వకర్మ తత్త్వపరిజ్ఞానమున కృతకృత్యుడై బ్రహ్మభూతుడు కాజాలడు. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అనుఉపనిషద్వాక్యము ఈరహస్య మునే ఉపదేశించు చున్నది. కావున భావనాపథమున కాని, అతిబౌద్ధమగు కొండొక దశయందు కాని సుందరమగు శిల్పతత్త్వము లేకపోలేదని గ్రహించుట ఆవశ్యకము.

శిల్పతత్త్వవేత్తలగు భారతీయ శిల్పాచార్యులు, ఈ రహస్యమును ఎఱింగియే ఆసేతుశీతాచలము దేవాలయములను అవ్వారిగా నిర్మించి ఉన్నారు. దేవతామూర్తి, దేవాయతన నిర్మాణమున లగ్నమయినంత గాఢముగా భారతీయ శిల్పాచార్యుల చిత్తము వేఱు విషయములందు అంటుకొనలేదు. వీరిదృష్టి పారమార్థికము కావున ఇతర విషయముల మీదికి అది మిక్కుటముగా ఆకర్షింపబడలేదు. అవాఙ్మానస గోచరమైన యీశ్వర సౌందర్యమునే భారతీయ శిల్పి, చిత్రించియు, గానము చేసియు కృతకృత్యుడైనాడు. అతీంద్రియసత్తను రూప ద్వారమున ఇంద్రియ విషయముచేసి బాహ్యాభ్యంతర జగత్తును రసభోగ సమంచితము చేయు టయే సనాతన భారతశిల్పి లక్ష్యము. ఈ పరమలక్ష్యముతోడనే సర్వ

పురుషార్థములను సాధింపబడినవి. రామాయణ భారతా ద్యైతిహాసిక శిల్పములును, బౌద్ధ చారిత్రక శిల్పములును వెలసినవన్నను, అవికూడ వారి ప్రధానాశయమునకు అంగభూతములై తన్ముఖ్య సిద్ధాంతాచరణ మార్గములనే బలపఱచి, హిందూసంఘములో స్థానము సంపాదించు కొన్నవి. ఏ యితర లక్ష్యమును పురస్కరించుకొని కాని ప్రత్యేకముగా ఏర్పడలేదు.

దైవములు, మానుషములు అగు నానావిధ శిల్పములనుగూర్చి ఋగ్వేదీయమగు ఐతరేయ బ్రాహ్మణమునందలి ఒక మంత్రము ఇట్లు పలుకుచున్నది.

"శిల్పాని శంసంతి దేవశిల్పా న్యేతేషాం వై శిల్పానా మనుకృతీహ శిల్పమధిగమ్యతే. హస్తో కంసో వాసో హిరణ్య మశ్వతరీరథః. శిల్పం శిల్పం హాస్మిన్నధిగమ్యతే. య ఏవం వేద యదేవ శిల్పాని ఆత్మ సంస్కృతిర్వావ శిల్పాని ఛందోమయం వా ఏతైర్యజమాన ఆత్మానం సంస్కురుతే."

"ఆశ్చర్యకరమగు ఈ శిల్పము దేవశిల్పము, మానుష శిల్పము అని రెండు తెఱగుల విలసిల్లుచున్నది. నాభానేదిష్ఠాది శిల్పములు దేవతా ప్రీతిని సంపాదించునవి కావున దేవశిల్పములగును. ఈ దేవశిల్పములకు సదృశముగనే మనుష్యజగమునందలి మానుషశిల్పమును ఒప్పుచున్నది. లోకములో శిల్పులు మట్టి, కొయ్య, ధాతువులు మున్నగు వానిచేత జనోపయోగకరములగు పలువస్తువులను సృష్టించుచున్నారు. ఇది అంతయు మానుషశిల్పము. నాభానేదిష్ఠాదిశిల్పములు జీవాత్మకు సంస్కారమును కలిగించునవి. ఈ శిల్పములచేత యజమానుడు తనను వేదమయునిగా సంస్కరించుకొనుచున్నాడు."

— విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము.

ఇట్లనుటచేత శిల్పమెట్లు లోకప్రవృత్తిని కలిగించి, దేవతా ప్రీతిని సంపాదించుచు, ఆత్మసంస్కార హేతువై ఒప్పుచున్నదియు తెల్లమగు చున్నది.

వైదికశిల్పములు, దేవశిల్పముల మాట అటుంచినను, వేవిధముల ఒప్పు లౌకిక శిల్పములుకూడ పూర్వము చెప్పిన లక్ష్యమునే పురస్కరించు కొని ప్రవర్తిల్లినట్లు గ్రహింపగలము భారతీయశిల్పి ఏ చిన్ని ఆట వస్తువును నిర్మించినను, ఏ గృహోపకరణమును చేసినను వాటిమూలమున దివ్యసందేశమును ఇచ్చుటకును, ఒక చరిత్రను స్మరింప జేయుటకును, ఒక విజ్ఞాన భావోదయమును కలిగించుటకును యత్నించినాడని మఱువ తగదు.

పవిత్ర యగు సౌందర్యదేవతను యోగ్యములగు సంస్కారము లతో మన హృదయములందు, దేహములందు, గేహములందు, మాటల యందు, వస్తువులందు - అన్నింటను నర్తింపజేసి మానవజీవితమును మధురముగను, మనోజ్ఞముగను గమ్యస్థానమునకు చేర్చుటకు శిల్పము ప్రయత్నించినది ఇంకను లౌకిక శిల్ప రహస్యములను సాకల్యముగ వివరించుటకు ఇచ్చట స్థలము చాలదు. సనాతనార్య శిల్పతత్త్వ పరిజ్ఞాన మునకు యత్నించి కృతకృత్యుల మగుటకు ఆ విశ్వశిల్పి కృపాసుందర ములగు దృక్కులచే ఆశీర్వదించు గాక !

"శిల్పైనై వేద ముపబృంహితమ్"

ఈ జగము శిల్పముచేతనే విస్తరింపబడినది.

# భావశిల్పము

"మనసా యత్ సృజ్యతే విశ్వకృత స్తత్సర్వగ్ం శిల్పమేవ భవతి"

—శిల్పోపనిషత్తు.

విశ్వకర్మేశ్వరుని మనస్సుచే ఏది సృజింపబడుచున్నదో, అది అంతయు శిల్పమే అగుచున్నది.

వాక్కుతో చెప్పుటకు పూర్వము, క్రియాయోగమున రూపొందుటకు తొలుత భావము పడయు ఒండొక అవస్థ కలదు. శివములుకాని, సుందరములుకాని, అశివములుకాని, అసుందరములుకాని అనంతములై ఉదయించు భావరాశులు తొలుదొల్త మనస్సంకల్పితములై అటు పిమ్మటనే శబ్దచిత్రితములు, కార్యరూపములు అగుట. అంతస్తప్తమగు ఈ సంకల్పరూపావస్థ భావమునకు తొల్లింటిది. ఈ అంతరిక తపస్సులో కృతకృత్యమైన భావమునకే బాహ్యలోకమున శబ్దనిష్ఠకాని, కర్మయోగ నిష్ఠకాని చేకూరుట. కావుననే శ్రుతికూడ "య న్మనసా మనుతే, త ద్వాచా వదతి, త త్కర్మణా క్రియతే" అని నుడువుచున్నది మానవుడు ఏ తలంపును హృదయములో అంకురిత మొనర్చుకొనునో, దానిని వాక్క్రియలమూలమున పుష్పితమును, ఫలితమును ఒనర్చుకొనుచున్నాడు. హృదయోద్యానమున తలసూపు ఈ ఆశయముల అంకురిత పుష్పిత ఫలితావస్థలలో తొల్లింటిదగు అంకురితావస్థను గూర్చి ఇంచుక భావించి చూతము. అంకురితమన్న మాత్రమున ద్వితీయ తృతీయావస్థల నందని భావము నిష్ఫలావసానమని తలంపకూడదు. శుభాశుభ సంకల్పములు సయితము అనురూప ఫలము ఇచ్చునను కర్మరహస్యము భావసౌందర్యము పట్లను చెల్లి తీరును ఆనందాశ్చర్యములనుకొల్పి, మానవ హృదయమునకు

పరమశాంతిని కూర్చుశిల్పము తొలుదొల్త భావసామ్రాజ్యముననే విలసిల్లు చుండును. ఒక్కొక్క కళారసికుని హృదయమున సురుచిరమై చెలు వొందు ఈ సంకల్ప శిల్పవిభూతిని సునిశితమగు అంతర్దృష్టితో భావించియు, వేయికన్నులతో తిలకించియు తృప్తినందము.

భావోదయము హృదయ సంస్కారమునుబట్టి కలుగుచుండును. ఏ మనుజునకు ఏ విధమైన సంస్కారములు ఉండునో తదనురూపములైన భావములే ఆతనికి తలసూపుచుండును. విశాల రమణీయమగు అంత రంగముగల నటునకు సమున్నత భావములు అంకురించునుగాని, ఇఱుకు ముఱికిదొడ్డినిం బోలినయెడదగల మానవ నామధారికి సుధామధురములగు తలపులు మొలకలెత్తునా ! పలుతరగతులుగా ఉండు ప్రజానీకములో కొందఱు మాత్రమే సుందర సుందర భావకిరణములకు తమ నవనీత హృదయములలో చోటిచ్చుచుందురు. అల్పహృదయుడు, సద్వాసనా జాల మునకు నోచుకొననిరిక్తచిత్తుడు ఎంతగా తపించినను నవ్యనవనీతపు ముద్దలట్లు మెఱుగులు చిమ్ము కోమల భావములకును, అనల్ప శిల్పకళా సౌందర్యమునకు ఇక్కలైన భావనా విశేషములకును జనకులు కాలేరు. విశ్వప్రకృతిమీదికి కనువమ్ములను విసరిన ఒకని చూపులు తారకాగోళము లందును, ఒండొకని దృక్కులు మంటిపెళ్ళలయందును చిక్కువడుటకు కల కారణము చర్మచక్షువులలో లేదు. మఱి భావగ్రంథ భండారములగు స్వాంతములలోనే ఉన్నది. పద్మినీ మధుపముల చెలికారమును ఒక్కరుడు ప్రియానురక్తిగా భావింప, వేఱొకడు మాతృప్రేమయని తలంపనేల ! సంధ్యాకాలమునందలి ప్రాచీ సూర్యుల నేస్తమును ఒక రసికుడు ప్రణయ రక్తియని వర్ణింప, ఒండొక భావతపస్వి అయ్యది "తరణి శైశవలీల" అని స్తుతింపనేల ? దీని కంతటికిని సంస్కారమునకన్న ఇతర కారణమును వచింప గలమా ? రససిద్ధ హృదయుడు తలపులలోను,

పలుకులలోను, చేతలలోను రసము నొలికింప గలడు. పాషాణ హృద యునికి సప్తసముద్రములకు ఉఱికినను నీటిబొట్టే చిక్కదు. హృదయము రసార్ద్రము కాదేని రసమును బాహ్యజగత్తునుండి పడయజాలునా? సహజ రసభావ విలసితుని ఆంతరిక రసరత్నాకరము ఉప్పొంగుటకు బాహ్యజగత్తునందలి కారణము చంద్రోదయము వంటిదగును. అమృత కరుని ఉదయమున చంద్రకాంతములు స్రవించునుకాని, గండశిలలు కరగునా? మహోదధి ఉప్పొంగునుగాని, ముఱికికాల్వలు వీచిహస్తముల ఆతని లాలించునా? నిద్రాముద్రితలైన పద్మినులను మేలుకొల్పుదివాకరుని కోమల కరముల కోష్ణస్పర్శకు సాధ్యమగునే కాని, తేజఃప్రధానములైన అగ్నిశిఖలకు వీలగునా? కావుననే భవభూతి కవిచంద్రుడు "వ్యతిషజతి పదార్థా నాంతరః కోఽపి హేతుః, న ఖలు బహి రుపాధీన్ ప్రీతయ స్సంశ్రయన్తే" అని పలికినాడు. మృదుహృదయుడైన వాల్మీకియెదలోని శోకరసము తరంగిత మగుటకు నిషాద చేష్టితము నిమిత్తమాత్రమే. అట్టి చేష్టకు శిలాహృదయములు కరగకుండుటయు అనుభవసిద్ధమే.

కావున బహిరుపాధులను అపేక్షింపని ఆంతరంగిక సంస్కారము కూడ భావస్రవంతుల వెల్లివిరియ జేయుననుట నిక్కము; సంస్కార దార్ఢ్యమును బట్టియు, భావనలోని స్థైర్యమునుబట్టియు భావసౌందర్యము, భావవైశాల్యము అలవడుచుండును. భావ పవిత్రతకు హృదయము లోని ధార్మికశక్తులయొక్కయు, సత్యనిష్ఠయొక్కయు సౌందర్యము మూలము. సత్యసంకల్పము ధర్మముతోడి నేస్తమున దొడ్డగుణములకు ఆటపట్టయి ఉత్కృష్ట భావజాలముల వెలయించును. దీనిని ఒక చిన్ని ఉదాహరణముచే తెలిసికొనగలము.

* జగదీశ్వరుని భావనాశిల్పము అనంత మహిమాభిశోభితమై విశ్వమున రసముద్రితమైనది. విశాల విశ్వరంగమునందలి సౌందర్య విభూతినిబట్టి విశ్వకర్త హృదయంగత భావరామణీయకమును భావింప వచ్చును. నానా భూతధాతువులు లేనినాడు ఆ కల్యాణకరుని హృదయ మందు ఉదయించిన జగద్రివిణ భోగేచ్ఛ యింతటి మహత్తర సృష్టికి ప్రేరకమై సౌందర్యముద్రాభిముద్రితమైన జగల్లీలను శతధా సహస్రధా ప్రకటించుచున్నది. సంకుచితమును, స్వార్థపరమును అగు మానవ దృష్టినిబట్టి శుభాశుభ భావపరంపరలకు నిధాన మగుచున్నట్లు కన్పట్టు భగవ ద్విభూతిలోని భావోజ్జృంభణము గుప్తమయినది, మానవాత్మను ఋష్యాత్మ గను, ఋష్యాత్మను, పరమపురుషుని పానావత్మగను పరిణత మొనర్చు కొన్ననే కాని, గుప్తమయిఉన్న ఆ నిరుపప్లవ నిర్వికార భావానుభూతి నిత్యశివంకరమై భేదములేని సౌందర్య ఘనస్వరూపమున సాక్షాత్కారము కాదు.ఇది ఒకవిచిత్రయోగము. ఒరులూహించుటకు అలవికాక, కేవలము భావకునిభావసామ్రాజ్యమునకు అధిదైవతమై నెఱపు ఒకఅంతరికదివ్యలీల! ఈపరామర్శచేత జగన్నాథునిసత్యసంకల్పాదులు ఎట్లుజగచ్ఛిల్ప నిర్వహణ మున కృతార్థములైనవో తెలిసికొంటిమి. ఈ అంశమును వర్ణించెడు సూక్తులు వేదోపనిషత్తులయందు పెక్కులు కాననగుచున్నవి

* "జగదుదయకారణం తన్మనో జాయతే. మనస్సంకల్పా త్సర్వం జగ త్సంకల్పితం భవతి. తదేవైవం ప్రారభ్యతే జగచ్ఛిల్పమ్"
—శిల్పోపనిషత్తు.

జగదుత్పత్తికి ఆ దేవుని మనస్సే కారణము. సృష్టికర్తయొక్క మనస్సంకల్ప మాత్రముచే ఎల్లజగమును కల్పింపబడుచున్నది. అప్పుడే జగచ్ఛిల్పము ఆరంభమాయెను.

మానవులలో సైతము వారి వారి విజ్ఞానయాత్రలోని గొప్ప కొద్దు లనుబట్టి భావతపస్సు, భావనాబలము చేకూరుచుండును. సామాన్యజనుని భావసంపద సామాన్యమైన స్వీయజీవితమునే ఉద్ధరించి పరిపూతము చేయలేని అవస్థలో ఉండును ఒండొక మెట్టు పైనున్న సంస్కారికి ఇంచుకంత ఉన్నతమగు భావాభ్యుదయము కలిగి వాని జీవితమునేని ఆహ్లాదభరిత మొనరుప వచ్చును. మానవ సంఘము నంతటిని శాసించు భావబీజములకు తమయెడందలలో పాదుచేసికొన్నకర్షకులు చాలతక్కువ. సంఘమున ఇట్టివారు కవులు, శిల్పులు, మతప్రవర్తకులు, రాజకీయవేత్తలు అగు కొందఱు పురుషోత్తములు మాత్రమే.

కవి మానసము, అందలి భావోదయ విభూతియు సౌందర్యానంద రస నిధానము లనవచ్చును. సృష్టిహృదయమును, మానవ మానసమును తెఱచుటకుకల కీలకము కవి కుమారునిచేతిలో ఉండగలదు. జీవిత విధానమును రససంపన్నము చేసి సమున్నత విజ్ఞానశిఖరమునకు మనలను ఉద్ధరించుటకు కళాహృదయమును చూఱలాడిన నిక్కమగు కవియే వలంతి. విద్యాధికులమని గర్వించు శుష్కపండితులకంటెను కవీశానుడే తన హృదయక్షేత్రమున లెక్కలేని భావధ్యానములను పండించి పెట్టును. కవి హృదయవిభూతియు, భావవైశారద్యమును అతని గ్రంథజాలమున ప్రతిబింబించి మనమీదికి పరువులిడుచుండును. కాళిదాస భవభూతుల హృదయ క్షేత్రములలోని భావ సస్య సమృద్ధి ఎంత మహత్తరమైనది ! ఎంతటి శిల్ప సౌందర్యము కలది !!

అట్లే సౌందర్యతత్త్వమును గుర్తెఱింగి కళాప్రౌఢిమను చూపు శిల్పుల హృదయమును భావనాశిల్పమునకు ఇక్కయే ! ఏ మహనీయ రూప నిర్మాణమును శిల్పిచేయగలడో అంతకు వేయిరెట్లు ఎక్కువగా

అతని రససిద్ధ హృదయములో భావసౌందర్యము ముద్రితమై ఉండ వలయును. గభీరమగు ధ్యానసమాధిలో శిల్పి సౌందర్య రసముద్రలను హత్తుకొన్నకాని అందలి సహస్రాంశమునేని స్థూలజగమున రూపింప లేడు. విశ్వశిల్పమునెల్ల నిజహృదయములో భావనా చిత్రితము చేసి కొన్న కాని శిల్పి చరితార్థుడు కాడు. అట్టి తఱి ఆతని యెడంద ఎంతగా కోమలభావములకు జగదా రాధ్య సంకల్పములకు నిలయమై ఉండవలయునో చెప్పనైతిగాదు. భారత దేమున ఆసేతు శీతాచలము వెలసిన శిల్ప విభూతిని ఆరసినకాని తదాచార్యుల హృదయములు ఎంతటి భావ సౌందర్య నిధానములో రస రత్నాకరములో ఊహించుకొనలేము!

భావైశ్వర్యమును సంపాదించుకొని ప్రభుత్వము నెఱపు మనీ షులు-కవులు శిల్పులేకాక, రాజకీయవేత్తలు మొదలుగా కలవారు మఱి కొందఱుఉండవచ్చును అయినను కవిశిల్పుల భావవిభూతియే సౌంద ర్యోజ్వల మగుటలోమిన్న అనవలయును. ఈ తరగతిలో చరమసీమ నందుకొన్నవాడు యోగీశుడు ఒక్కరుడు. కవిశిల్పుల భావనాశిల్పముల కన్న ఈతని భావ శిల్పము మిన్న. మిన్నయే కాదు, పావనతరమును అనవలయును. ఏకాగ్రమైన హృదయదేశములో ఈతడు రచించు కొను భావ శిల్పకళ అనిర్వాచ్యము. ఈతని మననశక్తి ఎంతగా విశ్వ విహారము చేయజాలునో, ఎంతెంతటి సౌందర్యముద్రలను ముద్రించునో ఊహించుటయు దుర్లభమే. అనేక విధ భావములకు జన్మస్థానమైన యెడందలో అట్టితలపు విద్యుత్తులను పాఱద్రోలి ధ్యానగమ్యమైన విశ్వ కర్తృ విశ్వరూపమును భావించు ఈతవి భావనాశక్తి నిరుపమానము కాదా! స్థూల సూక్ష్మ ప్రపంచములయందలి మర్త్యామర్త్య సౌందర్యముల కది అధిదైవతమై సర్వాతిశాయి అగునవుట పొల్లువోని మాట. ప్రజ్ఞా చక్షువగు సంయమి భావప్రపంచములో పడసెడు ఆనందమునకు మేర

లేదు. రెండవ సృష్టికర్తయట్లు అతడు సృష్టితత్త్వ పరిజ్ఞానమున కృతకృత్యుడై ఒరులకు కూడ ఆ భావమరీచులను చిమ్మి ఆనందముద్రాముద్రిత హృదయుల చేయగలడు. చక్షుర్గోచరములు కాని లోకాంతర రహస్యములును, ఇంద్రియ ప్రత్యక్షములుకాని అతీంద్రియ జ్ఞాన చిత్రములును ఇతని యెడందలోని భావశిల్పమునకు దవ్వులవి కావు. శరీరమునుబట్టికాని, మాటలనుబట్టికాని, చేతలనుబట్టికాని ఊహించుటకు అలవికాని అనితరప్రాప్యమగు భావానందము, అనంత చిదేకరస సంపత్తి యోగీంద్రుని అంతర్ హృదిలో విద్యోతితమగుచుండును. కవిశిల్పుల భావ బలము భౌతికమో, లేక సూత్రప్రాయమగు ఆధ్యాత్మికమో, తెలియబడని భౌతికాధ్యాత్మిక విలాసముల సమ్మేళనమో కావచ్చును. (ఇది కేవలము లౌకికులగు కవి శిల్పులను ఉద్దేశించిన పలుకు)కాని ఆత్మజ్ఞాని భావప్రబోధము అట్టిది కాదు. భౌతికమైనను, అతిభౌతికమైనను, భౌతికాధ్యాత్మికముల సమ్మేళనమైనను సకల తత్త్వముల బాహ్యాంతర్లీలా రహస్యమును చూఱలాడిన దివ్యప్రజ్ఞా ప్రభాసి తపసియొక్క తాత్త్విక భావసంపత్తి కావుననే ఐహికాముష్మికజగములకు రెంటికి ఒక ఐక్యమును కూర్చి కర్మలో అకర్మను, కర్మమున ఏకర్మను ముడిపెట్టి విశ్వసామ్రాజ్యము ఏలుచున్నది. నిర్వికల్పమగు మౌనిజనుల భావవిలాసమును వివరించుటకు ఇది అదనుకాదు. ఊహామాత్ర సాధ్యమైన అవ్వారి విశ్వజనీన భావ సౌందర్యమునకు ఒక్కకై మోడ్పు పెట్టి అవ్వలికి పోదము.

భావమనునది ఇంద్రజాలమువలె అవిద్యమాన వస్తు ప్రకాశము కాదు. 'భూ' అను ధాతువునుండి పుట్టిన 'భావ' శబ్దము సత్తామాత్ర స్థితిని (ఉనికిని) బోధించుచున్నది. కావున సత్యస్వరూపము-లేక సత్త (ఉనికి) వీటియొక్క విలాసమే — నానావిధ సౌందర్యమే భావశబ్ద

వాచ్యమైనది. (అవిద్యమానములు) ఎంత సౌందర్యోజ్జ్వలములైనను, అందలి సౌందర్యము క్షణికమే) దీని ఉనికి, ఆ ఉనికియందలి లీలానుభూతి, అందలి రహస్యము- ఇవియే భావయితకు భావనీయములు. నానా ప్రకారముల విశ్వవ్యాప్తమయిన ఈ 'సత్త'ను స్వీయాంతరంగమున అనుభూతికి తెచ్చుకొని ప్రత్యక్షమొనర్చు కొనుటయే—పలురీతులుగల అద్దాని వైఖరిని ప్రస్ఫుటము చేసికొనుటయే ఉత్తమ భావతపస్వికి ఆచరణీయమగు యోగము.

ఉత్కృష్టమగు ఈభావశక్తిని మనోవికారమాత్రముగా వచించుట తగదు. నిముసమునకు సహస్రాధికములుగా అవ్యవస్థితచిత్తుల యెదందలలో మొలకలెత్తెడి తలపుగుంపులు కాకులగుంటలోని పిల్ల కెరటముల వంటివి. వీటిని వికారములని పిలిచినను సత్యమునకు తలవంపులు లేవు. భావనాశక్తియుక్తుని తలపుమెలపు జాహ్నవీతరంగమాలికయట్లు పవిత్రమై నాకరాజ్యరమనుకూడ ప్రత్యక్షించును. మధురప్రకృతినంతయును హృదయములో బంధించుకొని, సురుచిర భావములను బుద్ధి విషయము లొనర్చుకొనుచు భావవిహారము చేయుట ప్రతి వానికిని చేతకాదు. అవిచలిత భావతపస్సునకు అలవాటుపడిన మౌనికల్పులకే అది సాధ్యము. సత్యజిజ్ఞాసను, ధార్మికశక్తులను విజ్ఞానభూమికమీద కేంద్రీకరించి, ప్రకృతి లీలారహస్యమును మథింపచూచు భావప్రణయియొక్క గంభీరోదాత్త భావస్రవంతి త్రిపథగ (గంగాభవాని) కాక, మురికి గుంటవంటి వికార మెట్లగును: ఆభావముయొక్క నైశిత్యము, ధైర్యస్థైర్యములు, నిత్య శివంకర మహిమావిర్భూతి, శాంత సుందర స్వరూపములు అనితర లభ్యములు.

బాహ్యజగమునందలి హేతువులనుబట్టి తదుచితములైన భావములకు మాత్రమే మనసులో చోటిచ్చు ప్రకృత్యనుయాయులు కొంద

యుందురు. ఇచ్చటను సంస్కార సాజాత్యముఉన్నను బాహ్యోపాధి సాపేక్షకమైన భావోదయమునే కనుచున్నారము. యథార్థభావారాధకుడు వెలుపలి జగత్తునందలి కారణసామగ్రిని సరకుగొనక, తన మనో రాజ్యములో తాను వలచిన భావశిల్పమును చిత్రించుకొని, మధుర మోహన సౌందర్యమును వెల్లివిరియించి తన్మయనృత్యము చేయును. ఆంతరికమగు ఈ సౌందర్యతపస్సు పరులకు ఊహింప వీలుకాకున్నను, ఎప్పుడో ఒకప్పుడు కళాభావుకుని హృదయమునుండి రసతరంగితమై వాగ్రూపమున వెల్వడి సహృదయుల మానసముల తళ్కొత్తక మానదు. కన్నులున్న అంతర్దృష్టులు అద్దాని మహత్తును భావింపక ఊరకుండరుకూడ.

తినుటకు అన్నము లేకున్నను, శరీరమున కైసేతకు విలువగల దుకూలములు లభింపకున్నను, చూపఱకు వెఱ్ఱి బాగులాడుగా తోచినను గభీరసంస్కారములుగల సహృదయుడు అనర్ఘ భావసౌందర్యమునకు మాత్రము దూరుడు కాడు. స్వీయాంతరంగమున ఇతరాపేక్షలేక ఏక మాత్రుడై భావసృష్టి చేసికొని, నిర్వికల్పానందమును పడయుటకు బాహ్యా డంబరములతో పని ఏమి ? లోక మందించు ప్రశంసలకు ఉబ్బియు, నిందలకు ఓడియు అలీకప్రతిష్ఠకై అఱ్ఱుసాచి తన భావహర్మ్య నిర్మాణ మును వమ్ముచేసికొనునట్టి మూర్ఖుడు కాడు భావశిల్పి. సాంసారిక పరిస్థితు లును, లోకామోదమును తనకు వ్యతిరేకమై భావతపమునకు, భావాభ్యు దయమునకు అంతరాయములను కలిగించుచు, కడకు భావపతనమునకే దోహద మిచ్చుచున్నను, అట్టి విఘ్నములను లెక్కింపక 'ఛీ' అని వాటిని విదలించి, ఉదాత్త భావారాధనావేశముతో రమణీయ భావసృష్టికే అతడు ఉవ్విళ్ళూరు చుండును. "అతని దొకలోక మన్యుల కనవగతము" అని ఒక కవిమిత్రుడు వచించినట్లు ఆ భావకళాతపస్వి విశిష్టప్రపంచమును

సృష్టించుకొని, దానికి తాను అధినాథుడై కమనీయ భావనిర్మాణమును సంలగ్నుడై విశ్వరహస్యములను అన్వేషించి, అవ్వాని తత్త్వదర్శనముచే ఆశ్చర్యామోదములతో చిందులు త్రొక్కుననుట భావోపాసకుల అనుభవములలో తెల్లము చేసికొనగలము.

బాహ్యసంపత్తులు ఎంత కొల్లలుగా ఉన్నను, అంతరికమగు ఈ హృదయవిభూతి లేనివాడు దరిద్రుడే అగును. హృదయము శిల్పసౌందర్యోజ్జ్వలము కాదేని సమాధిలభ్యమగు దివ్య సుఖము భావయితకు ఎక్కడనుండి లభించును ? హృదయంగత భావరామణీయకమునకు సంబంధించిన యీ విషయమే "మనశ్శిల్పము" న (ఇది యొక శిల్ప గ్రంథము) వేవిధముల చర్చింపబడినట్లు తోచుచున్నది. కలిగిన సందేహములను దూరీకరించుకొనుటకును నూత్నవిషయ పరిజ్ఞాన మలవఱచుకొనుటకును, అట్లొనర్చుకొని శోక మోహ వ్యాకులమైన జగద్రంగమున లీలామానుష విగ్రహుడై ఆనంద నాట్యము సలుపుటకును భావసంపదయే సన్నిహిత కారణము సుఖ దుఃఖముల భావనచేతను, అహంకార మమకారములచేతను మోహితుడై పోయిన పార్థుని యెడందలో శ్రీకృష్ణచంద్రుడు రేకెత్తించిన భావశిల్పము ఎంత అనిర్వాచ్యమైనదో ఊహింపుడు. విశ్వరూపమునెల్ల హృదయ పటముపై సత్యముగను, సుందరముగను, శివంకరముగను చిత్రించిన కళావిష్ణాత కృష్ణపరమాత్మ ఎంతటి మహత్తర శిల్పి ! ఇతడు కేవలము గీతాచార్యుడే కాదు; అద్భుత భావశిల్పాచార్యుడును. ఈవిధమున తమ యెడందలందే కాక ఒరులమనస్సులందును అనూనభావశిల్ప చిత్రములను ముద్రింపగల చతురమతులు మొట్టమొదట వాకొనిన కవివరేణ్యులు, శిల్పసమ్రాట్టులు, మతప్రవర్తకులు, యోగీశులునై తేజరిల్లువారు కొందఱు మాత్రమే. సమాజము వీరి అడుగుజాడలలో అనుగమింపక

తప్పదు. కావుననే వారి భావవై శారద్యము ప్రపంచమును శాసించి పాలించు చున్నదని గ్రహింపవలయును. అట్టిభావకుడే మానవసంఘమున అగ్రయాయి అగుననుట రూఢి.

అంతగాని ఇంతగాని ఈ భావసంపద లేని యెడద చీకటికోన, దుఃఖాలయము, సందియములపుట్ట, స్వార్థమాలిన్య దూషితము, భయ ప్రమాదముల కాణాచి అనుట తప్పుకాదు. జగమున మానవుడు 'మృత్యువుచే తలవట్టి యీడ్వబడిన వాడు వోలె, వెదకి వెదకి సంతరింప దగినది భావైశ్వర్యమే అది కలిగిననాడు పెఱసిరులు అడుగులకు మడుగులొత్త గలవు. అది లేనినాడు ఎల్ల సిరులకును మూతివిఱుపే.

వాచిక కాయికావస్థలకు పూర్వభావి యగు ఈ మానసికదశ భావమునకు మూలజనని; బీజప్రాయము. బీజములోని గుణాగుణములే ఫలమునకును సంక్రమించును గావున, విత్తనములను ఏరికొనుటలోనే ప్రతినరుడును జాగరూకుడై మెలగవలయును. భావములు ఎంతగా శివసౌందర్య విభూతులకు నివాసములై గంభీరములగునో, వాటికి తగిన ఫలసంపదలనే ఆ భావజనకుడును పడయుచుండును. తదనుసారమే లోకసంగ్రహమును చేయ సమర్థుడగును. జొన్నలను విత్తి రాజనములను అపేక్షించిన, విఫలమనోరథు డగునట్లు, ఫలానురూపములైన భావములకే మదిలో పాదొనర్చుకొనవలెగాని, విపరీతమార్గగామియై అనిష్టఫలభోక్త యగుట పొరపాటు. కావున తలపులను కనుటలోనే జనులు చూపవలసిన కౌశలము దొడ్డదని వ్యక్తమగుచున్నది. మానవుడు తన స్వభావమును మాత్రమే అనుగమించుటలో ధన్యమ్మన్యతను చూపక అన్నింటి స్వభావ ములను బుద్ధిస్థము చేయబూనుటలోనే భావతపస్సుయొక్క కలిమి బలములు నెలకొని ఉన్నవి. ఇది అది అనక సకల చరాచరముల స్వభావ పరిశీలనమే, భావసాక్షాత్కృతియే, ఉత్పత్తి స్థితి ప్రళయముల

నిరంతర విచారమే, తల్లీలావిలాస మర్మజ్ఞాన సిద్ధియే అఖండ భావశిల్ప విభూతి అని చెప్ప నొప్పును. సుందరమగు ఈ భావశిల్ప సంసిద్ధిని అందిననాడే ఆచార్యత్వ సిద్ధియనని ఎఱుంగనగు.

సాహితీ సౌష్ఠవమునకుకాని, శిల్పకళాకౌశలమునకు కాని, కవిత్వ కల్పనమునకుకాని, నిర్వికారానందాభివ్యక్తికికాని, లౌకికాలౌకిక విషయ పరిజ్ఞానమునకుకాని, క్రియాపాటవమునకుకాని ఈ భావతపస్సే — భావ విభూతియే — భావనాశక్తియే — భావస్థైర్యసౌందర్యమే మూలమయి చారి తార్థ్యమును వెలయించును.

"యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ"
ఏ విధమగు భావన కలవానికి ఆ విధమగు సిద్ధియే కలుగును.

— ••• —

# వాఙ్మయ శిల్పము

"యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్''.

— తైత్తిరీయ బ్రాహ్మణము.

"నానార్థభాజం వాచగ్ం శిల్పవిచిత్ర సుందరా మకరోత్.''

— శిల్పోపనిషత్తు.

సౌందర్యము సర్వజనారాధనీయమైనది; ఎల్లరకును వాంఛనీయమైనది; విశ్వమునందెల్ల సర్వాంగీణముగ వ్యాపించి జగమును సమాకర్షించునది. ప్రకృతిసుందరము. దాని బాహ్యాంతరములు సుందరములు. ప్రకృతికి అవ్వలఉన్న తత్త్వము సుందరము. ఆ ప్రకృతియొక్క రూప గుణములు సౌందర్య రసపూరితములు. ఎటచూచినను సౌందర్యమే. విశ్వములోని పదార్థజాలము అంతయు సుందరతత్త్వమునుండి వెలువడిన అంశాంశ కణ రాశియే. విశ్వాంతర్గతుడైన పురుషుడు సుందరుడు. ఆతని తలపులు, చేతలు, మాటలు అన్నియు సుందరములే. సుందరము కాని వస్తువు విశ్వములో లేదు. మానవుడీ సౌందర్య పూజకే నిరంతరమును జీవితయాత్రను నిర్వహించుచున్నాడు. హృదయముగల ప్రతి ప్రాణికిని ఆరాధనీయమైన సంపద సౌందర్యమే అని జనునియొక్క ప్రగాఢమగు సౌందర్యభోగేచ్ఛ తెలియజేయుచున్నది. సహజమైన యీ సౌందర్య కాంక్ష బాహ్యాంతర్నిరోధములను విదలించుకొని, ఱెక్కలు కట్టుకొని నభోమార్గమున ఎగుర వేగిరపడుచుండును. సౌందర్యమునందలి ఈ మక్కువ దోషమని కాని, శుష్కావేశ జనితమని కాని, నింద్యమని కాని దూరీకరింప వీలుగాదు. స్వభావ సుందరుడైనవానికి సుందరప్రకృతి తోడి చెలిమి అసహజ మెట్లగును ?

తన సర్వస్వము సౌందర్యోజ్జ్వలముగా ఉండవలెనని మానవుడు తలంచుచుండును. తనదే కాదు; స్వీయసంపదకాని, ఒరుల సంపదకాని సుందరమై భాసింపవలయునని జనుడు కోరుచుండును. సామాన్యమానవుని నుండి మానవోత్తమునివఱకు ఈ ఆకాంక్ష వంకర లేక జాలువాఱుచునే ఉండును. తన శరీరము, తన మనస్సు. తన దుస్తులు, తన గేహము, తనపెండ్లము, తన బిడ్డలు, తన ఎల్ల సంపదయు సుందరమై ఉండవలెనని కోరుట ప్రకృతివిరుద్ధము కాదు. తనది కాకపోయినను తనకు భోగ్యము కానున్న — కావలసియున్న సర్వప్రకృతియు సుందరతరమై వెలయవలయునని ప్రజానీకము చూచుచుండుట అనుభవసిద్ధము. తన దేశము, తన రాజ్యము సుఖసంపన్నమై సర్వసౌందర్య సమన్వితమయి నెగడవలయు ననెడి ఇచ్ఛయు ఈ తరగతిలోనిదే. సుందరము కానిదెల్ల అసహ్యము; రోతను పుట్టించును; దుఃఖాకరమగుటచే అది సుఖజనకము కాదు. అసుందరమైనదానికి వేయిగజములు దూరమున ఉండుటయే మానవునకు ఇష్టము. లోకమున సుందరముకానిది లేదని భావించుకొను భావకులు కొందఱు ఉన్నను, జనసామాన్యము సౌందర్య తారతమ్యమున కొలతబద్దలు జారవిడుచుకొనదు. సర్వప్రపంచమును సుందరతరముగా ఎంచు గాఢభావన సౌందర్యతత్త్వ పరాకాష్ఠను అందినది. కావున తాదృశ భావనిష్ఠుల సౌందర్యయోగము విశిష్టము. తదితరులకు సర్వమును సుందరతర మొనర్చుకొనుటయే సమీహితము.

మానవునిలోని యీ సౌందర్య వాంఛయే అతని మనోవ్యాపారములను సుందర మొనర్చుచున్నది. కందని వాడిపోవని సుకుమార భావసుమములతో హృదయపాత్రిక నింపుకొందమను ప్రవృత్తి సౌందర్య భోగేచ్ఛనుండియే కలుగుచున్నది. అశ్లేతన మాటలనుకూడ సుందరములు చేసికొందమను తలపు ఉదయించి వాఙ్మయమును శిల్పవిచిత్ర సుందర

మొనర్చినది. పరస్పరాభిప్రాయ పరిజ్ఞానము మాత్రమే భాషాప్రయోజనమైనను, ఆ భాష సౌందర్యవంతమై ఉండవలయును. సౌందర్యహీనమైన పలుకుబడి ఆశయసిద్ధినికూడ సంపాదింపజాల దనవచ్చును. భావమే సుందరతమము.కావున అట్టి భావమును అందచందములులేని నుడికారము పాలుచేసి, అద్దాని శోభనుకూడ చెఱుపు కూర్చుట సహృదయేష్టము కాదు. భావరామణీయకమునకు భాషారామణీయక గుణము తోడైన బంగారము పరిమళించినట్లే! లేకున్న మాణిక్యమును మసిబొగ్గులలో పొదిగినట్లు ఆ భావమునకు శిరోధార్యత సిద్ధింపదు. మానికము ఉత్కృష్ట గుణగుంఫితమైనను "రత్నం సమాగచ్ఛతు కాంచనేన" అని కాళిదాస కవివతంసుడు అన్నట్లు బంగారములో పొదుగబడిననే అది స్వీయసౌభాగ్యమును వెలార్పగలదు. కావున భావానుగుణమైన భాషారామణీయకము అనివార్యము. ఈ సౌందర్యవాదము ఒక వాఙ్మయముపట్లనే కాక, అన్నింటను అనువర్తించుచున్నదని మున్నే తెలిసికొని ఉంటిమి. నిఖిల ధార్మిక శక్తులును, లౌకికాలౌకిక వ్యాపారములును, పురుషార్థములును సౌందర్య భూమికపై పరిష్కృతములై కాని స్వప్రయోజనమును సంపాదించుట లేదని సులభముగ నిరూపింపవచ్చును. శరీరమున చైతన్యమువలె మానవుని సర్వకర్మములందును సౌందర్యము నిశ్యపూర్ణమై వెలయుచు అతనిని ప్రవృత్త్యున్ముఖుని జేయుచున్నదనుట రహస్యము. నివృత్తియును సౌందర్యసాక్షాత్కారమునకే ఐనను, బాహ్యాంత ర్భేద భిన్నమగుటచే ప్రవృత్తి నివృత్తులనెడి రెండు పూవులను ఒక్క సౌందర్య లతయే పూచినది కావున సౌందర్యవాదము మొక్కవోనిది. శక్తిసుందరి! ఆమె తత్త్వము సౌందర్యము!! ఆ సౌందర్యము ప్రవృత్తి నివృత్తులనెడి రెండు పాయలై ప్రవహించి ప్రవహించి, అనిర్వచనీయ శివస్వరూపమున ఆనందమాత్రముగ ఘనీభవించుచున్నది. చలనముకాని, స్పందముకాని,

వికారముకాని అచ్చటలేదు అచట కేవలము సత్తయే, అఖండప్రకాశమే, అని మనము అనుకొందము. ఇక మాటలు మసలవు. అగుటచే అది అనిర్వాచ్యమే. మనస్సు కదలదు. కాన అమనస్కమే బుద్ధి ప్రసరింపదు. కాబట్టి అతిబౌద్ధమే. అతిబౌద్ధము కేవలాత్మ. కేవలాత్మ సౌందర్య ఘనము. తత్తథాస్తు. ప్రకృతమును అనుసరింతము.

పామరజనుల భాషచే అభిప్రాయములు మాత్రము వ్యక్తమగునే కాని, అందలి రసరామణీయకములు మనోముద్రితములు కావు. కారణ మేమన? వాటికి కావలసిన శిల్పసంపద అలవడకుండుటయే అని ఎఱుంగ నగు. ఆ అభిప్రాయములైనను చెఱగిపోని రసముద్రలు కాక చల్లనగా మాసిపోయెడి రేఖావిన్యాసములనుపోలి యుండును. అందుచే ఆ అభిప్రాయములకు హృదయములో స్థైర్యము చిక్కదు. అవి అలంతికాలము మనసులో పైపైని మాత్రము సంచారము చేసి అదృశ్యము లగుట నిక్కము. ఇయ్యది జనసామాన్యముయొక్క భాషకు ఉన్నలోటు. జనసామాన్యములో నైనను - చదువులు రానివారును శిల్పసుందరముగను, చమత్కారముగను మాటలాడగల రసికులు కొందఱు ఉందవచ్చును. వీరి హృదయములు రససంపన్నములు కావున, శిల్పసౌందర్య సృష్టి వీరికి చేతనయి, సంస్కారము పొందని భాషనేని శబ్దార్థముల కూర్పు నేర్పుచేత శోభావంతము చేసికొని భావరామణీయకమునకు తోడు భాషాపై చిత్రిని సంపాదింపగలరు. ఈ తరగతివారు నిర్మించిన అసంఖ్యాకవాఙ్మయము పండితాదరమును అందకున్నను, సర్వజన సాధారణమై చెన్నొందుటను మన మెఱుంగుదుము. దీనిని జానపద వాఙ్మయము క్రిందికి తీసికొను చున్నారు.

వాఙ్మయశిల్పమును ఎఱింగిన కవిశిఖామణుల భాష రామణీయకమునకు ఇక్కయై భావమునకు వలసిన శబ్దరమ్యతను అపాదించుకొని

రత్నకాంచన సంయోగమట్లు శ్రవోలంకారమగును. కేవలము చెవికిఇంపు నింపుటతోడనే అది చరితార్థముకాక, సహృదయుల హృదయములందు రసముద్రలను హత్తి చిరస్థాయి అగుననుట సత్యము. శిల్పచిత్రితమైన భాష ప్రజాహృదయములమీద ప్రభుత్వము నెఱపి, వాటిచే తన చెప్పిన యట్లు చేయించుకొనుటకు రాజు వంటిది. రామాయణ భారతములలోని ప్రత్యంశమును పండిత పామరులకెల్ల హృదయ రంజకమై చిరకాలము జ్ఞప్తికోశమున భద్రపడి, ఆయా జీవితఘట్టముల ప్రబోధము నంది వారి నడవళ్ళను తీర్చి దిద్దగలుగుటకు అందలి వాచాశిల్పమే కారణము. మహత్తర భావము వాఙ్మయ ప్రపంచమున శిల్పకళా మోహనమై జనుల యెడందలలో చిరస్థానమును ఆక్రమించుకొనుట నిక్కము. వేదసూక్తములయందు అద్భుతమగు వాచాశిల్పము ఉన్నది. మనోహరభావములను సుందరమగు భాషాశిల్పముచేత మన మనస్సులకు ఎక్కింప బూను కొన్నది మొట్టమొదటగా వేదమే. కావుననే శ్రుతికూడ ''ప్రజాపతి ఏ శిల్పములచేత వాక్కును వివిధరూపములు గలదానినిగా ఒనర్చెనో'' అని పలికినది.

తరుణ సహకారమూల వితర్దిమీద శీతలానిలమొలయ ఆసీనయై, కాయలు ఉత్తుంగ కుచసాళిని అత్తమిల్లగా రతిపారవశ్యవిభ్రమము తోచెడి అరమోడ్పు కనుదోయితో జిలిబిలిపాట ముద్దులు కులుక ఇంపు తళుకొత్త వీణవాయించెడి వరూథిని మన హృదయఫలకముపై హత్తుకొనిపోవుటకు కవితాశిల్పమే కారణము. అంతియేకాదు. వేలకొలది మైళ్ళదూరమునఉన్న హిమవన్నగము, అందలి మనోజ్ఞ దృశ్యములు మన కన్నులలో చిందులు త్రొక్కుటకు వాగ్వైచిత్రికాదా హేతువు? "సతుల మాయలు ధీరచిత్తంబులను గలంపలేవ"ను సూక్తి చిరస్థాయియై వెలుగొందుటకును వాఙ్మయ శిల్పమే కతము. మఱియు జానపద వాఙ్మయమునకు చెందిన 'సర్వాయి

పాపారాయడు' 'బొబ్బిలి రంగారావు' మున్నగాగల వారి పౌరుష భాషణములు మన మెదడులో అంటుకొని పోవుటకును వాఙ్మయ శిల్పము నకన్న ఒండొక కారణమును వచింపలేము. శిష్టవాఙ్మయముకాని, జానపద వాఙ్మయముకాని శిల్పచిత్రితమైనచో మహనీయ మగుననుటలో వింతలేదు.

వాఙ్మయభూమికలో శిల్పవిభూతి నందని భావము ఎంత ఘనమైనదైనను అది మన మానసములను చూఱగొని వాటిపై ప్రాభవమును నెఱపజాలదు. ఆతరగతిలోనివగు శాస్త్రములు విశేషపరిశ్రమచేత ఒకానొక విశిష్ట వ్యక్తిచే మాత్రము గ్రహింపతగినవై ఉండుట మన మెఱుంగుదుము. హృదయ మోహనశక్తి ఆ మాటలకు లేమిచే, సిద్ధాంత ప్రవచన మాత్రమున అవి జనతకు తలనొప్పి పుట్టించునవై ఉన్నవి. మానవుడు వాటిని అనుసరించుచున్నను, తదాచరణమున అప్రమత్తుడై మెలగుచున్నను అది ఎల్లను పాపభీతిచేతను, విధిననుసరించు దీక్షచేతనే కాని రసానంద తాత్పర్యమున కాదు కావుననే అట్టివానిని ఇంచుమించు ప్రభుసమ్మితములుగా లెక్కింపనైనది. పరిశ్రమ సాధ్యమైన శాస్త్ర మాధుర్యముకూడ ఆస్వాదనీయమే ఐనను, అయ్యది ఒకానొక విశిష్ట లక్షణ లక్షితునకే కాని, ఎల్ల ప్రజాహృదయములకును జుట్టుకొనకాదు. శాస్త్ర సిద్ధాంతమును కళాపులకితము చేసి, రసభరితముగా మనకు అందించుటలోనే కవియొక్క శిల్పకౌశలము వ్యక్తమగుచున్నది. పితృవాక్య పరిపాలనము, భ్రాతృభక్తి, ఏకపత్నీవ్రతము, ప్రతిజ్ఞాపాలనము, పరస్త్రీవైముఖ్యము, దుష్టనిగ్రహ - శిష్టపరిపాలనములు మొదలుగాకల యోగ్య గుణములు దొడ్డవియే అగును. శాస్త్రకారులు క్షుణ్ణముగా వీటినిగూర్చి నూరిపోసియే ఉన్నారు. కాని ప్రతివానికిని మనోరంజనము అగునట్లు వాటిని చిత్రించుటకు వాల్మీకి కవివర్యునికి రామాయణకావ్య రచనము అవసరమైనది. ఆ సనాతన సత్య సిద్ధాంతములనే సాలంబనముగా

ఐతిహాసిక భూమికమీద కళాభరితము లొనర్చి ఆదికవి కృతకృత్యు డైనాడు. అసంఖ్యాక ప్రజాహృదయములను తాను వశపఱుచుకొనుటయే కాక, సిద్ధాంతములచేతను ఆకర్షింపజేసినాడు. పరనారివంక చూపులు పఱపకు మన్నంత ఈర్ష్యాళువై మూతివిఱుచుకొను మనుజుడు, రామాయణ కావ్యపఠన శ్రవణములచే మనసును వశము చేసికొన కలుగుచున్నాడు. కవి కవితాశిల్పముచే సంపాదించిన మహత్తర ప్రయోజనము ఇది. ఈ ప్రయోజనమును శాస్త్రము కాఠిన్యముచే సంపాదించుచుండ, కవిత సౌంద ర్యముచేతను, రసానందముచేతను కలిగించుచున్నది. కావున వాఙ్మయము సౌందర్యభూమికమీద శిల్పచిత్రిత మగుటలో ప్రకృతిసిద్ధమయిన సువర్ణము శిల్పిచేత భూషణము కావింపబడు దశను పొందుచున్నదని యెఱుంగ వలయును.

మాటల యందంపు పొందికను బట్టియే ఉపమాద్యర్థాలంకారములు, అనుప్రాసాది శబ్దాలంకారములు, రీతి వృత్తులు, శయ్యా పాకాది నానావిధ కావ్యసౌందర్య హేతుభూతమైన సామగ్రి ఏర్పడినది. సౌందర్యము తొనకులాడు మోమును కాంచి వాగ్వైచిత్రిని ఎఱుంగనివాడు 'ఆ చెలి మో మందముగా నున్నద'ని ఆ మొగముయొక్క సౌందర్యమును ఇదమిత్థ మని నిర్ణయింపలేక తాను అనుభవించిన సౌందర్యానందమును మదిని ఆకర్షింపలేని మాటలతోడను, అర్థభంగులతోడను వ్యక్తీకరింప, వాగ్వై చిత్రిని ఎఱింగినవాడు ప్రకృతి పదార్థ పర్యవేక్షణమున కుశలుడై సహజ రసభావ విలసితమైన యెడందతో దానికి సాటివచ్చు వస్తువును తెచ్చి పోల్చి సౌందర్యభరితముగ చెప్పకలుగుచున్నాడు. "ఆ ముఖము చంద్రుని వలె అందముగా ఉన్నది. లేదా చంద్రునితో పోల్చుటకును వీలుకాక ప్రకాశించు చున్నది, చంద్రుఁడా పద్మమా ముఖమా'' అనియు — నానాభంగుల వాక్రువ్వబడుచున్నది. ఈ అలంకారభరిత భాషణము కేవ

లము కవీంద్రులనుండియే వెడల నక్కరలేదు. సామాన్య జనతనుండియు రససంపన్న హృదయములందు ఇట్టి నుడికారమును మనము ఆరయ గలుగుచున్నాము. స్వభావముచేతనే ప్రతి పదము నందును చమత్కారము వెల్లివిరియునట్లు, ప్రతి వాక్యమునందును రసము తొనకులాడునట్లు మాటాడగల జనుల నెందఱినో మనము ఎఱుంగుదుము. ప్రజాసమూహములోని ఆ విధమైన చమత్కారభాషణమే విద్యాసంపన్నులయు, శాస్త్రకారులయు లక్షణకరణవిధానములో సూక్ష్మదృష్టితో సంలక్షిత మయి వృత్తి గుణ శయ్యాలంకారాద్యభిధానములతో అలరారుచున్నది.

వీటి నన్నింటిని మించిన అర్థవైచిత్రి ఒండు శబ్ద నిష్ఠమై కలదు. అయ్యదియే వ్యంజనావృత్తి ద్యోతిత మైన వ్యంగ్యధర్మము. కావ్యాత్మభూతమును, అఖండ రసస్వరూపమును అగు దీనికే వాఙ్మయ రాజ్యమున ప్రముఖ పట్టాభి షేకము గట్టియున్నారు. వస్త్వలంకార రసాత్మకమై రామాయణ మహాభారతాద్యసంఖ్యాక లక్ష్య గ్రంథముల యందును, కాళిదాసాది మహాకవుల సూక్తులయందును నెలకొనియున్న యీ వ్యంగ్యము సకలసత్కవి కావ్యోపనిషద్భూతమని ఆనందవర్ధనాభినవగుప్తాదుల సిద్ధాంతము. ఇయ్యది వాక్కు యొక్క సౌందర్యద్యోతనకు చరమసీమ. ఈ సౌందర్యమునే రస సౌందర్యముగ ఆలంకారిక మూర్ధన్యులు వాకొనియున్నారు. నన్నయభట్టారకుడును రసపర్యవసన్నమయిన వాక్కునే ఉత్తమ కావ్యముగా సిద్ధాంతీకరించెను. (సా వాగ్యా రస వృత్తిః) మఱియు "వాక్యం రసాత్మకం కావ్యం" అను సిద్ధాంత వచనమును రస సౌందర్యమునకే మూర్ధాభిషేకము ఒనర్చు చున్నది. పండితరాయలు రసవత్త్వము లేకున్నంత మాత్రమున కావ్యత్వమునకు హాని లేదనియు, రమణీయత్వ మున్ననే కావ్యత్వసిద్ధి చేకూరుననియు నిర్వచించి, కావ్య మార్గమునకు వైశాల్యమును సంపాదించెను. ఎట్లైనను

రసవాదము అజ్ఞాన మూలము కాదు. రసము సర్వాంగీణమై కావ్యమున నెలకొన వలయుననియు, రసతత్త్వము చేతనే అనిర్వచనీయానంద మనియు- అను సిద్ధాంతము రసామృతమూర్తియగు పరమ పురుషుని తత్త్వమును సాక్షాత్కరించుకొను పక్షమున సరసమై అన్వయించు చున్నది. బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసస్వరూపము, వాఙ్మయమున తత్స్వరూపసంసిద్ధి తదాస్వాదనామార్గము, సమాస్వాదిత రసజనిత నిర్భరానంద సంపత్త్వము, ఈ భూమికలో పురుషుడందెడి అవిజ్ఞాత స్వాత్మవికాస విధానము విలక్షములు, విశిష్ట భావుకగణ విజ్ఞేయములు; చిరంతన భావనీయములు. అగుట రసవాద స్వరూప విపుల విమర్శనము నకు ఇచ్చట తావు చాలదు.

రసాభావమునను రామణీయక ముండుననియు, రమణీయత్వసిద్ధిచే మాటలకు కావ్యత్వసిద్ధి చేకూరుననియు నిర్వచించు పండితరాయల వాదమును సహృదయ హృదయ సమ్మతమే ఈ పక్షమున భావమును రమణీయముగ బోధించెడు శబ్దజాతమునకును కావ్యత్వసిద్ధి అవ్యాహతము కాలేదా ! కావుననే "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్'' అని ఆతడు నిర్వచించినాడు.

శబ్దార్థములకు సంబంధించిన యీ సౌందర్య మంతయు శిల్పకళా మూలక మైనదే. శిల్పము భావమును సుందర మొనర్చినట్లు, దానికి శరీర ఘాతమయిన వాఙ్మయమునుగూడ సురుచిర మొనర్చి, తొల్లింటి భావము నకును, వాఙ్మయమునకును పరమోపాదేయతను సంపాదించుచున్నది. ఈ శిల్పకళచే విరాజితముకాని వాఙ్మయము మానసాహ్లాదకరము కాదని మఱల నుడువుట పునరుక్తియే. శిష్టలోకమునుండి పామర ప్రపంచము వఱకును తమ పలుకులకు అంతయో ఇంతయో ఈ అందమును సంత రించుకొనుచునే ధన్యతను సంపాదించు కొనుచుండును. అయినను

సామాన్యుల వాచాశిల్పము సుస్థిరముకాక, శిల్పతత్త్వమున పరినిష్ఠితులైన వారి వాగ్విభూతియే చిరస్థాయి కాగలుగుచున్నది. అట్టివారే సాహితిని చిరంజీవినిగా ఒనర్చ వలతు లగుచున్నారు. వాఙ్మయాకాశమున తారలై ప్రకాశించు సకలకవికుల శిరోమణులు, కవిబ్రహ్మలు, కవిసార్వభౌములు, కవిపితామహులు అట్టి వాఙ్మయశిల్ప నిష్ణాతులే. సారస్వతోపాసకులకు తెలియ తగినదగు వాచాశిల్ప విధానము "సారస్వత శిల్పము" అను గ్రంథమునను, ఆలంకారిక గ్రంథములందును కూలంకషముగా చర్చింపబడి ఉన్నది. విశేష జిజ్ఞాసువులు అందు ఇద్దాని తత్త్వమును దర్శింతురుగాక.

ఈ వాఙ్మయశిల్ప విచారముచే నామరూపాత్మక శిల్పములలో ఒక్కటగు నామశిల్పముయొక్క పరిశీలనమును చేసినట్లే అగుచున్నది. వాఙ్మయము నామరూపములలోని నామ (శబ్ద) బ్రహ్మమునుండి సముత్పన్నము కావున, వాటి రెంటికిని ఇట అభేదమే. ఈ శబ్దబ్రహ్మతత్త్వమును గుర్తెఱింగియే—ఈ శ్రబ్దబ్రహ్మమును కళారాధనము చేసియే— ఈ శబ్దబ్రహ్మమును బహుభంగుల చిత్రించియే కవిగాని, విద్వాంసుడుగాని శబ్దబ్రహ్మనిష్ణాతృత్వమున పరబ్రహ్మ ప్రాప్తి నందుట।

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి"

— ••• —

# రూప శిల్పము

''రూపేణైవ ధ్యాయన్తే త ద్దైవతమ్.

— శిల్పోపనిషత్తు.

రూపముచేతనే అభీష్టమగు దేవతను ధ్యానము చేయుదురు.

భావశిల్పమును గూర్చియు, వాఙ్మయ శిల్పమును గూర్చియు ఇంత వఱకు తెలిసికొని యుంటిమి. ప్రస్తుతము నామరూపాత్మక శిల్పములో ఒక్కటగు రూపశిల్పమునుగూర్చి విచారింతము. వాగ్రూపమైన నామశిల్పమునకును రూపాంతర్భావ మున్నను, వాఙ్మయత్వ మున్నది కావున దానికంటె ఇది విశేష విభేదముతో ఒప్పుచున్నది. రూపములో సైతము వాగ్రూపము వేఱు; తదితరములయొక్క రూపము వేఱు. ఈ విషయమునే ఇంచుక స్పష్టముగా తెలిసికొందము. వాగ్రూపము శబ్దసాహాయ్యమున మనోరంజనమును గల్పించునది. తదితర రూపసృష్టి అశబ్దమై తత్తదాకార సౌందర్యముచే మనస్సు నలరించునది. కాన తత్త ద్వస్తు—పదార్థములయొక్క కలరూపును నేత్రేంద్రియ ద్వారమున మనోముద్రిత మొనర్చు భావ వాఙ్మయేతర శిల్పము రూప శిల్పమని గ్రహింపదగును. చెవితో గ్రహింప దగిన శబ్దమునకును, మనోగ్రాహ్యములైన ఆ యా భావములకునుకూడ, ఏ రూపము కలదని మనము భావించుచున్నామో, అట్లు భావించి, 'భావరూప, వాగ్రూపాది' పదములను వ్యవహరించుచున్నామో అది యంతయు ఔపచారికము మాత్రమే.

భావ, నామ, రూపములకు గల ఉపాధులనుబట్టి చూచినను ఈ భేదము సువ్యక్తము కాగలదు. భావశిల్పము అంతఃకరణోపాధికము.

వాఙ్మయ శిల్పము శబ్దోపాధికము. రూపశిల్పము ప్రకృత్యంతస్స్థిత తత్తద్ద్రవ్యోపాధికము. అనంతములగు భావములు అంతఃకరణముననే ఉదయించి ఆ అంతరింద్రియము చేతనే గ్రహింప దగినవై ఒప్పుచున్నవి. పలువిధములగు మాటలు శ్రవణేంద్రియ ద్వారమున మనోగ్రాహ్యము లగుచున్నవి. వేఱొక యింద్రియము శబ్దమును గ్రహింప జాలదుగదా! అట్లే నానారూప విలాసములును చక్షురింద్రియము మూలమున హృదయంగమము లగుచున్నవి వీటిలో అమూర్తములగు భావములకు అమూర్తమగు మనస్సే ఉపాధి. అమూర్తములయ్యు వాగ్రూపమున పరిణతములైన నామముల (పలుకుల)కు శబ్దము ఉపాధి ఇది శ్రవణేంద్రియ గ్రాహ్యము. అంతరింద్రియమాత్రోపాధికమైన భావమునకంటె విలక్షణము. ఇక రూపజగ మంతయు మూర్తమే. కావున, రూపము తత్తద్ద్రవ్యోపాధికము. ఆ యా పదార్థములు చక్షురింద్రియమాత్ర గోచరములే అగుట చేత, భావ వాఙ్మయములకన్న రూపము భిన్నము. ఇచ్చట వాగ్రూపము శ్రవణేంద్రియమాత్ర గ్రాహ్యమే అగుటచేతను, ఏతదితర ద్రవ్యోపాధిక రూపము నేత్రేంద్రియగ్రాహ్య మగుటచేతను ఈ రూపమునకు సిద్ధించిన విశేషభేదము గుఱుతింప దగినది. కాగా ప్రస్తుత రూపము మూర్తమై చక్షుర్గోచర మగునట్టిదని పిండితార్థము. మఱియు ఇంద్రియ గోచరము లగు అయ్యై విషయముల నామౌచిత్యమునుబట్టి చూచినను, శబ్ద స్పర్శ రూప రస గంధములలో చక్షుర్విషయమై దర్శనక్రియా యోగ్యమైన రూపము, కంటిచే చూడదగు ఆకార సౌందర్యమనియే ప్రస్ఫుట మగుచున్నది. ఇట్టి "రూప" శబ్దమును భావములపట్లను, శబ్దములపట్లను ప్రయోగించుకొన్నను అది యథార్థము కాక ఉపచారమాత్రమే అగుననుట విద్వాంసు లెఱుంగనిది కాదు.

శిల్పి హృదయములో తోచిన రసప్రపంచము, అత్యద్భుత భావ రామణీయకము, సౌందర్య విలాసము వెలుపలి జగత్తున (స్థూలజగమున) కళావిలసిత మైనప్పుడే అది లోకోపకారకము కాగలదు. అంతఃకరణో పాధికమైన భావసౌందర్యము ఒక్క భావయితకే తప్ప, పెఱవారికి అనుభావ్యముకాదు. లోకమునకు ఆ రసభావములను చవిచూపవలెనన్న వాటికి ఒండొక ఉపాధిని సృష్టింపవలసియున్నది. శబ్దోపాధి నాశ్రయించి వాటికి ప్రచారము సంపాదించుట ఒకమార్గము. అంతకన్నను సమాకర్షణీయ మగు పథము రూపోపాధి నాశ్రయించి చేయునది. ఈ రెంటికిని శ్రవ్య దృశ్య భేదము కలదని గ్రహింపవలయును. శబ్దము శ్రవ్యము, రూపము దృశ్యము. దృశ్య శ్రవ్య కావ్యములలో శ్రవ్యమునకన్న దృశ్యమునకు ఎక్కుడు ప్రాధాన్యము, ప్రయోజనము ఉన్నట్లే, ఇచ్చటను శ్రవ్యమగు శబ్దమునకన్న దృశ్యమగు రూపమునకు మనోరంజనాది పరమ ప్రయోజనాధిక్యము ఉన్నది. మఱియు శ్రవ్యము సారస్వతోపాసకులకు, అక్షరకుక్షులకు మాత్రమే గ్రహింపదగినది. దృశ్య మట్లుకాదు. నేత్రేంద్రియముగల ప్రాణిమాత్రమునకెల్ల దర్శనీయము; విశిష్ట విజ్ఞాన సంపత్తిగల మనుష్యులకెల్ల విజ్ఞేయము. రూపము దర్శనీయతచేతనే తన ప్రయోజనము పూర్తి యయినట్లు తలంపదు. ఆత్మగుణోచితమైన భావసంపదను ద్రష్టకు రేకెత్తించి, ఆతని ఆంతరంగిక సంకల్ప సంస్కారములను మేలుకొల్పును. సంస్కార ప్రబోధముతోపాటు నిర్భరానందమును గలిగించి, కళాపిపాసువునకు అమర విభూతిని గూడ ప్రసాదింపగలుగుట నిక్కము; ధ్యానావస్థలోనున్న బుద్ధదేవుని ప్రతిమను చూచినచో మనకు కల్గునది కేవలము ఆనందమును (సద్యఃపరనిర్వృతి) సౌందర్య తృప్తి యునేకావు. బుద్ధునివలె మనమును ఇంద్రియాతీతమైన ఆత్మభావమును పొంది అమృతులము కావలయునను సంకల్పముకూడ గలిగితీరును.

# శిల్ప దర్శనము

..నము నిత్యము దేవాలయమునకు పోయి దేవతావిగ్రహమును దర్శించు నప్పుడును మన హృదిలో ఉన్నతములగు పవిత్రభావములే సంచారము చేయుననుట అందఱికి అనుభవమే. ఈ అనుభూతి ప్రబోధములు అన్ని విధములగు శిల్పరూపములను గాంచునప్పుడును- వాటియందలి రసభావ రామణీయకములకు తగినట్లుగా మనహృదయ సంస్కారములనుబట్టి కలుగు చుండును. రూపశిల్పమున ఇంతటి మహిమ నెలకొని యుండుటచేతనే పలురీతుల రూపొందిన చిత్రజగత్తు, విగ్రహ ప్రపంచము (బొమ్మలు ప్రతిమలు మున్నుగా గలవి) ఆబాలగోపాలము..సందర్శనీయములై జ్ఞానికి గాని అజ్ఞానికిగాని పరమానంద ప్రదాన మొనర్ప గలుగు చున్నవి. మనమొక విషయమును పిన్నలకుగాని, పెద్దలకుగాని బోధింప వలెనన్న చిత్తరువుల మూలముననే సులభముగను, హృదయాకర్షకము గను ఆ పనిని చేయగలుగుచున్నామనుట అనుభవసిద్ధము.

తాత్త్విక లోకమునుబట్టిమాచినను రూపప్రాధాన్య ప్రయోజనముల మహత్త సువ్యక్తము కాగలదు. ప్రపంచ తత్త్వమును, జగదాత్మ రహస్యమును గూర్చిన సూత్రములను ఎన్నింటిని జెప్పినను విన్నను విశ్వరూప సందర్శనము కానిది మానవ హృదయమునకు సందేహ నివృత్తియు, సత్యోపలబ్ధియు కలుగదు. ఇందులకు అర్జునుడే ప్రబల దృష్టాంతభూతుడు. కృష్ణభగవానుడు సాంఖ్యయోగాధ్యాయము మొదలు తొమ్మిది అధ్యాయముల వఱకును జగద్రహస్య సూత్రములను, దేహాత్మ తత్త్వమును, తత్సంబంధమైన కర్మ జ్ఞాన రహస్యములను, ఆత్మవిభూతి మాహాత్మ్యమును ఉగ్గడించినను విశ్వరూప సందర్శనము చేయనిది ఆతనికి సందేహ నివృత్తి కాలేదు. "ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ" అని అంజలించి ఆ నిరాకారుని నానా రూపములను కాంచిగాని, కృష్ణమాహాత్మ్యమును భావించుకొనలేక పోయినాడు. ఇది సమంజసము

కూడ. నరునకు సకలసంశయ నివారణమునకుకాని, నిరతిశయానందాను భూతికికాని, స్వరూప సందర్శనముతో సరియైనది వేఱొక ప్రమాణము లేదు. ఇంద్రియప్రత్యక్షముకాని అతీంద్రియ విషయమునుకూడ ఆత్మ ప్రత్యక్షము చేసికొన్నకాని జిజ్ఞాసువు తృప్తి పొందడు. విశ్వాత్ముని పక్షమున ఈ అర్థమును "అపరోక్షానుభూతి" అను పదముతో పేర్కొని ఉన్నారు. ఉపనిషత్తులు "దర్శనము" అన్నవి. ఈ ఆత్మస్వరూప దర్శనముచేకాని సంశయనివృత్తి పూర్వక నైష్కర్మ్య సిద్ధిని కలిగించు జ్ఞానప్రభాపటలి తేజరిల్లదని ఉపనిషత్తు•. ఈదర్శనార్థము అంతర్ముఖము.

నానారూపముల భాసిల్లు సృష్టిని అనుకరించుటయే శిల్పిచంద్రుని కర్తవ్యము. విశ్వస్రష్ట సృష్టికి ప్రతిసృష్టి ఒనర్చి శిల్పి లోకసంగ్రహ ముతోపాటు జగత్ప్రవృత్తిని సంపాదించుచున్నాడు. "ఏకం సత్" అన్న ఈశ్వరకళా విభూతిని "ఏకం రూపం బహుధా యః కరోతి" అను శ్రుతి ప్రకారము బహుప్రకారముల చిత్రించియు, రూపొందించియు తత్తదుపాసక - అభిరుచులనుబట్టి తత్త న్మానసోన్మీలనమును చేసి, హృదయ మునకు ఏకరూపమైన అంతరాత్మయొక్క సందర్శనమునకు తోడ్పడుటతో భారతీయ శిల్పవైశిష్ట్యము ప్రకటమగుచున్నది. అనాది కాలమున శిల్ప ఋషులు ఈ రూపయోగముచేతనే మానవ సంఘమునకు సంతరణభిక్షను పెట్టినట్లు శిల్ప కథా కలాపము చెప్పుచున్నది. నానా మతములకు సంబం

• "భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వ సంశయాః,
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే."

సాధకునికి పరబ్రహ్మ దర్శనము యినప్పుడు హృదయగ్రంథి భేదింపబడి, సర్వసంశయములు నశించి, కర్మలెల్లను క్షీణించిపోవును.

—ముండకోపనిషత్తు.

బడినాడు. కావున ఎక్కడెక్కడ వాస్తుపురుషుని పూజించినను, విశ్వకర్మ బ్రాహ్మణ వంశజుడైన శిల్పిని పూజింపవలయును.

ఇంకను వావిళ్ళవారు ప్రకటించిన మయబ్రహ్మవిరచితమగు "మయ వాస్తు శాస్త్రము''నందు ఇట్లు కలదు.

"ఆదిమూర్తిస్స్వయం శిల్పీ, న భేదః శ్రుణు పార్వతి,
త్రిసంధ్యావందనాచ్చైవ, గాయత్రీ వేదపాఠనాత్.
తజ్జిహ్వా వేదసంపన్నా, తత్కర్మదీక్షయా గురుః,
శిల్పినో హృదయం బ్రహ్మ, చంద్రసూర్యౌ చ చక్షుషీ.
హస్తౌ హరిహరౌ చైవ, సర్వాంగం సర్వదేవతాః,
మణిబంధద్వయం చైవ, గణేశ షణ్ముఖ స్తథా.
కరయో స్సర్వతీర్థాని, గంగా యమునా సరస్వతీ.''
''శిల్పిపూజా శిలాపూజా. శిల్పిదుఃఖేన దుఃఖితా
శిల్పినా కల్పితం దైవం, శిల్పిబ్రహ్మమయం జగత్.''
'శిల్పినం పూజయేత్ పూర్వం, తస్య లక్షణ ముచ్యతే,
''శిల్పినమస్క్రియా పూర్వం దేవరూపధరో యతః."

పవిత్రుడగు శిల్పాచార్యుని గౌరవము నుగ్గడించు ప్రమాణములు పెక్కులు శ్రీనిరంజనశాస్త్రిగారి "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము'' శిల్పకాండములో చూడవచ్చును. ఇక ప్రకృతము ననుసరింతము.

శిల్ప మనునది భావమునందును, వాఙ్మయమునందును కూడ నెలకొనిఉన్నను, అందలి సౌందర్యముపట్ల శిల్పశబ్దము ఔపచారికముగ మాత్రమే ప్రయోగింప బడుచున్నది. రస భావ సౌందర్యముల మనోహరాభివ్యక్తి రూపమున ముద్రితమైనప్పుడే శిల్పశబ్దము అందు రూఢము కాగలదు. శిల్పమన్నంత మాత్రమున మనకే విగ్రహాది

నిర్మాణమో, లేక యే చిత్తరువులో, బొమ్మలో, కర్మకౌశలము నెఱపు మఱే పనితనమో బుద్ధ్యారూఢ మగుచున్నది కాని, వాఙ్మయ సౌంద ర్యముకాని, భావవిభూతికాని తోచుటలేదు కదా। కవి ఎంతటి గొప్ప శిల్పకల్పనముతో గ్రంథ నిర్మాణ మొనర్చినను, ఆతనిని శిల్పిఅనుట కాని, తత్కృతిని శిల్పకృతి అనుటకాని వ్యవహారమున కానము. కావు ననే సాయణులు "ఏభి శ్శిల్పైః" అను మంత్రమును భాష్యీకరించు పట్టున "శిల్పైః—కర్మకౌశలైః" అని శిల్పమును కర్మకౌశలమునుగా వ్రాసి ఉన్నారు. ఇచ్చట కర్మశబ్దమును గూర్చియు కొంత మీమాంస. మానసిక వాచిక క్రియలుకూడ కర్మపద వాచ్యములే ఐనను, కర్మశబ్దమునకు రూఢ్యర్థము హస్తాద్యవయవ విశేషములచే నిర్వహింపబడుకార్య విశేషము అనుట సర్వసాధారణము. "కర్మేతి హస్తయోః" అని ఉపనిషత్తు. కర్మము చేతులయందున్నది. అనగా చేతులతో చేయవగినదే కర్మమని భావము. ఈ ప్రసిద్ధి వ్యవహారమునకూడ కానవగును. లోకమున ఒకని "ఏమి పని చేయుచున్నా"వని అడిగినచో నిరుద్యోగి అగు ఆతడు "ఏమియు లేద"ను చున్నాడు. అనగా ఇక్కడ అవయవ విశేషము లచే చేయ తగినపని చేయుట లేదనియే భావముకాని, శ్వాసప్రశ్వాసల పనికాని, మానసికాలోచనల పనిగాని, మాటలాడు పనికాని చేయుటలేదని అర్థము కాదు గదా। కాబట్టి కర్మకౌశల మనగా హస్తకర్మ కౌశలమనియే సిద్ధమగుచున్నది. జగచ్ఛిల్పిపక్షమున ఐనచో మానసికమైన సత్యసంక ల్పాది కర్మకౌశలము కావచ్చును. అచ్చటనైనను లౌకికశిల్పి శిల్ప నిర్మాణ విధానమునుబట్టి ఔపచారికముగ హస్తకౌశలమనియు కావచ్చును. సాయణాచార్య హృదయమును శిల్పశబ్దమునకు కర్మకౌశలమునే భావించు చున్నది. కర్మ కౌశలమనుటచేత సామాన్యములగు పనులయందలి నేర్పు మాత్రమే అనుకొనతగదు. సృష్ట్యాత్మకమగు కర్మమని భావము. రమ ణీయమును, ప్రయోజనకరమును, ఆనందదాయకమును అగు నూత్న

సృజనశక్తితో కూడిన కర్మకౌశలమును శిల్పమనవలయును. "ప్రజాపతి శిల్పముల చేత భూమిని భార్యము కలదానినిగా చేసెను, ఆకాశమును చంద్ర తారకల చే సురూపముగా చేసెను" అన్నప్పుడు రమణీయమును సప్రయోజనమును అగు సృష్టికర్మమే మనకు వ్యక్తమగుచున్నది కావున, శిల్పశబ్దమునందలి ఈ రహస్యార్థమును సూక్ష్మదృష్టితో భావింపవలయును. "కవేః కర్మ కావ్యమ్" అన్నప్పుడు కవి చేయు దంతధావన భోజనాది కర్మలు కావ్యములు కాక, విశిష్టమగు రసభావద్యోతక రమ్యతర శబ్దార్థ రచనమే కావ్యము అయినట్లు, ఇచ్చటను శిల్పి చేసెడు రసభావములతో కూడిన రమణీయ రూపకల్పనమే కర్మకౌశలయుక్తమగు శిల్పము కాగలదు. అట్లు కానిచో సామాన్యమగు పనితనపు నేర్పునుకూడ శిల్పమే అనవలసి వచ్చును. కవులు కానివారి శబ్ద రచనమునకు కావ్య ప్రసిద్ధి చెల్లనట్లు, శిల్పులు కానివారి సామాన్య కర్మ కౌశలమునకును శిల్పప్రసిద్ధి చేకూరదు. సామాన్యుల శబ్దరచనమునందును, హస్తకర్మమునందును కావ్యగుణము, శిల్పసౌందర్యము ఆభాసించిన ఆభాసింప వచ్చును. కావున శిల్పములోని కర్మకౌశలము, కావ్యములోని శబ్దవ్యాపారము విశిష్టములు.

మఱియు "శిల్పం కర్మ కలాదికమ్" అను నిఘంటు వాక్యము శిల్పశబ్దమునకు కర్మ పారతంత్ర్యమునే వక్కాణించుచున్నది. కావున ఆ యా ద్రవ్యోపాధులయందు మహత్తర రూపకల్పనము చేయు ఈ హస్త కౌశలమునే శిల్పశబ్దమునకు రూఢ్యర్థముగా భావించి ఉన్నారు. ఇయ్యది సముచితమును, సరసమును కూడ. కనుక శిల్పయోగము కర్మయోగము. కర్మము జగత్ప్రవృత్తి సంపాదకము ॥ సత్తామాత్రమగు పరాశక్తి ప్రపంచాకార పరిణతి నిచ్చించి, కర్మోన్ముఖమయి క్రియాశక్తిగా రూపొందుట సృష్టి ధర్మము. కావున ఈ క్రియాయోగము యొక్క రహస్యము విజ్ఞేయము. క్రియాశక్తి అన్నంత మాత్రమున జ్ఞానశక్తి

లేనిదని భావింపరాదు. కేవల జ్ఞానశక్తినేకాక, ఇచ్ఛాశక్తినికూడ అంతర్భూతము చేసికొన్న శక్తిత్రయముయొక్క కూటమే యిది. ఈ త్రికూటమునందలి మూడు శక్తులును భిన్నములు కావు ఒకటి ఇంకొక దానిని వీడి ఇవి లీలానాట్యము చేయుటలేదు. మఱి, ఒకటి వేఱొకదానితో పెనవేసికొనగా, చక్రనేమి క్రమమున (చక్రముయొక్క అంచు తిరుగుట వలె) ఈ పయనము సాగుచున్నది. మున్ముందు, అనంత జ్ఞానశక్తి, అందుండి ఇచ్ఛాశక్తి, దానినుండి క్రియాశక్తి. తిరిగి ఈ క్రియాశక్తినుండి ఇచ్ఛాశక్తి, దానినుండి జ్ఞానశక్తి. ఇట పరిసమాప్తి. "జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి." (జ్ఞానము నంది పరమ శాంతిని పొందును) వ్యవహారమున ఈ శక్తులను మూటినిగా. లేక అయిదింటినిగా (పరాశక్తి ఆదిశక్తులతో కలుపుకొని, పేర్కొనుచున్నను ఇవి ఒక్కదాని రూపాంతరములే బీజము, మొలక, మొక్క, చెట్టు—అను నామములు ఎట్లు ఒక్క వృక్షమునుగూర్చియే భిన్నకాలములందు ప్రయోగింపబడుచున్నవో, అట్లే ఏకరూపమగు అనంతశక్తి యందును ఆ యా పేరులు ఆయా విధానములందు ప్రయోగింప బడుచున్నవనుట తత్త్వము. ఇచ్చట ఈ విచిత్రగతి ఆరయ తగినది. అనంత జ్ఞానశక్తినుండి, సృష్టి, మఱల అందే లయము. (జ్ఞానే మౌనం) ఆద్యంతములు తుల్యములు. మధ్యంగతమగు క్రియాశక్తియందు లీలాలాస్యము; సౌందర్య క్రీడ. ఇచ్ఛాశక్తి ఉభయ శక్తులకు సహకారిణిమాత్రము.

శిల్పి హృదయము జ్ఞానరస ప్రపూర్ణము. ప్రవృత్తి ధర్మమును కోరిన అద్దానినుండి క్రియాశక్తియుక్తమగు నానా రూప శిల్పకళా ప్రకటనము. ఈ క్రియానాట్యమునుండి ఉపసంహృతిని—లేదా, తన్మూలమును, ఆకాంక్షించు ఇచ్ఛాశక్తి ఇది జ్ఞాన సంపాదకము. విశ్వశిల్పినుండి సామాన్యుని వఱకు ఈ ధర్మప్రసారము తారతమ్యమున అభివ్యాప్తి.

ఈ శక్తిత్రయమును భక్తి జ్ఞాన కర్మములుగా భావించి ఉన్నారు. భక్తియు కర్మయు జ్ఞానము నొదవించుచున్నవి. ఇచ్ఛ (భక్తి) లేనిది ప్రవృత్తి కలుగదు. ప్రవృత్తి క్రియారూపము. కర్మముచే జ్ఞానసిద్ధి. "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకా దయః" అనుచున్నది గీత. భక్తి లేనిది సాధన ప్రబలదు. సాధన లేనిది జ్ఞానోదయము కాదు. కావున ఈ త్రికముయొక్క సంబంధము విచిత్రము. కాబట్టియే ప్రస్తుతమగు మన కర్మయోగము (క్రియాశక్తి) భక్తి జ్ఞానయోగములను అంతర్భూత మొనర్చు కొన్నదగు చున్నది.

సూత్రప్రాయముగా చెప్పికొన్న యీ సిద్ధాంతములమీద మన రూప తత్త్వము ఆధారపడి ఉన్నది. ఈ దృష్టిని అవలంబించియే భారతీయులయొక్క వివిధ దేవతామూర్తుల సృష్టిశిల్ప నిర్మాణము విస్తరిల్లినది. మన భరతక్షేత్రమున శిల్పదేవత మధుర లాస్య మొనర్చి "భారతము కర్మభూమి" అని ప్రసిద్ధిని గడించినది యజ్ఞాది క్రతుకర్మల ఆధిక్యముచేత మాత్ర మేకాదు. పవిత్రమును, కర్మశక్తియుక్తమును, మోక్ష ద్వారమును అగు ఈ శిల్పకర్మ కలాపముచేతకూడ. ఇంకను సూక్ష్మముగ ఆలోచించిన యజ్ఞమునకును శిల్పమే మూలము కావున, కర్మభూమియన శిల్పకర్మభూమి అనియే స్పష్టము కాగలదు. యజ్ఞశిల్పముల సంబంధమునుగూర్చి వేఱొకచో ముచ్చటింపబడినది. ఇంకను వలసిన విస్తరము గ్రంథాంతరములందు కాననగు. భగవదుపాసనను మానవులలో ప్రబల జేయుటకును, ప్రజానీకమును కర్మశక్తియుక్త మొనర్చుటకును మన శిల్పఋషులు అవలంబించిన శిల్పయోగముయొక్క మహత్త్వ యిట్టిది. "స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప" అన్నట్లు ఆధునిక యుగమున ఈ రూపయోగముయొక్క రహస్యములును, సంప్రదాయములును భ్రష్టములై పోయినను, అటనట ఈ సూత్రములు,

అవ్వాని భాష్యములును నిశ్శేషములు మాత్రము కాలేదు. శిల్పమునందలి ఈ ప్రపంచతత్త్వ రహస్యోద్ఘాటన శక్తి ఈశ్వర దర్శనమునకు ప్రకృష్ట సాధనమై శిల్పవేదమునకు దర్శన శాస్త్రత్వమును ఆపాదించి, మనలను ఎల్లరను ఆత్మదర్శన యాత్రికుల నొనర్చుచున్నది. సచ్చిదానందములకు విహరణ స్థానమై, మఱల ఆ యనంత సచ్చిదానందముల సంవేదనమునకు ద్వారమైన ఈ రూపయోగము అనన్య యోగము.

రూపప్రకటనము చేయుటలో ఉపాధిభూత మగునది కొంత ద్రవ్యజాతమని చెప్పికొంటిమి. సువర్ణాది నానా ధాతువులయందును, మృద్దారు శిలా ద్రవ్యములయందును, పట కర్గజా (కాగితము) దులయందును రూప విన్యాసము చేయుట శిల్పాచార్య సంప్రదాయ సిద్ధము. ఈ విషయమును గూర్చి రుద్రయామళము—

"మృదా కాష్ఠేన లోహేన పాషాణైః పారదేన వా
రచయన్తి విచిత్రాణి రూపాణి వివిధాని యే
దివ్యాన్ భౌమా నంతరిక్షాన్ భావాన్ సందర్శయన్తి యే,
పంచాలా స్తే సదా పూజ్యాః ప్రతిమా విశ్వకర్మణః."

—రుద్రయామళ వాస్తు తంత్రము.

ఎవ్వరు మట్టి, కొయ్య, పంచలోహము, పాషాణము - అను వాటి చేత చిత్ర విచిత్రములగు రూపములను సృష్టించుచున్నారో, దైవ, మానుషాంతరిక్షమయములగు భావములను ప్రదర్శించు చున్నారో - విశ్వకర్మకు ప్రతిబింబ రూపులైన ఆ పంచాలురు(శిల్పులు) ఎల్లవేళల పూజింపదగినవారు. పంచ శిల్పములచేత లోకము నలంకరించువారు గనుక శిల్పులకు పంచాల బ్రాహ్మణులని పేరు. వీటిని గూర్చి అగ్నిపురాణము మొదలగు గ్రంథముల యందును ఫలకథనముతోకూడ విస్తరము కలదు.

"మృణ్మయా ద్దారుజే పుణ్యం దారుజా దిష్టకా భవేత్
ఇష్టకోద్ధాచ్ఛైలజే స్యాద్ధేమాదే రధికం ఫలమ్"
—అగ్ని పురాణము 38 వ అధ్యాయము. 32-33

"సువర్ణ రూప్య తామ్రా స్యు ర్దారు లేఖాని శ క్తితః
చిత్రం చేతి వినిర్దిష్టం ద్రవ్య మర్చాసు స_ప్తధా.
సువర్ణం పుష్టికృ ద్విద్యా ద్రజతం కీ_ర్తివర్ధనమ్
ప్రజావివృద్ధిదం తామ్రం శై లేయం భూజయావహమ్
ఆయుష్యం దారవం ద్రవ్యం లేఖ్యచిత్రే ధనావహే."
—సమరాంగణం. ప్రతిమాలక్షణం 76 అధ్యా.

వస్త్రము, కాగితము మున్నగువానియందు ఏర్పఱచు రూపము వర్ణ (రంగు) మేళనాత్మకమగు రేఖావిన్యాసము మాత్రమే. రూపధర్మములైన మెట్ట పల్లములు కాని, స్థూలత్వ కృశత్వములుకాని వర్ణఘటనచేతనే ఇందు వ్యక్తము కావలయును. సువర్ణము, రజతము, తామ్రము, పిత్తళము, దారువు, శిల మున్నగు వానియందలి రూపము స్వతస్సిద్ధమైన రూపప్రకృతిని కన్పఱచును దానికా వర్ణమేళనముకూడ చేకూరిన ఆశోభ చెప్ప వీలుకాదు. ఇందు వర్ణ మేళనముచే చేసెడు శిల్పమంతయు చిత్రకర్మము. ధాతువుల యందలి, పాషాణాదుల యందలి రూపసృష్టి తత్తత్పదార్థ వాచక విశిష్ట శిల్పము. ఈ రెండును సౌందర్యానంద రసనిధానములే. రెంటియందును త్వాష్ట్రి కళావిభూతి రూపాధిపత్యమున తేజరిల్లుచుండును. "త్వష్టా రూపాణా మధిపతిః". ఈ త్వష్టృతేజము దివ్యవిలసనమునందనిది సురుచిర రూపశోభా సంపత్తి మూర్తీభవింపదు. ఇయ్యది రూపమహిమ!

"రూప మేవ త చ్ఛిల్పమ్"

# స్థాపత్య వేదము

"ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేద మాత్మభూః.
స్థాపత్యం చాసృజ ద్వేదం క్రమా త్పూర్వాదిభి ర్ముఖైః."
—భాగవతం. స్కం, 6. అ. 12

బ్రహ్మ తన నాలుగు మోములనుండి క్రమముగా ఋగ్యజుస్సామాథర్వములను నాలుగు వేదములను సృజించి, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేద, స్థాపత్య వేదములను గూడ అపూర్వాది ముఖములనుండియే సృష్టించినట్లు భాగవతపు పురాణము చెప్పుచున్నది ఈ నాల్గువేదములు ఋగాది వేదములకు ఉప వేదములు అయినట్లు "చరణవ్యూహ" మను గ్రంథమునందలి దిగువ వ్యాఖ్యానముచేతను స్పష్ట మగుచున్నది.

"ఆయుర్వేద శ్చికిత్సాశాస్త్రం ఋగ్వేద స్యోపవేదః.
ధనుర్వేదో యుద్ధశాస్త్రం యజుర్వేదస్యోపవేదః.
గాంధర్వవేద స్సంగీతశాస్త్రం సామవేదస్యోపవేదః.
స్థాపత్యవేదో విశ్వకర్మాది శిల్పశాస్త్రం అధర్వవేదస్యోపవేదః."
—చరణవ్యూహే- చతుర్థఖండః.

వేదములు మొదలుగాగల భారతీయుల శాస్త్రములు అన్నియు పరమేశ్వరుని సన్నిధినుండి వచ్చినట్లు చెప్పబడుచున్నవి. మనుష్యకర్తృకములైన శాస్త్రములను పరిశీలించినను, అవికూడ అనాది కాలమున ఏ దేవుని నుండియో ఋషులకు ఉపదిష్టములైనట్లు ఉపోద్ఘాతములందు కాంచుచుందుము. ఏ గ్రంథకర్తకాని తాను రచించు శాస్త్రముయొక్క కర్తృతమును తనకు ఆరోపించుకొనడు. ఆ రహస్యములు సనాతనములనియు

వాటినే తాను నూతన భాషాబద్ధము లొనర్చు చున్నాడనియు చెప్పుకొనుట సహజము. ఇది భారతీయుల ప్రాచీన వాఙ్మయమునకు ఉన్న ప్రత్యేకత.

ఉపవేదములని చెప్పబడిన యీ నాల్గింటికికాని, తదితరములగు శాస్త్రములకుకాని, విద్యలకుకాని వేదమే మూలభూతము. వేదములో బీజప్రాయములుగాఉన్న అంశములను శాఖోపశాఖలగునట్లుగా విస్తరింప జేసి, శాస్త్రములుగను, విద్యలుగను ప్రాచీనులు రూపొందించిరను విష యము చక్కగా ఋజువగుచున్నది. శాస్త్రమను మాటకంటెను, వేద మనుమాట పవిత్రముగను, ప్రాచీనముగను భావింపబడుటచేతను, మానవ జీవిత సంతరణమునకు ఎక్కువగా ఉపకరించున వగుటచేతను పై శాస్త్రములను ఉపవేదములుగా పరిగణించి ఉన్నారు. శారీరక రోగము లను పోగొట్టి ఆయుర్వృద్ధిని గలిగించును కావున, వైద్యశాస్త్రమును ఆయుర్వేదమనియు, దుష్ట నిగ్రహ శిష్ట పరిపాలనములద్వారా ఆత్మరక్షణ దేశరక్షణములకు ఉపయోగించు యుద్ధశాస్త్రమును ధనుర్వేదమనియు, నాదబ్రహ్మోపాసనము ద్వారమున పరబ్రహ్మ సాయుజ్యమును చేకూర్చు సంగీతశాస్త్రమును గాంధర్వవేద మనియు, ఐహికాముష్మిక జీవనము సాగుటకును, పరమార్థప్రాప్తికిని వలసిన సర్వసాధనములను సిద్ధము చేయుటకు ఉపయోగించు శిల్పశాస్త్రమును స్థాపత్య వేదమనియు అనుటలో చక్కని ఔచిత్య మున్నది. ఏ వేదవిషయము ఆచరణమునకు రావలె నన్నను శిల్పము ప్రధానము కావున, అన్ని వేదములకును స్థాపత్యవేదము ముఖ్యభూతమైన వేదమై ఒప్పుచున్నది. ఈ వేదములు ఉపవేదములనుట చేత ప్రధానవేదములతో వీటికి కొంత సంబంధము ఉండునని తెలియు చున్నది. వేదోపవేదములకు కల సంబంధమును నిరూపించు వేదమంత్ర ములను ఇచ్చట నిరూపించి, వీటి ఉపవేదత్వమును సాధించుట విస్తర మగును కావున, స్థాపత్య వేదవిషయమునే కొంత విచారింతము.

* స్థపతి అనగా శిల్పి. ఆ స్థపతికి సంబంధించిన కర్మ స్థాపత్యము; అనగా శిల్పము కాబట్టి స్థాపత్యవేదమనగా శిల్పవేదమని అర్థము. ఈ శిల్ప వేదమును అథర్వ వేదమునకు ఉపవేదముగా చెప్పియుండుటచే ఆ రెంటికిని కొంత సంబంధము ఉండునను అంశము "శిల్పోపనిషత్తు" లోని "తత్రాథర్వణ శ్శిల్పభూయిష్ఠ మత్యన్తమ్" అను వాక్యముచేతను వ్యక్తమగుచున్నది అథర్వవేదమునందేకాక తదితర వేదములందును శిల్ప ప్రశంస పలుతావుల కన్పట్టుచున్నది. కొన్ని ఈ గ్రంథమున ఉదాహరింపబడినవి. శస్త్రచికిత్స మున్నగువాటి విషయమునను, విశేషించి యుద్ధోపకరణ నిర్మాణ విషయమునను, శిల్పము లేనిదే ఆట సాగదు కావున, ఆయుర్వేద ధనుర్వేదములుకూడ కొంతభాగము స్థాపత్య వేదములోనే అంతర్భూతములు కావలసివచ్చెను. ధనుర్వేదము ముఖ్యాతిక భాగము శిల్ప వేదములోనే ముడుచుకొనక తప్పదు. ప్రకృతమున ఈ స్థాపత్యమును వేదమనుటలోని సామంజస్యమును, తత్త్వమును ఇంచుక విచారించి, పిమ్మట స్థాపత్యవేద స్వరూపమును అవలోకింతము.

"విద, జ్ఞానే' అను ధాతువునుండి పుట్టిన వేదశబ్దము జ్ఞానరూపార్థమును ప్రకటించుచున్నది. ప్రకృతి పూరుషులయొక్క పరమతత్త్వ దర్శనమున ప్రకృష్టసాధనమగుట జ్ఞానముయొక్క సామాన్య ధర్మము. అనగా ఐహికాముష్మిక పారమార్థిక క్రియాతంత్రముల సమ్యగ్దర్శనముచే

---

* స్థపతిః స్థాపనాయార్హః, వేదవిచ్ఛాస్త్రపారగః,
స్థాపనాధిపతి ర్యస్మా త్తస్మాత్ స్థపతి రుచ్యతే."
—— మానసారము.

ఆ యా దేవతామూర్తులను స్థాపించుటకు అర్హతగల వేదశాస్త్రవేత్త స్థపతి అనబరగును. స్థాపించుటకు అధిపతియైనందున అతడు స్థపతి అని చెప్పబడుచున్నాడు.

జీవలోకమును ఉద్ధరింపజేయుటకంటె ఇతర కార్యము జ్ఞాన విజ్ఞానములకు లేదు. అగుటచే అట్టి జ్ఞానవిజ్ఞాన ధర్మప్రవచన మూలకముగా సురుచిర సంవేదనమును కూర్చుట వేదత్వము. ఈ వేదత్వమునే విద్యారణ్య స్వామి "ప్రత్యక్షానుమానములచే తెలియబడని ఉపాయమును వేదము ఎఱింగించుచున్నది కావున, అయ్యదియే వేదముయొక్క వేదత్వ'' మని తన వేదభాష్య భూమికలో ప్రకారాంతరముగ నిర్వచించియున్నాడు.

భారతీయమైన శాస్త్రజాత మంతయు పురుషార్థ పరతంత్రమై తన చారితార్థ్యమును వెల్లడించుకొనుచున్నది. పురుషార్థ దూరమైన ఏ శాస్త్ర విషయ లేశమునకును ఈ కర్మభూమిలో స్థానము లేదు పలికిన పలుకులో, తలచిన తలపులో, చేసిన చేతలో పురుషార్థ ప్రవణత వ్యక్తమగు చుండ వలసినదే. కానిచో భారతాంబ కినిసి అట్టివానికి తన కడుపున పుట్టు యోగ్యత లేదని శపించును. పరబ్రహ్మ పరతంత్రములైన మన వేదములుకాని, శాస్త్రములుకాని ఈ సూత్రమున గ్రుచ్చబడియే శిరో ధార్యము లగుచున్నవి. ప్రకృతమైన మన శిల్పవేదమునకు అట్టి ఐహికాముష్మిక పారమార్థిక పురుషార్థ పారతంత్ర్యము వలసినంత కన్పట్టు చున్నది.

మనుబ్రహ్మ మున్నగు శిల్పసూత్రకర్తలు శిల్పమను ఉత్కృష్ట పురుషార్థప్రాప్తి సాధనముగా వాకొని ఉన్నారు. ఋగ్వేద ప్రథమాష్టకములో సుధన్వఋషి పుత్త్రులగు ఋభువులు మరణధర్మము కలవారయ్యు శిల్పము నొనర్చి దేవానుగ్రహముచే అమరత్వమును అందుటయే కాక, అగ్నిష్టోమాదులయందు హవిర్భాగములను అందిరనికూడ చెప్పబడి యున్నది. ఇంకను దేవమూర్తి, దేవాలయములను నిర్మించిన శిలాచార్యుడు స్వర్గమునందును, విష్ణులోకమునందును శాశ్వతస్థితిని అందునని అగ్నిపురాణమందును, ఇతర శిల్పవాస్తు గ్రంథములయందును మనము

చదువగలము. అంతియేకాక, నిఖిలవైదిక లౌకిక యజ్ఞక్రియా నిర్వహణమునకును శిల్పమే మూలభూత మనియు, శిల్పవిజ్ఞానముచేత మానవుడు అనిర్వచనీయ సుఖానంద శాంతులను చూఱగొని తనతోపాటు లోకమును కూడ తరింపజేయ గలడనియు ఆదిమ శిల్పఋషుల విజ్ఞానసూత్రముల రహస్యము. ఆ దృష్టితోడనే శిల్పవేదద్రష్టలు విశ్వావలోకనము చేసినట్లు వారి సూత్రగ్రంథములు సాక్ష్య మిచ్చుచున్నవి. "సృష్టిశిల్పము" అను గ్రంథమున విశ్వసృష్టి రహస్యము ఉద్ఘాటిత మగుచుండ, "మనశ్శిల్పము"లో భావనాశిల్పము చర్చిత మగుచుండ, "సారస్వతశిల్పము" లో వాఙ్మయ శిల్పచాతుర్యము వెల్లివెతియుచుండ, తక్కుంగల ధాతు, లోహ, పాషాణ, దారు, సువర్ణాది సంబంధులగు శిల్పగ్రంథములలో హస్తకౌశలము నెఱపు కాయిక శిల్పకళా విభూతి ప్రకటమగుచుండ, త్రికరణముల సంశుద్ధికొఱకు, ఆ త్రికరణములచేత ఉపాసింప తగినది ఐహికాముష్మిక సూత్రబద్ధమగు విశాల విశ్వశిల్ప మగుటలేదా : అహో ! శిల్పదృష్టి ఎంత ఉన్నతము ! ! ఎంత విశాలము ! ! ! ఎంత గంభీరము ! ! !

నిఖిల * కళా స్వరూపుడగు పరమేశ్వరుడు శిల్పిఅనియు, ఆతని సృష్టి అంతయు శిల్పకళా మండిత మనియు వేదసూక్తములు పలురీతుల ఘోషించుచున్నవని మనవిచేయబడినది. పరిదృశ్యమానమైన యీ విశ్వమునకు సంబంధించిన సృష్ట్యాది కర్మలు నెఱపు విశ్వస్రష్ట నిఖిల కర్మాధి

---

* ఇచ్చట కళాశబ్దమునకు, కకారాది ళకారాంతమగు అక్షర విద్యా స్వరూపమును భావింపవలయును.

నాథుడగుటచే విశ్వకర్మ అనియు, ఆతడే సర్వశిల్పాధిపతి అనియు కీర్తించుట వేదహృదయము •.

విశ్వసృష్టి విధాతను విశ్వకర్మ అన్నట్లే శిల్పసృష్టిచేయు ప్రతివానినికూడ ఆ విశ్వకర్మ శబ్దముచేతనే వేదము మొదలుగాగల వాఙ్మయ ప్రపంచము పిలుచుచున్నది. జగత్తును సృష్టించినవాడు విశ్వకర్మకనుక, నూతన వస్తువుల సృష్టిచేయు శిల్పినికూడ విశ్వకర్మ అను బిరుదముచే పేర్కొనుట వింతకాదు. పై నుదాహరించిన "చరణవ్యూహము'' కూడ "స్థాపత్యవేదో విశ్వకర్మాది శిల్పశాస్త్రమ్" అని శిల్పాచార్యులకు సంబంధించిన శాస్త్రమునుగా స్థాపత్యవేదమును పేర్కొనుపట్ల, శిల్పిపర్యాయముగా విశ్వకర్మశబ్దమునే వాడి ఉన్నది. "విశ్వకర్మార్క సురశిల్పినోః" అను అమరకోశ నానార్థ వాక్యము కేవలము దేవశిల్పికే విశ్వకర్మ శబ్దము వర్తించు నన్నను, సాయణాదులును, పెక్కురు లౌకికవాఙ్మయ నిర్మాతలును, విశ్వకర్మ శిల్పి శబ్దములను పర్యాయములుగనే వాడిఉన్నారు. అట్లే త్వష్టృ శబ్దమునుకూడ విశ్వకర్మ శబ్దమునకు పర్యాయముగా ఉపయోగించుట భాష్యములందును,తదితర వాఙ్మయమునందునుకూడ కాంచనగును. నేటికిని కొన్నిదేశములందు (ఒరిస్సా, సంయుక్త ప్రాంతములందు) శిల్పులగువారి నామములచివర "విశ్వకర్మ" శబ్దమును బిరుదవాచకముగా జోడించి 'రామమోహన విశ్వకర్మా' మొదలగు రీతుల వ్యవహరించుట ప్రసిద్ధము విశ్వకర్మ శబ్దమువలెనే స్థపతి, ఆచార్య, శిల్పిశబ్దములను కూడ నామములచివర బిరుదములుగా ఉంచుకొనుట సామాన్యమే. వ్యవ

• "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషిర్హోతా నిషసాద పితానః.
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ. విశ్వకర్మా మనసా యద్విహాయా ధాతా విధాతా పరమోత సంధృక్.''
—తైత్తిరీయ సంహిత. కాం. 4. ప్ర. 6.

హారమునందుకాని, వాఙ్మయమునందుకాని ఇది సంప్రదాయ సిద్ధముగా యౌగికరీతిని అనుసరించి వచ్చినదే కాని, అజ్ఞతామూలకముగా ప్రవర్తిల్లినది కాదు

దేవశిల్పియగు విశ్వకర్మ మహత్తర నగరములను, పుష్పకాది విమానములను, నానావిధాస్త్ర శస్త్రములను సృష్టించి చెన్నొందినట్లు పెక్కు వర్ణనములు కలవు. మఱియు నిఖిల జీవస్వరూపములను సృజించు దేవుడు విశ్వకర్మ స్వరూపుడగు త్వష్ట అయినట్లు "త్వష్టా రూపాణా మధిపతిః, "త్వష్టా రూపాణి పిగ్ంశతి" మున్నగాగల యజుర్వాక్యములు నుడువు చున్నవి. నేటి లౌకిక శిల్పులును ఐహికాముష్మిక పారమార్థిక యాత్రా పథమును తరించు సాధనసామగ్రినే సిద్ధ మొనర్చి, మానవుని నిరతిశ యానంద జీవిత సంసిద్ధికి తోడ్పడుచున్నారు. ఈ విధమున ప్రాణిసృష్టి మొదలుకొని జీవన నిర్వహణావసర సాధనములను, మానవ సంతారక సాధనములను సంపాదించునది శిల్పమే అని రూఢి అగుచున్నది. అతి గహనమైన పారమేశ్వర సృష్టి ఆదిమ దివ్యశిల్పము. మానవ నిర్మిత మైన తదను కృతియు, జనజీవితము సాగిపోవుటకై ఊహచేత సృష్టించిన వస్తుసామగ్రియు లౌకిక శిల్పము ఈ శిల్పము మానవుని అన్నమయ, ప్రాణమయ కోశములను తృప్తి పఱచుటలోనే సార్థకముకాక, మనోమయ విజ్ఞానమయానందమయ కోశములనుకూడ సంతృప్తి పఱచి పంచకోశాతీతమును, అతీంద్రియమును, ప్రత్యక్షానుమానములకు సాధ్యము కానిదియుఅగు పరమార్థమును పొందించుటకును ఉత్తమసాధనమై ఒప్పు చున్నది. పదవ శతాబ్దమునకు చెందినవాడును "హోలాలు" నివాసియు అగు "కలియుగ విశ్వకర్మ-బమ్మోజు శిల్పాచార్యుడు" తాను నిర్మించిన దైవతమునకు దృక్సంస్కార, ప్రాణప్రతిష్ఠాది కార్యము లొనర్చి తద్ధ్యానముచేతనే ఈశ్వర సాక్షాత్కారసిద్ధిని అంది స్వయముగా కృతార్థుడైనట్లు

విజ్ఞులు వచించుచున్నారు. ఈ విధముగా ఎందఱు శిల్పులు, ఉపాసకులు తరించిరో మనము వ్రాసి ఉంచుకొన్నామా? శిల్పము మోక్షసాధన మను టకు ఎన్నెని దృష్టాంతములను చెప్పవచ్చును.

ఈ విధమైన శిల్పమునకు వేదత్వము అవ్యాహతమగుట ఆశ్చర్య మేమి? కేవల భౌతికశిల్ప ప్రచురమగు శిల్పవేదమును ఉపవేదముగా పరిగణించిన యుక్తమే కాని, నిరుపమానాధ్యాత్మిక మహిమానిత్వమగు శిల్పవేదమును వేదములకెల్ల వేదముగా భావింప వలయును. సృష్టి రహస్యమును, సృష్టి తత్త్వమును, అనంత బ్రహ్మాండ సృష్టికిని, ఆత్మ శరీర సృష్టికిని కల సంబంధమును వ్యక్తముచేయు ఈ "శిల్పదర్శనము" సుదర్శనము "శిల్పవేదము" కల్పకల్పాంతరస్థాయి.

## శిల్ప వేదాధ్యయనము

ప్రాచీనకాలమున శిల్పవేదముయొక్క పఠన పాఠనములు భూయి ష్ఠముగా ప్రచారమున ఉన్నట్లు శిల్పశాస్త్ర గ్రంథములచే తెల్లమగుచున్నది. పూర్వము "శిల్పవిద్యాలయములు" అను పేర శిల్పవిద్యను గఱపెడి గురు కులములు ఉండెడివి. వాటియందు శిల్పాధికారులగు శిల్పి బ్రాహ్మణ బాలురు ఎనిమిదవయేటనే ఉపనీతులై శిల్పవిద్యను, శిల్పకర్మను నేర్చెడి వారు. శిల్పవిద్యా గురుకులమున కులపతిగనో, లేక ప్రధానా చార్యుడు గనో ఉండెడి శిల్పాచార్యుడు ఋగ్యజురాది వేదములతోపాటు శిల్పవేద మునుకూడ అధ్యయనము చేయించుచు కర్మకౌశలమును చేకూర్చుచుండెడి వాడు. ఈ శిల్పవిద్యాలయములలో ఒక్క శిల్పమునే కాక, దానికి అంగభూతములుగ కావలసిన వాస్తు జ్యోతిషములను, ప్రతిష్ఠా యంత్ర మంత్ర రహస్యములనుకూడ బోధించి యుక్తకాలమున విద్యార్థులను స్నాతకవ్రతార్హులను ఒనర్చుచుండునట్లు—మయమతము, మయశిల్పము

మున్నుగాకల గ్రంథములవలన తెలియుచున్నది. శిల్పశాస్త్ర పరిజ్ఞానము, వివిధవస్తు తత్త్వ విజ్ఞానము లేక, పనులొనరించువాడు కర్మకారుడు అగునేకాని - శిల్పిఅనియు, శిల్పాచార్యుడు అనియు చెప్పబడ జాలడు. శిల్పికి శాస్త్రపరిజ్ఞానము, కర్మకౌశలము రెండును ఆవశ్యకములు అను టకు "సమరాంగణ సూత్రధారము" లోని ఈ శ్లోకములు చూడదగినవి—

"యస్తు కేవల శాస్త్రజ్ఞః కర్మ స్వపరి నిష్ఠితః
స ముహ్యతి క్రియాకాలే దృష్ట్వా భీరు రివాహవమ్.
కేవలం కర్మయో వేత్తి శాస్త్రార్థం నాధిగచ్ఛతి
సోఽచక్షురివ నీయేత విపశోఽన్యేషు వర్త్మసు."

— స్థపతిలక్షణ మను 44 వ అధ్యాయము.

కేవలము శాస్త్రమును చదివి క్రియాకౌశలము లేనివాడు శిల్పకర్మము ఒనర్చుపట్టున, పిఱికివాడు యుద్ధరంగమును కాంచి భయపడునట్లు తడ బాటు చెందును కర్మకౌశలము మాత్రము కలవాడై శాస్త్రార్థమును ఎఱుం గనివాడు గ్రుడ్డివానివలె ఇతర మార్గములవెంట స్పృహతప్పి పోవును. కావుననే "అష్టాంగలక్షణ"మను అనంతరాధ్యాయమున రాజగువాడు శాస్త్రవేత్తయు, కర్మకుశలుడును అగు శిల్పినే కర్మయందు ప్రవేశింప చేసినచో సుఖావహమగు వాస్తువు సిద్ధించుననియు, వేఱువిధము నిష్ప్ర యోజనమనియు దిగువ శ్లోకములు చాటుచున్నవి.

"అశాస్త్రజ్ఞ మకర్మజ్ఞం స్థపతిం యః ప్రయోజయేత్
న తస్య వాస్తు సిధ్యేత సిద్ధమ ప్యసుఖావహమ్.
తస్మాత్ కర్మచ శాస్త్రంచ యో వేత్తి ద్వితయం నరః
అష్టాంగమపి యో వేత్తి స రాజ్ఞ స్థపతి ర్భవేత్."

దీనింబట్టి స్థపతి అగువానికి స్థాపత్యవేద జ్ఞానము ఎంత అవసరమో తెల్లమగుచున్నది కదా. ఇందులకు ప్రతిశిల్ప గ్రంథమునుండియు వేలకొలది ప్రమాణములు దొరకుచున్నవి. శిల్పవిద్యాలయములందు కులపతులు ఈ విధముగ శిల్ప శాస్త్రోపదేశముతోపాటు చక్కని కర్మ నిర్మాణ దక్షతను అలవరచి, దేశకల్యాణమును సంపాదించిన కాలమున శిల్పవేదాధ్యయనము, శిల్పసృష్టికౌశలము భూయిష్ఠముగా ప్రచారమున ఉన్నట్లు గ్రహింపగలము. అట్టి ప్రచారమే లేకున్న శిల్పవేదము శాఖోపశాఖలై ఇంతగా విస్తరించి ఉండనేరదనవచ్చును. ఒకవ్యక్తి సంపూర్ణ మానవుడుగా సిద్ధి నందవలెనన్న అతనికి శిల్పకర్మాచరణము, శాస్త్ర పరిజ్ఞానము అలవడి ఉండవలసినదే. లేకున్న, వానికి కృతకృత్యత లేదు. ఈ విషయమునే "శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణ లక్షణమ్" అను సూక్తి ప్రవచించుచున్నది. మన ప్రాచీనాచార్యులు హస్త కర్మ కౌశలమునకును, మానసిక జ్ఞానమునకును చక్కని అనుసంధానమును కూర్చి సంఘమును సేవించి ఉండిరి. ఉత్తమ మానవుడు జ్ఞానవిజ్ఞానములను (మోక్షేధీర్ జ్ఞాన, మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః) రెంటిని సంపాదించి కృతకృత్యుడు కావలయునని మనవారు ఆచరణపూర్వకముగా నిరూపించినారు. శిల్పశాస్త్రాధ్యయనము, శిల్పకర్మాచరణము సన్నగిల్లిన—సన్నగిల్లుటయే కాదు నష్టప్రాయమైన యీ కాలమున వాటి గొప్పతనమును భావించుటకేని మనకు అర్హత లేకుండుటలో ఆశ్చర్యము లేదు. ఇక శిల్పవేదప్రచారముయొక్క క్షీణయుగ విచారమును ఆవలనుంచి ప్రకృతమున స్థాపత్య వేదస్వరూపమును ఇంచుక తిలకింతము.

ఋగ్యజురాది వేదములవలె ఈఉపవేదములు ఒక్కొక్క గ్రంథముగ మాత్రమే రూపొందిలేవు ఋగ్వేదమును చూతుము. అది మండలములుగను, అష్టకములుగను విభజింపబడి ఉన్నది. అట్లే ఇతర వేదములను

ప్రత్యేక ప్రత్యేక భాగములుగా విభక్తములై ఉన్నవి. ఆయుర్వేదము మున్నగు ఉపవేదములు అట్లు కావు. ఇవి పలువురిచే రచింపబడిన భిన్న భిన్న గ్రంథములై ఉన్నవి. వైద్యమునకు సంబంధించిన ఏ విషయములను చెప్పు గ్రంథమైనను ఆయుర్వేదములో అంతర్భూతమే. అట్లే సంగీతమునుగూర్చి చర్చించు పలుగ్రంథములు గాంధర్వవేద మనబడుచున్నవి. మన స్థాపత్యవేదముకూడ అట్లే అనేక శాఖలకు చెందిన శిల్ప గ్రంథముల యొక్కయు, వాస్తు గ్రంథములయొక్కయు సమూహమే. వాస్తు శిల్పములు రెండును పెనవేసికొని యుండుటచేత రెంటిని స్థాపత్య వేదాంతర్గతములుగనే భావింపవలయును. ప్రతివేదమునకు ఉపనిషత్తు ఉన్నట్లు శిల్పవేదమునకును "శిల్పోపనిషత్తు" కలదు. స్థాపత్య వేదము అనేక గ్రంథముల సమూహమైనను, అందలి ప్రధాన సూత్రములు మాత్రము వేదోపనిషన్మంత్రములలో నిగూఢముగా నిక్షేపింపబడి ఉన్న వనువిషయము మఱువరాదు.

చతుర్వేదీ రంగమును, అందలి శిల్పసూక్త విధానమును వీడి ఋషి ప్రోక్తములు, ఆచార్య రచితములు అగు శిల్పగ్రంథములను అన్వేషించినచో అసంఖ్యాక వాఙ్మయము పొడకట్టుచున్నది. శిల్పశాస్త్ర గ్రంథముల పట్టికయందు దరిదాపు 400 శిల్పాగమ గ్రంథముల సంఖ్య దొరకుచున్నది. ఇవి కాక అగ్నిపురాణమునందు కొన్ని అధ్యాయములలోను, విష్ణు ధర్మోత్తరమునందును శిల్పశాస్త్రము చెప్పబడి ఉన్నది. మత్స్యాది పురాణములందును శిల్పప్రశంసకలదు. సృష్టి మొదలుకొని— నగర, గ్రామ, భవన, గృహారామ, వాపీ, కూప, తటాకాది నిర్మితులును, రాజప్రాసాద, దుర్గ, చతుశ్శాలాది విధులును, దేవాలయ, దేవమండప నాట్యశాలా, కర్మశాలా నిర్మాణ విధానములును, నిఖిల దేవతామూర్తి

నిర్మాణ పద్ధతులును, వివిధాస్త్ర శస్త్ర రథాదులను జేయురీతులును, దేవ మనుష్య విధాన భేదములచే అయో దారు తామ్ర శిలా స్వర్ణములయందు పచరింపవలసిన ఎల్లశిల్ప కల్పనములును ఈగ్రంథజాలమునందు సలక్షణ ముగా ఉపదిష్టములై ఉన్నవి. అంతియేకాక, యీ కాలమున ప్రపంచ ముచే సర్వాశ్చర్యకరముగా ఎన్నబడు యంత్రశిల్పమును అతిప్రాచీన కాలముననే భరతభూమియందు వెలసియుండుట గమనింపతగిన అంశము. పలువిధములైన గజ తురగ యంత్ర నిర్మాణ విధులు, విమాన నిర్మాణ పద్ధతులు శాసింపబడుటకు ప్రత్యేక గ్రంథములే వెలసి ఉండుటచే భార తీయ నాగరికతా స్వరూపము విస్మయావహము అగుచున్నది.

సృష్టిశిల్పము, విశ్వశిల్పము, విశ్వసారము, ఆదిసారము, మనశ్శి ల్పము, సారస్వతశిల్పము, శిల్పసాహిత్యము, చిత్రశాలము, చిత్రఖం డము, చిత్రబాహుళ్యము, చిత్రకర్మశిల్పము, మనుతంత్రము, మయ మాయ, మయజయము. మయమతము, మయశిల్పము, మయవాస్తు, త్వష్టృతంత్రము, కలానిధి, కాష్ఠశాల, పాషాణవిచారము, రూపమండ నము, రూపవిధి, ప్రతిమాలక్షణము, గాంధర్వవిద్య, మనుష్యాలయ చంద్రిక, సమరాంగణ సూత్రధారము, మానసారము, విమానాధికరణము, విమానవిద్య, లోహతంత్రము, శత్రుఘ్నీయము, భరద్వాజకృతయంత్ర సర్వస్వము, గార్గేయాగమము, విశ్వకర్మప్రకాశము, కాశ్యపశిల్పము, విశ్వ కర్మ వాస్తువు - విమానాది మానము, మొదలుగాకల గ్రంథముల ఆను పూర్విని బట్టియు, వాటి పేరులలోని అర్థమహిమను బట్టియు చూచినచో, శిల్పవాఙ్మయముయొక్క సురుచిర సభ్యత వ్యక్తము కాగలదు.

## శిల్పవాఙ్మయము

అతిప్రాచీన కాలమున శిల్పవాఙ్మయము నానావిధముల విస్తరిల్లి ఉన్నను, ఆ శాస్త్రసంపద చాలభాగము నష్టమైనదని చెప్పక తప్పదు. ఇందుకు ఆశాస్త్రమునందు మనము ఉదాసీనులమై ఉండుటయు, రాజ్యాంగమునందు శిల్పమునకు ప్రాధాన్యము తగ్గించి, మంత్రాంగమునకు ప్రాధాన్యము ఇచ్చుటయు కారణమని చెప్పవచ్చును. రాజ్యాంగములో మంత్రము, శిల్పము చేతులు కలుపుకొని పయనము చేసినంత వఱకును మన శిల్పసభ్యత కొఱతలేకుండనే ఉన్నది. హిందూదేశములో తనకు ఆదరము తగ్గుచున్నప్పటినుండియు, మన శిల్పలక్ష్మి దేశాంతరములకు ప్రయాణము సాగించినదని యెఱుంగవచ్చును.

ఇంకను భారతీయుల సంస్కృత వాఙ్మయము యవనులయు, పాశ్చాత్యులయు దండయాత్రలయందు నాశ మొనర్పబడియు, విజ్ఞులైన వారిచే చిక్కినది అపహరింపబడియు స్వదేశమునుండి జారిపోయినదన్న విషయము చరిత్రజ్ఞులకు చెప్పపనిలేదు. సంస్కృతవాఙ్మయమున కంతటికిని పట్టిన యీ దుర్దశ శిల్పశాస్త్రమునకు ఎక్కువగా పట్టినది. కారణ మేమన? ఆధ్యాత్మిక పరిమళమును విశేషముగా విరజిమ్ము భారతీయ సారస్వతముపై పాశ్చాత్యులయొక్క దృష్టి మున్ముందుగా ప్రసరింపదయ్యె. భౌతికభోగలాలసమును, ప్రాపంచికైశ్వర్యమాత్ర సంతుష్టమును అగు వారిచూపు పలువిధములుగా పూలతో కాయలతో వికసించిన శిల్పవాఙ్మయోద్యానముమీదికి పర్వి, దానిని స్వాధీనము చేసికొన ప్రేరేచినది. ఆ కారణమున శిల్పశాఖకు చెందిన ఉత్కృష్ట గ్రంథములను వారు భారతీయ శిల్పాచార్యులను, పండితులను లోబఱచుకొని కైవసమొనర్చ

కొనిరి. ఈ కార్యము అలెగ్జాండరు దండయాత్రతో ఆరంభమైనదని విజ్ఞుల అభిప్రాయము *. తరువాత క్రమక్రమముగా ఎంతటి మహత్తర శిల్పగ్రంథసమూహమును వారు చేజిక్కించుకొనిరో ఎవ్వరు చెప్పగలరు? తరువాతివగు కొన్ని యవనదండయాత్రలు భారతీయ గ్రంథజాలమును అగ్నికి ఆహుతిచేసి నష్టపఱచినవి. సత్త్వసంపన్నులగు హిందువులే మతాసహన గుణముచేత మహోన్నతమగు బౌద్ధవాఙ్మయమును నాశము చేసినారన్నచో, రాజసస్వభావులగు పరులమాట చెప్పనేల? ఈ విధముగా అన్యులచే శిల్పవాఙ్మయము ఆక్రమింపబడుటయేకాక, ఆ వాఙ్మయ రహస్యముల నెఱింగి, లోకోత్తరములగు శిల్పముల నిర్మింప సమర్థులగు శిల్పాచార్యులను వారివారి దేశములకు కొనిపోబడి, ఆ యా శిల్పకర్మల యందు ఆ యా దేశములవారు సుశిక్షితులైనట్లు ఊహింప నగుచున్నది. ఇట్టి మహోపద్రవము కారణముగా సమగ్రమగు భారతీయ శిల్పశాస్త్రము కాని, సంప్రదాయముకాని, ఆ సంప్రదాయములను పిడికిటపట్టిన శిల్పాచార్యుల చరిత్రముగాని కొంత అలభ్యముగను, కొంత కష్టలభ్యముగను ఉన్నది.

ఇప్పటికైనను హిందూదేశమునందు అనేకులగు శిల్పాచార్యులవద్ద పెక్కు శిల్పవాస్తుగ్రంథములు లభించుచున్నవి. శిల్పులు కానివారివద్దను

* ప్రస్తుతము సమగ్రమగుస్కాందపురాణము మనదేశములో లేదు. జర్మనీ దేశమునందలి బెర్లిన్ నగరములోని ఓరియంటల్ లైబ్రరీలో స్కాంద పురాణముఉన్నట్లు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోని జర్మన్ కేటలాగునుబట్టి తెలియుచున్నది. ఆ స్కాందపురాణములోనే ఆద్య శిల్పుల చరిత్రమునుతెల్పు "నాగరఖండమును" ఆ ఖండాంతమున మూల స్తంభమునుకూడ ఉన్నవనుచున్నారు.

ప్రాచీన విజ్ఞానమును చాటిచెప్పు గ్రంథములు అనేకములు కలవు. వారు ఆ పుస్తకములను దేవతార్చనలో ఉంచి పూజించుచుందురు ఎవ్వరికిని చూచు అవకాశమునుకూడ గల్గనీయరు. ఇక శిల్పులన్ననో, గ్రంథములను బయల్పఱచిన తమ గౌరవమునకు ఏమి భంగము కలుగునో అని దాచు కొనుచున్నారు. ఇట్టి పరిస్థితిలో పరిశోధక శాఖలు బయలుదేరి శిల్ప వాఙ్మయమును సేకరించుటకు పూనుకొన్న యెడల అమూల్యమగు వాఙ్మయము చిక్కగలదని తోచుచున్నది. ఇప్పుడిప్పుడే కొన్ని సంస్థలు పూను కొని పండితులను ప్రేరేపించి శిల్పగ్రంథ సంపాదనము చేయించుచున్నవి. ఇంకను విశ్వవిద్యాలయములవంటి సంస్థలు పూనుకొన్నచో, ఈ కార్యక్రమము బాగుగా కొనసాగగలదు. నాలుగు ఉపవేదములలోను స్థాపత్య వేదమునకు ఉన్న వాఙ్మయ సంపత్తి ఏ ఉపవేదమునకును కన్పట్టదు. ఆయుర్వేదము ఆరోగ్యమునకు అవసరమగుటచేత కొంతవరకు తత్సంబంధమగు వాఙ్మయము సుస్థితిలో ఉన్నదికాని, స్థాపత్య వేద వాఙ్మయము మాత్రము ఉండవలసినంత ఉచ్చదశలో లేదు. ఈ సందర్భమున, ప్రాచీనములగు ఆ గ్రంథములు ఆధునిక విజ్ఞానము పెంపొందిన యీ దినములలో ఎట్లు ఉపకరించునని శంకింపవచ్చును. ప్రాచీన విజ్ఞానాంశములను బాగుగా ఎఱింగి వాటిని నవ్యవిజ్ఞానాభివృద్ధికి వినియోగించుకొనుట ఉత్తమము కాగలదు. ఆ గ్రంథములను పఠించుటచేత మన నూత్న పరిశోధనలుకూడ సుకరములై ఉండగలవు. "సస్యానందము, పాదపవివక్ష, కృషివిషయము, వృక్షాయుర్వేదము" మున్నగు గ్రంథములు కృషి శాస్త్రమునకు సంబంధించినవి. వాటినిబట్టి నేటి కృషివిధానములను పెంపొందించుకొని క్రొత్త వ్యావసాయిక రీతులను సృష్టించుకొనవచ్చును. ఇట్లే నానా శాఖలకు చెందిన ప్రాచీన వైజ్ఞానిక గ్రంథములు ఈనాటి మానవ జీవనసరణిని అలంకరించు కొనుటకు ఉపయోగించు కొనుటలో మన చాతుర్యము వ్యక్తము కాగలదు.

శిల్పశాస్త్రప్రచారము తగ్గిపోవుటకు ఇంకొక కారణము ఆ శాస్త్రము పఠన పాఠనములచేతనే అనుభవమునకు వచ్చునది కాకపోవుట. పూర్వము చెప్పిన శిల్పవిద్యాలయములందు పారంపర్య కౌశలముగల ఆచార్యులవద్ద సప్రయోగముగ (ఆచరణపూర్వకముగ) దానిని అభ్యసించిననే కాని అది వశముకాదు. రసాయన, పదార్థ విజ్ఞాన శాస్త్రములు ప్రయోగశాల (Laboratory) ల యందు సప్రయోగముగ నేర్వతగి ఉన్నట్లు, శిల్పశాస్త్రమును పనిచేయుచు, చేసినదానిని చూచుచు అభ్యసింప తగినదై ఉన్నది. నేడుఇట్టి శిల్పవిద్యాశాలలు, భారతదేశమున సంప్రదాయము చావలేదనుటకు నాలుగైదు మాత్రము ఉన్నవి. వీటిలో మైసూరు మహారాజాస్థాన శిల్పాచార్యుడగు "శిల్పసిద్ధాంతి శ్రీసిద్ధలింగస్వామి"వారి శిల్పశాల ఎన్నదగినది, చూడదగినదికూడ. ఇప్పుడది తత్పుత్రుడగు మహాదేవస్వామి యాజమాన్యములో ఉన్నది.

ప్రకృతమున శిల్పవాఙ్మయమునందలి ప్రత్యేక ప్రత్యేక గ్రంథములనుగూర్చికాని, ప్రత్యేక ప్రత్యేక విషయములపై వెలసిన శిల్పవాఙ్మయమునుగూర్చికాని విస్తరింపక, ఇంతటి మహత్తర శిల్పశాస్త్రమునకు ఉపదేశకులైన ఆచార్యులను కొందఱినిమాత్రము సందర్శింతము. శిల్పశాస్త్రోపదేశకులలో బహుళతర శాస్త్రమును ఉపదేశించినవాడు విశ్వకర్మ ఋషి. అనేక గ్రంథములను విశ్వకర్మ ఉపదేశించినట్లును, రచించినట్లును తెలియుచున్నది. విశ్వకర్మ కృతయుగాదిలో పదిరెండువేల సంఖ్యగల శిల్పశాస్త్రమును ఉపదేశించెననియు, అయ్యది కలియుగమున నాల్గువేల సంఖ్యకలదై ప్రచారములో ఉన్నదనియు "అపరాజితపృచ్ఛ'' అను గ్రంథమువలన తెలియుచున్నది. సమస్త శిల్పమునకును అధి దైవతమై, ప్రవర్తకుడై, ఉపదేశకుడై చెన్నొందిన ఈ విశ్వకర్మ చరిత్రమును సంస్కృత వాఙ్మయమును అనుసరించి సంగ్రహముగా తెలిసికొందము.

## విశ్వకర్మ

"స ప్రథమ స్సంకృతి ర్విశ్వకర్మా,
స ప్రథమో మిత్రో, వరుణో,ఽగ్నిః,
స ప్రథమో బృహస్పతి శ్చికిత్వాన్."

యజుర్బ్రాహ్మణ ప్రథమాష్టకము. ప్రపా, 1.

సమీచీనము-అనగా యోగ్యమగు కృతిని (ఆకృతిని-రూపమును) నిర్మించువాడు "సంకృతి"* — అనగా శిల్పి అని భావము. యజుర్బ్రాహ్మణ గ్రంథము ఆద్య శిల్పాచార్యులనుగూర్చి చెప్పుచు - విశ్వకర్మ, మిత్రుడు, వరుణుడు, అగ్ని, బృహస్పతి - అనువారు మహాసంకృతులు (శిల్పులు) అని నిర్దేశించినది. దీనినిబట్టి చూచినచో వైదిక దేవతలలో కాని, ఋషులలోకాని, శిల్పులు కానివారు లేరని స్పష్టమగుచున్నది. వేద కాలమున శిల్పమును చిన్నచూపు చూచినవారు లేరు.

* సంకృతి శబ్దమువలెనే 'కారు' పదము కూడ వేదమున ప్రయోగింపబడి ఉన్నది. నేటి లౌకిక సంస్కృతభాషలో 'కారువు' అనగా-శిల్పి, విశ్వకర్మ, త్వష్ట-అని అర్థములు వ్రాయబడినవి. ఋగ్వేదములో కారు శబ్దము ఏ కర్మము చేసెడివాని కైనను వాడబడినది. యజ్ఞము-దానికి మూలమగు శిల్పము వేదమునందు ముఖ్యములగుటచేత కారు శబ్దము శిల్పమును, యజ్ఞాదికర్మములను చేయువారిపట్ల ప్రయోగింపబడినట్లు వేద పరిశీలనముచే తెలియగలదు. "కారవే-కర్మ కర్త్రే, కారుః-కర్మకర్తా" అని పెక్కు మంత్రముల భాష్యములందు మనము కాంచగలము. ఇట్టి విశేషములు అనేకములు ఈ గ్రంథకర్తచే వ్రాయబడుచున్న "వేదపరిశీలనము"లో కాంచవచ్చును.

ఈ మహత్తర విశ్వశిల్పమునకు నాయకుడై ఒకమహనీయ శిల్పాచార్యుడు ఆద్యంతములు లేనివాడై వ్యక్తుడుగను, అవ్యక్తుడుగను కలడని పూర్వగ్రంథముచే మనము ఎఱింగియే ఉన్నాము. జగత్సృష్టికర్త అగు ఈ విశ్వకర్మ అదృశ్యరూపుడై ఆ యా గర్భాంకురాదులను మూర్తి రూపముగా విభజించి స్వయముగా సృజించుచున్నాడని పద్మపురాణము చెప్పుచున్నది.

"విభజ్య మూర్తిరూపేణ, తత్తద్గర్భాంకురాదికమ్,
అదృశ్యేనైవవ రూపేణ, విశ్వకర్మాఽసృజత్ స్వయమ్."

అనగా చరాచరాత్మక భూతకోటిఅంతయు అంతర్యామి స్వరూపుడగు ఈ సృష్టికర్త (సృష్టిశక్తి) యొక్క ప్రభావము వలననే రూపొంది వ్యక్తమగుచున్నదని తెలియుచున్నది. ఔను. అవ్యక్తమగు ఏదోఒక శక్తియొక్క ప్రభావము చేతనే జగత్తు వ్యక్తమగుచున్నదన్న సంగతి సర్వమతాచార్యులు అంగీకరించినదే. సర్వకర్మసమర్థమైన ఆ శక్తినే వేదర్షులు విశ్వకర్మశబ్దముచేత గానము చేసిఉన్నారు.

ఈ పరాత్పర విశ్వకర్మను అటుంచి చూచినను, వేదశాస్త్ర పురాణాగమములయందు అనేకులగు విశ్వకర్మలు పొడకట్టుచున్నారు. ఈ విశ్వకర్మలు పలువిధములుగ లోకమును విస్తరించినట్లు తెలియుచున్నది. భువనమహర్షి పుత్రుడగు విశ్వకర్మ కశ్యపునిచే సార్వభౌముడుగా అభిషేకింపబడి సమస్తభూమండల సామ్రాజ్యాధిపత్యమునుపొంది, అనేకాశ్వమేధములను చేసెనని ఐతరేయ బ్రాహ్మణపంచిక యెనిమిదవ ఖండములో ఉన్నది. విశ్వకర్మ ప్రజాపతియై ప్రజాసృష్టి చేసెనని యజుర్వేదమును, కణ్వసంహితయు వక్కాణించు చున్నవి. విశ్వకర్మ ఋషియై శిల్పి బ్రాహ్మణులకు మూలపురుషుడైనట్లును, అనేకఅవతారములనుదాల్చి నానా

విధశిల్పములను లోకసంగ్రహార్థమై వెలయించినట్లును, సప్తర్షుల అభీష్టములను తీర్చినట్లును యజుర్వేదమును, పురాణాగమములును పలుకుచున్నవి. మత్స్యపురాణము విశ్వకర్మ అష్టవసువులలో ఒకడగు ప్రభాసుని తనయుడనియు, ఆతడు ప్రజాపతియు, మహాశిల్పియునై ఒప్పెననియు చెప్పుచున్నది. మహాభారతములోను, విష్ణుపురాణమునందును బృహస్పతి చెల్లెలగు "యోగసిద్ధ" అనునామె బ్రహ్మవాదినియు, బ్రహ్మచారిణియునై జగమంతయు సంచారము చేయుచుండెడిదనియు, తుదకు ఆమె అష్టమ వసువగు ప్రభాసుని పెండ్లియాడి, శిల్పాచార్యుడును, ప్రజాపతియుఅగు విశ్వకర్మను కనె ననియు కలదు. ఈ విశ్వకర్మను గూర్చియే మహాభారతము —

"కర్తా శిల్పసహస్రాణాం, త్రిదశానాం చ వాస్తుకృత్,
మానుషా శ్చోపజీవన్తి, యస్య శిల్పం మహాత్మనః.
య స్సర్వేషాం విమానాని, దేవాతానాం చకార హ."

వేయి విధములగు శిల్పములను విశ్వకర్మ సృష్టించెననియు, ఆ మహాత్ముడు దేవశిల్పాచార్యుడై నెగడెననియు, ఆతని శిల్పప్రభచేతనే మనుష్యులుకూడ వస్తుసమృద్ధి కలిగి జీవించుచున్నారనియు దేవతలకందఱకు అతడు విమానములను చేసెననియు చెప్పుచున్నది. పై శ్లోకార్థమును నన్నయభట్టు ఈ విధమున తెనిగించినాడు.

"క. ఆ విశ్వకర్మ నిర్మిత
దేవవిమానుండు నిఖిల దివ్యాభరణ
శ్రీవిరచన పరితోషిత
దేవుడు శిల్పప్రజాపతియు నై నెగడెన్."

—ఆదిపర్వము.

ఈ అంశమునే అగ్ని పురాణము ఈ రీతిగ వచించుచున్నది.

"కర్తా శిల్పసహస్రాణాం, త్రిదశానాంచ వర్ధకిః
మనుష్యా శ్చోపజీవన్తి, శిల్పం వై భూషణాదికమ్."

మానసారములో బ్రహ్మయొక్క మోములనుండి అవతరించిన శిల్పాధిపతులలో విశ్వకర్మ ఒకడని చెప్పబడి ఉన్నది.

అనాది సిద్ధుడును, జగచ్ఛిల్పియు అగు విశ్వకర్మ భువనమునందలి ప్రాణులకు ఉపభోగ్యవస్తువులను సృష్టించుటకును, భూలోకమునందు మానవశిల్పులకు కూటస్థుడు అగుటకును వివిధావతారములను ఎత్తె ననియు, అట్టి అవతారములే భువనఋషి పుత్రుడు అగుటయు, యోగ సిద్ధాప్రభాసులకు జనించుటయు అని సంప్రదాయజ్ఞులు తలంచుచున్నారు. వేదశాస్త్రములును అట్లే సమన్వయములు అగుచున్నవి. ఈ అభిప్రాయ మునే శ్రీనిరంజన శాస్త్రిగారు అనుసరించిరి. విశ్వకర్మ మహిమాతి శయమునుగూర్చి సంపూర్ణముగా ఎఱుంగగోరువారు శ్రీవడ్డెపాటి నిరంజన శాస్త్రిగారిచే సంగ్రహింపబడిన "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" లోని విశ్వకర్మకాండమును, శిల్పకాండమును కాంచినచో అందు సప్ర మాణముగ అమ్మహామహునిగూర్చిన రహస్యములు తెలియగలవు.

సంస్కృతవాఙ్మయములో ఎక్కడ, ఏ నగరము నిర్మింపబడినను, ఏ భవన ప్రాసాదాదులు, శస్త్రాస్త్రములు, విమానాదులు నిర్మింపబడినను అవి ఎల్ల విశ్వకర్మ నిర్మితములు ఐనట్లే చెప్పబడి ఉన్నవి. విశ్వకర్మ రాక్ష సనివాసమగు లంకను, అత్యద్భుతమగు పుష్పకవిమానమును, అగస్త్యు నకు, కుబేరునకు, బ్రహ్మకు, సూర్యునకు భవనములను నిర్మించినట్లు— రామాయణములో చదువుచున్నాము. శ్రీకృష్ణుని ద్వారకానగరమును,

ఇంద్రుని అమరావతిని విశ్వకర్మయే నిర్మించినాడని భాగవతములో ఉన్నది. విశ్వకర్మ తన అల్లుడగు సూర్యునితేజమును తగ్గించుటకై తరిమెనపట్టి కొంత తేజమును వేఱుచేసెను. ఆ తేజము (పొడివంటిదని భావింపవలయును) చేత విష్ణునికి చక్రమును, శివునికి త్రిశూలమును, ఇంద్రునికి వేయంచులుగల వజ్రాయుధమును నిర్మించిపెట్టెనని మత్స్య పురాణము నుడువుచున్నది. విశ్వకర్మ సూర్యుని తరిమెన పట్టెనను గాథ లోని రహస్యమును ఈ కాలపు "సైంటిస్టులు" చక్కగా వివరించు చున్నారు. పై అంశములనుబట్టి ఆ యా కాలములలో ఎందఱె దఱో విశ్వ కర్మలు ఉండి ఆ యా విధములైన సృష్టికార్యములను ఒనర్చినారని ఊహింప వీలగుచున్నది.

సంస్కృత వాఙ్మయమునందు దేవశిల్పిగా కనుపట్టెడి విశ్వకర్మ జరామరణములు లేనివాడు అగుటచేత, కాలభేదములేక సమయమువచ్చి నప్పుడెల్ల దేవమానవుల సమీహితములను సంపాదించిపెట్టెననుట ఒక దృష్టిననుసరించి యుక్తముగా ఉండునని కొందఱి తలంపు. విశ్వకర్మ శబ్దము శిల్పికి పర్యాయపదముగను, బిరుదవాచకముగనుకూడ భావింపబడి నది కనుక, ఎక్కడ ఏ శిల్పము చేయవలసివచ్చినను, అదిఎల్లను విశ్వ కర్మయే చేసెనని కవులు వర్ణించిరనుటయు ఒకదృష్టితో సమంజసము గనే ఉండును.

సంస్కృత వాఙ్మయమునందు విశ్వకర్మ సర్వశిల్పాధిపతిగను, సకల వాస్తువిధానములకు మూలభూతుడు అగు వాస్తోష్పతిగను వర్ణింప బడి శిల్పకాములగు ఎల్లరికి ఆరాధ్యదైవముగ చెప్పబడెను. పంచానను డును, సకల జగదుపాస్యుడు అగు ఈ విశ్వకర్మదేవుని సుందర స్వరూ పము వాయుపురాణమునందలి భూఖండమునందు విస్తరముగా వర్ణింప బడినది. హేమాద్రి వ్రతకాండమునందు సైతము ఉగ్గడింప బడినది.

భారతదేశమునందు అంతటను సర్వశిల్పాధిపతి అగు ఈ విశ్వకర్మకు పూజలు, జయంతులు నాడును నేడును అవ్యాహతముగా జరిగినవి, జరుగుచున్నవి.

సంస్కృత వాఙ్మయమునందు పొడకట్టు ఈ విశ్వకర్మకంటెను భిన్నుడై, కొన్ని శిల్పగ్రంథములకు కర్తయై ఒక విశ్వకర్మ కలడని ఫణీంద్రనాథబోసు మున్నగు కొందఱు ప్రముఖులు అభిప్రాయపడుచున్నారు. వరాహమిహిరుడు తన బృహత్సంహితలో "సార్థం హస్త త్రయం చైవ కథితం విశ్వకర్మణా" అని చెప్పిఉన్నాడు కనుకను, గుప్తవంశపు రాజుల కాలములో ఒక విశ్వకర్మ ఉన్నట్లు స్పష్టమైన చిహ్నములు కన్పట్టుచున్నవి కనుకను, ఆఱవ శతాబ్దములోని వరాహమిహిరునికంటెను పూర్వము ఒక విశ్వకర్మ ఉండి ఉండవలెననియు, అతని కాలమును నిర్ణయించుటకు గట్టి ఆధారములు లేవనియు ఫణీంద్రనాథబోసు వ్రాసినాడు ("శిల్పశాస్త్రమ్" ఉపోద్ఘాతము) ఎవరు ఎట్లు చెప్పినను విశ్వకర్మకు జాతకము వ్రాయుప్రయత్నము వ్యర్థమే! ఏ యే కాలములయందు ఎందఱెందరు శిల్పాచార్యులు శిల్పిపర్యాయపదమగు విశ్వకర్మ నామముచే పేర్కొనబడిరో నిర్ణయించుట కష్టము. కావున ఋషులకాలమువలె ఈ విశ్వకర్మల కాలములును చరిత్రకు అందునవి కావు. వారిచేతలును, వ్రాతలు (గ్రంథములు)ను కూడ అట్టివిగనే పొడకట్టుచున్నవి. ఇట్టిస్థితిలో ఎవరేని ప్రమాణములను సంపాదించి సముచిత చారిత్రక ఘట్టములను ప్రదర్శింప గలిగిన సుస్వాగతమనక తీరదు. కాని, ప్రపంచము పుట్టకముందే, దానిపుట్టుకకు కారణుడై, ప్రపంచోత్పత్తి ఐన పిమ్మట, మానవ విజ్ఞానము వృద్ధినందుటకు నానా విధములుగా అవతరించినవాని మహిమ కనుగొనుట అసాధ్యమే!

విశ్వకర్మ తరువాత తత్పుతులును, ఆద్యశిల్ప ప్రవర్తకులును అగు మను, మయ, త్వష్ట్ర, దైవజ్ఞ, విశ్వజ్ఞులనువారు శిల్పముతోపాటు శిల్ప శాస్త్రమునుకూడ విస్తరిల్లజేసిరి. ఈ పంచబ్రహ్మలలో అద్భుతమగు శిల్ప శాస్త్రమును ఉపదేశించిన మయునిగూర్చి విచారింతము.

## మయబ్రహ్మ

శిల్పగ్రంథములనుబట్టి చూచినచో విశ్వకర్మ తరువాత రెండవ స్థానము మయునిదా, అనిపించును. ప్రాజ్ఞుడగు మయమహర్షి మనుష్యుల కెల్లరకును వాస్త్వాదుల సుఖమును కలిగించు వాస్తుశాస్త్రమును నిర్మించెనని "మయమతశిల్పము" లోని రెండవ శ్లోకము వచించుచున్నది—

"త్రైతిలానాం మనుష్యాణాం, వాస్త్వాదీనాం సుఖోదయః"
ప్రాజ్ఞో ముని ర్మయః కర్తా, సర్వేషాం వాస్తులక్షణమ్."

మయబ్రహ్మ గృహ, స్యందన, మందిరాది నిర్మాణములను కని పట్టి లోకమున ఎక్కువగా దారుకర్మ ప్రచారము చేసిన మహనీయుడు. శిలాశిల్పమునందు విగ్రహ నిర్మాణము, దేవాలయాది నిర్మాణములను కూడ భూయిష్ఠముగా ప్రచారముచేసి, పలుగ్రంథములను ఈతడు రచించెను. పెక్కు గ్రంథములందు విశ్వకర్మ దేవశిల్పిగను, మయుడు దానవశిల్పిగను పేర్కొనబడి ఉన్నారు. శుక్ర బృహస్పతులు ఇరువురును ఋషివంశ సంభూతులయ్యును—రాక్షసులకును, దేవతలకును గురువులైనట్లు, మయ, విశ్వకర్మలు ఇద్దఱును బ్రహ్మవంశభవులయ్యును, దేవాసురులకు శిల్ప కార్యములు ఒనర్చినట్లు వర్ణనలు ఉండుటలో విరోధము లేదు. మఱియు శిల్పాచార్యులకు ఏనాడైనను దేవదానవాది భేదముకాని మతభేదముకాని ఉన్నట్లు పౌరాణిక వాఙ్మయమునుబట్టియు, చరిత్ర వాఙ్మయమునుబట్టియు

తెలియుటలేదు. ఎన్ని మతములు మారినను, ఎన్నిరాజ్యములు మారినను, ఎన్నిజాతులు మారినను శిల్పులు ఒకేపక్షమునకు చెందక, సమవర్తులై ప్రజాక్షేమమును, లోకకల్యాణమునే సాధింప పూనుకొన్నట్లు తెలియు చున్నది.

స్కాందపుపురాణమువలన మయబ్రహ్మ విశ్వకర్మ సుతపంచక ములో ఒక్కడని తెలియుచున్నది. మత్స్యపురాణమునందు ఈతడు వాస్తు శాస్త్రాచార్యుడుగ చెప్పబడినాడు. మానసార శాస్త్రమువలన బ్రహ్మ మోములనుండి కలిగిన శిల్పాచార్యులలో మయుడును ఒక్కడని స్పష్ట మగుచున్నది.

ఉత్తర రామాయణమునందు మయుడు కశ్యపునకు దనువునందు పుట్టిన కుమారుడనియు, దానవులకు శిల్పాచార్యుడయ్యెననియు, ఇతని సుగుణములకు మెచ్చుకొని దేవతలు హేమయను కన్యను ఈతని కిచ్చి పెండ్లిచేసి రనియు, మయుడు ఆమెపేరనే నగరమొకటి నిర్మించి అందు కాపురము ఉండగా ఆతనికి మాయావి, దుందుభి అను పుత్రులును, మందోదరి అను కూతును, కలిగిరని వ్రాయబడి ఉన్నది. దీనినిబట్టి మయుడు దనుజుడుగా పొడకట్టుచున్నాడు. ఎట్లైనను స్కాందపురాణా ములయందలి గాథలనుబట్టి మయులు ఇర్వురు ఉన్నట్లు స్పష్టమగుచున్నది. కాలక్రమమున మహాశిల్పి అగు మయుని నామముతో ఎందఱో శిల్పులు ప్రసిద్ధులై ఉండవచ్చును.

మయుడు దానవులకు శత్రుదుర్భేదములైన మూడు పురములను నిర్మించి ఇచ్చి ఉన్నాడు. ఈ అంశమును ఉగ్గడించుచు "శిల్పరత్న" కారుడు ఈవిధముగ మయుని స్తుతించెను—

"త్రిపుర పురత్రయ రచనా యత్కరయోః కర్మచాతురీ జాతా
శిల్పివరం తం దనుజై రర్చితచరణం మయం వందే."

ఇంకను ఈ మయవిశ్వకర్మ ఒకసారి సప్తఋషులకు యజన యాజనాది షట్కర్మాధికారమును ఇచ్చి, అద్దానిని వారు దుర్వినియోగము సేయగా కోపించి వారిబ్రాహ్మణత్వము వ్యర్థమైపోవునట్లు శపించెననియు, తరువాత ఆ ఋషులు బ్రహ్మపాలికేగి మొఱ యిడగా, బ్రహ్మ వారలతో కూడ ఏతెంచి మయవిశ్వకర్మను ప్రార్థించి ఆ శాపమును క్రమ్మరింప జేసె ననియు వైవస్వతపురాణమున చెప్పబడిఉన్నది.

"అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః" నేను దానవశిల్పినగు మహాకవిని అనిమయుడు వచించినట్లు మహాభారతములో చదువగలము. దీనినిబట్టి మయుడు మహాశిల్పాచార్యుడేకాక, మహాకవి అనియు తెలియుచున్నది. మయుడు ధర్మరాజునకు అత్యపూర్వమగు ఒక్క సభాభవనమును నిర్మించెననియు, ఇంద్ర యమ వరుణాదుల సభలు ఎవ్వియు దానికి ఈడు కావనియు పై గ్రంథములోనే ఉన్నది. శత్రువు లగువారికి ఉన్నది లేనట్లును, లేనిది ఉన్నట్లును తోపజేయు మయసభా విశేషములు, అందలి శిల్పచిత్రములు, మాయామహిమలు "మయమాయ" "మయజయము" అను గ్రంథములలో శతాంశమాత్రముగనేని సూచిత ములై ఉండునేమో అని ఆశ కలుగుచున్నది. దానవుల "మాయానగర" మహాద్భుత నిర్మాణవిధులను శాసించు మయ శాస్త్రములు నేడు లేవుకదా! శ్రీకృష్ణునిచే దహింపజేయబడిన ఇంద్రుని ఖాండవవనము మయుని రసా యనశాల (Labora ory) అనియు; అది దగ్ధమగుటతో మయుని శిల్ప ప్రతిభను చాటు గ్రంథములును, వైజ్ఞానిక శాస్త్రమునకు పనికివచ్చు ఓష ధులు మున్నగు సాధనములును నశించిపోవ లోకమున మయశిల్పప్రభా

వము నామమాత్రావశేష మైనదనియు సుగృహీతనాములు కీ. శే. కోల
వెన్ను పరబ్రహ్మతీర్థులువారు భావించుచున్నారు.

క. మయ దివ్య సూత్రకారుని
"మయమాయా, మయజయ" ప్రమాణగ్రంథ
ద్వయ మిపు డెక్కడః ఖాండవ
భయదాగ్నికి నాఁడె బూదిపండ్లయిపోయెన్.

అని శ్రీశరభాచార్య మహాకవి చింతించినాడు.

వరాహమిహిరుడు తన బృహత్సంహితలో భవన నిర్మాణ విష యమున మయమతమును ఉద్ఘాటించును. మఱియు "వజ్రలేప" మను యోగము మయుడు చెప్పినట్లు "మయకథితో యోగోఽయం విజ్ఞేయో వజ్ర సంఘాతః" అని బృహత్సంహితలో ఉన్నది.

షట్చక్రవర్తులలో ఒకడగు హరిశ్చంద్రుని భార్య చంద్రమతి మయబ్రహ్మ పెంపుడుకూతురనియు, ఆమెకు మహామహిమాభి శోభిత మగు (తన మగనికి తక్క ఇతరులకు అగపడని) మంగళసూత్రమును చేసి యిచ్చి సాటిలేని పతివ్రతగా ఒనర్చి, మహిళామండలికి ఆదర్శ మూర్తిని ఒనర్చినది మయుడే అనియు "ఉత్తర హరిశ్చంద్రీయము" అను గ్రంథము చాటుచున్నది.

శిల్పశాస్త్రములో చాల భాగము మయుడే రచించినాడు. మయుడు తన గ్రంథములలో మనువు, త్వష్ట మున్నగువారి మతములనుకూడ అను వదించుచుండును. ("దేవస్య కర్ణాంత సమప్రమాణాం దేవీం మనుత్వష్ట్ర ముఖావదన్తి" — మయవాస్తు) మాయామయ శిల్పమునకును మయుడు ఆచార్యుడై ఒప్పినను, నిరీహుడై లోకోద్ధరణము చేసి జనోపకారియై

అనాది కాలమున మొదటి శిల్ప ప్రవర్తకులలో ఒకడై జగత్పూజ్యుడైనాడు.

ఆద్యశిల్పోపదేశకులగు మనుమయాదులే కాక, ఇంకను పెక్కురు ఋషులును, శిల్పాచార్యులునుకూడ బహుశతర శిల్పశాస్త్రమును నిర్మించి ఉన్నారు. మత్స్యపురాణము పదునెనమండ్రు శిల్పోపదేశకులను పేర్కొనుచున్నది.

"భృగు, రత్రి, ర్వసిష్ఠశ్చ, విశ్వకర్మా, మయ, స్తథా ।
నారదో, నగ్నజి, చ్చైవ, విశాలక్షః, పురందరః,
బ్రహ్మా, కుమారో, నందీశః, శౌనకో, గర్గ, ఏవ చ
వాసుదేవో,ఽ నిరుద్ధశ్చ, తథా శుక్ర-బృహస్పతీ,
అష్టాదశైతే విఖ్యాతా శ్శిల్ప శాస్త్రోపదేశకాః"

—మత్స్యపురాణమ్ - అ. 250

వీరలేకాక, ఇంకను కొందఱు ఆచార్యులు గార్గేయ ప్రతిష్ఠాగమమున పేర్కొనబడి ఉన్నారు.

"అగస్త్యః, కాశ్యప, శ్చైవ భృగు, గౌతమ, భార్గవాః,
గౌశారి, ర్విశ్వకర్మా, చ బోధక, స్త్వష్టృకో, మనుః.
మయో, యవన-మాణిత్థౌ, పరాశరముని, స్తథా
దైవజ్ఞో, మానసారశ్చ, దీప్తి, రత్రి, ర్మరీచికః,
కౌండిన్యో, విఖనా, చైవ శిల్పశాస్త్రేషు ధీమతాః."

సుప్రసిద్ధులగు కొందఱు ఋషులను మాత్రమే కొన్ని గ్రంథములు పేర్కొనుచున్నవికాని ఇంక ఎందఱో బృహత్తరమగు శిల్పశాస్త్రమును

సృజించిన ఋషులును, పురుషులును (లౌకికులు) కలరు. ఎందఱు శాస్త్ర ప్రవర్తకులు లేకున్న, స్థాపత్యవేదమునదరిదాపు నాల్గువందలకు పైబడిన గ్రంథ సమూహము వెలసియుండును ! ఈ నాల్గువందల సంఖ్యగణనను, గ్రంథ నామములు సైతము నష్టమైపోగా దొరకినట్టిదే. ఇందుకు కొన్ని మాత్రము ముద్రితములు. పెక్కులు ప్రాచీనగ్రంథ భాండారములందు హస్త లిఖితములై తాళపత్రములందును, కాగితములందును తపస్సు చేయుచున్నవి. అనేకములు అలభ్యములు. లేదా కష్టలభ్యములు. ఏది ఎట్లున్నను భారతీయ నాగరికతకు ప్రబల హేతుభూతమైన మన శిల్ప సభ్యత సనాతనమేకాక, సమగ్రమనియు (ఒక దృష్టితో) ప్రచారాభావమునను, చరిత్ర లేమిచేతనే పతనము సంభవింపగా తచ్ఛాస్త్ర పఠనాభిలాషయు కొఱవడినదనియు గ్రహింపవలసి ఉన్నది.

శిల్ప ప్రచురమైన భరతరంగమున సర్వశిల్పాధిపతియు, జగన్నేతయు, కళాస్వామియు అగు విశ్వకర్మేశ్వరుడు దేశ దేశాంతరములు తన దయాభిక్షను అర్థించునట్లు మఱల మధుర మోహన నాట్యము ఒనరించునా !

"యత్కించి ద్దృశ్యతే శిల్పం తత్సర్వం విశ్వకర్మజమ్"

జగమున తోచు ప్రతిశిల్పమును
విశ్వకర్మాంశమునుండి కలిగినట్టిదే !

---

# శిల్పబ్రహ్మలు

హిందూదేశమునందలి శిల్పచరిత్ర చాల సనాతనమైనది. చారిత్రకులు వేదకాలమునకుకూడ పూర్వమే మనదేశమునందు శిల్పము వెలసినదనియు శిల్పప్రవర్తకులు ఉండిరనియు ఇప్పుడిప్పుడే తెలిసికొనుచున్నారు. వేదమునందు కొన్ని మంత్రములలో "చక్కగా నిర్మింపబడిన రథమువలె ఈ మంత్రము ఇంద్రుని తోడ్కొనివచ్చుటకు సమర్థమగు గాక, పరమేశ్వరుడు కర్మారుని (శిల్పి) వలె ఈ జగమును సృష్టిచేసెను." అను ఇట్టి వర్ణనములు కలవు. వీటినిబట్టియు ఇంక "మొహంజోదరో, హారప్పా" లలోని పురాతన చిహ్నములను బట్టియు ఇక్కడి శిల్పకళ అతి ప్రాచీనమని వారి వ్యాఖ్యానము. దీనికి అనుకూలముగనే శిల్పప్రవర్తకులగు ఋషులను అతిప్రాచీనులై మానవశకారంభమున లోకమునకు విజ్ఞానభిక్ష పెట్టినట్లు వైదిక పౌరాణిక వాఙ్మయము పలుకుచున్నది.*

ఆద్య శిల్పప్రవర్తకులనుగూర్చి విచారించుటకు ముందు జగచ్ఛిల్పి అగు పరమేశ్వరునిగూర్చి కొంత తెలిసికొనవలసి ఉన్నది. విశ్వశిల్పి యొక్క సృష్టిశిల్పమును అవగాహన చేసికొని, తదనుసారము ప్రాచీన

---

* ఈ యధ్యాయము నందలి పంచాననస్వామిని, శిల్పఋషులను, వారి విజ్ఞాన నాగరికతలగూర్చి చారిత్రక దృష్టితో ఎఱుంగగోరువారు చరిత్రచతురానన బిరుదాంకితులగు కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారు శ్రీముఖ సంవత్సర మాఘమాసపు (1934 ఫిబ్రవరి) "భారతి" పత్రికలో వ్రాసిన "హరిజనులు హిందువులు కారా? మహాత్ముడు హిందువు కాడా?" అను వ్యాసమును చదువవలయును.

శిల్పఋషులు మానవశిల్పమును విస్తరింపచేసిరి కావున, భువనశిల్పిని, ఆతని శిల్పమునుగూర్చి తెలిసికొనుట అవసరము అగుచున్నది. పరమేశ్వరుడు విశ్వమునకు సంబంధించిన సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము-అను పంచకర్మములను చేయుచు జగచ్చక్రమును త్రిప్పుచున్నాడుకావున, ఆ దేవదేవుని విశ్వకర్మయని కీర్తించుట వేదహృదయము. విశ్వకర్మనుగూర్చి ఋగ్వేదము అష్టమాష్టకమునందును, తైత్తిరీయసంహిత చతుర్థకాండమునందును, శుక్లయజుర్వేదమునందును విశ్వోత్పత్తికి కారణుడని కలదు. జగమంతయు కర్మసూత్రముచే నడచుచున్నది కావున, ఆ జగమునకు సంబంధించిన కర్మముల నెల్ల తన మాయాశక్తిచే నిర్వర్తించు జగన్నాటక సూత్రధారుని విశ్వకర్మ అనుటలో వేదమంత్రోక్తమైన భావానుగుణ మార్గము ప్రశంసనీయము*. ఈతడు పరాత్పర విశ్వకర్మ. ఈ జగత్కారణుని తత్త్వమును సనాతన ఋషులు ఈ విధముగ అర్థము చేసికొన్నారు.

జగత్తు పంచభూతములనెడి ఉపాదానకారణముచే ఏర్పాటైనది. పంచభూతములచే పిండాండము, బ్రహ్మాండము ఎట్లు సృష్టిఅగు చున్నది అను విచారణ సాంఖ్య వేదాన్తశాస్త్రములందు చూడవలయునేకాని, ఇక్కడ విస్తరింప వీలుపడదు. లోకమున చరాచరములకు సంబంధించి జరుగు పనులుసైతము ఐదని వేదాంతము చెప్పుచున్నది. ప్రాణిగాని, అప్రాణిగాని-పుట్టుట (సృష్టి) కొంతకాలము ఉండుట (స్థితి) నశించుట (లయము) కనబడకపోవుట(తిరోధానము) తిరిగిపుట్టుకనందు యోగ్యతకు

* వేదము అనేక నామములచే జగన్నాథుని వర్ణించినను, విశ్వకర్మ నామౌచిత్యమునుగూర్చియే శిల్పదర్శనములో చర్చించుట ప్రస్తుతమని పాఠకులు గ్రహింపవలయును.

వచ్చుట (అనుగ్రహము) అను ఐదు ప్రధాన కర్మములకు లోనగుచు సంసార చక్రమున తిరుగుచుండును. ఈ ఐదు కర్మలును సమష్టియైన ఒకే విశ్వశక్తినుండి జరుగుచున్నవి కావున ఆ విశ్వశక్తికి సమష్టిలో విశ్వకర్మనామము సముచితమై ఉన్నది. ఈ సమష్టిశక్తిని వ్యష్టిగా విభజించుకొని ప్రత్యేకప్రత్యేకముగా చూచినఎడల అయిదుకర్మములకుఅయిదు శక్తులును, అయిదుగురు మూర్తులును తోచుదురు. ఆ దృష్టితో చూచినప్పుడు - సృష్టికార్యమును నిర్వహించుశక్తిని బ్రహ్మ అనియు, పాలన కర్మను ఒనర్చు శక్తిని విష్ణువు అనియు, లయకర్మను ఒనర్చు శక్తిని శివుడుఅనియు, తిరోధానమును ఒనర్చుశక్తిని ఇంద్రుడనియు, అనుగ్రహ కర్మను చేయు శక్తిని సూర్యుడు అనియు చెప్పుదురు. ఇచ్చట శక్తికిని మూర్తికిని విశేషభేదము లేదు. సృజనశక్తి, సృష్టికర్త. సృజనశక్తి సృష్టికర్తను ఎడబాసి ఉండదు. ఈ రెంటిని అద్వైతదృష్టితోకూడ చూడవచ్చును కాని, ద్వైతముగా చూచినయెడల స్త్రీ పుం భేదము తోచి, మన జీవితమార్గముకూడ దాంపత్య ధర్మరాజితమై ప్రకాశింప కలదు. శక్తిని స్త్రీ రూపిణిగ, శక్తిమంతుడగు వ్యక్తిని పురుషరూపముగ భావించి ఆరాధించుకొనుటలో భారతీయుల ఔచిత్య పరిజ్ఞానము తెల్లము కాగలదు. ఈ తీరుననే తక్కిన శక్తులును, మూర్తులును ; ఆ శక్తులకును, మూర్తులకును కల నామరూపభేదములను సమరసములుగా అర్థము చేసికొని ఆరాధించుకొనుటలో ఉపాసకుని ధీరత ప్రకాశించును.

వ్యవహారమునందు సృష్టి స్థితి లయములుఅను మూడు కర్మములును, ముగ్గురు మూర్తులునే కన్పట్టుచున్నను, తిరోధానానుగ్రహాకర్మలు

రెండును, వాటికి అధిపతులుగా ఇంద్ర-సూర్యులు అను ఇద్దఱు మూర్తులును ఉండినట్లు వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. తిరోధానానుగ్రహకర్మలు ప్రత్యక్షములు కానందుచేత, వాటికి వ్యవహారమున ప్రసిద్ధి కలిగి ఉండక పోవచ్చును. ప్రపంచము పంచక్రియాత్మకము అనుటకు పంచభూతములేకాక-పంచేంద్రియములు, పంచవిషయములు, పంచకోశములుకూడ తార్కాణములే అగుచున్నవి.

పైని చెప్పబడిన అయిదుకర్మలకును, అయిదు భూతములకును కూడ ఒకవిధమగు సంబంధము ఉన్నది. సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహములు జరుగుటలో ఐదు భూతముల తోడ్పాటు అవసరమైనట్లు సమష్టిగా తోచినను, ప్రత్యేకముగా ఒక్కొక్కకర్మకు ఒక్కొక్క భూతముయొక్క బలము ఎక్కుడుగా అవసరమని సూక్ష్మ విచారణచేత ఎఱుంగగలము. ఈ ఐదు కర్మలకును, ఐదు భూతములకును అభిమానులై ఆ యా పనులు ఒనర్చు శక్తిమంతులే (వ్యష్టిదృష్టిలో) బ్రహ్మ, విష్ణు మహేశ, ఇంద్ర సూర్యులు. ఇందు ఒక్కొక్క మూర్తినికూడ సమష్టి శక్తి యుక్తునిగా మనము భావించుకొని ఆరాధించి తరింపవచ్చును. ఈ దృష్టికూడ మనకు లేకపోలేదు.

పంచసంఖ్య ప్రాధాన్యమునుగూర్చి గ్రహింపవలసి వచ్చినప్పుడు దిగువ విషయములనుకూడ గమనింపవలసి ఉన్నది. ప్రకృతి పురుషాత్మకమైన జగత్తు పంచాంశములతో కూడినట్టిది. సత్తు, చిత్తు, ఆనందము-అనునవి మూడును పరబ్రహ్మాంశములు. నామ - రూపములు రెండును ప్రకృత్యంశములు. వెరసి అయిదు అంశములు! అట్లే మన్వాది పంచబ్రహ్మలు. బ్రహ్మాది పంచమూర్తులు. సానగాది పంచఋషులు. సద్యోజాతాది పంచముఖములు. ఆదిశక్తి, పరాశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియా

శక్తి, జ్ఞానశక్తి-అనెడి పంచశక్తులు. * ఋగ్యజు స్సామాథర్వణ ప్రణవములనెడి అయిదు వేదములు. అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయములైన అయిదు శిల్పములు. పంచజ్ఞానేంద్రియములు. పంచ కర్మేంద్రియములు. ఆ ఇంద్రియములకు విషయములైన—శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. వచన, ఆదాన, గమన, విసర్జన, ఆనందములు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయముల నెడి కోశములు - ఇట్టివన్నియు సృష్టి తత్త్వమును సూచించు నట్టివే. పరమేశ్వరుడు ఈ పంచసంఖ్యా రహస్యమును చాటుటకే జీవకోటిలో జ్ఞాన సంపన్నులగు మానవుల కాలుసేతులకు అయిదేసి వ్రేళ్ళను మాత్రమే సృష్టించి ఉన్నాడు. ఈ పంచ సంఖ్య ప్రాధాన్యమును సూచించుటకే విశ్వకర్మ, గాయత్రి, శివుడు-తుదకు బ్రహ్మకూడ అయిదు

---

* విశ్వకర్మ సంప్రదాయ ప్రకారము వేదములు అయిదు. పంచమ వేదము భారతము కాదు. ప్రణవ వేదమని నాగర ఖండాదులు చెప్పు చున్నవి. పంచర్షులలో సుపర్ణఋషి గోత్రమువారు ప్రణవ వేదాధ్య యనము చేయవలసి యున్నారు. బ్రహ్మ మొదట పంచముఖుడు కనుక, బ్రహ్మముఖములనుండి వేదములు పుట్టినవనెడి సంప్రదాయమును బట్టి చూచినచో, అయిదవ వేదము ఉండి తీరవలయును. ఈ దృష్టితో పంచ వేద విభాగము సమంజసమే. బ్రహ్మ చతుర్వదనుడయిన పిమ్మటనే చతుర్వేద సంప్రదాయము వచ్చినది. వ్యాసభగవానుడు పంచమ వేదమగు ప్రణవమును చతుర్వేదములలో కలిపి, దాని స్థానమున తన భారతమును నిలిపినాడేమో ! ఆయన పరిథవించిన వేద విభాగము అట్టిది కావచ్చును కదా ! అందుకే ఆయన "వేద విభాగముం బరిథవించిన పుణ్యుడు"గా వేదవ్యాసు డయినాడు.

శిరస్సులు కలవారుగానే భావింపబడినారు. విశ్వకర్మానుగ్రహ సంజాతుడైన ఆంజనేయుని వరకును ఈ పంచశీర్షత్వము వ్యాపించినది. ఉపనయన కాలమున వటువునకు పంచశిఖలు ఉంచెడి సంస్కారము చేయుట కూడ ఈ పరమ రహస్యమును బోధించుటకే!

మనుష్య పర్యాయ పదములలో "పంచజన" శబ్దము ఒకటి. దీనికి గురు బాలప్రబోధికలో పంచభూతములచేత సృష్టింపబడినవాడు - అని వ్యుత్పత్తి వ్రాయబడినది. అన్ని ప్రాణులును పంచభూతములచేతనే సృష్టింపబడుచున్నందున, ముందు వివరించిన వ్యుత్పత్తి సమంజస మనజాలము. పంచజనులనగా అయిదు తరగతుల జనులు - లేదా, అయిదు కర్మలను చేయుచు అయిదు శాఖలుగా విభజింపబడిన జనులు అని అర్థము చెప్పుటయే సమంజసముగా ఉండును. వేదములో "పంచజనులు, పంచకృషులు, పంచక్షితులు" అనెడి పదములు అగపడుచున్నవి. ఈ మాటలకు సాయణులు నిషాదులతో కలుపుకొని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనెడి-అయిదు తరగతుల జనులని అర్థము వ్రాయుచుందురు. కాని ఋగ్వేదమున ఈ మంత్రములు పుట్టునాటికి చాతుర్వర్ణ్యవిభాగము ఏర్పడినట్లు తోచదు. కనుక ఆ పంచజనులు-పంచవిధ శిల్పకర్మలకు జనకులైన సానగాది-లేక మన్వాది శాఖలకు చెందినవారని చెప్పుకొనుట యుక్తము. ఈ అంశములు మదీయమైన "వేద పరిశీలనము" అను గ్రంథమున విస్తరముగా వివరింపబడినవి.

పై సూక్ష్మవివరణమునుబట్టి సమష్టిదృష్టిలో పంచశక్తులు కలిగి, పంచకర్మలకు కర్తయై, పంచమూర్త్యాత్మకుడై ఒప్పు ఈ సర్వశక్తియే-సర్వజ్ఞుడే-సర్వేశ్వరుడే విశ్వకర్మ పరాత్పరుడు. ఈతని సంకల్ప రూప కర్మకౌశలము చేతనే విశ్వశిల్పము విజృంభించినది.

జగన్నాథుడు పంచకర్మలకు అధిపతి అగుటచేతనే పురాణాదుల యందు విశ్వకర్మ పంచశీర్షుడని వర్ణనలు కన్పట్టుచున్నవి. వాయుపురాణ భూఖండమునందు విశ్వకర్మ ధ్యానము చేయుపట్టున తదాకారము— "పంచ వక్త్రం దశభుజమ్"అని వర్ణింపబడెను. అట్లే ఇతరపురాణాగమములందును కలదు. రూపనామములులేని దేవునికి రూపనామములను కల్పించునప్పుడు, ఆ రూపనామములచేత ఉపాసకులు ఎఱుంగవలసిన అర్థము స్పష్టమగు చుండవలయును కావున, విశ్వకర్మ పంచశీర్షుడు అనుటచేత పంచమూర్తి స్వరూపుడు, పంచబ్రహ్మమయుడు, పంచక్రియాధిపతి— అనియు వ్యక్తమగు చున్నది. విశ్వకర్మ స్వరూపమునందలి ఈ తత్త్వార్థమునే గాయత్రీమాతృ స్వరూపమునందును చూచుచున్నాము. గాయత్రీమాత కూడ పంచభూతాత్మ కము లగు ఐదు శిరస్సులను కలిగి, పంచకర్మలకు రాజ్ఞియైఒప్పుచున్నది. గాయత్రీ విశ్వకర్మలకు స్త్రీ పురుష భేదముతక్క స్వరూప స్వభావములందు ఒక్కటే స్థితి గోచరించుచున్నది.గాయత్రి పంచశక్త్యాత్మికయగు అఖండ సమష్టిశక్తి. విశ్వకర్మ సమష్టి శక్తిశాలియగు అఖండాద్వైతమూర్తి ; వాగర్థస్వరూపులగు ఈ జగత్పితల తత్త్వమును ఏ ప్రకారముగనే; అర్థము చేసికొని సాక్షాత్కరింప చేసికొనుట ముక్తిహేతువు ;

విశ్వకర్మ పంచభూతమయమగు జగమును పంచకర్మలచే ప్రవ ర్తింప చేయుచున్నట్లు ఆ దేవుని తత్త్వమును అర్థము చేసికొన్న ఋషు లను ఐదుగురై కన్పట్టుచున్నారు. వీరే యజుర్వేదమునందు "ప్రాచీది శామా"ది మంత్రములలో వరుసగా పేర్కొనబడిన సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులనెడి బ్రహ్మర్షులు. ఈ ఋషిపంచకము విశ్వకర్మతత్త్వమును సమగ్రముగా అర్థముచేసికొని, ఆ పరాత్పరుని ఆరాధించి లోకమునకు జ్ఞానవిజ్ఞానభిక్ష పెట్టి ఉన్నారు. ఈ మహర్షులు విశ్వకర్మ ముఖములనుండి ఉత్పన్నులై మను మయాది బ్రహ్మలుగ

కూడ ప్రసిద్ధినంది సృష్టి ప్రవర్తకులైరని పెక్కు ప్రమాణములు కన్పట్టు చున్నవి -

శౌనకఉవాచ— "తన్ముఖేషు యథా జాతా సానగాద్యా మహర్షయః
తత్ప్రశంసా కథం లోకే వర్తమానే చరన్తి తే?

వసిష్ఠఉవాచ— సుపర్ణ స్సానగశ్చైవ సనాతన ఇతి స్మృతః
గురుశ్రేష్ఠో ఽహభూనశ్చ ప్రత్నో ధాత్రీసురక్షకః
విశ్వకర్మముఖోద్భూతా బ్రాహ్మణాః పంచకీర్తితాః.
సద్యోజాతముఖే జాత స్సానగో విశ్వకర్మణః.
వామదేవముఖే జాతో బ్రహ్మర్షి స్తు సనాతనః.
అఘోరముఖసంజాతో ఽహభూనో విశ్వకర్మణః.
తత్పురుషముఖే జాతః ప్రత్నో ఽసౌ విశ్వకర్మణః.
తస్యేశానముఖే జాత స్సుపర్ణో విశ్వకర్మణః.

—వసిష్ఠోపపురాణము.

"ఆ విశ్వకర్మబ్రహ్మ ముఖములనుండి సానగాది మహర్షులు ఎట్లు కల్గిరి? వారిప్రశంస లోకమున ఎట్లు వ్యాపించెను? వర్తమానకాలమున వారు ఎట్లు చరించుచున్నారు?" అని శౌనకుడు అడుగగా వసిష్ఠుడు ఇట్లు చెప్పుచున్నాడు—

"సుపర్ణుడు, సానగుడు, సనాతనుడు, అహభూనుడు, ప్రత్నుడు అను ఐదుగురు బ్రాహ్మణులు విశ్వకర్మ ముఖములనుండి అవతరించిరి. విశ్వకర్మయొక్క సద్యోజాతముఖమునందు సానగమహర్షియు, వామదేవ ముఖమునందు సనాతన ఋషియు, అఘోరముఖమునందు అహభూనుడును, తత్పురుషముఖమునందు ప్రత్నబ్రహ్మఋషియు, ఈశానముఖమునందు సుపర్ణ ఋషియు పుట్టిరి."

ఇట్టి ఈ సానగాది మహర్షులు అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణ మయములగు ఐదు ప్రధాన శిల్పములకును, ఇంక తక్కుంగల ఉప శిల్పములకును కర్తలును, ఉపదేశకులును అయినారు. ఆదికాలమున ప్రపంచము విజ్ఞానశూన్యమై ఉన్నప్పుడు, ఈ ఋషిపంచకము - కనుల ఎదుట ఉన్న కొయ్యను, జాతిని మానవ ప్రయోజనమునకు ఉపయోగించుటేకాక, ఇనుము, రాగి, బంగారు మున్నగు లోహములనుకూడ కనిపట్టి నానారీతులగు శిల్పకర్మలను విస్తరిల్ల చేసిరి.

## సానగ ఋషి

సానగఋషినిగూర్చి బ్రహ్మాండ పురాణ ద్వితీయ పటలమునందు ఈ రీతిగ ఉన్నది —

"నమోస్తు తే సానగవిశ్వకర్మణే నమోస్తుతే పూర్వముఖోద్భవాయ
నమోస్తు షడ్భూత వినిర్మితాయ(?) నమోస్తు చిద్రూప నమో నమస్తే.

సాధనం నాస్తి సర్వత్ర, లోకానాం సర్వసాధక,
కరోతి లోహకర్మాణి, లోకాన్ రక్షతి సానగః.
దదౌ శస్త్రాణి దేవానాం, దుష్టనిగ్రహకారణాత్,
స చ సర్వం జగత్కర్తా, సద్యోజాతముఖోద్భవః
శూలం దదాతి భర్గాయ, చక్రం దత్తం చ విష్ణవే,
పాశస్తు బ్రహ్మణే దత్త, త్రిమూర్త్యాత్మక సానగః."

విశ్వకర్మ పరమేశ్వరుని పూర్వముఖమున పుట్టిన చిద్రూపుడవైన సానగ విశ్వకర్మా, నీకు నమస్కారము: లోకమున ఎక్కడ ఏ ఉపకరణములు లేనప్పుడు సర్వసాధకుడైన సానగబ్రహ్మర్షి లోహకర్మలనుచేసి లోకములను రక్షించుచున్నాడు. మఱియు ఆ సానగుడు దుష్టనిగ్రహము

కొఱకై దేవతలకు శస్త్రాస్త్రములను ఒసంగెను. సద్యోజాత ముఖమున పుట్టి సర్వజగత్కర్త ఐన ఆతడు శివునకు శూలమును, విష్ణునకు చక్రమును, బ్రహ్మకు పాశమును ఒసంగెను.

## సనాతన ఋషి

"క్షుత్తృష్ణాది నివృత్తాత్మా, జాయతే దక్షిణాన్ముఖాత్,
సనాతనో దారుకర్మ కుశలో నిర్మమే పురా.
హలాదీనాం తు కర్తవ్యం, మందిరాణాం విశేషతః,
స్యందనాదీని యానాని, వికరోతి సనాతనః"

—బ్రహ్మాండపురాణ ద్వితీయపటలము.

ఆకలిదప్పులు లేనివాడును, దారుకర్మను కనిపట్టినవాడును అగు సనాతనఋషి పరమేశ్వరుని దక్షిణముఖమున ఉదయించెను. ఆ మహర్షియే పూర్వము-నాగలి మొదలగు కర్షకోపకరణములను, మందిరములను, రథము మొదలగు ప్రయాణ సాధనములను సృజించెను.

ఈ సానగ, సనాతన ఋషులు బ్రహ్మ విద్యోపదేశకులలో అగ్రగణ్యులుగా బృహదారణ్యకోపనిషత్తు చతుర్థాధ్యాయాంతమున పేర్కొనబడినారు. ఆ పరంపర ఇట్లు ఉన్నది—

"సనారుః సనాతనాత్. సనాతనః సనగాత్ సనగః పరమేష్ఠినః.
పరమేష్ఠిబ్రహ్మణో-బ్రహ్మ-స్వయం భూబ్రహ్మణేనమః"

బ్రహ్మవిద్యా ప్రవర్తకులలో ప్రథమాచార్యుడు స్వయంభు బ్రహ్మ (విశ్వకర్మ). ఆయననుండి పరమేష్ఠికి, అతనినుండి సనగునికి, వానినుండి సనాతనునికి, అతనినుండి సనారువునకు - పిమ్మట 55 గురు మహర్షుల

ద్వారా లోకమున ఈ బ్రహ్మవిద్య వ్యాప్తమయినది : ఇచ్చట సనగుడే సానగు డని గ్రహింపవలయును. సనగ-సానగ శబ్దములు, భరద్వాజ-భారద్వాజ పదములవంటివి. దీనినిబట్టి సానగాదులు శిల్పవిద్యా ప్రవర్తకులే కాక, బ్రహ్మ విద్యోపదేశికులుకూడ అని స్పష్టమగుచున్నది.

## అహాభూన ఋషి

"సంస్తుతో నారదాద్యై, స్త్వహాభూన ఋషిసత్తమః,
అశేషమునిభిః పూజ్య, స్త్వఘోరవదనోద్భవః.
యో గార్హపత్యధర్మస్య, వినిర్మాతా జగద్విభుః
త్వష్టా స్వర్ణాదిభి ర్లోహైః, పాత్రాణి వికరోతి సః."

—బ్రహ్మాండ పురాణ ద్వితీయపటలము.

నారదాదులచే స్తుతింపబడినవాడును, సర్వ మునికోటికి పూజనీయుడును అగు అహాభూనఋషి విశ్వకర్మేశ్వరుని అఘోర ముఖమునుండి పుట్టెను. జగత్ప్రభుడు అగు ఆ అహాభూనమహర్షియే గృహస్థ ధర్మమును సృష్టించినవాడు. త్వష్ట స్వరూపుడు అగు అతడు బంగారు మున్నగు లోహములచే గృహములందు ఉపయోగింపబడు పాత్రములు మొదలగువాటిని నిర్మించుటను ఎఱింగి లోకోపకారము చేసెను.

పై శ్లోకములలో త్వష్టయు, అహాభూనఋషియు ఒక్క-వ్యక్తియే ఐనట్లు వర్ణింపబడి ఉన్నది. "యోగార్హపత్య ధర్మస్య వినిర్మాతా జగద్విభుః" అనుటచేత అనంత మహిమాభిశోభితుడగు త్వష్ట గృహస్థ ధర్మమునకు నిర్మాత అని సుస్పష్టముగా తెలియుచున్నది. ఈ అంశమునుగూర్చి పలు వేదమంత్రములుకూడ త్వష్టృదేవుని మహిమను ఇట్లు వక్కా-ణించుచున్నవి.

"త్వష్టా జాయా మజనయ, త్వష్టాస్యై త్వాం పతిమ్
త్వష్టా సహస్ర మాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వామ్."
—ఏకాగ్నికాండ మంత్రప్రశ్న. అష్టమఖండము.

పై మంత్రము వివాహకాలమున వధూవరులను ఉద్దేశించి చెప్పబడుచున్నది. దాని అర్థమిది- "త్వష్ట ఈ భార్యను నీకై సృజించెను. ఈ భార్యకు భర్తగా నిన్ను ఆ త్వష్టయే సృష్టి చేసెను. అట్టి త్వష్టృదేవుడు మీ ఇరువురకును సహస్రవర్షాధికమైన దీర్ఘాయుష్యమును కలిగించుకాక!" ఇట్లనుటచేత జాయాపతులను సృష్టించి ఆయురాదికమును ఒసంగి, గార్హస్థ్య ధర్మమును నిర్మించినవాడు త్వష్టయే అని తెల్లమగుచున్నది. ఇంతియేకాక, గృహస్థాశ్రమ ఫలమగు సంతానము లభించుటకును త్వష్టృదేవుని అనుగ్రహమే కారణమయినట్లు ఏకాగ్నికాండ మంత్రప్రశ్నమే వాకొనుచున్నది.

"విష్ణు ర్యోనిం కల్పయతు, త్వష్టా రూపాణి పిగ్ంశతు,
ఆసించతు ప్రజాపతి, ర్ధాతా గర్భం దధాతు తే."

ఈ గర్భాధానమంత్రమునందు త్వష్ట గర్భస్థ పిండమునకు రూపమును కల్పించుచున్నాడని వ్యక్తమగుచున్నది.

"త్వష్టా వై రేతస స్సిక్తస్య రూపాణి వికరోతి"
— యజుః. కాం 2. 6. 10. 3.

"త్వష్టారగ్ం రూపాణి వికుర్వన్తం విపశ్చిమ్"
—ఆరణ్యక ప్ర. 3-11-2-10.

త్వష్ట గర్భమునం దుంచబడిన తేజస్సుచే రూపములను చేయుచున్నాడనియు, త్వష్టను రూపనిర్మాణమున పండితునిగా ఎంచుకొందు

రనియు అనుటచేత ఆ దేవునకు గార్హస్థ్యధర్మమును నిర్మించుటలోకల ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది.

"త్వష్టా వై పశూనాం మిథునానాం రూపకృత్."
—తైత్తిరీయ సం. 6. 3. 6.

"త్వష్ట జీవులకు, మిథునములకు రూపములను కల్పించును." అహభూనఋషి గృహస్థధర్మమును సృష్టించెననెడి బ్రహ్మాండపురాణ వాక్యమును, త్వష్ట జాయాపతులను సమకూర్చి రక్షించునను వేదవాక్యములును పరస్పరము సమన్వయించుచు అయ్యిరువురికిని అభేదమును తెలుపుచున్నవి.

ఇంకను-త్వష్ట, ప్రజాపతి అయినట్లును, లౌకికాలౌకిక శిల్పములకు నాయకుడు అయినట్లును, స్వర్గహితమునుకోరి తన శిల్పకౌశలమును ప్రదర్శించినట్లును అనేక శ్రుతి పురాణ వాక్కులచే తెలియుచున్నది. వైదిక కర్మలయందును, వేదమునందును బహుళ ప్రచారము కలిగి అడుగడుగునను ఆహూతుడగు దేవుడు త్వష్ట అనెడి సంగతి వేదవాఙ్మయమును ఎఱింగిన ధీమంతులకు తెల్లమగును. త్వష్టృదేవుని ప్రభావమును, తచ్చరిత్రమును ఎఱుంగగోరువారు "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" నందలి త్వష్టృపకాండమును చదువదగును.

"త్వష్టౄణాం తామ్రకర్మాణి" అనుటచేత అహభూనఋషి పాత్రాది నిర్మాణములను గనిపట్టి లోకోద్ధరణముచేసి-రాగి, ఇత్తడి, కంచు మున్నగు ధాతువులచే చేయబడు శిల్పములకు నాయకుడై వెలసెనని తెలియుచున్నది.

## ప్రత్న ఋషి

"ప్రత్నో విశ్వస్య కర్తాసౌ, జగద్రక్షాపరాయణః,
బ్రహ్మోదఙ్ముఖా జ్జాతః, ప్రవరః ప్రత్నసంతతేః."

—బ్రహ్మాండపురాణము.

"విశ్వకర్తయు, జగద్రక్షాపరుడును అగు ప్రత్నఋషి విశ్వకర్మ ఉత్తరముఖమున జనించెను. ఇతడు ప్రత్నసంతతికి మూలపురుషుడు అయ్యెను. పై శ్లోకములో ప్రత్నఋషిచేసిన శిల్పమును ఇది అని వక్కాణింపలేదు. అయినను "శిలాకర్మ చ శిల్పినాం" మొదలగు వచనములచేత, శిల్పిబ్రహ్మగా గణుతికెక్కిన ప్రత్నఋషి శిలాశిల్పమునకు ఉపదేష్టయై నానావిధ దేవతామూర్తులయు, దేవాలయ, మండప, గోపుర, ప్రాకారాదులయు నిర్మాణమును కనిపట్టి లోకమును తరింపచేసెనని తెలియుచున్నది.

## సుపర్ణ ఋషి

"మహోన్నతో మహాత్మా వై, పీనవక్షా స్సుసుందరః,
అనాదినిధన స్స్వర్ణ, స్సుపర్ణ స్తస్య నామహి,
స్వర్ణం దదాతి లోకానాం, బ్రహ్మణూర్ధ్వ ముఖోద్భవః,
కిరీట కుండలాదీనాం, భూషణానాం ప్రయోజకః."

బ్రహ్మాండపురాణము.

మహోన్నతుడును, మహాత్ముడును, అందగాడును, ఆద్యంతములు లేనివాడును అగు సుపర్ణుడనెడి మహర్షి విశ్వకర్మ ఊర్ధ్వముఖమున పుట్టెను. ఈ మహాత్ముడు సువర్ణ శిల్పమునకు ప్రయోజకుడై

కిరీటకుండలాది భూషణముల నిర్మాణమును ఉపదేశించెను. ఈ ఋషులను వసిష్ఠపురాణము విశ్వకర్మ ముఖోద్భవులని చెప్పగా, బ్రహ్మాండ పురాణము బ్రహ్మముఖోద్భవులని చెప్పుచున్నది కావున, బ్రహ్మ విశ్వకర్మలకు అభేదమే అని పాఠకులు గ్రహింపవలయును. బ్రహ్మ విశ్వకర్మలకు అభేదము శ్రుతి సమ్మతమే।

ఈ సానగాదిఋషులే సృష్టిప్రవర్తకులగుటచేత, మనుమయాది బ్రహ్మలుగకూడ వర్ణింపబడిరి. ఋషులకును, ఈ బ్రహ్మలకును అభేదమే తోచుచున్నది సానగాదులవలె మనుమయాదులును విశ్వకర్మ పంచ ముఖములనుండి అవతరించి పంచకర్మలకును ప్రవర్తకులైనట్లు స్కాందాది పురాణములందు చెప్పబడి ఉన్నది—

"మను, ర్మయ, స్తథా త్వష్టా, శిల్పి, విశ్వజ్ఞ, ఏవచ,
విశ్వకర్మ సుతా హ్యేతే, పంచ సృష్టిప్రవర్తకాః."
—స్కాంద నాగర ఖండము.

సృష్టి ప్రవర్తకులగు—మనువు, మయుడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుడు- అను అయిదుగురును విశ్వకర్మ యొక్క కుమారులు.

"భూత్వాథ పురుషాకారో, విశ్వకర్మాదిపూరుషః,
ప్రతీకే ష్వసృజ ద్దేవాన్, విశ్వోత్పత్తి చికీర్షయా,
ముఖేభ్యో బ్రహ్మణః పంచ, జాతా మన్వాదయః క్రమాత్,
మను, ర్మయ, స్తథా త్వష్టా, శిల్పి, విశ్వజ్ఞ, ఏవ చ."
—విశ్వకర్మ పురాణము.

"ఆది పురుషుడగు విశ్వకర్మ * పురుషాకారమును దాల్చి విశ్వమును సృష్టించు ఇచ్ఛచేత తన అవయవములయందు దేవతలను సృజించెను. విశ్వపురుషుని అవయవములనుండి నానాదేవతలు సంభవించిన విషయము పురుషసూక్తమునందును, ఇతర వేదవాఙ్మయమునందును సుప్రసిద్ధమై ఉన్నది. ఆ విశ్వకర్మబ్రహ్మ ముఖములనుండి మనువు, మయుడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుడు-అను ఐదుగురు బ్రహ్మలు ఉద్భవించిరి."

సృష్ట్యాదిమకాలమున పరమేశ్వరుని ముఖములనుండి ఉద్భవించిన వీరు జ్ఞానవిజ్ఞానములకు ప్రభువులై లోకసంతరణ సాధనములగు యజ్ఞశిల్పములను ఉత్పాదించి ప్రజాజీవనము భద్రమార్గమున నెలకొనుటకు కృషి సల్పిఉండిరి. ఈ విషయమును శిల్పోపనిషత్తుకూడ వక్కాణించుచున్నది. మనుమయాదులు ఆ యా శిల్పములకు నాయకులైరను విషయము పద్మపురాణ భూఖండమునందును, స్కాందమునందుకూడ కాంచనగును.

ఇంకను మనుమయాదులకును, సానగాదులకును అభేదమునుచెప్పు వాక్యములును, వారు ఏఏ విధముల లోకమునకు జ్ఞానవిజ్ఞానములను ప్రసాదించిరను విషయములను చెప్పుసూక్తులు పెక్కులు పురాణాదులయందు కలవు. విస్తరభీతిచే ఉదాహృతములు కాలేదు. ఈ మన్వాదులు వేదధర్మములకు ప్రవర్తకులై యజ్ఞశిల్పముల ద్వారమున అతిప్రాచీన కాలమున లోకసేవ చేసిరని స్కాందపురాణ నాగరఖండము పలుకుచున్నది.

---

* పురుష సూక్తమునందు చెప్పబడిన పురుషుడే ఈ విశ్వకర్మ అని గ్రహింపవలయును.

"ఋగ్వేదశ్చ మనూనాంచ, మయానాం యాజుషం తథా,
త్వష్టౄణాం సామవేదశ్చ, దైవజ్ఞానాం త్వథర్వకః,
శిల్పినాం ప్రణవం చైవ, గాయత్ర్యం చ సమాచరేత్."

ఈ విధముగా పంచర్షులు, లేదా పంచబ్రహ్మలు విశ్వకర్మముఖో ద్భూతు లనుటచేతను, శివవిష్ణ్వాది పంచమూర్తులు విశ్వకర్మయొక్క పంచాననములచే సూచింపబడు అయిదు కర్మములకు అధిపతులై పంచ మూర్త్యాత్మకుడు అగు విశ్వకర్మలో అంతర్భూతు లగుటచేతను అనిర్వ చనీయమగు దైవశిల్పమునకును, లోకప్రవృత్తికి కారణమగు మానుష శిల్పమునకును చక్కని సంబంధము కుదురుచున్నది. సానగాదులు విశ్వకర్మయొక్క సమష్టి వ్యష్టితత్త్వములను అర్థము చేసికొన్నారు కావు ననే- శైవ, వైష్ణవ, బ్రాహ్మ, ఐంద్ర, సౌరములనెడి అయిదు మతము లనుకూడ సృజించి మూర్త్యుపాసనముద్వారా వ్యష్టితత్త్వమునుండి సమష్టి తత్త్వమునకుచేరు రీతులనుకూడ ఉపదేశించి మతప్రవర్తకులును అయిరి. శక్తితత్త్వమునకు ప్రాధాన్యము ఇచ్చినప్పుడు, శాక్తేయముకూడ ఒక మతము కాగలదు ఈ విషయములు అవాంతరముగా ముచ్చటింపబడు చున్నవి కావున, వీటి సమగ్రస్వరూప విషయమున పాఠకులు సందేహా గ్రస్తులు కానక్కఱ లేదు. ఈ విధముగా పంచసంఖ్య తత్త్వమును, పంచభూత-పంచకర్మల రహస్యములను మననము చేసి కృతార్థులైన వీరు పంచమూర్తులుగనే భావింపబడిరి.

గీ॥ మనువు శివుఁడును, మయుడు రమాధవుండు,
త్వష్ట పరమేష్ఠి, శిల్పి వృద్ధశ్రవుండు,
తక్ష భానుండునగు, వీరు దైవగురులు-
విశ్వకర్మాగ్రనందనుల్ వినుతపుణ్య!"

—తెలుగు నాగరఖండము

ఇట్లే ఋషులును, బ్రహ్మలును, మూర్తులును విశ్వకర్మతత్త్వము నందును, విశ్వకర్మ స్వరూపమునందును సమరసముగా సమన్వితులై ఏకీభవించుచున్నారు. అట్లే పంచశక్తులును సమష్టిశక్తియగు గాయత్రీ దేవియొక్క భిన్న స్వరూపములే అనియు భావింపవలసి ఉన్నది.

సానగాదులు ప్రకృతిలో వ్యక్తముగా మనకు పొడకట్టుచున్న పృథివ్యప్తేజో వాయ్వాకాశములనెడి అయిదు భూతములలో ఒక్కొక్క భూతమును ఒక్కొక్కరు మననముచేసి, వాటిచేనగు లోకోపకారక కార్యములను వెల్లడించినారని వైజ్ఞానిక దృష్టికి తట్టుచున్నది. శిల్ప శాస్త్రములో యంత్రశిల్పమునుగూర్చి విచారించినచో, ఆ శిల్పమునకు పంచభూతముల తోడ్పాటు ఆవశ్యకమని తెలియుచున్నది.

"యదృచ్ఛయా ప్రవృత్తాని, భూతాని స్వేన వర్త్మనా,
నియమ్యాస్మి న్నయతి య, త్త ద్యంత్ర మితి కీర్తితమ్.
తస్య బీజం చతుర్ధా స్యాత్, క్షితి రాపోఽనలోఽనిలః,
ఆశ్రయత్వేన చైతేషాం, వియద ప్యుప యుజ్యతే."

అను సమరాంగణసూత్రములోని శ్లోకములనుబట్టి స్వేచ్ఛాప్రవృత్తితో కూడుకొనిన భూతములను యమించి పనిగొందురుగాన "యంత్ర" మనియు, అద్దానికి భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనునవి బీజములనియు చెప్పబడెను. ఇంకను ఈ విస్తరము ఆ గ్రంథమునందు కాననగును. దీనినిబట్టి చూచిన పై మహర్షులు ఏ విధముగా ఆ యా భూతములను భౌతికాధ్యాత్మిక ప్రయోజనములకు వినియోగించుకొని ప్రజా ప్రయోజనమును సంపాదించియుండిరో అని ఆశ్చర్యము గలుగకపోదు.

మనుమయాదులు వరుసగా అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణము లచే వెలయింప తగిన అయిదు శిల్పములకే ప్రవర్తకులన్నను, ఒక్కొక్కరు తదితర శిల్పములను ఎఱుంగరని అర్థముకాదు. ఒక్కొక్కరు ఒక్కొక్క భూతమునకును, ఒక్కొక్క కర్మమునకును ప్రాధాన్యమునిచ్చి వాటిని మననము (Study) చేసి ప్రచారము ఒనర్చినారని గ్రహింప వలయును. ఈ అంశములే మనుమయాదులు ఉపదేశించిన శిల్పవాస్తు గ్రంథములవలనను తెలియుచున్నవి.

పంచాననోద్భూతులగు ఈ ఋషుల, (బ్రహ్మల) వంశపు బ్రాహ్మణులే క్రమముగా పంచాలురని (పంచకర్మలచే లోకమును అలంకరించు వారని వ్యుత్పత్తి)యు, పంచాణము వారనియు, విశ్వకర్మజులగుటచే విశ్వకర్మ బ్రాహ్మణులు, విశ్వబ్రాహ్మణులు, వైశ్యకర్మణులు-అనియు అనేక నామములచే ప్రసిద్ధులైరి. నాటికీ నేటికీ, శిల్పసంప్రదాయములో ఈ పంచసంఖ్య విశ్వకర్మ తత్త్వవర్ణకమై ప్రాధాన్యము వహించుచు వచ్చినది. హైందవశిల్పులు, బౌద్ధమత వ్యాప్తికాలమున - బౌద్ధశిల్పము నందును, తమ శిల్పసంప్రదాయములోని పంచసంఖ్యను విశ్వకర్మ తత్త్వ ద్యోతకముగా వీలైనతావులందు ఇమిడ్చియే ఉన్నారు. బౌద్ధస్తూపము లందు ప్రాకారమునకు నాల్గుదిక్కులద్వారములనుఉంచి నడుమ స్తూపము ఉంచుటలోను, స్తూపమునకు నలుదిక్కుల ఐదేసి ఆర్యక స్తంభములను ఏర్పాటు చేయుటలోను శిల్పాచార్యుల విశ్వతత్త్వ ప్రదర్శనాభిలాష వ్యక్త మగుచున్నది. అన్యమతమువారికి సైతము సత్యసమన్వితమతమును బోధించుటకు హైందవశిల్పులు సల్పిన కృషి ఇట్టిది.

ఈ గ్రంథముచేత ఆదిమ శిల్పప్రవర్తకులు సంగ్రహముగా పరిచితులైరి. వీరికి మూలభూతుడగు విశ్వకర్మ చరిత్రము పూర్వాధ్యా

యమునకూడ కొంత ఎఱుకపడెను. శిల్పోపదేశకపరంపరలో ఎఱుంగదగిన మఱొక మహాచార్యుడు—

## విశ్వరూపుడు

"విశ్వకర్మ సమారంభాం, విశ్వరూపార్య మధ్యమామ్,
"అస్మదాచార్య పర్యన్తాం, వన్దే గురుపరంపరామ్."

స్థాపత్య వేదగురుపరంపరను, బ్రహ్మవిద్యా గురుపరంపరను సంగ్రహముగా ధ్యానించు నప్పుడు ఉత్తమ సంప్రదాయమునకు చెందిన ప్రతిశిల్పాచార్యుడును, బ్రహ్మ జిజ్ఞాసువును పై విధమున గురుస్తోత్రము చేయుదురు. దీనినిబట్టి చూచిన విశ్వరూపుడు శిల్ప-బ్రహ్మ విద్యోపదేశక మధ్యముడుగా కన్పట్టు చున్నాడు.

"విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్."
—యజుర్వేదము. 2-5-1.

విశ్వరూపుడు కొంతకాలము ఇంద్రపురోహితుడుగా ఉన్నాడు. ఈతడు విశ్వకర్మ తనయుడగు త్వష్టబ్రహ్మ కొడుకు. మూడుశిరములు కలవాడు.మహాతపస్వి. అఖండ బ్రహ్మ తేజోవిరాజితుడు తన అద్వితీయ శిల్పచాతుర్యముచేతను,ప్రతిభావిశేషము చేతను దేవాసురులకుసంధికూర్ప యత్నించి ఇంద్రుని ఆగ్రహమునకు గుఱియైనాడు. త్వష్టపుత్రుడగు ఈ విశ్వరూపుడు బృహదారణ్యకోపనిషత్తు చెప్పిన బ్రహ్మ విద్యోపదేశికులలో 14 వ వాడు. అందుకే ఈయనను బ్రహ్మవిద్యాగురు పరంపరలో మధ్యముడుగా పేర్కొనుట యైనది.

## క శ్య పు డు

సానగాదులవలెనే కశ్యప ప్రజాపతియు మహాశిల్పాచార్యుడే. ఈతని శిల్పమునుగూర్చి కృష్ణయజుర్బ్రాహ్మణ ద్వితీయాష్టకమునందలి సప్తమ ప్రపాఠకములోని ఒకమంత్రమును చూతము.

"యత్తే శిల్పం కశ్యప రోచనావత్
ఇంద్రియావ త్పుష్కలం చిత్రభాను,
యస్మిన్ త్సూర్యా అర్పితా స్సప్త సాకమ్
తస్మిన్ రాజాన మధివిశ్రయేమమ్."

ఈ మంత్రము కశ్యపుని శిల్పము– "కాంతిమంతమును, వీర్యవత్తరమును, చిత్రవిచిత్రమును, సంపూర్ణమును - అని చెప్పుచున్నది. ఇట్టి శిల్పముగల కశ్యపుని ప్రాసాదమున రాజునకు ఆశ్రయము ఈయవలసిన"దని కోరబడుచున్నది. యేభి శ్శిల్పైః...." (చూడు 42 వ పుట) అను మంత్రమును, "యత్తే శిల్పమ్...." అను ఈ మంత్రమును రాజపట్టాభిషేక సమయమున వినియోగింపబడునట్టివి. కశ్యపుడు మహాశిల్పాచార్యుడు కావుననే, అతని శిల్పప్రభావముచే సంస్కార సౌందర్యములను పొందిన భూమి "కాశ్యపి" అని పిలువబడినది. కాశ్యపీ శబ్దమునకు గల వ్యుత్పత్తులలో ఇదియే మిక్కిలి సమంజసమైనదని తోచుచున్నది. కశ్యపుడు వ్రాసిన శిల్పశాస్త్రములలో — "శిల్ప సంహిత, కాశ్యప శిల్పము, అంశుమాన భేదకల్పము"— అనునవి గణనీయములు. నైమిశారణ్యమున విహరించిన మహర్షులలో "సంకృతి, కళాధరుడు" అను శిల్పాచార్యులు అగపడుచున్నారు. ఇంకను శిల్పప్రవర్తకులగు

ఋషులు "గోత్రకాండము'' మున్నగు గ్రంథముల వలనను పేర్కొనరు తెలియబడుచున్నారు ఈ విధముగా ప్రాచీన శిల్పఋషులు శిల్ప-సారస్వత విద్యలచేత లోకమును సేవించియున్నారు.

"శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణలక్షణమ్.''

— మహాభారతము.

శిల్పము చేయుట, వేద శాస్త్రాధ్యయనము
ఒనర్చుట సంపూర్ణ బ్రాహ్మణ లక్షణములు.



నటరాజశిల్పం
అలంపురం మ్యూజియం

# దేవాలయ శిల్పము

"కాలతస్కర కర తిరస్కార చణము
నాపురాతన శిల్ప సౌందర్య ధనము,
కనుము ! ఆసేతు హిమవన్నగ ప్రసిద్ధ
భవ్యదేవాలయంబులఁ బరగు నిపుడు."

—శ్రీగోనుగుంట పున్నయ్యగారు.

"చిన్మయస్యా ద్వితీయస్య, నిష్కలస్యా శరీరిణః,
ఉపాసకానాం కార్యార్థం, బ్రహ్మణో రూపకల్పనా."

"సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా."

—కులార్ణవతంత్రము.

హిందూదేశమునందు ఇంతవఱకును వెలసిన శిల్పములలో శిలాశిల్పము అగ్రస్థానము వహించుచున్నది. మనపూర్వుల వ్యవహారమునందు శిల్పమన్న శిలపై తీర్చిన ఆకార విశేషమునకే ప్రధానముగా చెల్లినట్లును గమనింపగలము. నేటికిని శిల్పశబ్దమునకు అట్టి అర్థస్ఫురణము లేకపోలేదు. పూర్వము పంచవృత్తులొనర్చువారిలో శిలానిర్మాతకు శిల్పిశబ్దమును ప్రత్యేకముగా వాడియుండుటయు ఇందులకు ఒక నిదర్శనము. శిలా-శిల్పశబ్దములలో అక్షరసాదృశ్యముఉన్నదిగనుక, శిలాశబ్దము నుండి శిల్పశబ్దము పుట్టిఉండవచ్చుననియు కొందఱు భాషావేత్తలు చెప్పుదురు. ప్రాచీనకాలములో రాగి మున్నగు వాటియందును శిల్పము వెలసినను, తొంబది తొమ్మిదిపాళ్ళు శిలాశిల్పమే విస్తరించినదని ఇప్పటికిని లభించుచున్న పురాతన చిహ్నములనుబట్టియు, కొండలయందు, కోనలయందు కల దేవాలయాదులనుబట్టియు స్పష్టముగా ఎఱుంగవచ్చును.

భారతీయుల యీ శిలాశిల్పము వేయివిధముల రూపొందినను, అందు ప్రతిమాశిల్పము, దేవాలయశిల్పము పవిత్రమును, ప్రధానమును అగు స్థానమును ఆక్రమించుచున్నవి. చిన్మయుడు, అద్వితీయుడు, అశరీరుడు అగు బ్రహ్మమునకు రూపకల్పనము-ఉపాసకులు తరించుటకే అని కులార్ణవ తంత్రవాక్యములు చాటుచున్నవి. ఔను. అద్వితీయాఖండ బ్రహ్మమును మానవుడు పరిచ్ఛిన్నములగు ఇంద్రియాదులతో ఆరాధింపవలెనన్న అట్టి దివ్యశక్తికి రూపకల్పనము చేయకున్న ఎట్లు సాధ్యము ? హైందవశిల్పులు అట్టి యీశ్వరతత్త్వమును లోకమునకు వ్యక్తము చేయుటకు అవలంబించిన దేవాలయ నిర్మాణ విధానము అద్భుతమైనది. హిందూ దేశమునందు ఏ మూల చూచినను, ఏ కొండపై కాంచినను, ఏ నదీపరిసరములందు, అరణ్యములందు చూచినను-దేవతా మూర్తులు, దేవాలయములు అద్భుత శిల్పకౌశలములతో మనకు దర్శనమిచ్చుచున్నవి. ఈ దైవమూర్తులను సేవించి, జన్మధన్యము చేసికొనుటకు—ఈ సుందర శిల్పములను కాంచి, నేత్రసాఫల్యము నంది సౌందర్య తృష్ణను తీర్చుకొనుటకు - దూరమనికాని, కష్టమనికాని ఎంచుట లేదు. నదులను దాటి, అరణ్యములను గడచి, పల్లములను లంఘించి, మెట్టకలను ఎక్కి, కొండలమీదికి ఏగి నానాశ్రమలను సహించియైనను జనులు దైవసేవకు పరుగిడుచున్నారు. ఒక్క శ్రీశైలయాత్ర ఎంత కష్టమగుచున్నదో చూడుడు. అట్లే తిరుపతి, అరుణాచలము మున్నగు క్షేత్రములును. "మానవుని కష్టసహిష్ణుతను, సేవాదీక్షను, త్యాగభావమును, సత్యవిరతిని పరీక్షించి కాని భగవానుడు దర్శన మీయడా!'' అన్నట్లు ఈదేవతలు కొండలమీదికి ఎక్కి కూర్చుండినారని తోచును. అత్యద్భుతములగు ఈ దేవమందిరములను అరణ్యసీమయందును, పర్వతాగ్రములయందును, నదీపరిసరములందును నిర్మించుటలో మనశిల్పఋషులు, శిల్పాచార్యులు

కేవలము దైవారాధనమును మాత్రమే ఉద్దేశింపక, ఈశ్వరుడు సృజించిన దివ్యప్రకృతినికూడ మన కన్నులకు సాక్షాత్కరింపచేసి, దానితో తాదాత్మ్యమును పొందించి, పరాప్రకృతిలో ఐక్య మొనర్చుటకుకూడ ఉద్దేశించిరి. ఒక్కొక్క పుణ్యక్షేత్రమునకు యాత్ర సల్పునపుడు ప్రకృతిలోని భవ్యదృశ్యములను కాంచి మనము పొందెడి ఆనందమునకు మేర ఉండునా! చిత్తము ఉప్పొంగిపోవ ఈశ్వరుని దివ్యశిల్పమునకు కైవారముచేసి, ప్రకృతి గర్భమునుండి పరమేశ్వరుని హృదయవిభూతిని కూడ చూడగోనమా! ఒక్కొక్క దివ్యక్షేత్రములో కల పలు తీర్థములందు క్రుంకువెట్టుటచేతను, అందలి పావనోదకములను పానము చేయుటచేతను శారీరక వ్యాధులుకూడ ఉపశమించును. దివ్యప్రకృతిని, దేవుని దర్శించి సేవించుటచే చిత్తమాలిన్యము క్షాళితముకాగా, హృదయ నైర్మల్యము చేకూరి మనస్సునకు ఈశ్వర సాక్షాత్కార యోగ్యత లభించును. పవిత్ర దైవసన్నిధానము అగుటవలన అనృతభాషణాదులు దూరమై వాఙ్నియమము చేకూరును. ఈ విధముగా త్రికరణముల సంశుద్ధి నేర్పఱచి తరింపజేయుటకు పుణ్యదేవాలయములు సృష్టింపబడినవి.

తిరుపతి కొండనుగూర్చిన రహస్యమును ఎన్నడేని భావించి చూచినారా? ఏడుకొండలకు పైని వేంకటేశ్వరుని ప్రతిష్ఠించుటలోని ఉద్దేశ్యమేమి? ఇది మహాద్భుతమగు ఆధ్యాత్మిక రహస్యమును చాటుచున్నది. యోగరీతిని, శ్రీవిద్యాసంప్రదాయము (శాక్తేయము) ను అనుసరించిన వేదాన్త దృష్టితో చూచినయెడల శరీరమునందు ఏడుచక్రములు ఉన్నవని గ్రహింపగలము. అవియే ఆధారము, స్వాధిష్ఠము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, సహస్రారము-అనునవి. అధోముఖమైన కుండలినీశక్తిని యోగాభ్యాసముచే ఊర్ధ్వగామినినిగా చేసి జీవత్మను ఈ చక్రములమీదుగా సహస్రారమునకు పయనింప చేసినయెడల

అక్కడ పరమాత్మానుసంధానము చేకూరి, బ్రహ్మానందము, నిరతిశయ మోక్షము సిద్ధించును. జీవుడు దిగువ చక్రములమీద సంచారము చేయు నప్పుడు నానాభ్రాంతులకు, వాంఛలకు, శుభాశుభ సంకల్పములకు గుఱియై సుఖదుఃఖములను కాంచుచుండును. సహస్రార పద్మమునకు చేరినపుడే పరబ్రహ్మ సాక్షాత్కారము, నిర్వికల్పానందమును। ఈ సంద ర్భమున ఎఱుంగదగిన షట్చక్ర రహస్యములు అనేకములు ఉన్నవి. అవి ఉపాసకైక వేద్యములు *. ఈ రహస్యమే యేడుకొండలపై దేవుని ప్రతిష్ఠించుటలో పొడకట్టుచున్నది. యాత్రికులు ఆఱు కొండలయందును పెక్కు కడగండ్లనుపొంది,ఏడవకొండను ఎక్కిననే అక్కడ దైవ సాక్షా త్కారము; ఆత్మశాంతి. ఇట్టి చక్రరహస్యమునే "ఏడుమెట్ల నిచ్చెన వేసికొని, పూజకు నే నొస్తి బ్రహ్మము పూజకు నే నొస్తి" అని సిద్దప్ప మనోజ్ఞముగా వచించినాడు. ఉత్తమ సాధకులు అభ్యసించు ఈ యోగరహస్యమునే ఏడుకొండలమీది దేవాలయము సూచించుచున్నది. శాక్తేయులకు అవశ్యాచరణీయమగు ఈ యోగమునకు అనుగుణముగ తిరుపతి దేవాలయములో మొట్టమొదట శైవదైవతమే ఉండెడిదనియు, రామానుజాచార్యుల కాలమున అది వైష్ణవాలయముగా మాఱినదనియు తెలియుచున్నది •. శివకేశవులలో ఎవరైనను ఒక్కటేకాని, ఈ రహస్యమును సూచించుచు, ప్రకృతి సౌందర్యమును కన్నులకు ట్టుచు, దివ్యతీర్థములందు అవగాహన మొనరింప జేయుచు, దేవతా

---

* షట్చక్ర రహస్యములు మదీయ "యోగదర్శనము"న వివరింప బడినవి. జిజ్ఞాసువులగు పాఠకులు ఆ గ్రంథమును తిలకింప వచ్చును.

• ఈ గ్రంథకర్త వ్రాసిన "కళారాధన" నవలలో ఈ అంశము విస్తరింపబడి ఉన్నది.

మూర్తిని అచ్చట ప్రతిష్ఠ చేసిన మహనీయుల ఆదర్శము ఎంతగొప్పదో భావింపుడు! ఇంకను తిరుపతి కొండలమీదుగా ఆ యా తీర్థములను సేవించుచు పోయినచో, శ్రీశైలక్షేత్రమువఱకును ఆ కొండలు బాట నీయగలవు. శేషాకారమగు (శేషశైలము) ఈ కొండలకు నడుముగా ఎంచబడిన నడిమి భాగమున - అహోబలక్షేత్రమున, నరసింహస్వామి ఉన్నాడు. ఈ విధముగా ఒకే పర్వతపంక్తిమీద శివకేశవులకు ఇద్దఱకును కల ఈ అనుసంధానము "శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే" అను అద్వైత స్థితికి తార్కాణమై ఉన్నది. ఈ రీతిని ఒక్కొక్క మహాక్షేత్రమున ఎన్నెన్ని ఆధ్యాత్మిక రహస్యములు ఇమిడి ఉన్నవో బహిరంతర్దృష్టిగల ఉపాసకులు భావింపవలయును.

జీవునకు దేహమువలె, సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మకును శరీరమువోలె వెలయు దేవాలయమును ఒక్కసారి తిలకింతము రండు. శిల్పిచంద్రుడు ఎంత మనోజ్ఞముగను, అర్థవంతముగను, ప్రయోజనకరముగను ఈ దేవాలయమును సృష్టించినాడు! మనకువలెనే ఆలయమునకును సర్వావయవములు ఉన్నవే; ఇది విశ్వపురుషుని ఆకారమా యేమి! అవిగో, పాదములవలె ఉన్న ఆ పాదశిలలను కాంచి మ్రొక్కులిడుడు. వాటికి పై భాగమున పిక్కలవలెనున్న ఊాల సౌందర్యమును విలోకింపుడు. నడుమువలె ఉన్న ఆ మేఖలలను, అపానమువలె ఉన్న సోమసూత్రమును కాంచుడు. అవిగో, మన చేతులకు కర్మశక్తిని ఒడగూర్చుచున్నవా అన్నట్లున్న ఆలయ స్తంభములే విశ్వపురుషుని బాహువులు. వాటి నొక్కసారి పరామర్శించి చూడుడు. ఓహో! ఎంతటి మనోజ్ఞశిల్పములు! ముప్పదిమూడు కోట్ల దేవతలును ఈ బాహువు (స్తంభము) లయందే నృత్యము చేయుచున్నారే! ప్రకృతిలోని సుందర సుందర లతాదృశ్యములు అన్నియు ఇక్కడనే ఉన్నవే! నాట్యవేద

మంతయు ఇక్కడనే రూపెత్తినదే। ఔను, విశ్వపురుషుని దేహమునందే ఈ చరాచర ప్రకృతి అంతయు ఇమిడిఉన్నది కదా. అదే, ఉదరముం బోలిన గర్భాలయము ! ఆ దేవాలయములోని దీపమును జూచితిరా ? ప్రాణమువలె ప్రకాశించుచున్నది. దాని కాంతియే ఆలయపురుషుని చక్షువు. ఘంటయనెడి నాలుకతో మనలను ఎట్లు ఆలయపురుషుడు పిలుచుచున్నాడో వినబడుట లేదా ? నాభివంటి ఆ బ్రహ్మస్థానమును, అహంకారమువంటి పాదచారమును, ముక్కువంటి శుకనాసమును, చెవివంటి గవాక్షమును, కంఠమును బోలిన అమలసారికను, మేదస్సువలెనున్న గచ్చును, అస్థులవలెనున్న శిలలను, మూపువంటి కాయపాలిని చూచి భావింపక ఆలసించెదరేల? అది గదిగో శిరస్సు. సర్వోన్నతమగు ఆ కలశమును దాని సౌందర్యమును చూడ మఱువకుడు. శ్రీశైలక్షేత్రమునందు ఈ శిఖరమును కాంచియే ప్రాణి పునరావృత్తి రహితమగు శాశ్వతస్థానము నందును. (శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే) ఇన్ని అవయవములతోకూడిన ఈ దేవాలయపురుషునికి ఆత్మ అందలి దైవప్రతిమ*. అది ఏ ఆకారముతో ఉన్నను, ఏ నామముచే పిలువబడుచున్నను మనము రాగద్వేషములు వహింపరాదు. వినమ్రభక్తి భావముతో నామరూపములకు ప్రాధాన్య మీయక వాటిచే సూచితమగు జగత్కారణ పరమతత్త్వమునే మనము అనుసంధానము చేయవలెను. ఆలయములోని స్వామికి ప్రతిమ ,ప్రతీక, ప్రతికృతి-మున్నగు పదములు ఉపయోగింప బడుచున్నవని మనమెఱుగుదుము. వాటి అర్థమేమి ? జగదీశుని స్మరణ, ధ్యాన, పూజనములకు ఇవి ప్రతినిధులవంటివని ఆశబ్దముల అవయవార్థము స్పష్టము చేయుచున్నది. ఈశ్వరునికి ప్రతినిధి

---

* దేవాలయము విరాట్పురుషుని ఆకారమను విషయము శిల్పశాస్త్రములో చక్కగా వర్ణింపబడినది.

వంటిదగు ఈ ప్రతిమచేత మూలతత్త్వమును అనుభూతికి తెచ్చుకొనవలెను. లింగశబ్దమును చూడుడు. లింగమనగా చిహ్నమని అర్థము. పరమాత్మకు ఇది చిహ్నము వంటిదని ఆదిమకాలమున ఈ శబ్దము ప్రచారములోనికి వచ్చినది.

దేవాలయ స్వరూపములో ఒక్కతత్త్వము మాత్రమేకాదు; సౌందర్యము, ప్రయోజనముకూడ వలసినంతగా ఉన్నవి. సౌందర్యము ముమ్ముందు దృష్టిని ఆకర్షించును. తరువాత ఆ యా భాగములు ప్రయోజనములను కలిగించును. అనంతరము ఉత్తముడగు దైవారాధకుడు ఆధ్యాత్మిక రహస్యములను ఎఱింగి తరించును. ఆలయములో ముందు ప్రతిమాస్థాపనమునకు వలసిన భాగము గర్భము. ఇది హృదయము వంటిది*. హృదయ స్థానములో ఆత్మయుండును కావున ఇది ప్రధాన భాగము. తరువాత చెప్పతగినది అంతరాళము. ఇది గర్భాలయమునకు ముందటిభాగము. ఇందు ఉత్సవ విగ్రహములు మొదలగునవి ఉండును. దైవదర్శనార్థులు ఇచ్చట నిలువబడి దేవుని దర్శింతురు. దీనికి పిమ్మట శుకనాసము ఉండును. కొందఱు ఈ శుకనాసమునే అంతరాళముగకూడ భావింతురు.తరువాత చెప్పదగినది ముఖమండపము. ముఖమండపమునందు పరివారదేవతలు, అప్రధానములగు ఇతరదైవతములు ఉండవచ్చును. ఇది దర్శనార్థులకు విశ్రాంతి స్థానముగాను ఉపయోగించును. ఈ మూడు భాగములును కాళహస్తి దేవాలయములో దర్శనీయములై ఉన్నవి. ఆలయమునందు నియమిత భాగమున ధ్వజస్తంభము, దానికి ఆవల ప్రాకారము ఉండును. ఈ ప్రాకారకుడ్యములకు లోపల యాత్రికుల

---

* హృది, అయం= (హృత్ + అయం) హృదయం. అనగా హృదయమునందే ఆత్మ ఉండును కావున, హృదయశబ్దము సార్థకమని ఉపనిషత్తు పలుకుచున్నది.

విశ్రాంతికై శాలలు కట్టబడి ఉండును. ప్రాకారములకు నలువైపులను గోపురములు, ప్రాకారమునకు లోబడి అనేక మండపములు నిర్మితములై ఉండును. గర్భాలయము మొదలుకొని తక్కిన భాగములు అన్నియు శాస్త్రీయ పరిమాణముల ప్రకారము కట్టబడి ఉండవలెను. ఆలయములో ముఖ్యమగు ప్రతిమ కొలతనుబట్టి గర్భాలయము, ధ్వజము మున్నగునవి అమర్పవలెను. ప్రాకారాంతర్భాగమున నవగ్రహములయు, సప్తమాతృకలయు, ఇంక ఇతర దేవతలయు గుళ్లు నిర్మింపవచ్చును. ప్రధాన దేవాలయముచుట్టును కల్యాణమంటపము మొదలగు పెక్కు మంటపములు నిర్మింపబడి ఆ యా ప్రయోజనములకు ఉపయోగించు చుండును. ఇట్లే శిల్పశాల, స్నానమండపము, నాట్యశాల మున్నగునవి డెబ్బదిరెండువఱకు ఉండవచ్చునని శాస్త్రముచే తెలియుచున్నది. దేవాలయమునకు అనుబంధముగా పాఠశాల, గ్రంథాలయము మున్నగు సారస్వత సంస్థలు ఉండి జనులకు జ్ఞానదానము చేయుటకును చక్కని అవకాశములు ఉన్నవి. ఈ సంప్రదాయమును నేటికిని తిరుపతి దేవస్థానమువంటి మహాక్షేత్రములందు కాంచుచున్నాము.

ఆలయమునందు శిల్ప సౌందర్యము జగన్మోహనమై వెలుగొందునట్లు చిత్రింపవచ్చును. ఆలయ కుడ్యములయందు దశావతార చిత్రములు, క్షీరసాగరమథనము, దేవాసుర సంగ్రామము, అప్సరసల దివ్య నృత్యములు, భారత రామాయణ గాథలు, షట్చక్రవర్తుల చరిత్రములు, ఒక్కటేమి, శిల్పికిని ఆలయమును నిర్మింపజేయు యజమానునకును ఇష్టములయిన నానావిధశిల్పములను దృష్టిని ఆకర్షించురీతిని, సౌందర్యము తాండవించునట్లు నిర్మింపవచ్చును. కుడ్యములయందేకాక, స్తంభములందును, ద్వారశాఖలయందును, మీది ఆచ్ఛాదనమునందును కూడ అద్భుతమగు పనితనమును చూపింపవచ్చును. కుడ్య స్తంభ శిల్పముల

సౌందర్యమునకు నిధానములైన దేవాలయములు దక్షిణదేశమునందు— "హలేబీడు, సోమనాథపురము, శ్రవణబెళగుళము, బేలూరు" మున్నగు తావులందు ఉన్నవి. బేలూరులోని చెన్నకేశవస్వామి దేవాలయము నందలి కుడ్య స్తంభ శిల్పములు, హలేబీడునందలి హైశాలేశ్వరాలయము నందలి కుడ్యశిల్పములును స్వర్గసౌందర్యమును కన్నులకు కట్టును శిల్ప సమ్రాట్టు జక్కనాచార్యులు నిర్మించినవే పై దేవాలయము లన్నియును. ఇందు సోమనాథపురములో కేశవస్వామి దేవళము ప్రత్యేక స్థానమును ఆక్రమించును దేవళము నందలి ప్రతిశిలాఖండము మీదను శిల్పమున్నది. భారత రామాయణ గాథలు ఆలయ కుడ్యములమీద చెక్కబడి ఉన్నవి. ఆలయాంతర్భాగములోని "భువనేశ్వరీ మండపములు" (పై అచ్ఛాదనములు) లోకోత్తరములు! ఆమండపములమీది శిల్పరచనము స్వయముగా చూడవలసినదేకాని, చెప్ప నలవికాదు.

ఈ విధమున ఆలయ సర్వస్వము శిల్పకళా సుందరమై ప్రకాశించునట్లు శిలలను వెన్నపూస చేసికొని మనశిల్పులు తమ ప్రౌఢిమను చూపియున్నారు. ఈ నిర్మాణములలో ప్రత్యంశమునందును తత్త్వమును, సౌందర్యమును, ప్రయోజనమును పోతపోసినారు. పూర్వము దేవస్థానము నృత్త గీత వాద్యాదులకును, అన్ని కళలకును, శాస్త్రచర్చలకును, విద్యాబోధనమునకును, శిల్పసౌందర్యమునకును నివాసభూతమై తేజరిల్లినది. కేవలము భక్తకూటమునకే ఇది ఆరాధ్యమై ఉండలేదు. ప్రతికళారసికుడును తనకళాప్రౌఢిమచేత స్వామిని ఆరాధించియే కృతార్థుడయ్యేడివాడు. నృత్యము, సంగీతము, కవిత్వము, శిల్పము, శాస్త్రము, వేదము-ఇవి అన్నియును భగవన్నివేదితములయికాని ఆకాలమున సార్థకములు కాలేదని మనము గ్రహింపవచ్చును. ఆ యా విద్యలను, కళలను, వాద్యములను ప్రదర్శించువారికి జీవనార్థము "మాన్యములు" ఏర్పడి ఉండుట

సుప్రసిద్ధము. అనిర్వచనీయమగు ఈశ్వర విభూతిని తొలగట్టిన ఆలయములలో సంప్రతిష్ఠించి, జగమునకు ఐహికాముష్మిక సౌభాగ్యములను చేకూర్చుటకు మన శిల్పాచార్యులు ఒనర్చినకృషి ఇంతింత కాదు. కొండలను తొలిచి, శిలను మలచి, వృక్షములను ఛేదించి, లోహములను కరగి, స్వర్ణమును సంపాదించి, రత్నములను చెక్కి స్థాపత్య వేదసారమును రూపెత్తించిరి.

ప్రతిమాశిల్పమునుగూర్చి ముచ్చటించుటకు ముందు శిలారహస్యములనుగూర్చి చర్చింప వలసి ఉన్నది. ప్రాచీనులు పాషాణపరిశోధనమునకూడ అద్భుతమగు కృషిచేసిరని శిల్పగ్రంథములచేతను, శిల్పకథలచేతను తెలియుచున్నది. ప్రాణులయందువలెనే శిలయందును, స్త్రీ పుం నపుంసక భేదములును, బాల్యయౌవన వార్ధకాది భేదములును, రజస్సత్వ తమో గుణములును, జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలును కలవు. ఇంకను శిలయొక్క వర్ణమునుబట్టియు మంచిచెడులు ఏర్పాటగునని మయశిల్పాది గ్రంథములు చెప్పుచున్నవి. నిద్రలో ఉన్న రాయి బరువు తగ్గి తేలికగా ఎత్తుటకు వీలగుననియు, ఆ నిద్రావస్థనుబట్టి శిల్పులు పెద్ద పెద్ద శిలలనేని ఎత్తైన ప్రదేశములకు ఎత్తజాలిరనియు మనవారు చెప్పుచున్నారు. దేవాలయమునకు ఏ విధమగు శిలను ఉపయోగించినను, మూలవిరాట్టునకు మాత్రము శాస్త్రీయమగు శిలను ఉపయోగించిననే అది ఫలప్రదము కాగలదు. ఫలాఫలములు భావమునుబట్టియేకాక, వస్తువునుబట్టియు సంక్రమించుచుండును.

"ఘంటాధ్వని సమోన్నాదా, దీర్ఘా సా పుంశిలా ఇవ.
తాలశబ్ద సమాకారా దీర్ఘా, యా సా శిలా స్త్రియః.
అస్నేహా ఝర్ఝరీ రూక్షా, స్వరహీనా నపుంసకా."

—కాశ్యపశిల్పమ్.

ఘంటానాదమువలె గంభీరముగా మ్రోగునది పురుషశిల. తాళ శబ్దమువలె మ్రోగునది స్త్రీశిల. స్వరహీనమై చమురులేక ఝర్ఝరమై కఠినముగాఉండునది నపుంసకశిల. ఈ స్త్రీ పుం నపుంసక భేదములు స్వరమును బట్టియేకాక, ఆకారమునుబట్టియు నిర్ణయింపవచ్చును. ఈ భేద ములవలని ప్రయోజన మేమన ?

"పుంలింగం లింగ మిత్యాహుః, స్త్రీ లింగం పీఠికా మతా,
పాదపీఠశిలాయాం తు, నపుంసక శిలాః స్మృతాః."

—మయశిల్పము.

పుంశిలతో లింగమును, స్త్రీ శిలతో పీఠమును, నపుంసక శిలతో పాదపీఠమును చేయవలయును. అట్లుగాక విపరీతముగా చేసినచో కర్తకు, కారయితకును హాని చేకూరును.

శాస్త్రవేత్తయు, సదాచార సంపన్నుడును అగు శిల్పాచార్యుడు ఉత్తమజాతికి చెందిన శిలను ఎన్నుకొని శాస్త్రమార్గమున ప్రతిమానిర్మాణముచేయ వలయును. ప్రతిమానిర్మాణములో విగ్రహమునకు జనకువంటివాడైన శిల్పాచార్యుని బాధ్యత దొడ్డదని శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి. శిలను ఎన్నుకొనుట మొదలుకొని విగ్రహమును తీర్చి ప్రతిష్ఠ చేయువఱకును శిల్పి ప్రమాదములేక కడుజాగరూకతతో మెలగవలయును. లేకున్న, శిలామాత్రమునకు దేవత్వము ఎట్లు కలుగును ? కావుననే "అశ్మాపి యాతి దేవత్వం శిల్పిభి స్సుప్రతిష్ఠితః" ఱాయి అయినను శిల్పులచే సుప్రతిష్ఠితమై దేవత్వమును అందగలదని శాస్త్రము ఘోషించుచున్నది.

శివ, కేశవ, వీరభద్ర, వినాయకా ద్యుత్తమ విగ్రహములయు ; తదితర క్షుద్రదేవతలయు ప్రతిమ లన్నియు శాస్త్రోక్తములైన ప్రత్యేక

ప్రత్యేక లక్షణములనుబట్టి నిర్మింపబడవలయును. ఏకతాళము మొదలు కొని దశతాళములవఱకును ఈ విగ్రహముల పొడవు ఆ యా దేవతలను అనుసరించి ఉండును. వాటిలో నవతాళ దశతాళ ప్రమాణములు శ్రేష్ఠములు. ఉత్తమ దశతాళమునందు విగ్రహము పొడవు నూటయిరువది నాలుగు అంగుళములు ఉండవలయును. మధ్యమ నవతాళములో నూటయెనిమిది అంగుళములు విగ్రహ ప్రమాణమని చెప్పబడినది. ఈ నూటయెనిమిది, నూటయిరువదినాల్గు-మున్నగు సంఖ్యలుకూడ ఉపాసక వేద్యమగు తత్త్వరహస్యములను చాటుచున్నవి. అందు అష్టోత్తర శతసంఖ్య జ్యోతిశ్శాస్త్రమునకును, మంత్రశాస్త్రమునకును, ఆధారాది కమలములయందలి దళములకును సాదృశ్యమును ప్రకటించుచు-అత్యద్భుతమై ఒప్పుచున్నది ప్రతిమానిర్మాణ లక్షణములలో ఆ యా తత్త్వ రహస్యములను ఈ రీతిని ఇమిడ్చిపెట్టి ఆరాధకుల జ్ఞాననేత్రమును విప్పజూనుకొన్న దేవాలయశిల్పమహిమ ఎంతటిది! దేవుని విగ్రహమునకును, దేవిప్రతిమకునుకూడ పరిమాణములో భేదము ఉండవలయును.

"దేవస్య కర్ణాంత సమప్రమాణాం, దేవీం మను త్వష్ట్ర ముఖా వదన్తి,
దేవ్యాస్తు దృష్టిః స్తనమధ్యదేశా, జానూపరిస్థానగతా మనోజ్ఞా."

—మయవాస్తువు.

దేవి, దేవుని చెవులయెత్తు కలదిగా ఉండవలయునని-మనువు, త్వష్ట-మున్నగువారు వచించిరి. దేవిదృష్టి స్తన, మధ్య ప్రదేశమునుండి జానుభాగముపైకి ప్రసరించెనేని మనోహరముగా ఉండును. ఇక ఇతర దైవమూర్తులకు సైతము దృష్టిని ఇడుటలోను, ప్రాణ ప్రతిష్ఠచేయుటలోను శిల్పాచార్యుడు చూపవలసిన కౌశలము. మిక్కిలి నిశితమును, సూక్ష్మము నయినది.

ఆ యా దేవతాప్రతిమలు ఆ యా దేవతలకు ప్రతినిధుల వంటివని చెప్పికొంటిమి. ఈ ప్రాతినిధ్యము ఆకారములోనే కాదు ప్రభావము నందును, శక్తియందును కూడనని మఱువరాదు ఏ దేవత ఏ యే శక్తులను, మహిమలను కలిగి ఉండునో, ఆ దేవత ప్రతిమయు ఆ యా శక్తులను కలిగి ఉండవలయును. లేకున్న ప్రయోజనమేమి? చిత్రకారుడు గీసిన బొమ్మవలె ఆ దైవవిగ్రహము కనులపండువు సేయునే కాని, ఉపాసకుల అభీష్టములను తీర్పజాలదు కావుననే, ఈ ప్రతిమలను ఆ యా మంత్ర, యంత్ర విధానములతో ప్రతిష్ఠాతంత్రము నడపబడి మూర్తియందు దైవశక్తి నిక్షేపింపబడుచున్నది. ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క యంత్రము, మంత్రము నియమితమై ఉండును. శిల్పాచార్యుడు ఆ యంత్రమును యజమానుని శక్తినిబట్టి, బంగారు మున్నగు వానియందు చెక్కి, నియమిత మంత్రముతో సుదీక్షితుడై జపము సల్పి, యంత్రమును ఆ విగ్రహముక్రింద స్థాపించి, దానిపై విగ్రహమును ప్రతిష్ఠింపవలయును. పవిత్ర వైదికవిధానముతో దృష్టి నిడి, ప్రాణ ప్రతిష్ఠ చేసినయెడల ఆ విగ్రహము అఖండశక్తి యుక్తమై ఆరాధకుల కామితార్థములను సంపాదించును. ఈ అంశములు శిల్పాగమగ్రంథము లందు బహుళముగా వ్రాయబడి ఉన్నవి.

"దృష్టి నిర్మాణకాలే చ, ప్రాణ సంస్థాపనేఽపి చ,
మంత్ర తంత్ర ప్రభావజ్ఞః కారయే చ్ఛిల్పికోత్తమః."

—మయవాస్తు.

దృష్టి నుంచునపుడును, ప్రాణ ప్రతిష్ఠ చేయుసమయమునను మంత్ర తంత్ర ప్రభావము నెఱింగిన శిల్పాచార్యుడు యుక్త విధులను నెఱవేర్పవలయును.

"శిల్పీ యత్నం చ కుర్యాద్వై, దీక్షాకర్మసు తత్పరః
యస్య యంత్రస్య యోమంత్ర। స్తేనైవ హి సుదీక్షయా,
భూమి మేరు ప్రస్తరాది లోహజాతేన కారయేత్."

—కాశ్యపశిల్పము.

శిల్పి దీక్షాకర్మలయందు ఆసక్తి కలవాడై ఏ యంత్రమునకు ఏ మంత్రమును ఉపాసన చేయవలెనో, ఆ యా మంత్రోపాసనలయందు దీక్ష వహించి పూనిక చూపవలయును. భూప్రస్తారము, మేరుప్రస్తారము మున్నగు చక్రాదులను, యంత్రములను లోహసముదాయముతో చేయవలెను.

భారతీయుల అక్షరసమామ్నాయము అర్థవంతమును, మహిమోపేతమును అయినది. ప్రకృతిలోని శక్తులను, పరమేశ్వరునిలోని మహిమలను కైవసముచేసి కొనుటకు తగిన బీజాక్షరములను మహర్షులు కనిపట్టి, శాస్త్రపేటికలో భద్రపరచినారు. ఆ బీజముల సంపుటీకరణముతో ఏర్పడిన మంత్రజాలమును అట్టిదే. శక్తిని, కీలకమును, బీజమును ఎఱింగి ఉపాసించువారికి ఆ యా దైవ శక్తులు వశీభూతములు అగుటలో ఆశ్చర్యము లేదు. పూర్వము సూచించిన షట్చక్రముల యందలి దళములమీద ఆ యా అక్షరములు ప్రకాశించుచు, ఆ యా దైవశక్తులను ఉపాసకులకు కలిగించుచుండును. దేవాలయమునందలి మూర్తుల ఉపాసనములో ఈ విధముగా శబ్ద(మంత్ర) తత్త్వము,రూపమహిమ-రెండును ఐక్యమునంది, నామరూపాత్మకమగు జగత్తులోని నామరూప విశిష్టులగు ఉపాసకులకు ఉపాస్యములై, నామరూప భేదాతీత పరబ్రహ్మప్రాప్తికి

పరమసాధములై ఒప్పుచున్నవి. భిన్నశాఖలుగా కనుపట్టు శబ్ద (మంత్ర) రూప (ప్రతిమ), శక్తులు రెండును దేవాలయశిల్పములో అద్వైతభావమును అందినవి కావుననే, జగము తరించుటకు ఇది నాటికిని, నేటికిని విశ్వజనీన సాధనమై ఒప్పుచున్నది.

హైందవశిల్పుల విశ్వజనీనమగు ఈ దేవాలయ సంప్రదాయము స్థూలముగ బౌద్ధస్తూపములందును, మహమ్మదీయుల మసీదులయందును కూడ అవతారమెత్తినది దేవాలయము బ్రహ్మాండమునకు సంక్షిప్త చిహ్నమని మనము గ్రహించి ఉండవచ్చును. హిందూ దేవాలయము మీది బ్రహ్మాండమును పోలిన కిరీటాకృతిగల విమాననిర్మాణమే బౌద్ధుల స్తూపములయెడ రమ్యమగు అర్ధవృత్తాకారముగ రూపెత్తినది. ఉన్నతమగు ఆ గోపురాకారమునే మసీదులయందును కాంచగల్గుదుము. ప్రాచీన హైందవసంప్రదాయము ఖండాంతరములకును ప్రసరించి, ధర్మ ధ్వజములను స్థాపించినది కావున, ఏ యే దేశములందు ఇది ఏ యే ఆకృతులను దాల్చినదో ఈ చిన్నిగ్రంథమున వివరింప వీలుకాదు. కాని, ఆస్తికులనేకాక, నాస్తికులనుకూడ లోకోత్తరమగు తన శిల్పసౌందర్యము చేతను, తత్త్వముచేతను ఆకర్షింపజాలిన ఈ ఆలయశిల్పము అసాధరణమైనదనియు, ఎన్నెన్ని రహస్యములో ఇందు ఇమిడిఉన్నవనియు మనము గ్రహించిన చాలును. దేవాలయశిల్ప విజయధ్వజమా అన్నట్లు. అదిగో! ఆ దేవాలయమునకు ఎదురుగఉన్న ధ్వజస్తంభమును ఒక్కసారి తిలకించి పోదము. ఆ ధ్వజాగ్రమున దేవుని పైపునకు తిరిగిఉన్న ఆ మేఖలలను మూటిని గాంచుడు. దేవునిపైపునకే తిరిగిఉన్న-అవి మనోవాక్కాయములు అనెడి త్రికరణములను సూచించుచు "ఎవ్వాని త్రికరణములు దేవునకు అధీనములై ఉండునో, అట్టివాడు కృతార్థుడు కాగలడు" అనెడి తత్త్వమును బోధించుట లేదా "ఐహికంబునకు నిత్యాముష్మిక విభూతి

దేవతామూర్తి"ని ఇట్లు ప్రతిష్ఠ చేసిన మనశిల్పి ఋషులకు నమో వాకములు !

"భారతక్షోణి ఆస్తిక్య భరితమేని
నేటికిని పుణ్యభూమియై నెగడు నేని
పూజ్య శిల్పర్షి భావ సంభూత మూర్తి
గర్భదేవాలయంబులే కారణములు !"

కీ. శే. గోనుగుంట పున్నయ్యగారి "కలాతపస్వి"



మహిషాసురమర్దని
అలంపురం మ్యూజియం

# ప్రతిమా లక్షణ - సౌందర్యములు



వేదయుగమున ప్రతిమాశిల్పముకాని, విగ్రహారాధనగాని లేదని కొందఱ తలంపు. ఇందుకు "న తస్య ప్రతిమా అస్తి, యస్య నామ మహ ద్యశః'' అను వాక్యము కారణము కావచ్చును. పై వాక్యము లోని "ప్రతిమా'' శబ్దమునకు ''విగ్రహము'' అనెడి అర్థమును భావించి, వారు భగవంతునికి ప్రతిమ లేదని అనుకొని యుందురు. కాని, ప్రతిమా శబ్దమునకు ప్రతిమానము - అనగా ఉపమానము లేదని అర్థము చెప్పి కొనుట యుక్తము. ఈశ్వరునితో సాటియైనది మఱొకటి లేదను అర్థము ఇతరత్రకూడ కన్పట్టు చున్నది. "న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే" (శ్వేతాశ్వతరము) ఆ భగవంతునితో సమానుడుకాని, అధికుడుకాని లేడని భావము. కాగా, ఇక వేదమున విగ్రహారాధనము కలదని ఆధారమును చూపవలసి ఉన్నది. ఋగ్వేదమున ఈ మంత్రము కలదు.

''క ఇమం దశభి ర్మమేంద్రం క్రీణాతి ధేనుభిః,
యదా వృత్రాణి జంఘన దథైనం మే పున ర్దదత్.''
మండలం. 4. సూక్తం. 24. మంత్రం. 10.

''ఈ నా ఇంద్రుని ఎవడేని పదిధేనువులను ఇచ్చికొనినచో బాగుండును. అట్లు కొనినవాడు తనపని తీరిన పిమ్మట-అనగా ఆ ఇంద్రపూజ వలన తన పాపములను పోగొట్టుకొనిన తరువాత, మరల ఆ ఇంద్రుని నా కీయవలయును."

ఋగ్వేదమున ఈ విధముగా ఉండుటచేత, ఆ కాలముననే శిల్పులగువారు ఇంద్రాది దైవమూర్తులను నిర్మించి, కొంత గోధనమునకో—

ఇంక ఏదో ఒక ప్రతిఫలమునకో- వాటిని భక్తులకు ఉపాసనార్థమై ఇచ్చు చుండెడివారని ఊహింప వీలగుచున్నది. కావున విగ్రహారాధనము, లేదా-ప్రతిమార్చనము ఋగ్వేదకాలమునందే కలదని తెలియుచున్నది.

భారతీయుల మూర్తి శిల్పము బాహ్యాంతస్సౌందర్యము లకు నిధానము. గ్రీకులు దేహసౌందర్యమునకును, శరీర పుష్టికిని విశేషప్రాధాన్యమును ఈయగా హైందవ శిల్పులు సహజసిద్ధమగు శారీరక సౌందర్యముతోపాటు — ఆత్మసౌందర్యమునకును, భావసంపత్తికినికూడ సమధిక ప్రాధాన్యమును ఒసంగి ఉన్నారు. ధ్యానావస్థలో ఉన్న బుద్ధ దేవుని ప్రతిమలనుగాని, ధర్మబోధ చేయునట్లున్న బుద్ధమూర్తులను గాని, ఇంకను వివిధావస్థలలో ఉన్న బుద్ధుని ఆకార విశేషములనుకాని తిలకించి నచో, ఆ ప్రతిమలు ఆ యా భావములను ఎట్లు ప్రదర్శించునో సుస్పష్టము కాగలదు. ధ్యానిబుద్ధప్రతిమలో ఆత్మ సాక్షాత్కారజనితమైన నిరతిశయ-ఆనంద శాంతి సంతృప్తులును, బోధక బుద్ధునిలో ధర్మదీక్షాపరమైన భావ ప్రదీప్తియు, సన్న్యాస వ్రతోద్యుక్తుడైన సిద్ధార్థునిలో ప్రాపంచిక విషయ వైరాగ్యమును, కర్తవ్యోత్సాహాది భావములును సువ్యక్తములు అగు చుండును. ఇట్లే హైందవ దేవతామూర్తులను తిలకించినను వాటి వాటికి తగిన భావ విశేషములను, అంతస్సౌందర్యమును అవి వెల్లడించుటను అనుభవములో మనము కాంచుచునే ఉన్నాము. కాళీమూర్తిలోను, మహి షాసురమర్దనిలోను ప్రచండమగు క్రోధమును, బాలాత్రిపురసుందరిలో ముజ్జగములను మోహింపజేయగల దివ్య లావణ్య సముజ్జ్వల మందహాస రోచిస్సులను ప్రముఖముగా కాంచగలము. ఇట్లే మహాబలిపురములోని అర్జున తపశ్చర్యాది శిల్పములయందును సముచిత రసభావ ప్రదీప్తిని పుష్కలముగా దర్శింపగలుగుచున్నాము అందుకే హైందవ శిల్పి చిత్రకర్మలోను, శిల్పక్రియలోనుకూడ భావలావణ్య యోజనలకు అధిక

ప్రాధాన్యమును ఇచ్చిఉన్నాడని కళాభిజ్ఞులు అనుచున్నారు. ఒకే దశలో ఒకేపని చేయుచున్నమూర్తి భిన్న భిన్న భావములకు ప్రతీకము కావచ్చును. స్థూలములును, బాహ్యములును అగు ఆకారక్రియలు ఒకే విధముగా ఉన్నను, భావములతీరులు మాత్రము ఆ యా మానసికావస్థలకు నిదర్శనములై ఒప్పుచుండవలసినదే. ఒక చిత్రకారుడు సాయం సమయమున, స్నానమాడి అలంకరించుకొనుచున్న సుందరి చిత్రమును వ్రాసినాడను కొందము. ఆమె అలంకారచర్య, ఆలయమున కేగి దేవుని దర్శించుటకో, లేక ప్రియుని మధుర పరిష్వంగమునకో, లేక దైనికాలంకారార్థమో కావచ్చును. అట్టి తఱి ఆ యా భావములు ఆమె ముఖములోను, తదితర రీతులలోను వ్యక్తము చేయగలిగిననాడే—ఆతడు ఉత్తమశిల్పి కాగలడు. అట్టి భేదమును వ్యక్తము చేయజాలనివాడు అధమచిత్రకారుడే అగును. ఈ విధముగా శిల్పములో నేమి, చిత్రకరణములో నేమి భావమనునది అత్యంతప్రాధాన్యమును వహించుచున్నది. అట్లని బాహ్య సౌందర్యమునకుగాని, శరీరావయవ సౌష్ఠవమునకు కాని అందు చోటు లేదని తలంపవలదు. భారతీయుల దృష్టి, తత్త్వ విశిష్ట మయినందున భావసంపత్తికి ఎక్కుడు ప్రాధాన్యము ఇచ్చినను, శరీరావయవ సౌందర్య విషయమున హైందవశిల్పి ఉపేక్ష వహింపలేదని పెక్కు శిల్పములను-శిల్ప శాస్త్రమును - పరిశీలించుటచే తెలియగలము.

భారతీయ శిల్పశాస్త్రములో ప్రతిమా లక్షణము అగ్రస్థానమును పొందుచున్నది. ఆలయమునందు ప్రధానముగా ఆరాధనీయ మగునది ప్రతిమయే కావున—అది సౌందర్య సర్వస్వముగాను, భావప్రపూర్ణముగాను ఉండక తప్పదు. దానికి పిమ్మటివే ఆలయ-మండప - ప్రాకార - గోపురాదులు. మూలవిరాణ్మూర్తి సలక్షణము, సౌందర్యోపేతము కానిచో అది ఉపాసకుల దృష్టిని ఆకర్షించి, వారి మనోరథములను తీర్పజాలదు.

ఒక్కొక్క సుందరపురుషునికాని, స్త్రీనిగాని చూచినప్పుడు, మనదృష్టి అతర్కితముగా వారిపై ఎట్లు ప్రసరించునో, ప్రసరించి వారు చెప్పినరీతి నడచుకొనుటకు ఎట్లు ఇచ్చ పొడముజేయునో, అట్లే సుందరమగు దేవతా మూర్తిని కాంచినప్పుడును మనబుద్ధి తద్దర్శనారాధనములకై పరువెత్తి కృతకృత్యము కావలయును. అందుకే—శివ విష్ణ్వాది పురుష ప్రతిమలు కాని, లక్ష్మీ సరస్వత్యాది స్త్రీమూర్తులు కాని సలక్షణమగు అంతర్బాహ్య సౌందర్యములకు నివాసభూములై ఒప్పుచుండవలయునని శాస్త్రమును, సంప్రదాయమును చెప్పుట.

దేవ మనుష్యాది భేదములతో ఉన్న స్త్రీ పురుషమూర్తులలోకాని, తిర్యక్కులగు పశుపక్ష్యాదులలోకాని ఏయే అంగములు ఎంతెంత ప్రమాణములలో ఉండవలయునో, అంతంత ప్రమాణములలో అవి ఉన్నప్పుడే ఆ యా మూర్తులు అందచందములకు ఇక్కలై వఱలగలవు. తలకు తగిన కాయము, కాయమునకు తగిన హస్తపాదోదరములు, వాటికి తగిన వ్రేళ్లు మొదలగు ఉపాంగములు, అట్లే - ముఖప్రమాణమునకు తగిన ముక్కు, చెవులు, కన్నులు, పెదవులు, గడ్డము-మున్నగునవి ఉన్నప్పుడే స్త్రీ పురుషులు చక్కనివారు అనిపించుకొందురు. అట్లు కాక, విపరీతముగా పెద్దతల, కుఱుచచేతులు, కొంకి కాళ్ళు, చొట్టముక్కు, చేటచెవులు, పెదవినిమీఱిన పండ్లు, వ్రేలాడుపెదవి, మిడిగ్రుడ్లు—లేక గుంటకన్నులు— మొదలగు అవలక్షణములు కలవారు ఏవము పుట్టించుచుందురు. వారికి ఉన్న ఆ అవలక్షణములు, అవలక్షణములనే వారికి కూర్చుచుండును. ఇట్టివారి ఆకారములు ఆకర్షణీయములు, ఆరాధనీయములు కావనుట మనకు అనుభవసిద్ధమే!

సర్వ లక్షణ సంపన్నములగు శరీరములుగల స్త్రీ పురుషులు మిక్కిలి అరుదుగా ఉందురు. ఇది మానవజాతిలోనే గాక, తక్కిన తిర్యగ్జాతులందును మనము చూచుచునే ఉన్నాము. అందుకే కాళిదాసు "ప్రాయేణ సామగ్ర్య విధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" అనినాడు. ఉదాహరణకు చూడుడు : అన్ని మంచిలక్షణములుగల ఎద్దు చిక్కుట కష్టము. అట్టిదే ఆబోతుగా ఉపయోగింపతగినదై ఉన్నది. అది అనేక గోవృషభములకు జనకముకదా ! తక్కిన సామాన్య వృషభములు నాగళ్ళు, బండ్లు లాగుటకు మాత్రమే పనికివచ్చును. అట్లే పంచకల్యాణి లక్షణములుగల గుఱ్ఱములును, భద్రజాతి గజములును తక్కువగానే చిక్కుచున్నవి. దీనినిబట్టి శ్రేష్ఠలక్షణములుగల చేతనాచేతనములే సమాజమునకు ఉపయోగకారులును, పూజార్హములును ఐవఅలుచున్నవని సులభముగా గ్రహింపవచ్చును.

మానవులలో అందచందములుగల స్త్రీ పురుషులు ఎందఱున్నారు? అట్లు లేకపోవుటకు ఉత్తమ మానవ లక్షణములు అన్నియు వారిలో రాశీభూతములు కాకుండుటే కతము. పురుషులలో పాంచాలజాతివాడు ఉత్తముడనియు, స్త్రీలలో పద్మినీజాతిది శ్రేష్ఠ అనియు శాస్త్రము చెప్పుచున్నది. మనముకూడ కొంతవఱకు ఎఱుగుదుమనియే అనుకొందము. వారి శ్రేష్ఠతకు వారికి ఉన్న సర్వలక్షణ సమగ్రతయే కారణ మనుటలో సందేహముండునా ! మన పురాణేతిహాసములలోను, కావ్యనాటకాదులలోను ప్రధాన నాయికానాయకులుగా ఎన్నబడువారు త్రిభువన సౌందర్యరాశులుగా వర్ణింపబడుట మనకు సుపరిచితమైన అంశము. ఇది అంతయు కవిప్రౌఢోక్తిగానో, అతిశయోక్తిగానో కొందఱు భావింతురు. ఆ భావము దూరదృష్టి—అనుభవము లేక కలుగునది. ప్రౌఢోక్తులు, అతిశయోక్తులు ఉన్నను, పరమార్థమున అట్టి సృష్టులు లేవనుట సాహస

మగును. సీతారాములవంటి లోకోత్తర స్త్రీ పురుషులను సృష్టించుటకు విధాతకు ఎంతకాలము పట్టిఉండునో ఎవరెఱుగుదురు! ఆ ప్రియదంపతుల మనోహర రూపలావణ్యములను, గుణగణములను చిత్రించుటకు వాల్మీకి ఎంత తపస్సు చేసినాడో! కొన్నివేల సంవత్సరములనుండి నిర్మితమైన హైందవవాఙ్మయములో ఎందఱు ఉత్తమ నాయికానాయకులు వెలసినారో విచారింపుడు. ఆ సీతారాములు, ఆ నలదమయంతులు, ఆ శకుంతలా దుష్యంతులు, ఆ సావిత్రీ సత్యవంతులు, ఆ సుభద్రార్జునులు—కొందఱు మాత్రమే పొడకట్టుచున్నారు కదా! కనుక, సారాంశము ; మంచి సరకన్నది సృష్టిలోనే తక్కువ అనుట! ఈ అంశము — అనుభవమును బట్టియు, మహాకవుల సాక్ష్యములను బట్టియు రుజువగుచున్నది. కనుకనే కాళిదాసు కుమార సంభవ కావ్యములో పార్వతీ వర్ణన సందర్భమున ఇట్లనినాడు —

"సర్వోపమాద్రవ్య సముచ్చయేన
యథాప్రదేశం వినివేశితేన,
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా
దేకస్థ సౌందర్య దిదృక్షయేవ."

"బ్రహ్మదేవునికి చంద్ర పద్మాద్యుపమాన వస్తువులను అన్నిటిని ఒక్కమూర్తియందు రాశివోసి, విశ్వసౌందర్యమును చూచుకొనవలయునని సంకల్పము కలిగినది. అప్పుడాతడు తత్తదుపమాన వస్తువులతో పార్వతీ మూర్తిని కల్పించి, రాశీభూతమయిన భువన సౌందర్యమును దర్శించి తృప్తిపొందినాడట." ప్రకృతిలోని సుందర వస్తువులన్నియు సృష్టిలో సమగ్రమూర్తియగు మనుష్యునందు సన్నిధిచేసియున్నవనెడి అంశమును ప్రతిమాశాస్త్రము, చిత్రసూత్రములు సమర్థించుమనే ఉన్నవి.

అలంకారశాస్త్రము ఈ అంశమును ఉపమాన ముఖమున దృఢపఱచు చున్నది. ముఖము పద్మ చంద్రాదులవలె వర్తులమై ఉండవలెననియు, కన్నులు చేపలవలెగాని, కమలములవలెగాని, తామర రేకులవలెగాని ఉండవలయుననియు, అట్లే, బాహువులు — లతలను, తామరతూండ్లను, ఊరువులు - ఏనుగుతొండములను, రంభా స్తంభములను, వక్షలు - తర గలను, పెదవి - దొండపండును, చిగురుటాకును, చెవులు-శ్రీకారములను, చక్కిలములను, కురులు-తుమ్మెదలను, తక్కిన అవయవములు ఆ యా సుందరవస్తువులను పోలి ఉండవలె ననుటలోని ఉద్దేశ్యము ప్రకృతిలోని సుందరవస్తువులు అన్నియు మనుష్యమూర్తిలో ప్రవేశించి ఉండవలె ననుటయేఅని "చిత్రసూత్ర—ప్రతిమాశాస్త్రముల" హృదయము. ఇది కేవలము ఆ శాస్త్రహృదయమే కాదు, సృష్టికర్త హృదయముకూడ అను కొన్నను తప్పులేదు. తిలోత్తమాసృష్టి అట్టిదే కదా! ప్రకృతిలోని సర్వసుందర పదార్థములనుండియు తిలమాత్రముగా ఉత్తమ సౌందర్య మును గైకొని విశ్వకర్మ ఆమెను సృష్టించినాడట. ఇట్టి సర్వోత్తమ సౌందర్యయోగ ప్రతిపాదనమునకే ప్రతిమాలక్షణ శాస్త్రము ఏర్పడినది. ఇట్టి ఉత్తమ మానవలక్షణములనుబట్టి ఫలములను నిర్ణయించుటకే సాము ద్రిక శాస్త్రము సృజింపబడినది. శరీరావయవ లక్షణములనుబట్టియే ఫలా ఫలములను, సౌందర్యాసౌందర్యములను ఈ శాస్త్రము చెప్పుచున్నదనుట అనుభవసిద్ధము. శిల్పశాస్త్రములోని ప్రతిమాలక్షణమునకును, సాముద్రిక శాస్త్రమునకును గాఢ సంబంధము ఉన్నది. ఈ రెండు శాస్త్రముల హృద యమును సరసముగా మనోముద్రిత మొనర్చునదే కవిసమయ సిద్ధాం తము. కనుకనే ప్రతిమాకారునికిగాని, చిత్రనిర్మాతకుగాని ఆ యా శాస్త్రముల హృదయము అవగతమై ఉండవలసి ఉన్నది. శిల్పములో గాని, కావ్యములోగాని ప్రధానులుగా తీసికొనబడువారు ఉత్తమ స్త్రీపురు

షులే కావున, వారి లక్షణములను ఈ శాస్త్రములు చెప్పుచుండును. ఆ లక్షణములుకూడ ఉత్తమ మధ్య మాధమ విభాగములతో ఒప్పుచుండును. కావ్యములలోని ప్రతినాయకులు ఈ మధ్య మాధమ శ్రేణులకు చెందుచుందురు.

ఉత్తమ స్త్రీపురుషులుగా ఎన్నబడు మానవులే ఇట్టి శుభలక్షణములతో ఒప్పుచుండవలెనన్నప్పుడు—ఇక అట్టివారి కామితములను తీర్చుటకు వారికి ఆరాధ్యులుగా ఉండవలసిన దేవతలు ఇంక ఎంతగా ఉత్తమోత్తమ శుభలక్షణ లక్షితులు కావలసి ఉందురో ఊహింపవచ్చును. అధమ లక్షణములు — లేదా, అవలక్షణములుకల మనుజులు అధమఫలములను అందువారలు అగునట్లే, లక్షణ హీనములైన దైవ ప్రతిమలుకూడ తమ్ము అర్చించువారికి సమగ్రఫలములను ఈయజాలవు ఏ యే అంగము ఎట్లెట్లు దోష దూషితమగునో, దానికి తగినట్లే తదుపాసకులును దుష్ట ఫలములనే పొందుదురని శాస్త్రము చెప్పుచున్నది. కావుననే హైందవ శిల్పములో నానావిధ దేవతలయు, వారి పరివార-వాహనాదులయు మూర్తులన్నియు శాస్త్రీయ లక్షణలక్షితములయి బాహ్యాంత సౌందర్యముతో అలరార వలయుననుట శిల్పాచార్య సమ్మతము. ఈ నానా మూర్తుల లక్షణములను నిర్వచించుటకు అనేక శాస్త్రములు వెలువడినవి. వీటిలో విశ్వకర్మ ప్రోక్తములు, తత్తనయులైన మను, మయ, త్వష్టృ, దైవజ్ఞ (శిల్పి), విశ్వజ్ఞులను వారు రచించినవియు—ఆదిమములై పరమప్రమాణములుగా ఎన్నబడుచున్నవి. తక్కిన శాస్త్రములు పైవాటిని ఆధారముగా చేసికొని, తన్మతములను అనువదించుచు వెలువడినట్టివే! ఈ శాస్త్ర మతములలోకూడ మయ—విశ్వకర్మల మతములు—గ్రంథములే మనకు ఎక్కువగా ఈ నాడు లభ్యములైనవి. ప్రతిమా లక్షణములో మయ మతానంతరము - ప్రస్తావించదగినవి మానసారాదులవి. ఈ మతభేద వివరములు ఇక్కడ ప్రస్తావించుట అనావశ్యకము.

## మా న వి చా ర ము

శిల్ప శాస్త్రపరిభాషలో మానము పలువిధములుగా ఉన్నది. ఇది—మానము, ప్రమాణము, ఉన్మానము, పరిమాణము, ఉపమానము, లంబ మానము మొదలగు నామములతో ఒప్పుచుండును. అంగుళములుకూడ పరమాణు పరిమాణమునుండి క్రమాధిక సంఖ్యతో ఏర్పడుచుండును. అణువులో పదునాఱవ వంతు పరమాణువు. ఇది యోగి దృష్టి గోచర మగునట్టిది। ఎనిమిది పరమాణువులు ఒక త్రసరేణువు. ఎనిమిది త్రసరేణువులు ఒక వాలాగ్రము, లేక రోమాగ్రము. ఎనిమిది వాలాగ్ర ములు ఒక లీక్ష. ఎనిమిది లీక్షలు ఒకయూక. ఎనిమిది యూకలు ఒక యవ ప్రమాణము. ఎనిమిది యవలు ఒక ఉత్తమ మానాంగుళము. ఏడు యవలు ఒక మధ్యమ మానాంగుళము, ఆఱు యవలు ఒక అధమ మానాంగుళము—అగుచున్నవి. కాగా, మానాంగుళము ఉత్తమ మధ్య మాధమ భేదములతో ఒప్పుచున్నది. ఈ అంగుళముల సంఖ్యతో కిష్కువు, ధనుర్ముష్టి, దండము – మొదలగు ప్రమాణములు ఏర్పడు చున్నవి. మానాంగుళమే కాక, మాత్రాంగుళముకూడ శిల్పశాస్త్ర ప్రసిద్ధమై ఉన్నది. ప్రతిమా నిర్మాణముచేయు శిల్పాచార్యునియొక్కగాని, చేయించు యజమానునియొక్క గాని కుడిచేతి నడిమి వ్రేలియొక్క మధ్య పర్వ ప్రమాణము మాత్రాంగుళము; లేక దేహాంగుళము అని చెప్పబడుచున్నది. ఈ మాన—మాత్రాంగుళముల సంఖ్యతో దశతాళ, నవతాళాది భేదము లతో ఒప్పు వివిధప్రతిమలు నిర్మితములు కావలయును. ఈ తాళములు కూడ ఉత్తమ మధ్యమాధమభేదములు కలవై ఉన్నవి. ఉత్తమదశ తాళమున ప్రతిమయొక్క పొడవు 124 దేహాంగుళములు. ఈ ప్రమా ణము ప్రధానదైవతములగు బ్రహ్మ, విష్ణు, శివాది మూర్తులకు ముఖ్యము. మధ్యమ దశతాళమున ప్రతిమ పొడవు 120 అంగుళములు. ఈ

ప్రమాణము శ్రీదేవి, భూదేవి, పార్వతి, దుర్గ, సరస్వతి - మున్నగు స్త్రీమూర్తులకు ఉచితమైనది. అప్పుడు ముందు నిర్దేశించిన పురుషమూర్తి కన్న ఈ స్త్రీమూర్తి నాలుగంగుళములు కుఱుచయై—

"దేవస్య కర్ణాన్త సమప్రమాణామ్
దేవీం మను త్వష్టృముఖా వదన్తి."

అనెడి మయశాస్త్ర లక్షణము సరిపడును. అధమ దశతాళమున మూర్తి పొడవు 116 అంగుళములు. ఈ ప్రమాణముతో సూర్యచంద్రులు, ఏకాదశ రుద్రులు, అష్టవసువులు, గరుడ, శేష, స్కందాదుల మూర్తులు నిర్మితములు కావలయును. నవ-నవార్ధతాళ ప్రమాణములతో నవగ్రహ, కుబేరాదుల మూర్తులు ఉండును. అష్టతాళమును మానవులకు, ఋషులకు, యోగులకు ఉపయోగింతురు. ఈ తాళములు ఎవరెవరికి ఎట్లెట్లు ఉపయోగ పడవలయును అనుటలో శిల్పశాస్త్రకారులు భేదించు చున్నారు. అందుకే కాబోలు కొందఱు ఆధునిక శాస్త్రకారులు ఈ తాళప్రమాణములు దాక్షిణాత్యములనియు, యావద్భారతదేశ సాధారణములు కావనియు అనుట. కాని అతిప్రాచీనమైన మయవాస్తుశాస్త్రము తాళప్రమాణములను ప్రస్తావించియే ఉన్నది. దాక్షిణాత్య శిల్పులు పెక్కురు తాళానుసారము గనే ప్రతిమానిర్మాణము చేయుచుందురు.

## ప్రతిమా సౌందర్యము

ఆ యా ప్రతిమలకు అంగోపాంగ ప్రత్యంగములు ఎంతెంత పరిమాణములో ఉండవలయునని శాస్త్రము చెప్పుచున్నదో, అంతంత పరిమాణములో అవి ఉన్నప్పుడే ప్రతిమ అందచందములతో ఒప్పు చుండును. ఉత్తమ నవతాళమున పాదాది మస్తకాంతము — ప్రతిమ

పొడవు 108 అంగుళములని మయ మతము. ఇందు మస్తకము నాలుగు అంగుళములు. ముఖము పదిరెండుఅంగుళములు. ఈ పదిరెండు అంగుళములను మూడు సమభాగములు చేసికొని, భ్రూ మధ్యమునుండి కేశ పర్యంతము ఒక భాగమును, నాసికకు ఒకభాగమును, గడ్డము తుదివఱకు ఒకభాగమును ప్రత్యేకింపవలయును. అప్పుడు చిబుక, నాసికా, భ్రూ-ఉపరిభాగములు సమములై సౌందర్యము ఉట్టిపడ హేతువు లగును. గ్రీవముపొడవు నాలుగు అంగుళములు. గ్రీవమునుండి స్తన మధ్యమువఱకు పదిరెండు అంగుళములు. స్తనమధ్యమునుండి నాభి వఱకు పదిరెండు అంగుళములే. నాభ్యాది మేహనమూలమునకును అంతియే ప్రమాణము. మేహనమూలమునుండి మోకాలివఱకు ఇరువది నాలుగు అంగుళములు. అటనుండి చీలమండవఱకు ఇరువదినాలుగు అంగుళములే. చీలమండనుండి పాదాంతము నాలుగు అంగుళములు. ఇవి పురుష ప్రతిమయొక్క దైర్ఘ్యమునకు మాత్రమే సంబంధించిన కొలతలు. మనము సర్వాంగసుందర పురుషుని చూచినచో, ఆ యా అవయవములు ఈ ప్రమాణములకు సరిపడి ఉండుననుటలో వింత లేదు. అట్లు ఉన్నప్పుడే ఆవ్యక్తి సాముద్రిక శాస్త్రలక్షణలక్షితుడై శుభావహుడు అగును. ఇప్పుడు-కంఠమూలమునుండి స్తనమధ్యము వఱకును, అట నుండి బొడ్డువఱకును, అటనుండి శిశ్నమూలమువఱకును సమభాగములు అగుచున్నవి. అట్లే గుహ్యావయవ మూలమునుండి జానుపర్యంతమును, అటనుండి గుల్ఫపర్యంతమును సమభాగములు అగుచున్నవి. నూట యెనిమిది అంగుళముల ప్రమాణముగల ఈ నవతాళములో ఒక్కొక్క భాగము పదిరెండు అంగుళముల చొప్పున తొమ్మిది భాగములు కలవు. కావున దీనికి నవతాళప్రసిద్ధి కలిగినట్లు ఉన్నది! ఈ భాగముల వివరములు ఈ క్రింది విధమున గ్రహింపవచ్చును.

| | అంగుళములు | భాగములు |
|---|---|---|
| ముఖ ప్రమాణము | 12 | 1 |
| కంఠాది స్తనమధ్యము | 12 | 1 |
| స్తననాభి మధ్యము | 12 | 1 |
| నాభి మేహనమూల మధ్యము | 12 | 1 |
| మేహన మూలమునుండి జానుపర్యంతము | 24 | 2 |
| జానుగుల్ఫ మధ్యము | 24 | 2 |
| మస్తకము, గ్రీవము, గుల్ఫమునుండి పాదాంతము | 12 | 1 |
| | 108 | 9 |

స్త్రీప్రతిమా ప్రమాణములు ఇందుకు కొంత భిన్నములుగా ఉండును మొత్తముమీద ఇందలి అష్టోత్తరశత సంఖ్యకూడ ఎన్నో ఆధ్యాత్మిక రహస్యములను చాటునదై ఉన్నది. జ్యోతిశ్శాస్త్రములో నవగ్రహములు, ద్వాదశ రాశులు, ఇరువదియేడు నక్షత్రములు—అగపడుచున్నవి. అశ్విన్యాది నక్షత్రముల పాదములు మేషాది రాశులలో ఒక్కొక్కదానికి తొమ్మిది పాదములచొప్పున విభక్తములు కాగా, ద్వాదశ రాశులలోనున్న ఇరువదియేడు నక్షత్రముల పాదములను నూటయెనిమిది-అగుచున్నవి. సూర్యాది నవగ్రహములు ఈ ద్వాదశ రాశులయందు నక్షత్రపాదముల వరుసను సంచారము చేయుచు — జగత్తునకును, జీవులకును శుభాశుభ ఫలములను ఒసంగుచుండునని జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. జ్యోతిశ్శాస్త్రములోని ఈ నూటఎనిమిది సంఖ్యకును, మంత్రశాస్త్రములోని అష్టోత్తరశతసంఖ్యకును గాఢమైన సంబంధము ఉన్నదనుట పరమ

రహస్యము! ఏతత్సంఖ్యాకములగు అంగుళములతో చేయబడు ప్రతిమ కూడ అనేకాధ్యాత్మిక రహస్యములకు మూలభూతమై ఉపాసకులకు సంభావనీయ మగుచున్నది. ఆధారాది షట్చక్రములనుబట్టి చూచినను, ఈ అష్టోత్తర శతసంఖ్య మహత్తరార్థమునే చాటుచున్నది. మతాంతర మున ఉత్తమ నవతాళమున ప్రతిమయొక్క పొడవు 112 అంగుళములు. అప్పుడు జానువు (మోకాలు) నాలుగు అంగుళములు కలియగా 112 అంగుళములు అగును.

"సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్'' అనుటచేత శిరోభాగమును తీర్చుటలో శిల్పికి ఎంతయో జాగరూకత అవసరమని తెలియుచున్నది. అందుకే ముఖమును త్రిభాగములుగా చేసికొని అందచందములు దిద్దవలసి వచ్చినది. తరువాత "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్'' అనుటచే కన్నులతీర్పుకూడ ఎన్నదగినదై ఉన్నది. సమగ్ర విగ్రహమునకు జీవ కళను తెచ్చునవి ఈ నేత్రములే. ఆకర్ణాంత విశాలనేత్రములు ఉత్తమము లని కదా శాస్త్రము! నవతాళములో ప్రతిమనేత్రములు రెండు అంగుళ ముల వెడల్పును, నాలుగు అంగుళముల నిడివియు కలిగి ఉండవలెనని అన్నారు. అట్లే చెవులుకూడ రెండుఅంగుళముల వెడల్పును, నాలుగు అంగుళముల నిడివియు కలవై ఉండవలయును. ఇంకను ఇక్కడ కవిసమయ సిద్ధములగు ఉపమానములకును, ఈ అంగోపాంగములకును పోలికలు చెప్పవలసి ఉన్నవి. చెవులు — శ్రీకారాకారములై, తత్త దుచిత భూషణభూషితములై ఒప్పవలయును. కన్నులు—తామర రేకుల వలె కాని, తామరపూలవలె కాని, లేక చేపలవలె—అందును బేడిసమీలవలె కాని, ఉండవలెనని శాస్త్రము. విష్ణుమూర్తి ఆకర్ణాంత విశాలనేత్రుడు, పుండరీకాక్షుడును కదా! పద్మములవంటి నేత్రములలో వర్తులత్వగుణము ఎక్కువ. మత్స్యనేత్రములలో ఆయతత్వము ఎక్కువ. మత్స్యనేత్ర

ములు స్త్రీ ప్రతిమలకును, పద్మనేత్రములు పురుష విగ్రహములకును సాధారణముగా తీర్చుట కలదు. నాసిక రెండు అంగుళముల వెడల్పు గలిగి, తగిన ఎత్తుగలదై మనోహరముగా ఉండవలయును. కర్ణ, నేత్ర,నాసికాదులు ఈ పరిమాణములలో ఉండి ఆ యా ఉపమానములతో సామ్యమును పొందినప్పుడే ఆ ప్రతిమ సౌందర్యరాశి కాగలుగుచున్నది. కనుబొమ్మలను తీగలవలెను, విండ్లవలెను తీర్పవలసి ఉన్నది.

శాస్త్రానుసారముగా - వెడదయురము, ఆజానుబాహువులు ఉత్తమ పురుష లక్షణములు. మన కవులుకూడ ఉరోవర్ణనము చేయునప్పుడు, ఏ మన్మథుని సింహాసనముతోనో-దానిని పోల్చుట కలదు. అట్టి వెడద యురము సిద్ధించుటకే భుజమధ్యప్రదేశ విస్తారము ఇరువదినాలుగు అంగుళములు అనియు, స్తనమధ్యప్రదేశము పండ్రెండు అంగుళములు అనియు శాస్త్రము అనుచున్నది. వక్షోదేశమువలెనే, కటికూడ ఇరువది నాలుగు అంగుళములు ఉండవలసినదే కాగా, భుజాంతర పరిమాణము ఎంతయో కటిప్రమాణమును, అంత అగుచున్నది. ఈ పై ప్రమాణములు అజంతాలో - మొదటిగుహలో ఉన్న పద్మపాణి బోధిసత్త్వుని చిత్రము నందును, బేలూరిలోని చెన్నకేశవస్వామి మూర్తియందును మనము పొడగాంచగలము. ఇంకను పెక్కు శాస్త్రీయ ప్రతిమలయందు ఈ లక్షణములు అవ్యాహతముగా ఉండును.

స్త్రీమూర్తులను ఉన్నత వక్షోజలుగను, సింహమధ్యలుగను, కంబుగ్రీవలుగను, త్రిభంగీయుత శరీర వల్లులుగను చిత్రించుట సామాన్యము. సింహమధ్యలు, సమపీన స్తనులు అగువారిలో ఉన్న సౌందర్యము - గజమధ్యలలోను, శుష్క స్తనులలోను ఉండదుకదా ! కనుకనే కాదాళిసు మేఘదూతమున యక్షపత్నిని వర్ణించుచు —

"తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యా ద్యువతివిషయే సృష్టిరాద్యేవ ధాతుః."

ఆమె బ్రహ్మదేవుని ఆద్యసృష్టివలె ఆ యా అవయవముల సౌందర్య సౌకుమార్యములతో ఒప్పుచున్నది అనినాడు.

నానావిధ మానములలోను, తాళముల విషయములోను శాస్త్ర కారులకు మతభేదములు కలవు ఎన్ని భేదములు ఉన్నను అవి అన్నియు దృష్టిభేదములను అనుసరించి స్త్రీ పురుషమూర్తులలో సౌందర్య సంయోగ మును ఒనర్చుటకే ఉపయోగించుచున్న వనుటలో విప్రతిపత్తి లేదు. అందఱు శాస్త్రకారులుకూడ తమ తమ ప్రతిమా లక్షణములద్వారా సాధింపదలచినది సౌందర్య సృష్టియే; సౌందర్యయోగమే।

మనము ఒక ప్రతిమ సౌందర్యమును భావింపవలసి వచ్చినప్పుడు, ఆ యా అంగములను కొలిచి నిర్ణయింప నక్కఱలేదు. కళా పరిశీలనా భ్యాసముగల కళాభిజ్ఞుడు ఒక మూర్తిని కాంచుటతోడనే - దానిలోని గుణదోషములను గుర్తింపగలడు. అట్లే ప్రతిమానిర్మాత యగు శిల్పా చార్యుడుకూడ ప్రతి - అవయవమును కొలతలు కొలుచుకొని నిర్మింప బూనడు. సమగ్రసౌందర్యముమీద దృష్టినుంచుకొన్న అతని హస్తమే ఏ అంగము ఎంతప్రమాణములో ఉండవలయునో, అంత ప్రమాణములో ఉండునట్లే ఆ అంగమును తీర్చును. ఇది అభ్యాస పాటవముయొక్క మహిమ ! ఛందశ్శాస్త్రమును ఎఱిగి పద్యములు వ్రాయజాలినకవి - గురు లఘు గణములను లెక్కించుకొనుచు కవిత్వరచనకు పూనుకొనడన్న విషయము మనకు అనుభవములోనిదే కదా। అట్లే కృతహస్తుడైన శిల్పి!

కూడ ఆ యా ప్రమాణములు—సౌందర్య లావణ్యములు సహజముగనే సిద్ధించుచున్నవనుట రహస్యము. ఎక్కడ ఏ ప్రమాణము లోపించి నప్పటికిని వెంటనే ఆ మూర్తి సౌందర్యదూరమై పోవును. కావున శిల్పి సమగ్రసౌందర్యమును దృష్టిలోడుంచుకొని విగ్రహమును తీర్చి నప్పుడు, శాస్త్రాదులు ఆతనికి దాస్యము చేయును. అప్పుడే అతడు మహాశిల్పి కాగలడు.

అమరావతీ–నాగార్జునుని కొండలనాటినుండి వెలసిన ఆంధ్రశిల్పము నందుకాని, భారతీయ శిల్పమునందుకాని ఈ శాస్త్రలక్షణములు సరి పడునా అని సందేహింప పనిలేదు. కొన్ని కొన్ని శిల్పములకు శాస్త్రము మూలము. అతి ప్రాచీనములు–ప్రాచీన తమములు అగు మఱికొన్ని శిల్పములు శాస్త్రమునకే మూలభూతములు. వాటిని మాతృకలుగా పెట్టు కొని, కొన్ని శాస్త్రములు రచితములైనవనిమనము ఊహింప వీలగు చున్నది. అత్యంతప్రాచీన శిల్పాచార్యులకు లక్షణము ప్రకృతియే. ప్రకృతిలోని ఉత్తమోత్తమ మానవులను, తిర్యక్కులను సూక్ష్మదృష్టితో భావించి వివిధ వ్యక్తులలో ఉన్న విభిన్నావయవ సౌందర్యమును ఏర్చి కూర్చి, వారు సౌందర్య నిధానములగు వివిధ ప్రతిమామూర్తులను నిర్మించినారని మనము సులభముగా గ్రహింపవచ్చును.

ఇక భారతదేశమున ఆ యా యుగములలో వెలసిన శిల్ప-చిత్ర కృతులలో విభిన్న లక్షణములు, సంప్రదాయములు వెలసినవి. వీటిని అన్నింటిని ఒకే సూత్రమున గ్రుచ్చలేము అనుటయు నిజమే. అయినను మయ-కాశ్యప-మానసార-విశ్వకర్మ - సమరాంగణసూత్రధారాది శాస్త్ర కారుల గ్రంథములను బట్టియు, అశోక-భారశివ - గుప్త - శాతవాహన చాళుక్య–చోళ–పల్లవ–హొయసల–కాకతీయ–విజయనగరాది పాలకుల

కాలములకు చెందిన శిల్పుల శిల్ప సంప్రదాయములనుబట్టియు - ప్రతిమా నిర్మాణములోనేమి, ఆలయ నిర్మితిలోనేమి వివిధప్రభేదములు సిద్ధించినవని కళాకోవిదులకు చెప్ప పనిలేదు. అట్లే తత్తద్దేశ సంప్రదాయములుకూడ శిల్ప చిత్రకళలలో ఎన్నో ఉన్నవి కావున మతభేదములు ఉండుట విరోధము కాదు. ఎన్ని శాస్త్ర-మత-సంప్రదాయ శిల్పాచార్యాది భేదములు ఉన్నను, ఈ అన్నింటియొక్క- పరమోద్దేశ్యము - సౌందర్య లావణ్య సంయోజనమే అని గుర్తుంచుకొని, ఉచితరీతి కళాపరిశీలనము - కళా నిర్మాణము చేయుట కర్తవ్యము.



రాజుగారి ఊరేగింపు చిత్రం

"అజంతా" 17 వ గుహ

# లింగతత్త్వస్వరూపాదులు



కార్యరూపమున పరిదృశ్యమానమును, స్థూల సూక్ష్మకృత్యులతో ఇంద్రియగోచరమును అగు ఈ విశ్వమునకు - అదృశ్యము, అతీంద్రియము, సుసూక్ష్మము - అయిన ఒక దివ్యశక్తి కారణభూతమై తేజరిల్లుచున్నదని వేదములు వాకొనుచున్నవి. అది సర్వజ్ఞము, సర్వేశ్వరము నై అచింత్యాద్భుత దివ్యశక్తులతో విశ్వముయొక్క సృష్టిస్థిత్యాదులను జరుపుచున్నది. ఆ దివ్యశక్తినే ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము, పరబ్రహ్మము, సత్తు, ఈశ్వరుడు, పురుషుడు, విశ్వకర్మ. మున్నగు పదములచే వేదము పేర్కొను చున్నది. సత్యజ్ఞానానంతమగు ఈ యేకైక పరతత్త్వము నుండియే అనృత జడ దుఃఖాత్మకమగు జగము పుట్టుట. ఈ ఈశ్వర పదార్థమునకు కరచరణాద్యవయవ విశిష్టమైన శరీరముతో పనిలేదు. శరీరేంద్రియ నిరపేక్షముగానే అది జగత్క్రీడ జరుపగలదు. ఈ విషయములు శిల్పదర్శనము 18, 19 పుటలలో శ్వేతాశ్వతరోపనిషన్మంత్రముల ద్వారా స్పష్టము చేయబడినవి.

ఆదిమమగు ఈ ఈశ్వర తత్త్వమును అపరోక్షానుభూతికి తెచ్చుకొన్న ఋషులు దానిని అనేక విధములుగా గానముచేసి ఉన్నారు. "ఏకం స ద్విప్రా బహుధా వదన్తి" మున్నగు శ్రుతులు ఇందుకు నిదర్శనములు. శబ్ద స్పర్శ రూప రసాది భూతగుణములులేని-ఆ సచ్చిదానందమును మానవులు అనుభూతికి తెచ్చుకొనుటకు అనేక మార్గములు ఏర్పడినవి. అందు నిరాకారమగు-ఆ తత్త్వమునకు రూపకల్పనముచేసి, తదుపాసనము చేయుట ఒక మార్గము. ఇది స్థూలమార్గమైనను, సుసాధమైనది అనుటలో సందేహము లేదు. అందుకే అనేకము లయిన

తంత్రాగమ గ్రంథములు దీనిని బలపఱచుచున్నవి. "చిన్మయము, అద్వితీయము, నిష్కలము, శరీర రహితముఅగు బ్రహ్మమునకు—ఉపాసకుల సౌకర్యమునకై రూపకల్పనము ఏర్పడినది. సాధకుల హితము కొఱకై బ్రహ్మమునకు ఆకార నిర్మాణము."— అను అర్థముగల కులార్ణవతంత్ర వాక్యములను మనము దేవాలయ శిల్పాధ్యాయ ప్రారంభమున చదివి ఉన్నాము.

జగత్కారణమగు నిరాకార నిర్గుణ పరబ్రహ్మమును — దేశకాలాద్యనవచ్ఛిన్నమైన పరమతత్త్వమును ఉపాసించుటకు ఆదిమ కాలమున ఒక చిహ్నమును ఏర్పఱచు కొన్నారు. చిహ్నమనగా గుర్తు. సంస్కృత భాషలో గుర్తునకు "లింగము అను శబ్దము వాడబడి ఉన్నది. విశ్వము యొక్క సృష్టిస్థిత్యాదులకు హేతుభూతమైన సర్వవ్యాపక పరమ తత్త్వమునకు ఈ వస్తువు చిహ్నమనెడి అర్థమున మొదట లింగశబ్దము వాడబడి ఉండును. ఆ నామమును అనుసరించియే దాని స్వరూపముగూడ అండాకారముగా తీర్పబడినది. బ్రహ్మాండమును దృష్టిలో ఉంచుకొనికూడ బ్రహ్మాండ స్వరూపుడును, విశ్వమయుడును అగు పరబ్రహ్మమునకు సంకేత రూపముగా ఏర్పఱుపబడిన లింగము (చిహ్నము)ను అండాకారముగా ఊహించి తీర్చి ఉన్నారని భావింపవచ్చును. ఈ లింగము బిందు స్వరూపముగాకూడ భావింపబడుట ఒక రహస్యము. శ్రీ చక్రమున మొదట మధ్యస్థానమున బిందువును, తదుపరి త్రికోణమును (బిందు, త్రికోణ, వసుకోణ, దశారయుగ్మమ్) ఉండుట తదుపాసకులు ఎఱింగిన విషయమే. అండాకృతికిని బిందుస్వరూపమునకును దగ్గఱి సంబంధము ఉన్నది కదా ! బిందువు ప్రసారావస్థలో అండాకృతిని—లేదా, లింగాకృతిని పడయుచున్నది. ఇట్టి అర్థవిశేషములను మదిలో ఉంచుకొనియే ఆదిమ

తత్త్వవేత్తలు లింగ పూజను విశ్వజనకుని పూజగా పూర్వకాలమున విధించి ఉన్నారు. సారాంశము—లింగము భగవంతునికి చిహ్నమనుట।

నిరవయవములగు ఈ లింగమూర్తులేకాక, సావయవములగు కేశవాదిమూర్తులుకూడ నిరాకార నిర్గుణ పరబ్రహ్మమునకు చిహ్నములని—ఉత్తమ సాధకావస్థలోను, సిద్ధావస్థలోను - భావింపబడక పోలేదు. శ్రీ శంకరులు పాండురంగాష్టకములో కాబోలును— "పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్." పాండురంగస్వామిని అఖండపరబ్రహ్మమునకు లింగ (చిహ్న) మనియే గానము చేసినారు. ఇట్టి ఉదాహరణములు పెక్కులు మనకు వాఙ్మయములో పొడకట్టుచున్నవి.

ఈ లింగములు, తదారాధకులకు శివంకరము లగుటచే శివలింగములనియు, భగవంతునికి చిహ్నములగుటచే భగవల్లింగములనియు కూడ ఆనాడు పిలువబడెడివి. లింగములు సర్పపరివేష్టితములై, ఆ పాము పడగలచేత కప్పబడి ఉండుటనుకూడ ప్రతిలింగాలయమునందును మనము చూచుచునే ఉన్నాము. లింగమునకు అలంకారముగానున్న ఈ సర్పస్వరూపమునే "నాగాభరణ"మని పిలుచుచున్నారు. ఈ నాగాభరణము కూడ ఒక విశిష్టార్థమును బోధించుచునే ఉన్నది. శరీరము నందలి షట్చక్రములలో ఆధారపద్మమున కుండలినీశక్తి ఉన్నది. అది సర్పస్వరూపముగా భావింపబడినది. ఈ శక్తిని యోగానుష్ఠానముచే మేలుకొల్పి, సుషుమ్నామార్గమున సహస్రార పద్మమున ప్రవేశపెట్టుట మోక్షసిద్ధికరమని ఒక యోగసంప్రదాయము. సహస్రారస్థితమైన అఖండ పరబ్రహ్మముయొక్క దివ్యానుభూతిని యోగులు ఈ మార్గమున ప్రయాణించి పడయుదురనుట రహస్యము. సర్పాకృతి గలదిగా భావింపబడిన ఈ శక్తి నిద్రావస్థలో ఉన్నప్పుడు, దాని తోక సహస్రారమునను, పడగ (తల) ఆధారమునను ఉండును. ఆధారస్థానమునుండి సహస్రారము

(తలలోని భాగము) వఱకు వ్యాపించియున్న ఈ నాడినే (సుషుమ్నా మార్గము) స్థూలముగా వెన్నుపామని వ్యవహరించుచున్నారు. యోగులగు వారు యోగాభ్యాసముచేసి ఈ శక్తిని మేలుకొల్పుటచే, అది ప్రబుద్ధమై వారు చెప్పినట్లు పని తలను సహస్రారమునకును, తోకను ఆధారము లోనికిని త్రిప్పి క్రమమార్గమున ఉండగలదు అట్టి స్థితిలో సహస్రారపద్మస్థితమైన పరబ్రహ్మమును ఆ పాము అలంకరించి తత్సేవా నిమగ్నమై ప్రకాశించును. ఈ తత్త్వరహస్యమే బాహ్యజగమున పరబ్రహ్మమునకు గుర్తుగా భావింపబడిన లింగపక్షమునను అనుసంధింపబడి, నాగాభరణములు ఏర్పఱుపబడినవి.

యోగమార్గమునకు చెందిన ఈ లింగతత్త్వ రహస్యము సృష్టిలో కూడ మనకు అగపడుచున్నది మనము "శివలింగపు పువ్వు'' లను చూచుచున్నాము. ఈ పుష్పములు మనుష్య కల్పితములు కావు. ప్రకృతిలో సహజముగా ఈశ్వరునిచే సృష్టింపబడినట్టివి. ఈ పూవు వర్తులాకృతిగలదై ఉండును. పుష్పమధ్యమున పానవట్టమువలె పీఠమొకటియు, దాని నడుమ లింగమును ఉండును. ఆ లింగమునకు పైని పాము పడగవంటి రూపమొకటి ఉండును. ఈ పూవు సర్వవిధముల దేవాలయములలోని నాగాభరణ యుక్తమగు పీఠస్థితలింగమును పోలిఉండుట ఉపాసకులు ఎప్పుడైనను చూచి ఆ రహస్యమును భావింపవచ్చును. వింతయైన ఈ పూవు పారమేశ్వర కళావిభూతినేగాక, శివలింగతత్త్వ రహస్యమునుకూడ అనుభవసిద్ధముగ చాటుటలేదా ? ఆ పుష్పమే ఒక గర్భాలయము, అందలి పీఠమే పానవట్టము. దానిమీది లింగమే భగవల్లింగము. మీది పాము పడగయే నాగాభరణము. "ప్రకృతిలో ఈశ్వరేచ్ఛగా ఏర్పడిన ఈపూవు,పరమేశ్వరుని ఈరూపముగా అర్చింపుడు" అని మానవులకు బోధించుచున్నది కాబోలు ! కావున లింగస్వరూపకల్పనము,

లింగపూజావిధానము — ఈ రీతిగా లోకమున వెలసినట్లు భావించుట అసహజము కాదు.

ఆదిమకాలమున, ఈ లింగమునకు శైవ వైష్ణవాది భేదములు లేవు. అది అఖండపరబ్రహ్మమునకు చిహ్నముగా మాత్రమే భావింపబడినది. కాలక్రమమున శైవ వైష్ణవాది మతములు ప్రబలగా, ఈ లింగము శివునికి మాత్రమే చిహ్నమైనట్లు తోచుచున్నది. తొలుత నిఖిల జగన్నాథుడగు సర్వేశ్వరునకు ఉపయోగింపబడిన శివశబ్దముకూడ, తరువాత శంకరునికి మాత్రమే పర్యాయపదమై ఉండవచ్చును. అందుచేతనే శివతత్త్వ ప్రతిపాదకమైన మతము 'శైవ'మనియు, పరబ్రహ్మలింగము వ్యష్టిపరమైన శివలింగమనియు వ్యవహరింపబడి ఉండవచ్చును. శివ విష్ణ్వాది వివిధమూర్తుల పూజ పురాణయుగమున ఎక్కువగా విజృంభించినది. పురాణములలోని పెక్కు గాథలలో వీరు రాగద్వేష వశులుగాకూడ చిత్రింపబడుట మనము గమనింపగలము. శివ - స్కాందాది పురాణములలో "శివుని లింగము (మేఢ్రము) ఋషుల శాపమువలన తెగిపడి, మింటిలోనికి మంటిలోనికి తెగ పెరిగిపోయినదనియు, దాని ఆద్యంతములు విష్ణువును, బ్రహ్మయు ఎఱుగలేక పోయినారనియు, ఆ లింగమే లోకమునకు పూజార్హమైన దనియు, చెప్పుగాథలు ఎంతవఱకు శివతత్త్వ ప్రతిపాదికములో విచారింపవలయును. ఈ లింగము శివుని శిశ్నమనుట సమంజసమో, పరమేశ్వరునకు - లేక పరబ్రహ్మమునకు చిహ్నమనుట సమంజసమో కూడ భావింపదగినదే. సృష్టి అంతయు ప్రకృతిపురుషులచే జరుగుచున్నది కావున, ఈ లింగము పురుష చిహ్నమును, దానికి ఆధారమైన పానవట్టము - అనగా పీఠము ప్రకృతి చిహ్నమును అని భావించుట సముచితము. అట్లే శ్రీ చక్రమునందలి బిందు త్రికోణములు కూడ పురుషునికిని, ప్రకృతికిని చిహ్నములై ఉన్నవి. పరమపురుషుడగు

శివుడు శక్తి (ప్రకృతి) యుక్తుడైననేకాని, జగత్సర్జనాదులు జరుగ జాలవు కదా "శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్ ''

స్థూలముగా చూచినచో ఈలింగములు దీర్ఘవర్తులపు-ఆకారములో ఉండునని మనము ఎఱుంగుదుము. ప్రథమమున నిరవయవములుగా ఉన్న ఈ లింగములకు కాలక్రమమున ముఖములు కల్పింపబడినవి. ఈ ముఖములు ఒకటినుండి అయిదువఱకు పెరిగినవి. ఏకముఖ, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖ శివ లింగములు కలవు. శరీరావయవము లన్నింటిలో శిరస్సు ప్రధానము. (సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్) కావుననే మొట్టమొదట ఈఅఖండ లింగమునకు ముఖకల్పనము చేయబడినది. పరమేశ్వరునకు అయిదు ముఖములు కల్పింపబడుటలోకూడ ప్రత్యేకాభిప్రాయము కలదని "శిల్ప బ్రహ్మలు" అను అధ్యాయమున చదివి ఉన్నాము.

పంచశీర్షులగు శివ బ్రహ్మ విశ్వకర్మలకు అభేదమునే పెక్కు ప్రమాణములు ప్రతిపాదించు చున్నవి. పరశివునకు – విశ్వకర్మకు అభేదమును చెప్పుచు, పరశివ విశ్వకర్మ తత్త్వము ప్రచలిత మైనది. ఈ అంశమును మూలస్తంభ పురాణమున కాంచనగు. ఇందుకు నిదర్శనముగా "పరశివ విశ్వకర్మాగమము" అని ఒక ఆగమగ్రంథము కూడ కలదు. కాగా పంచశీర్షయుక్తము-పురుషస్వరూపము ఒకటి; అది శివ,బ్రహ్మ,విశ్వకర్మా ద్యపరపర్యాయపదములతో ఒప్పుచున్నది. ప్రకృతికి ప్రతినిధిభూతమగు స్త్రీ స్వరూపము ఒకటి. అది గాయత్రీనామముచే ప్రకాశించుచున్నది. ప్రకృతి పురుషశక్తులకు దంపతిభావ సమారోపణము భారత సంప్రదాయమునకు ఇష్టము. వ్యష్టిగా భావించినప్పుడు సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము అను-ఐదు కర్మములకును వరుసగా–బ్రహ్మ, విష్ణు, మహేశ, ఇంద్ర, సూర్యులు కర్తలు. వీరి

సమష్టి స్వరూపము పంచశీర్షయుక్త పురుషతత్త్వములో తోచును. ఈ బ్రహ్మాది పంచమూర్తులును పంచశక్తి యుక్తులు. జ్ఞానేచ్ఛా క్రియా శక్తులు మూడు, ఆది పరాశక్తులు రెండు - వెరసి పంచశక్తులు. ఈ శక్తులే లక్ష్మీ సరస్వతీ పార్వతీ శచీ సంజ్ఞలుగా భావింపబడినవి. మఱల ఆ మూర్తులకు ఈ శక్తులకు దాంపత్యధర్మము! వేదమతములోని ప్రకృతి పురుషతత్త్వము, దానికి చేయబడిన దాంపత్యధర్మ చిత్రణము, పంచ మూర్తులు, పంచబ్రహ్మలు, పంచఋషులు, పంచశక్తులు, నానావిధ దేవతలు, తత్కుటుంబ పరివార వాహనాదులు కడువిచిత్రములుగా ఉండును. ఇవి సామాన్యులకు అర్థముకానంత కఠినములు; అర్థమయినచో ఆనందదాయకములు; తత్త్వ బోధకములును! ఈ నానాత్వమంతయు ఏకములోనే. ఈ రహస్యములు పెక్కులు కీ. శే శ్రీ కోలవెన్ను పరబ్రహ్మతీర్థులు వారు తమ "జగచ్ఛిల్పము" అను గ్రంథములో వివరించి యున్నారు.

పైని వివరించినరీతిగా ముఖలింగముల ప్రాదుర్భావము జరిగి, పంచముఖ లింగములు వెలసి సృష్టిరహస్య ప్రతిపాదకములు అయినవి. రాను రాను ఈ శివలింగము కరచరణాద్యవయవములతోను - ఆయుధాదులతోను వెలసి పత్నీ పుత్ర పరివార వాహనాదులతో కూడ ఒక శివ కుటుంబముగా పరిణమించి భక్తులకు ఆరాధ్య మైనది.

చారిత్రక దృష్టితో చూచినచో హిందూదేశపు ఆదిమ నివాసులు లింగపూజకులుగానే కనబడుచున్నారు. "మెహంజోదారో - హరప్పాల" కాలమునాటి జనులు ద్రావిడులనియు - వారి మతము శైవమనియు చరిత్ర వేత్తల నిర్ణయముగదా! శైవమతావిర్భావమునకు పూర్వమే లింగార్చనము కలదని మనము ఊహింపవచ్చును. సృష్టిలోని శివలింగపు పూవును

ఏనాడో మానవుడు చూచి యుండును కావునను, యోగాభ్యాస మనునది మన దేశపు జనులలో మెహంజోదారో - హరప్పాలనాటి సంస్కృతికి పూర్వకాలమునుండియు ఉన్నదని ఊహించుటకు వీలయిన చిహ్నములు దొరకినవి కావునను మీది ఊహ నిరాధారము కాదు.

## ము ఖ లిం గ ము లు

పలు శిల్పాగమ గ్రంథములుకూడ ముఖలింగములనుగూర్చి ప్రస్తావించి ఉన్నవి. ఒకటి, మూడు, నాలుగు-ముఖములుగల శివలింగములు ఐశ్వర్యప్రదములును, వాంఛాఫలసిద్ధిదములును. వీటిని గ్రామాదుల యందు ప్రతిష్ఠించి పూజింపవచ్చును. ద్విముఖలింగము శత్రునాశనము చేయును. అందుచే దీనిని కొండలమీదను, అడవులలోను, శత్రురాష్ట్రములకు సమీపముననను ప్రతిష్ఠింపవలయునని శాస్త్రానుశాసనము. పంచముఖలింగములను ఆభిచారిక క్రియలకు ఉపయోగింతురట మొత్తముమీద ప్రత్యేక ప్రత్యేక శాస్త్రలక్షణములతో నిర్మితములయిన లింగములు శత్రుజయాది వివిధ ఫలములను ఇచ్చునని శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి. దీనికి అనుగుణముగనే పురాణములలోని రాజులు కొందఱు ఆ యా లింగములను ప్రతిష్ఠించి పూజించి, కార్యసిద్ధిని పొందినట్లు వర్ణనలు, కథలు మనము వినుచున్నాము. ఈ ముఖలింగములు హస్త ప్రమాణమునుండి పంచహస్త ప్రమాణమువఱకు ఉండవచ్చునని కొన్ని శాస్త్రముల మతము. లింగప్రమాణమునుగూర్చి పెక్కు మతభేదములు ఉన్నవి. కర్త ననుసరించియు, శిల్పాచార్యులను అనుసరించియు, గర్భాలయ ప్రమాణమును బట్టియు - ఈ కొలతలు పలురీతులు గలవి అగుచున్నవి. కోణములనుకూడ ముఖములుగా భావించెడి సంప్రదాయము ఒకటి ఉన్నట్లున్నది. లింగము ఎన్ని పలకలు కలదిగానున్న, అన్ని ముఖములు కలదని చెప్పు ఆచారము ఒకటి కలదు. కంచియందలి

కైలాసనాథ దేవాలయములోని కైలాసనాథలింగము పదునారు పలకలు కలది. అనగా షోడశాస్రము అన్నమాట. దీనిని షోడశముఖ లింగమని అచ్చటివారు చెప్పుదురు. ముఖప్రకల్పనకు పూర్వము, కోణములనే ముఖములుగా భావించెడి ఆచారము ఉన్ననూ ఉండవచ్చును.

రేణిగుంట దగ్గర "గుడిమల్లము" అను ప్రదేశమున శుంగరాజుల (కాలము) నాటి శివలింగ మొకటి దొరకినది. ఇది దాదాపు నిలువెత్తు లింగము. ఈ లింగమునందు ఏకముఖముతో కరచరణాద్యవయవ విశిష్టమైన శివమూర్తి రెండుచేతులుగలది చెక్కబడి ఉన్నది. ఈ మూర్తి-రుద్రాగ్ని దేవతల సమ్మేళనమని కొందరు తలంపు. అనగా కాలాగ్నిరుద్రు డన్నమాట! ఈమూర్తి పాదములక్రింద ఒక రాక్షస మూర్తికూడ తీర్పబడి ఉన్నది. ఇది అపస్మారమూర్తి కావచ్చునేమో! ఈ లింగమునుబట్టి, లింగాకృతిలోనే సంపూర్ణ శివమూర్తిని చెక్కు సంప్రదాయముకూడ ఒకనాడు కలదని తెలియుచున్నది.

వాకాటకుల కాలమున వెలసిన శివాలయములలో ఏకముఖ, చతుర్ముఖ శివలింగములు స్థాపింపబడు చుండెడివి. వీరికాలమున మధ్య భారతదేశములోని "అజయఘడ" రాజ్యమున స్థాపింపబడిన చతుర్ముఖ శివమూర్తి ఒకటి సుందరమైనది లభించినది. ఎల్ఫెంటా గుహలలో కూడ చతుర్ముఖ శివమూర్తి ఉన్నది. ఇట్టివి, ముఖలింగములు క్రమముగా శివమూర్తులుగా పరిణమించినవి అనుటకు నిదర్శనములు. నిరవయవమగు లింగమును అర్చించుటకంటెను, సావయవమగు దైవ మూర్తిని ఆరాధించుటకు సాధకులు ఉత్సాహపడుచుండుట సహజమే కదా! లింగములో తత్త్వము మాత్రము ఉండగా, సావయవమూర్తిలో సౌందర్యముతో తత్త్వముకూడ రూపుకట్టుచున్నది.

## లింగము మూర్తిత్రయ స్వరూపము

"తుర్యస్రేఽష్టాస్రకే వృత్తే బ్రహ్మా విష్ణుః శివః క్రమాత్,
దేవతాః సర్వ లింగేషు త్రిఖండేషు విశేషతః."

—శిల్పరత్నము.

లింగముయొక్క పొడవును మూడు భాగములు చేయగా—మొదటి భాగము బ్రహ్మాంశమనియు, రెండవ భాగము విష్ణ్వంశమనియు, మూడవ భాగము శివాంశమనియు శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి. వీటిలో బ్రహ్మ భాగము చతురస్రముగాను, విష్ణుభాగము అష్టాస్రముగాను శివభాగము వర్తులముగాను ఉండవలయునని కొందఱి మతమును, వరుసగా నాలుగు, ఎనిమిది, పదునాఱు, ముప్పదిరెండు, అఱువదినాల్గు కోణములను తీర్చుచు కడకు వర్తులాకృతిని పొందింప వలయునని కొందఱి మతమునై ఉన్నది. ఇందు నాలుగు కోణములు గల బ్రహ్మాంశము పాదశిలలో ప్రవేశించును. ఎనిమిది కోణములు గల విష్ణుభాగము పీఠము (పాన వట్టము) లో ఇముడును. ఇక వర్తులాకృతి గల శివాంశము మాత్రము దృశ్యమై పూజకులకు పూజనీయ మగుచున్నది. ఈ విధముగా ఒకే లింగములో త్రిమూర్తులు సమ్మిశితము చేయబడినారు. అఖండ లింగము, అఖండ పరమేశ్వర స్వరూపమయినను, వ్యష్టితత్త్వము ననుసరించి చూచిన, మూర్తిత్రయీ స్వరూపమును అందే ఇమిడి ఉన్నదని ఈ రహస్యము చాటుచున్నది. ఏకత్వములో అనేకత్వమును, అనేకత్వములో ఏకత్వమును, వ్యష్టిలో సమష్టిని, సమష్టిలో వ్యష్టిని దర్శింపచేయు యోగ్యత భారతీయ సంస్కృతిలోనే నిబద్ధమై ఉన్నది కదా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టి స్థితి లయములనెడి కర్మములకు అధిపతులు అయినను సమష్టి తత్త్వముగా భావింపబడినపుడు, సర్వజ్ఞత్వ — సర్వేశ్వ

రర్తృ-సర్వశక్తిమత్వ యుక్తులుగాకూడ వర్ణింపబడక పోలేదు. ఆ దృష్టి తోనే ఒక్కొక్క పురాణము ఒక్కొక్కదేవుని ఆధిక్యమును వర్ణించుచు చరితార్థము అగుచున్నది. ఉత్తమ స్థితికి చేరునప్పటికి వ్యవహారార్థము కల్పితములయిన నానావిధ నామ రూప వికార భేదములు మటుమాయమై, తదతీతమగు పరమతత్త్వము మాత్రమే పరమార్థముగా గోచరించు చున్నది. కావుననే కాళిదాస కవీంద్రుడు త్రిమూర్తుల తత్త్వమును తరతమ భావ భేదరహితముగాను, సమగ్రముగాను దర్శించి వర్ణించినాడు. అతడు శివపారమ్యప్రియు డైనను, కుమారసంభవములో దేవతలు బ్రహ్మను ప్రార్థించు ఘట్టమునను, రఘువంశములో దేవతాకృత విష్ణు స్తోత్ర ఘట్టమునను బ్రహ్మ విష్ణుల సర్వశక్తిమత్త్వాదులకు-పరంధామత్వ మునకు లోపము రానీయక, సర్వోత్కృష్టముగా వర్ణించి తత్త్వ ద్రష్ట యైనాడు. ఇట్టి ఉదాహరణములనుబట్టి చూచినచో, లింగార్చన మహిమ యెట్టిదో వ్యక్తము కాగలదు. లింగపూజ ఇంత దొడ్డదగుటం బట్టియే, సావయవమూర్తి పూజకన్నను, లింగారాధనమే శ్రేష్ఠమని "పూజ్యో హరస్తు సర్వత్ర, లింగే పూర్ణార్చనం భవేత్" అని అగ్ని పురాణము అనుచున్నది. ప్రత్యేకముగా శివమూర్తిని గాని, కేశవ మూర్తిని గాని పూజించినచో, అది ఆ ఒక్కొక్కరికే చెల్లును. లింగా రాధనము చేసినచో, సృష్టి స్థిత్యాది ప్రవర్తకమైన సర్వేశ్వరునకు — పర బ్రహ్మమునకు ఆ పూజ సమర్పితమగును. కావుననే—లింగము, సమష్టి తత్త్వమైన పరమేశ్వరునకు — అవ్యక్త పరబ్రహ్మమునకు చిహ్నమని ప్రతిపాదింపబడినది.

## పంచభూతమయ లింగములు

భారతదేశములో పంచభూతమయములైన లింగములు ఉన్నవి జంబుకేశ్వరములో జలలింగము, కాళహస్తిలో వాయులింగము, కంచిలో

పృథ్వీలింగము, చిదంబరములో ఆకాశలింగము, అరుణాచలము (తిరువణ్ణామలై) లో జ్యోతిర్లింగమును - కలవు. కంచిలోని పృథ్వీ లింగము ఇసుకతో చేయబడినట్టిది (సికతామయము). ఇసుక జలస్పర్శ చేత ప్రీలిపోవునుగాన, దీనికి ఏనాడును అభిషేకము చేయరు. దీనిని సైకతలింగమని అనుచున్నారు. చిదంబరములోని ఆకాశలింగము నిరాధారమైన ఆకాశప్రదేశముననే ఉండునట. ఈ పంచభూతమయ లింగములను నిర్మించుటలో ఎన్నో శిల్పరహస్యములున్నవని శిల్పజ్ఞు లందురు. కాశీ విశ్వనాథస్వామియు,శ్రీశైలమల్లికార్జున స్వామియుజ్యోతిర్లింగములే. తెనాలి రామకృష్ణకవి తన పాండురంగ మాహాత్మ్యమున కాశిని వర్ణించుచు "విశ్వేశ్వరజ్యోతిర్లింగ విశుద్ధరత్న ఖని" అనినాడు. ఎల్లోరా గుహలకు సమీపమునకూడ ఒక జ్యోతిర్లింగాలయము ఉన్నది. ఇవి కాక, పంచలింగములని కొన్ని ప్రసిద్ధిచెందినవి కలవు.చిదంబరములోనిది మోక్షలింగమనియు, కుంభకోణములోనిది యోగలింగమనియు, శృంగేరిలోనిది భోగలింగమనియు, కేదారక్షేత్రములోనిది ముక్తిలింగమనియు, నేపాళములోనిది వరలింగమనియు కొందఱు సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు. కొందఱి మతమున కంచిలోనిది యోగలింగమనియు, కాళహస్తిలోనిది ముక్తిలింగమనియు, శ్రీరంగములోనిది భోగలింగమనియు, అరుణాచలములోనిది వరలింగమనియు కలదు. ఈ మతభేదములు ఎట్లున్నను వివిధ ఫలములను ఇచ్చెడి నానావిధ లక్షణములుగల లింగములు భారతదేశమునందు ఏనాడో వెలసినవనుట రూఢి. అమరావతిలోని అమరేశ్వస్వామిని సహస్రలింగమందురు. ఒకేలింగమున వేయి లింగాకార రేఖలు తీర్చినచో, అది సహస్రలింగము అగుచున్నది.

శ్రీశైలము, దాక్షారామము, *కాళేశ్వరము—అను తావుల సుప్రసిద్ధములైన మూడులింగములు ఉండుటచేత మనదేశమునకు త్రిలింగదేశమని ప్రసిద్ధి కలిగినది. ఇంకను కాళహస్తి, అమరావతి, భీమారామము మొదలైన తావులందు ఎన్నో మహిమాఢ్యములైన లింగములు మనకు కలవు. కావున మన తెలుగుగడ్డ లింగారాధనకు పేరుగన్నది.

## నానావిధ లింగములు

లింగములను నిర్మించుటకు నవరత్నములను, శిలను, దారువును, పాదరసమును, బంగారు మున్నగు లోహములను సాధారణముగా ఉపయోగింపవచ్చును. మాణిక్యము, స్ఫటికము, పుష్యరాగము, విద్రుమము మొదలగువాటితో చేయబడిన లింగములు ఆ యా రత్నముల పేరులతోడనే—స్ఫటికలింగము, విద్రుమలింగము, ముక్తాలింగము, పద్మరాగలింగము అని పిలువబడును. రత్నమయ లింగములను బంగారు పీఠము (పానవట్టము) మీదనే స్థాపింపవలయును. ఇవి సాధారణముగా చలలింగములుగానే ఉండును. చలలింగములు ఆ యా తావులకు కదలించుటకును, మెడలోగాని, చేతియందుగాని ధరించి త్రిప్పుటకును వీలైనవి. అచలములు, దేవాలయాదులందు ప్రతిష్ఠితములు అగునవి. శిలతో లింగమునుచేయునప్పుడు శిలాపరీక్ష అవసరము శిలలలో స్త్రీ,పుం, నపుంసక భేదములు ఉన్నవి కదా! కాన పుంశిలతో లింగమును, స్త్రీ, శిలతో పానవట్టమును, నపుంసకశిలతో పాదపీఠమును చేయవలయునని శాస్త్రము

---

* కాళేశ్వరము అనగా కాళహస్తి అని కొందఱును, తెలంగాణములోని కా ళే శ్వ ర మ ని కొందఱును భావించుచున్నారు. ఈ కాళహస్తిలోనిది వాయులింగము, ముక్తి లింగము అగుటయే కాక స్వయంభూ లింగముకూడ అని ప్రసిద్ధి.

చెప్పుచున్నది. ఉత్తముడగు శిల్పాచార్యుడు ఈ శిలాపరీక్షచేసికాని లింగాదులకు శిలలను ఎన్నుకొనరాదు. అజ్ఞానముచేకాని,అనవకాశముచే కాని నిక్షిత శిలలను తారుమారు చేసినచో అవిఅనిష్టఫలములనే ఇచ్చును. రత్నములలో స్త్రీ పుం నపుంసక భేదములు లేవు రత్న దోషములు వేఱు. కావున ఆ యా దోషములులేని నిర్మల రత్నములనే పూజార్థము గాని, ధారణార్థముగాని ఉపయోగింపవలయును. పాదరసమును మూలికా ప్రభావముచేకాని, లోహ సమ్మేళముచేకాని ఘనీభవింపజేసి, లింగములను నిర్మించి, పూజింతురు. ఈ లింగములకు రసలింగములని పేరు. మను చరిత్రములోని సిద్ధునివద్ద ఈ రసలింగము ఉన్నదని పెద్దన్నగారు (అనుటయు రసలింగమునిడు తన వట్రువ ప్రేపసజ్జ దంతపు బరణిన్) చెప్పి ఉన్నారు. ఈ రత్నలింగములుగాని, రసలింగములుగాని భిన్న భిన్న ఫలములను ఇచ్చుచుండును. "రత్నలింగస్య పూజాయాం ఫలం ముక్తి ప్రదాయకమ్." రత్నలింగపూజ మోక్షప్రదమని మాన సారము చెప్పుచున్నది. విజ్ఞులగువారివద్ద వాటి ప్రభావమును ఎఱింగి ఆ యా రత్న–రసలింగములను పూజకులు అర్చింపవలయును.

చందనము, దేవదారువు, జువ్వి, రావి, చంద్ర, మారేడు-మున్నగు వృక్షముల కొయ్యలతో దారుమయ లింగములను నిర్మింతురు. మృణ్మయ లింగముల కంటెను దారుమయ లింగములు శ్రేష్ఠములు.

## లోహమయ లింగములు

"సౌవర్ణం, రాజతం, తామ్రం, పైత్తలం, కాంస్య, మాయసం,
సైతకం, త్రాపుషం చేతి లోహం బింబం తథా ష్టథా."

బంగారము, వెండి, రాగి, ఇత్తడి, కంచు, ఇనుము, సీసము, తగరము–అను ఎనిమిది లోహములతోను లింగములను నిర్మింపవచ్చును.

ఇట్టివి లోహమయ లింగములని చెప్పబడును. వీటికి కూడ ప్రత్యేక ప్రత్యేక ఫలములు కలవు. ఒక్కొక్క వ్యాధి హరించుటకు ఒక్కొక్క లోహముతో చేసిన లింగమును ఉపయోగింపవలయును. అట్లే ఒక్కొక్క ఫలమునకు ఒక్కొక్క లోహముతో లింగమును నిర్మింతురు. ధనవంతులైనను—ప్రయోజనమునుబట్టి, ఇనుము, సీసము, రాగి-మొదలగు విలువ తక్కువ లోహములతో లింగములను చేసి ఆరాధింపక తప్పదు. మోక్షార్థుల లక్ష్యమే వేఱు గావున వారికి అన్నియును ఆరాధ్యములే! అయినను ఫలమును ఇచ్చుటలో మంద మధ్యమ ఉత్తమత్వములు లేకపోలేదు. కనుకనే, అగ్నిపురాణము లింగములకుగాని, తదితర దేవతా ప్రతిమలకు గాని ఉపయోగించెడి ద్రవ్యముల ఫలములనుగూర్చి ఇట్లు చెప్పుచున్నది.

"మృణ్మయాద్దారుజే పుణ్యం, దారుజాదిష్టకా భవేత్,
ఇష్టకోత్థాత్ శైలజే స్యా, ద్ధేమాదే రధికం ఫలమ్ "

మట్టి, కొయ్య, ఇటుక (కాల్చినమట్టి - గాజుకూడ దీనిలోనికే చేరును) శిల, బంగారు—అను వాటితో మూర్తి నిర్మాణముచేసినచో, వరుసగా అవి ఒకదానికంటె ఒకటి అధికఫలములను ఇచ్చును. స్వర్ణలింగము స్వర్గాపవర్గ ఫలప్రదము

## క్షణిక లింగములు

"సైకతం, గోమయం, పైష్టం, మాన్నం, గౌడం, ఫలాత్మకం,
నావనీతం, చ లింగాని త్యజ్యతాం ప్రతివాసరమ్."

ఇంకను ఇసుక, గోమయము, పిండి, అన్నము, బెల్లము, పండు, వెన్న—అను వాటితోకూడ లింగములనుచేసి అర్చింపవచ్చును. ఇవి చిర

కాలము ఉండవు కాబట్టి ఏనాటికి ఆనాడే పూజానంతరము త్యజింప వలయును. వీటికి జల ధాన్యాదివాస క్రియలు లేవు. ఏ యేటిలోనో స్నానముచేసిన భక్తుడు, అచ్చటి ఇసుకతోకాని, మట్టితోకాని, గోమయముతోకాని లింగమును నిర్మించి పూజింపవచ్చును. కాని పూజానంతరమే దానిని వదలివేయవలయును కాశిలో సైకత లింగములను ఇట్లే పూజింతురు. ఒక పండునుకూడ లింగముగా భావించి పూజింపవచ్చును. వెన్నతోను, పిండితోను లింగమునుచేసి అర్చించు ఆచారము నేటికిని కొన్ని శైవగృహములందు లేకపోలేదు. ఈ లింగములు తాత్కాలికములు; క్షణికలింగములని వీటికి పేరు.

## అష్ట లింగములు

ఇంకను 1. సమకర్ణలింగము, 2. వర్ధమానలింగము, 3. శైవాధిక లింగము (శివాంకము). 4. స్వస్తికలింగము, 5. సర్వతోభద్ర లింగము, 6. సార్వదేశికలింగము, 7. ధారాలింగము, 8 ముఖలింగము అని ఎనిమిది భేదములతో లింగములు ఒప్పుచుండును. అందు మొదటి నాల్గును బ్రాహ్మణాది చతుర్వర్ణములవారికిని, తక్కిన నాల్గును ఎల్లవారికిని ఆరాధనీయములు అని శాస్త్రము.

సామాన్యముగా లింగము-సకలము, నిష్కలము, మిశ్రము అని మఱల మూడు భేదములతో ఒప్పుచుండును. ముఖాద్యవయవ విభాగము లేక, కేవలము వర్తులముగా ఉండునది నిష్కలము. కరచరణాద్యవయవ విశిష్టమైనది సకలము. కేవలము ముఖము మాత్రము ఉంచి వర్తులత్వము కలది మిశ్రము. ఇంకను - చలము, అచలము, చలాచలము - అను భేదములుకూడ కలవు. జల ధాన్యాద్యధివాసములు చేయించి, ఆలయాదులయందు ప్రతిష్ఠింపబడినది అచలలింగము. అచల

లింగములకు శిలను, సున్నమును, పాకముచేసిన మట్టిని, కొన్ని వస్తువులు కలిపిన సంకరపదార్థమును ఉపయోగించుట మంచిది. సామాన్య పీఠము మీదనుంచి పూజింపబడునది చలలింగమగును. ఇది రత్నములతోకాని, కొయ్యతోకాని, లోహములతోకాని, నిర్మింపబడుట శ్రేష్ఠము. పలురంగులతో గుడ్డమీదకాని, ఫలకము మీదకాని చిత్రింపబడునది చలాచల లింగము. ఇందు చిత్రింపబడిన లింగాకృతికి చలనముండదుకావున అచల ధర్మమును, ఆ ఆకారమునకు ఆధారమైన గుడ్డ, కాగితము, పలక, మున్నగునవి చలించును కావున చలనధర్మము కూడ ఉండుటవలన ఇది చలాచలము అయినది.

## స్వాయంభూ లింగములు

కొన్ని లింగములు స్వయముగానే పుట్టొందును. అట్టి వాటిని స్వాయంభూలింగములు అందురు. ఇవి మహామహిమాఢ్యములు. వీటి యందు శివశక్తి నిత్యవాసము చేయుటంబట్టి ఇవి దర్శన స్పర్శనార్చాదులచే అనుత్తమమైన ఫలములను ఒసగును. కావున వీటి మూలమును గూర్చి విచారించుట హానికరము. ఇవి జర్జరములై ఉన్నను, కోణములతో ఉన్నను, కుబుచలైనను, పొడవుగలవైనను, పలకలవలె ఉన్నను, వంకరగా ఉన్నను, నానావిధవర్ణాకారములతో ఉన్నను దోషము లేదు. వీటికి శాస్త్రలక్షణములు ఉన్నవా, లేవా—అని విచారింపరాదు. ఇవి గిరి నదీ సముద్రతీర తీర్థారణ్యములందు ఎచ్చట ఉన్నను, ఆలయ రహితములుకాని, సహితములుకాని అయినను పూజార్హములే; ఈ స్వాయంభూలింగముల శక్తి అమోఘము. కావుననే "స్వయంభువి, తథా, బాణే, హ్యార్షే, వా నియమో న హి." స్వాయంభూలింగములు, బాణలింగములు, ఆర్షలింగములు - శాస్త్రనియమములకు లోబడ నక్కఱ లేదని శాస్త్రమే చెప్పుచున్నది.

## బాణలింగములు

మనదేశములో పెక్కు పర్వతములు లింగముల పుట్టుకకు పేరు గాంచినవి ఉన్నవి. లింగాద్రి, శ్రీశైలము, కాశికాగర్తము, అమరేశ్వరము, కన్యాతీర్థము, మహేంద్రాద్రి, నేపాళము- కన్యకాశ్రమము అనునవి లింగములు దొరకుటకు ప్రసిద్ధమైన క్షేత్రములు. వీటిలో మొదటినాలుగు తావుల యందును, మూడేసికోట్ల చొప్పునను, తక్కిన నాలుగు ప్రదేశములయందును కోటి కోటి చొప్పునను - మొత్తము పదునాలుకోట్ల లింగములు ఉన్నవని శిల్పరత్నము చెప్పుచున్నది. శ్రీశైలము వెళ్ళిన వారు నేటికిని లింగాలగట్టుకు వెళ్ళి లింగములను తెచ్చుచుండుట మన మెఱిగిన విషయమే ఈ తావులలో దొరకు లింగములకు బాణలింగములని పేరు ఇవి కూడ శాస్త్రప్రమాణములకు లోబడి ఉండనక్కఱలేదు. వీటిని పీఠములమీదగాని, ఆలయములలోగాని ప్రతిష్ఠించి పూజింపవచ్చును. ఇవి సర్వులకును భుక్తి ముక్తిప్రదములు. ఇంకను నదీనదసముద్ర పర్వతారణ్యములందు సహజములై లభించిన లింగములు -దేవతలచేతను, మునులచేతను, సిద్ధపురుషుల చేతను, ప్రతిష్ఠితములైనవి- బాణలింగములవలెనే లక్షణపర్యాలోచనము చేయకుండ పూజింపదగినవే!

లింగముల కొలతలు, ఆకారములు మున్నగు శాస్త్రనియమములు మానవశిల్పులచే చేయబడు వాటికే వర్తించునుగాని, బాణ - ఆర్ష - సిద్ధ స్వయంభూలింగములకు వర్తింపనేరవని మఱువజనదు.

ఆదికాలపు పరబ్రహ్మలింగము శివపరమైన పిమ్మట, శైవములో వచ్చిన నానాభేదములకును గుఱియై పలునామరూపములతో విస్తరిల్లినది పాశుపతము, కాలాముఖము, మహావ్రతము, వామాచారము, భైరవము- మొదలగు భేదములు శైవమతములో వచ్చిన పిమ్మటను, శివుడు ఒక

పౌరాణిక దేవతగా భావింపబడి, వివిధ కథలు, గాథలు బయలుదేరిన పిమ్మటను నానావిధ లింగస్వరూపములు, గజఘ్నమూర్త్యాదులైన—అష్టాదశమూర్తి భేదములు విస్తరిల్లినవి. వీటి యన్నింటను అంతర్లీనమై నామరూప వికారంభేదములకు అతీతమైనపరబ్రహ్మతత్త్వమునే లింగములో దర్శించి ఆరాధకులు కృతార్థులు కావలయుననుట మాత్రము రహస్యము—సత్యము. ఏకలింగమునుండి — షోడశ, శత, సహస్ర, శతసహస్ర, కోటిలింగములుగా విస్తరించి, విశ్వరూపమును తాల్చిన లింగస్వరూప తత్త్వ సమర్చనాదులు అద్భుతావహములు కావా!!

## ద్వాదశ జ్యోతిర్లింగములు

ఈ సందర్భమున ద్వాదశ జ్యోతిర్లింగములు కల ప్రదేశములను గూర్చి తెలిసికొనుట సముచితము। 1. హిమాలయము నందలి కేదారేశ్వరలింగము, 2. సౌరాష్ట్రములోని సోమనాథలింగము, 3. ఉజ్జయినిలోని మహాకాళేశ్వరలింగము, 4. వారణాసి యందలి విశ్వనాథలింగము, 5. పరలిలోని వైద్యనాథలింగము, 6. ఢాకినిలోని భీమశంకర లింగము, 7. నాసికలోని త్ర్యంబకేశ్వర లింగము, 8. అయోధ్య యందలి నాగేశ్వర లింగము, 9 నర్మదాతీరపు ఓంకారేశ్వర లింగము, 10. ఎల్లోరాయందలి గౌతమేశ్వర లింగము, 11. రామేశ్వరములోని రామనాధ లింగము, 12. శ్రీశైలమునందలి మల్లికార్జున లింగము — ద్వాదశ జ్యోతిర్లింగములని ప్రసిద్ధి పడసినవి. కాని, అరుణాచలము (తిరువణ్ణామలై) లోని అరుణాచలేశ్వర లింగము, దాక్షారామ భీమేశ్వరలింగముకూడ జ్యోతిర్లింగములే యని తెలియుచున్నది. ద్వాదశాదిత్యులనుబట్టి ఈ ద్వాదశ జ్యోతిర్లింగములు ఏర్పడిన వేమో! పరిశోధింపవలసి ఉన్నది. కాశ్మీరములోని అమరనాథ గుహలో ఒక అద్భుతమైన లింగము ఉన్నది. ఈ

అమరనాథ లింగము చంద్రుని వృద్ధిక్షయములను అనుసరించి శుక్ల-కృష్ణ పక్షములయందు క్రమముగా పెరుగుచు- తగ్గుచు ఉండునట।

## శివపంచాయతన పూజ

మధ్యయందు శివుని బాణలింగమును. విష్ణుస్థానమున సాలగ్రామమును, ఆదిత్యస్థానమున స్ఫటికమును, గణపతికి ప్రతినిధిగా శోణానదిలో దొరకెడి ఎఱుపురంగుగల శిలను, అంబికాస్థానమున నర్మదలో దొరకెడి బాణశిలను పెట్టి పూజించు పద్ధతిని శివపంచాయతన పూజ యందురు. "ఆదిత్యం, మంబికాం, విష్ణుం, గణనాథం, మహేశ్వరమ్." అని ప్రమాణము. ఇందు ఉదాహరించిన సూర్యమూర్తి, తంజావూరు ప్రక్కన ప్రవహించునదిలో స్ఫటికరూపమున దొరకు శిల. గంగకు ఉపనదియైన శోణభద్రలో గణపతి రూపమగు ఎఱ్ఱనిశిల లభించును. నేపాళ దేశమునందలి గండకీనదిలో విష్ణు స్వరూప సాలగ్రామము దొరకును. అంబికా చిహ్నశిల కాళహస్తివద్ద నున్న స్వర్ణముఖీనదిలో ఉండును. బాణలింగము నర్మదానదిలోని ఓంకార కుండమునందు లభించును. ఈ శివపంచాయతనమే కాక, ఇంక అనేక దేవతలకు ప్రాధాన్యములుగల పంచాయతనములును కలవు వాటినిగూర్చి "శ్రీతత్త్వనిధి" మొదలగు గ్రంథములయందు కాంచవచ్చును.

## పంచాక్షరీ మంత్రము

పరమ శివోపాసనలో పంచాక్షరీ మంత్రమునకు ఎంతో ప్రాధాన్యము కలదు. ఈ మంత్రమునందలి "నమః శివాయ" అనెడి అయిదు అక్షరములును సృష్టి హేతువులు, స్వరూపములు అయిన - నామ రూప సచ్చిదానందములు, పంచభూతములు, పంచబ్రహ్మలు, పంచశక్తులు-

మొదలగువాటికి సంకేతములు. అంతియే కాదు. ఇందలి "శివ" పదము పరబ్రహ్మమునకును, "నమ" శ్శబ్దము జీవునికిని, "య" కారము ప్రకృతికివి చిహ్నములు. 'శివాయ'— అను మాటలో 'శివ' — అనెడి ప్రకృతియు (ప్రాతిపదికము) 'య' అనెడి ప్రత్యయమును కలవు. ఆ ప్రకృతి ప్రత్యయములు రెండును కలసిననేగాని 'శివాయ' అనెడి పదము సిద్ధము కాదు. అప్పుడే ఆ మాటకు ప్రయోగార్హత. సుబన్తము గాని, తిజన్తముకాని అయిననే పదసంజ్ఞ వచ్చునని వ్యాకరణము. శివ శక్తులు - లేక, ప్రకృతి పురుషులు సమ్మేళనమయిననే సృష్టి. 'శివాయ' లోని 'శివ' శబ్దము పురుష (శివు)నికిని, 'య' కారము ప్రకృతి (శక్తి)కిని చిహ్నములు. కనుక "శివాయ" అనుపదము విశ్వస్వరూప మును, విశ్వేశ్వర స్వరూపముకూడ అగుచున్నది పదత్వసిద్ధికి ప్రకృతి ప్రత్యయములది విడదీయరాని కలయిక అయినట్లు - సృష్టిసిద్ధికిని ఈ శివ శక్తుల, లేక ప్రకృతి పురుషుల సంబంధముకూడ విడదీయరానిదే ! కనుకనే గాయత్రీ విశ్వకర్మలు, శివశక్తులు - 'శివాయ' అను మాటలోనే ఇమిడి యున్నారు. ఇక "నమ" శ్శబ్దము జీవునికి సంకేతమని చెప్పి కొన్నాము కదా ! కావున "నమ శ్శివాయ" అనెడి మంత్ర వాక్యమున జగజ్జీవేశ్వరులు - ఇమిడి యున్నారనియు, జీవుడు విశ్వారాధనము, విశ్వేశ్వరారాధనము చేయుచున్నాడనియు తెలియ వలయును. అందుకే పంచాక్షరీ మంత్రోపాసనము భుక్తి ముక్తి ప్రదము అగుచున్నదని అనుభవజ్ఞులగు ఉపాసకులు అనుచున్నారు !



# దేవతా మూర్తి భేదములు

శైవ, వైష్ణవ, శాక్తాది భేదములతో వైదిక సంస్కృతి పలు రీతులుగా విలసిల్లినది. మూర్తిపూజకు ప్రాధాన్యము ఇచ్చినప్పుడు - పై మతములలో ఒక్కొక్క దేవత అనేకావతారములు తాల్చుటచేతను, ఉపాసకుల కోరికలను అనుసరించి నానావిధ నామ – రూప – మంత్ర యంత్ర–ఉపాసనాది భేదములు ఏర్పడుటచేతను ఈ మూర్తిజాలములో వైవిధ్యము తప్పదయ్యెను. ఈ భేదములు చాలభాగము పౌరాణికము లనియు, శిల్పాగమానుసారులనియు ఎంచవలయును. ఒకవిధమగు రూపముగల దేవతను, తన్నామమును అనుసరించి నియమిత బీజాక్షర ములుగల మంత్రముతోను, ధ్యాన పూజాదులతోను అర్చించునప్పుడు సాధకుడు వాంఛితఫలమును పొందుటలో అన్యతము లేదు. భిన్న భిన్న సాధకులకు భిన్న భిన్న ఫలములనే ఈయజాలనిచో, ఈ నానావిధ నామ రూప మంత్ర ధ్యానానుష్ఠానములుగల దేవతా సమూహము నిష్ప్రయోజన మనియే భావింపవచ్చును. ప్రాచీనులు ఆస్తిక్యబుద్ధితో ఈ దేవతలను ఆరాధించి ఫలములను అందుటవలననే మనకు ఇంతటి శిల్పాగమ మంత్రశాస్త్ర గ్రంథజాలము సృష్టింపబడినది. ఈ దృష్టితో చూచినప్పుడు నానావిధ నామరూపములు గల శివ విష్ణ్వాది దేవతా వైభమును కాంచి సాధకులు పరిహసింపజాలరు. మీదుమిక్కిలి ఆ యా భేదములు అన్నియు అవసరములనియే వారు గ్రహింపగలరు.

సృష్టి స్థితి సంహారములకు కర్తలని భావింపబడిన మూర్తిత్రయ మునేకాక,తక్కిన దేవతా సమూహమునుకూడ పలు నామ రూపములతో శిల్పాగమములు చిత్రించి పెట్టినవి. ఒక్కొక్క దేవతామూర్తి

కూర్చుండియు (సుఖాసన మూర్తి) నిలబడియు (స్థానకమూర్తి) పరుండియు (శయానమూర్తి) పలురీతులుగా ఉండును. ఆ కూర్చుండుటలోకూడ అనేక రీతులు కలవు. ఇంకను ప్రసన్నమూర్తి, వీర మూర్తి, రౌద్రమూర్తి, అభిచారికమూర్తి–ఇత్యాది భేదములును కలవు. ప్రసన్నమూర్తి సర్వారాధ్యుడు. వీర రౌద్ర మూర్తులు శత్రుజయాదుల కోరెడివారు ఆరాధింపదగినవి. అభిచారికమూర్తి శత్రువినాశకరము. అట్లే సంతాన గోపాలాదులు సంతానాది ఫలములను ఇత్తురు.

ఒక్క విష్ణుమూర్తియే నాలుగు చేతులయందలి శంఖ చక్ర గదాద్యాయుధములను ఇటు, అటు మార్చుటచేతను, వర్ణభేదములచేతను–కేశవ నారాయణ–మాధవాదులైన ఇరువదినాలుగు మూర్తులుగా మారుచున్నది అట్లే అభయ వరద హస్తములచేతను, ఆ యా ఆయుధములచేతను, ఆసనములచేతను మూర్తులకు పలుభేదములు సిద్ధమగుచున్నవి. విష్ణు మూర్తి దశావతారములలోని, ఒక్కొక్క అవతారమును అనేక నామ రూపములతో శిల్పింప వీలు కలదు. వరాహమూర్తిని – ఆదివరాహ, యజ్ఞవరాహ, ప్రళయ వరాహ, నృవరాహ, భూవరాహ, లక్ష్మీవరాహ, వీరవరాహాది మూర్తులుగను, నరసింహమూర్తిని–లక్ష్మీనరసింహ, ఉగ్ర నరసింహ, యోగనరసింహ, వరాహనరసింహ, ప్రహ్లాద వరద నరసింహాది మూర్తి విశేషములతో 33 వఱకును తీర్పవచ్చును. ఈ నరసింహమూర్తి భేదములను 30 వఱకు సింహాచలము నందలి వరాహ నరసింహాలయ స్తంభములమీద చూడవచ్చును. ఇక్కడి పంచముఖ నరసింహమూర్తి శిల్పము దర్శనీయ మైనది. ఈ మూర్తికి నాలుగు దిక్కుల నాలుగు ముఖములు కలిగి, అయిదవ ముఖము–లేదా, శిరస్సు–ఈ నాలుగు శిరస్సులకు పైన (మధ్య) తీర్పబడి ఉన్నది. అనగా అయిదు శిరస్సులూ వరుస (పంక్తి) గా లేవన్నమాట. మైసూరులో శ్రీ సిద్ధ

లిఁగేశ్వరస్వామివారు తీర్చిన పరశివవిశ్వకర్మమూర్తి కూడ ఇట్లే ఉన్నవి ఈ నరసింహమూర్తుల వివరములు ఈ రచయిత వ్రాసిన "శిల్పకలా క్షేత్రాలు" మొదటి భాగములో చూడవచ్చును.

శివమూర్తికూడ 64 భేదములతో ఒప్పుచుండును. 1. సుఖాసన మూర్తి, 2. సోమస్కందేశ్వరమూర్తి, 3. వృషవాహనమూర్తి, 4. చంద్రశేఖరమూర్తి, 5. నృత్తమూర్తి, 6. గంగాధరమూర్తి, 7. త్రిపురాన్తకమూర్తి, 8. కల్యాణ సుందరమూర్తి, 9. కంకాళమూర్తి, 10. దక్షిణామూర్తి, 11. అర్ధనారీశ్వరమూర్తి, 12. పాశుపతమూర్తి, 13. హరిహరమూర్తి, 14. కాలఘ్నమూర్తి, 15. భిక్షాటనమూర్తి, 16. చండీశానుగ్రహమూర్తి, 17 లింగోద్భవమూర్తి, 8. గజహామూర్తి- అనెడి మూర్తులకు మాత్రము కాశ్యపశిల్పములో లక్షణములు చెప్పబడినవి. ఈ శివకుటుంబములో చేరిన గణపతి దేవుని విశేషములను, తన్మూర్తి భేదములను పరిశీలింతము.

## గ ణ ప తి మూ ర్తు లు

ఋగ్వేదములో "బ్ర హ్మ ణ స్ప తి" అని ఒక దేవుడు కలడు. ఆ దేవునిపేర అందు కొన్ని సూక్తములుకూడ ఉన్నవి. ఆ బ్రహ్మణస్పతియే గణపతి. విఘ్నేశ్వరపూజ చేయునప్పుడు ఆ దేవుని ఈ దిగువ మంత్రముతో ఆవాహనము చేయుదుము.

"గణానాం త్వా గణపతిం హవామహే
కవిం కవీనా ముపమశ్ర వ స్తమమ్,
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆ నః శృణ్వ న్నూతిభి స్సీద సాదనమ్."

ఋగ్వేద మండలం. 2. సూక్తం 23. మంత్రం 1.

ఈ మంత్రమునందు దేవాది గణములకు పతియు, బ్రహ్మలకు బ్రహ్మయు, కవులకు కవియు, జ్యేష్ఠరాజును అయిన దేవుడు ప్రస్తుతింప బడినాడు. ఆ దేవుని అసలు పేరు బ్రహ్మణస్పతి. అయినను మంత్రములో గణపతి పదముకూడ ఉన్నందున, ఆ దేవుని గణపతి అని మనవారు వాడినారు. ఈ బ్రహ్మణస్పతి త్వష్టృదేవుని కుమారుడని ఈ సూక్తములోని 17 వ మంత్రము అనుచున్నది —

"విశ్వేభ్యో హి త్వా భువనేభ్య స్పరి
త్వష్టాఽజన త్సామ్న స్సామ్నః కవిః,
స ఋణచి దృణయా బ్రహ్మణస్పతిః
ద్రుహో హంతా మహ ఋతస్య ధర్తరి."

"ఓ బ్రహ్మణస్పతీ! త్వష్ట అనెడు దేవుడు నిన్ను సమస్తభూత జాతమునకంటెను ఉత్కృష్టునిగా సృజించినాడు. అందుచే నీవు సమస్త సామములకు కవివి. అనగా స్రష్టవన్నమాట. అట్టి బ్రహ్మణస్పతి యజ్ఞకర్తయగు యజమానునికి ద్రోహముచేయు అసురస్వభావము గల వారిని చంపును"

దీనినిబట్టి త్వష్టపుత్రుడు బ్రహ్మణస్పతి — లేదా, గణపతి అని తెలియుచున్నది. ఈ త్వష్ట, విశ్వకర్మావతారమే అని పురుషసూక్తమునందలి —

"విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి."

అనెడి వాక్యములచే విదితమగుచున్నది కదా! ఈ విధముగా వేద ప్రస్తుతుడైన గణపతి ఆదిదేవుడగుచున్నాడు. అందుకే ఆయన సర్వకార్యములయందును తొలిపూజలను అందుకొను దేవుడుకాగలిగినాడు.

ఇట్టి గణపతికి—గజముఖము, ఏకదంతము, వామనత్వము, లంబోదరము, ఎలుక వాహనము మొదలగునవి పురాణ యుగకల్పనలు. ఈ కల్పనముల ప్రకారము గణపతి నానారీతులతో సిద్ధమయినాడు ముందుగా అష్టవిధ గణపతులనుగూర్చి తెలిసికొందము. ప్రథముడు బాలగణపతి ఈతనికి నాలుగు చేతులు ఉండును. అందొకటి అభయహస్తము. 2. నృత్య గణపతి. ఇతడు పాశాంకుశములను, మోదకమును మూడు చేతులతో ధరించి అభయహస్తుడై యుండును. 3. వీరగణపతి. ఇతడు పూర్ణయౌవనుడును, తత్తదాయుధ విశిష్టములైన ద్వాదశ బాహువులుకలవాడును. 4 లక్ష్మీగణపతి. ఈతనికి ఆఱు చేతులుండును. సుఖాసన మూర్తి. దక్షిణ పాదము లంబము. కుంచితమైన ఎడమతొడమీద లక్ష్మీదేవికూర్చుండును. గణపతివామహస్తము ఆమెనుచుట్టియుండును. 5. మహాగణపతి పద్మాసనాసీనుడై ఆయుధయుక్తములైన పదిచేతులతో ఒప్పుచుండును. 6. వల్లభ గణపతి. ఇతడు ఆయుధయుక్తములగు దశబాహువులు కలవాడు, సుఖాసనమూర్తి. వామాంకమున వల్లభ (భార్య) యుండును. 7. సిద్ధి గణపతి లంబ కుంచిత పాదములుగల సుఖాసనమూర్తి చతుర్హస్తుడు. 8. హేరంబ గణపతి. ఇతడు పంచముఖుడు. దశబాహువు. నాలుగు దిక్కులకు నాలుగు మోములును, ఊర్ధ్వమున ఒక మొగమును ఉండును. ఇతడు సింహవాహనుడై యుండుట ఒక ప్రత్యేక లక్షణము. అయిదు శిరములు కలిగియుండుట అనెడి తత్త్వము గాయత్రీ - విశ్వకర్మ-శివ బ్రహ్మలతో ఆరంభమయి ఈ గణపతి_నరసింహ - హనుమన్మూర్తుల వఱకును వ్యాపించి యుండుట గమనింపదగిన రహస్యము. గణపతి విశ్వకర్మాంశజుడు కాన, ఇతనికి పంచాననము లుండుట సమంజసమే. సర్వజగత్పూజ్యుడగు ఆదిదేవుడు కదా ఇతడు ! పంచముఖాంజనేయునికి వానర, నరసింహ, గరుడ, సూకర (పంది), అశ్వముఖములు ఉండి

వలయును. ఈ విషయమునే "వందే వానర, నారసింహ, ఖగరాట్, క్రోడా-శ్వ వక్త్రై ర్యుతమ్." అని శాస్త్రము చెప్పుచున్నది

మతొకశాస్త్రము ననుసరించి షోడశ గణపతులున్నారు. 1. తరుణ గణపతి. 2. భక్తగణపతి. 3. శక్తిగణపతి. 4. పింగళగణపతి. 5. విఘ్న గణపతి. 6. విజయగణపతి. 7. ఊర్ధ్వగణపతి. 8. ఉచ్ఛిష్టగణపతి–అను వారిని పై ఎనమండుగురితో కలుపుకొన్నచో షోడశ గణపతులగు చున్నారు. మతొక రీతినిబట్టి 32 గణపతులు కలరు. అప్పుడు డుంఠి గణపతి, త్రిముఖగణపతి, యోగగణపతి, దుర్గాగణపతి, సంకష్టహర గణపతి, ఏకాక్షరగణపతి, బీజగణపతి, చింతామణి గణపతి, సాక్షి గణపతి – మున్నగువారు ఆ సంఖ్యలో చేరుదురు. డుంఠివిఘ్నేశ్వరుడు కాశిలో ఉన్నట్లు – "కంఠాగ్రకరిరాజు డుంఠివిఘ్నేశుండు వడకుడు గుబ్బలికూతు గొడుకుగుజ్జు' అనెడి కాశీఖండ వాక్యము చెప్పుచున్నది. శ్రీతత్వనిధి కొందఱు గణపతులకు లక్షణము చెప్పినది. ఉచ్ఛిష్టగణపతి శ్రీశైల దేవాలయ ప్రాకార పశ్చిమ కుడ్యముమీద తీర్చబడియున్నాడు. ఈ మూర్తికి పదిచేతులు కలవు. ఇతని ఎడమ తొడమీద స్త్రీమూర్తి కలదు. ఈతని తొండము ఆ స్త్రీమూర్తి యోనిలో ప్రవేశించి యున్నది. అందుకే ఉచ్ఛిష్ట గణపతి లక్షణమును – "నారీయోని రసాస్వాద లోలుపః కామమోహితః" అని శ్రీతత్త్వనిధి చెప్పుట యైనది. అసలు పెండ్లియేలేని గణపతికి, ఎన్ని దురవస్థలు పట్టినవో చూడుడు! ఇది యంతయు వామాచారము ప్రబలిననాటి తంత్రము కావచ్చును.

ఈ 32 భేదములే కాక, లక్ష్యములనుబట్టి ఇంకెన్నియో విధములుగా గణపతులు ఉన్నట్లు శిల్పక్షేత్ర పరిశీలనముచే తెలియుచున్నది. ఇప్పటికి మనకు దొరకిన శిల్పగ్రంథములకు ఎక్కని చిత్ర విచిత్ర రూపములుగల

మూర్తులు ఇంక ఎన్నియో ఉన్నట్లు తెలియుచున్నది. భవుని భార్య 'భవాని' అయినట్లును, ఇంద్రుని భార్య 'ఇంద్రాణి' అయినట్లును-గణేశుని భార్య 'గణేశాని' కూడ అయినది. మన దేశమున కొన్నిచోట్ల ఉన్న గణేశాని మూర్తులే ఇందుకు నిదర్శనములు. సుచీంద్ర దేవాలయము నందలి ఒక స్తంభముమీద 'గణేశాని' వినాయకమూర్తి స్త్రీరూపముతో నున్నది. సుఖాసనముతో ఉన్న ఈ మూర్తి ప్రలంబ కుంచిత పాదము లతో ఒప్పుచున్నది రెండుచేతులలో పాశాంకుశములు కలవు. తక్కిన రెండుచేతులు వరదాభయముద్రలతో నున్నవి. జబల్‌పూర్‌వద్ద నున్న "భీర్‌ఘాట్" లో కూడ ఇట్టి గణేశానిమూర్తి ఉన్నదట. మధుర దేవా లయమున "వ్యాఘ్రపాద గణేశాని" మూర్తి కలదు. సుందరేశ్వరాలయ ద్వారపాలకుడుగా ఈ మూర్తి 'కంపట్టాడి' మండపమువద్ద ఉన్నది. ఈ మూర్తి పద్మహస్తములు కలిగినట్టిది. ఇది అద్వితీయమూర్తి అని చెప్పవచ్చును

రాయవేలూరి కోటలోని జలగుండేశ్వరాలయపు కల్యాణ మండప స్తంభముమీద బాలగణపతిమూర్తి కలదు. ఇది అద్భుత శిల్పసుందరము. పంచముఖ గణపతి మూర్తులు రెండు అగపడుచున్నవి. తమిళ రాష్ట్రము లోని తిరువత్తియ్యూరు దేవాలయమునందు ఒక సింహవాహన గణపతి కలదు ఈ మూర్తికి అయిదు ముఖములు వరుసగా తీర్పబడి యున్నవి. తంజావూరు మండలములోని నాగపట్టణ దేవాలయమునందు ఇంకొక సింహవాహన పంచముఖ గణపతిమూర్తి కలదు. ఈ మూర్తికి నాలుగు దిక్కులయందు నాలుగు ముఖములును,ఊర్ధ్వమున ఒక మోమును ఉన్నది. హలేబీడునందలి హొయసలేశ్వర దేవాలయముమీద నృత్య గణపతి మూర్తి కలదు. ఇది ఒయ్యారములు ఒలకబోయుచుండును. అట్లే శ్రీశైలమున వేణుగానము చేయుచున్న వినాయకమూర్తిని కాంచగలము.

సర్వవిద్యాధి నాథుడైన గణపతి వేణువూదినను, నృత్యము చేసినను చెల్లు బాటగునుగదా! కర్ణాటక రాష్ట్రములోని నంజంగూడులో శక్తిగణపతి, ఉచ్ఛిష్టగణపతిమూర్తులు కలవు. మనము ఆ యా క్షేత్రములకేగినప్పుడు నిశితదృష్టితో శిల్ప పరిశీలనము చేయుచో ఇంకెన్నెన్ని విశేషములుగల శిల్పమూర్తులుఅగపడునో చెప్పజాలము. అనేక మూర్తులవిశేషములు ఈ రచయిత వ్రాసిన "శిల్పకలా క్షేత్రములు" 1, 2 భాగములలో వివరింప బడినవి. ఈ నానావిధ మూర్తిప్రకరము ఒక్క పౌరాణిక దేవతా లోక మునకే కాక, జైన బౌద్ధ దేవతా ప్రపంచమునకూడ పొడకట్టుచునే ఉన్నది.

శాక్తసంబంధముగా చూచినచో, నవదుర్గలు, అష్టలక్ష్ములు మున్నగునవి శతాధిక భేదములతో ఒప్పునవి కలవు 1. సంతానలక్ష్మి. 2. ధాన్యలక్ష్మి. 3. ఆదిలక్ష్మి. 4 ధనలక్ష్మి. 5. విజయలక్ష్మి. 6. వర లక్ష్మి. 7. గజలక్ష్మి. 8. భాగ్యలక్ష్మి - అనునవే అష్టలక్ష్ములు. వీటిని భద్రాచలములో కాంచవచ్చును. ఈ ఎనిమిదింటిలో చేరని మహాలక్ష్మి, ద్విభుజలక్ష్మి, అష్టభుజలక్ష్మి, ప్రసన్నలక్ష్మి, పరిణామలక్ష్మి—మొదలగు లక్ష్మీ భేదములును, ఇంక అగపడుచున్నవి. ఇట్టివి కొన్ని శిల్పాగమా దులయందును, విభిన్న దేవాలయములయందును పొడకట్టుచున్నవి.

## పంచస్థానములు

భగవన్మూర్తి సన్నిధి చేసి ఉండెడి స్థానములు- 1. స్వయం వ్యక్తము. 2. దివ్యము. 3. ఆర్షము 4. పౌరాణము, 5. మానుషము- అని అయిదు విధములుగా ఉండును. భగవంతుడు స్వయముగా ఆవిర్భవించి భక్తులను అనుగ్రహించు తావునకు స్వయంవ్యక్తమని పేరు. బ్రహ్మ విష్ణు రుద్రాదులైన దేవతలచే ప్రతిష్ఠింపబడినది దివ్యము. ఋషులచే

ప్రతిష్ఠింపబడిన మూర్తి ఆర్షము. పురాణ ప్రసిద్ధమైనది పౌరాణము. మనుష్యులచే ప్రతిష్ఠితమైనది మానుషము. వీటిలో స్వయంవ్యక్తము సర్వోత్తమము. దివ్యము ఉత్తమోత్తమము ఆర్షము ఉత్తమము. పౌరాణము మధ్యమము. మానుషము తరువాతిది. ఇందు మానుషమునుండి స్వయంవ్యక్తము వఱకును ఒకదానికంటె ఒకటి అధిక ఫలసిద్ధి ప్రదము లని తెలియ వలయును.

ఏకమూర్తులేకాక మిశ్రమూర్తులును పెక్కు లున్నవి. అర్ధనారీశ్వర, హరిహర, లక్ష్మీనారాయణ, లక్ష్మీగణపతి, శక్తిగణపతి, శంకర నారాయణ, మొదలగునవి మిశ్రమూర్తులు. వీటిలో కేవల పురుషమిశ్ర మూర్తులు – హరిహర, శంకర నారాయణాదులు. స్త్రీపురుష మిశ్ర మూర్తులు అర్ధనారీశ్వర, లక్ష్మీగణపత్యాదులు. నరసింహ, నృవరాహాది మూర్తులు తిర్యఙ్మానవుల కలయిక కలవి. మత్స్య - కూర్మమూర్తులకు మనుష్యదేహమును కల్పించినచో, అవికూడ తిర్యఙ్మానవ మూర్తులే కాగలవు. ఇక విశ్వరూపమూర్తి సరేసరి. అది చరాచరాత్మకములైన సమస్త రూపముల సమ్మిశ్రణముకల సంపూర్ణాఖండమూర్తి కదా !



# యంత్ర శిల్పము

"యంత్రాధ్యాయ మథ బ్రూమో, యథావ త్ప్రక్రమాగతమ్,
ధర్మార్థ కామ మోక్షాణాం, యదేక మిహ కారణమ్."

—సమరాంగణ సూత్రధారము.

ధర్మార్థ కామమోక్షములనెడి నాలుగు పురుషార్థములకు హేతువైన యంత్రాధ్యాయము నిక క్రమగతముగా చెప్పుచున్నాము.

వైదికము, ఆధ్యాత్మికము అగు శిల్పము స్వర్గప్రాప్తికిని, భగవత్సాక్షాత్కారమునకును కారణ మగుటచేత, అద్దానికి పురుషార్థ పరత్వము చెల్లినది. లౌకికమగు శిల్పముకూడ లోకప్రవృత్తికి హేతువగుటచేత అదియును పురుషార్థ సంపాదకమే. పోగా, ఇక యంత్రశిల్పము పురుషార్థ దాయకము కాదని భావింతురేమో అని సమరాంగణ సూత్రధారుడు కంఠతః అది ధర్మార్థ కామమోక్షములకు ముఖ్యమగు కారణమని వచించి ఉన్నాడు.

సర్వైశ్వర్య కరములును, సర్వ విలాస నివాసములును అగు రాజభవనములయందును, ధనిక గేహములందును యంత్రాత్మకములగు పలు దేవతలను శిల్పి సృష్టించుటచేత, ఆ దేవతలు తమ ప్రతికృతులను కల్పించిన ఆ శిల్పినిగూర్చి సంతసింతురు. దేవతా సంతుష్టియే ధర్మమని వేదోద్దేశ్యము. దేవతానుగ్రహ పూర్వక మగు ఈ ధర్మసిద్ధిచేత శిల్పి స్వర్గప్రాప్తిని గాని, నిరీహుడైనచో, మోక్ష ప్రాప్తినిగాని పడయగలడు. శిల్పి తన యంత్రశిల్ప కౌశలముచేత రాజులను, ధనికులను సంతోషపెట్టును కావున, వారిచ్చు బహూకృతులచేత అర్థము చేకూరును.

అర్థవంతునకు కామపురుషార్థము కైవసమైనట్లేకదా! అర్థవంతుడు బుద్ధిమంతుడేయయిన, దానిని సద్వినియోగపఱచుకొని, మోక్షమునేని చూఱగొనగలడు. ఈ విధముగా యంత్రశిల్పము పురుషార్థప్రద మనుట సమరాంగణ సూత్రధారుని హృదయము.

యంత్రశిల్పముగాని, మఱేకర్మముగాని చక్కఁగా అనుష్ఠింపబడి భగవత్ప్రీతిని సంపాదింప జాలిన మోక్షహేతువగునని గీతలో భగవానుడును చెప్పియే ఉన్నాడు —

"యతః ప్రవృత్తి ర్భూతానాం, యేన సర్వ మిదం తతమ్,
స్వకర్మణా త మభ్యర్చ్య, సిద్ధిం విన్దతి మానవః."

ఏ సర్వశక్తినుండి భూతములు పుట్టుచున్నవో, ఎవ్వనిచే ఈ జగమంతయు వ్యాపింపబడి యున్నదో — అట్టి వానిని మానవుడు తనకు విహితమైన కర్మచే ఆరాధించి సిద్ధిని పొందగలడు. ఈ సందర్భమున సమరాంగణ సూత్రధారుడును, గీతాకారుడును చెప్పిన అభిప్రాయములను మనము కర్తకును, కారయితకును అన్వయింప వచ్చును. యంత్రశబ్దమునుగూర్చి సమరాంగణుడు ఈ అభిప్రాయమును వెలిబుచ్చుచున్నాడు —

"యదృచ్ఛయా ప్రవృత్తాని, భూతాని స్వేన వర్త్మనా,
నియమ్యాస్మిన్ నయతి యత్, త ద్యంత్ర మితి కీర్తితమ్."
స్వరసేన ప్రవృత్తాని, భూతాని స్వ మనీషయా,
కృతం యస్మా ద్యమయతి, త ద్వా యన్త్ర మితి స్మృతమ్.''

భూమి, అగ్ని, జలము, గాలి అనుభూతములు వాటి త్రోవను అవి ఇష్టము వచ్చినట్లు నడచుకొనుచున్నవి. అట్టి వాటి శక్తులను వశము చేసికొని మన యిష్టము వచ్చినట్లు నియమించు కొనుదానికే 'యంత్ర'

మని పేరు. తమ స్వాభావిక కృత్యములందు స్వేచ్ఛగా ప్రవర్తించు భూతములను మందశక్తి గల వానినిగను, అధికశక్తిగల వానినిగను, అన్యథాశక్తి గల వానినిగను చేసికొని ఉపయోగించు కొనునదియే యంత్రము.

జలము, అగ్ని, వాయువు — అనువాటిని మన యిష్టము వచ్చినట్లు ఉపయోగించుకొని ఆ యా పనులను సాధించుకొనుటను- ధూమశకటము, గాలిబండి, (బైసికిల్) ఆవిరిబండి (మోటారు) మున్నగువాటిని చూచి మనము నిశ్చయించు కొనవచ్చును. అట్లే ఒక్క ఆవిరిచేతనే పలు కార్యములు సాధింపబడుటయు ఎఱుంగుదుము. ఇక భూమి విషయమై ఆలోచించినచో కేవలము భూమినేకాక,అందు పుట్టెడి నానావిధ వస్తువులనుకూడ గ్రహింపవలయును; నేలయందును, గనులయందును, కొండలయందును పుట్టెడు పలువిధములైన లోహములు, ఖనిజములు, ఇంకను నేటి వైజ్ఞానికులు కనిపట్టిన వివిధ పదార్థములును యంత్రశిల్పమునకును, వివిధాస్త్ర శస్త్రముల నిర్మాణమునకును ఎంతగనో ఉపయోగించునవియై ఉన్నవి. సీసము, పాదరసము, తగరము, రాగి, లోహము, కొయ్య, చర్మము, గుడ్డ, మొదలగు నానావస్తువులు యంత్రశిల్పమునకు ఆవశ్యకములని సమరాంగణుడు వ్రాసుచ్చి ఉన్నాడు ఆ యా భూతముల యొక్కయు, లోహములయొక్కయు ప్రభావములను గూర్చియు, ఉపయోగములను గూర్చియు చెప్పినవిస్తరము, ఆ గ్రంథమునందే చూడవలయును ఇచ్చట వాటిని వివరింప వీలు కాదు.

భారతదేశములో ప్రాచీనకాలమున యంత్రశిల్పము ఉన్నదను విషయము పలువురకు ఆశ్చర్యజనకముగా ఉండును. మన సాహిత్య గ్రంథరాశినిబట్టి చూచినయెడల, యంత్రశిల్పముకూడ పూర్వము ఉన్నదను విషయము తెల్లము కాగలదు. ఈ అంశమును గ్రంథాధారములను

బట్టి ఊహింపవలసినదే కాని, శిథిలావస్థయందైనను ప్రస్తుతము ఆ యంత్రసామగ్రి కనుపింపక పోవుటచేత వేఱొక మార్గము కన్పట్టదు. రామాయణ భారతాది గ్రంథములయందును, పురాణాదులయందును—పలు చోట్ల పుష్పకాది విమానములయు, ఆశ్చర్యకర ప్రభావముగల వివిధాస్త్ర శస్త్రములయు ప్రశంస వినబడుచున్నది. వర్ణనములందు వినబడి నప్పటికిని ప్రత్యక్షముగా ఆ విధమగు వస్తువులు కన్పట్టక పోవుటచేత అవి ఉండి యుండునను విశ్వాసము మనకు కలుగుట లేదు. అట్టి నమ్మకము లేకపోవుటచేతనే పూర్వగ్రంథముల యందలి వర్ణనములు కవులు అతిశయోక్తులతో కావించిన స్వకపోల కల్పితములని మనము నిరాకరించు చున్నాము. నాస్తికతకూడ లోకమున ఇట్లే ప్రబలి పోయినది. దేవుడు కనబడకపోవుటచే లేడనుచున్నారు. వీరు ఇంచు మించు ప్రత్యక్ష ప్రమాణ వాదులు. అనుభవావస్థలోకాని సత్యము తేట పడదు.

పూర్వకాలమున భారతదేశమునందు యంత్రశిల్పము లేదనియు, అట్టిది ఉండుటే అసంభవమనియు త్రోసిపుచ్చువారైనను, ఈ ఇరువదవ శతాబ్దిలోని యంత్ర సమూహమునుచూచి తమ రెండవ వాదమును ఉప సంహరించుకొని "మానవ విజ్ఞానము, నాగరికత వృద్ధి చెందిన ఈ యుగ ములో యంత్రశిల్పము ఉండిన ఉండవచ్చునుగాని, మన దేశమున పూర్వముగాని, ఇప్పుడుగాని ఉండుట అసంభవ మనువారు పెక్కు రున్నారు. అట్టివారు తమ జాతిమీదను, విజ్ఞాన — నాగరికతలమీదను అవిశ్వాసమును ప్రదర్శించు వారేకాని, దూరదృష్టి కలిగి సత్యమును సందర్శించువారు కారు. పాశ్చాత్య దేశములందు యంత్రశిల్పము విజృంభింపక పూర్వమే—పాశ్చాత్యులు కన్నులు తెఱవక పూర్వమే మన పురాణేతిహాసములయందును, వేదములయందును విమానములు, అస్త్ర

శస్త్రాది అపూర్వాయుధములు ఉన్నట్లు పొడకట్టుచున్నవి ఆ గ్రంథములు ఇప్పుడు వ్రాసినవి కావు కనుక, పాశ్చాత్యుల యంత్రశిల్పమును చూచి వ్రాసిరనుటకు వీలు లేదు. కాబట్టి పూర్వమే ఆ విధమగు యంత్ర వస్తువులు మన దేశములో ఉండవలయునని తేలుచున్నది. అందులకు యంత్రశిల్ప నిర్మాణ విధానములను శాసించు గ్రంథములు పూర్వమే మన దేశమునందు ఉన్నవని నిరూపింప గలిగినయెడల ఈ వాదము నెగ్గినట్లగును.

యంత్రశిల్పము, యంత్రప్రశంస వేదములయందే ఉన్నట్లు అనేకాధారములు కనబడుచున్నవి. అందు త్వష్టృదేవుని ఆధ్యాత్మిక శిల్పమునుగూర్చి "శిల్పబ్రహ్మలు" అనెడి అధ్యాయమున చదివియే యున్నాము. ఆ త్వష్ట, దేవేంద్రునకు అయోమయమైనదియు, నూరంచులు గలదియు అగు వజ్రాయుధమును చేసి యిచ్చినాడని వేదములో పలుతావుల చదువగలము.

"మహ్యం త్వష్టా వజ్ర మతక్ష దాయసమ్"

ఋజ్మండలం 10-సూక్తం 48. మంత్రం 3.

ఈ మంత్రమున "త్వష్ట నాకు ఉక్కుతో వజ్రాయుధమును చేసి యిచ్చినాడు." అని దేవేంద్రుడే స్వయముగా చెప్పినాడు.

"అస్మా ఇదు త్వష్టా తక్ష ద్వజ్రం స్వపస్తమం రణాయ"

ఋజ్మండలం. 1 - సూక్తం 61. మంత్రం 6

"త్వష్టా స్మై వజ్రం స్వర్యం తతక్ష." ఋక్కు 1-32-2.

త్వష్ట యుద్ధార్థము ఇంద్రునికోసము వజ్రాయుధమును చేసెను. త్వష్ట ఈ ఇంద్రునికి స్వర్గహితకరమైన వజ్రమును నిర్మించెను — అని

పై మంత్రములకు అర్థము. "తక్షూ–త్వక్షూ" తనూకరణే'' తక్షూ – త్వక్షూ ధాతువులు రెండును ముడిపదార్థమును వస్తు (శిల్ప) రూపముగా మలచుట అను అర్థమున వాడబడును. కావున "అతక్షత్, తతక్ష" అను క్రియలకు వజ్రాయుధమును నిర్మించి పదునుపెట్టినాడని భావము. ఋగ్వేదమునుబట్టి చూచినచో ఈ త్వష్ట శిష్యులే అగు ఋభువులు కూడ మహాశిల్పాచార్యులే అని తెలియుచున్నది.

"తక్షన్ రథం సువృతం విద్మనాపస
స్తక్షన్ హరీ ఇంద్రవాహా వృషణ్వసూ,
తక్షన్ పితృభ్యాం ఋభవో యువ ద్వయః
తక్షన్ వత్సాయ మాతరం సచాభువమ్."

—ఋఙ్మండలం. 1–111–1.

"శ్రేష్ఠమైన శిల్పకర్మకౌశలముగల ఋభువులు అశ్వినీ దేవతలకు గట్టిచక్రములు గల రథమును చేసిరి ఇంద్రుని వాహనములైన గుఱ్ఱములను చేసిరి. ఈ గుఱ్ఱములు తిరుగాడవలయును కావున, ఇవి యంత్రమయములని గ్రహింపవలయును. ముసలివారైన తమ తలిదండ్రులకు యౌవనముతో కూడిన ఆయుష్యమును పెంచిరి. ఈ వాక్యమునుబట్టి ఋభువులకు వైద్యశాస్త్ర ప్రావీణ్యముకూడ ఉన్నట్లు స్పష్టము. దూడ కోసమై తల్లియగు ఆవునుకూడ సృష్టించిరి.'' ఇది కూడ యంత్రమయము కావచ్చును కదా ! ఇంకను వీరి శిల్పప్రావీణ్యమునుగూర్చి ఋగ్వేదము–

"తక్ష న్నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథం,
తక్షన్ ధేనుం సబర్దుఘామ్."

— ఋక్కు. 1 – 20 – 3.

ఋభువులు అశ్వినీ దేవతలకు నిర్బంధము లేకుండ సర్వత్ర సంచరింప గలదియు, పైని కూర్చుండుటకు సుఖకరమైనదియు అగు రథమును, పాలు పితుకుకొనుటకై ఒక ఆవును చేసిరని మంత్రార్థము. "సబర్దుఘాం" అనెడి మాటను "సర్వదుఘాం" అనియు, "కామదుఘాం" అనియు కొందఱు పఠించిరి. "సర్వ దుఘాం ధేనుం" అనగా సమస్తమును ఇచ్చెడి కామధేనువు అని వారి అభిప్రాయము. కాశ్యప శిల్పమునకు ఉపోద్ఘాతమును వ్రాసిన "వఝె కృష్ణశర్మ" గారు "కామదుఘామ్" అను పాఠమును గ్రహించి కామధేనువు ఒక మహాయంత్రము అనినాడు. ఆయన వాక్యములు ఇవి—

"శిల్పజ్ఞా యద్య దిష్టం త త్త త్సాధయితుం
సమర్థాం ధేనుం నిర్మముః. అనేన కామధేనునామ్నా
ప్రసిద్ధం కించి న్మహాయంత్రం భవతీతి తర్కయామి.
విశేషత స్తక్షధాతోః ప్రయోగాత్ కృత్రిమత్వం లక్ష్యతే."

"శిల్పవేత్తలు ఇష్టమైనవాటిని సాధించుటకు సమర్థమైన ధేనువును నిర్మించినారనుటచేత కామధేనువని ప్రసిద్ధి చెందినది. ఒక మహాయంత్రమని భావించుచున్నాను. విశేషించి మంత్రములో 'తక్ష' ధాతువును ప్రయోగించుటవలన కామధేనువు కల్పితమని తెలియుచున్నది." అని పై వాక్యములకు అర్థము. విష్ణుని అవతారములని చెప్పబడెడు మత్స్య, నరసింహాదులు కూడ యంత్రమయ శిల్పములనియే సమరాంగణ సూత్రధారాది శిల్పశాస్త్రకారుల అభిప్రాయము. మత్స్యావతారము నాటి జలాంతర్గామి (Submarine) అని కూడ పలువురి అభిప్రాయము.

ఈ ఋభువులకు యంత్రమయములైన రథాశ్వధేన్వాదుల నిర్మాణ చాతుర్యమే కాక, ఒక్కపాత్రను నాలుగుగా చేసెడి ప్రజ్ఞయు ఉన్నట్లు

ఋభుసూక్తములనుబట్టి తెలియుచున్నది. మానవశిల్పులగు వీరు తమ శిల్పచాతుర్యమువలన ఇంద్రాదులను మెప్పించి దేవత్వమును కూడ పొంది హవిర్భాగములనుగూడ స్వీకరించినట్లు ఋగ్వేదము అనుచున్నది. మరొక మంత్రము ఇట్లు చెప్పుచున్నది.

"అహం రుద్రాయ ధను రాతనోమి
బ్రహ్మద్విషే శరవే హంత వా ఉ."

ఋక్కు. 10 - 125 - 6.

అనగా "నేను రుద్రునికొఱకు ధనుస్సును నిర్మించుచున్నాను" అని భావము. ఈ ధనుర్నిర్మాణము త్రిపురాసుర సంహారము కోసమని సాయణుల భాష్యము. ఇంకొక మంత్రములో చక్రములు లేని రథము అగపడుచున్నది. "యం కుమార నవం రథ మచక్రం మనసా కృణోః" అని. అట్లే త్రిచక్రరథముకూడ ఒక్కచోట పొడకట్టుచున్నది. ఇట్టిమంత్రములు వేదముననే యంత్రశిల్పము ఉన్నట్లు స్పష్టీకరించుచున్నవి. ఇంద్రుడు మహాశిల్పాచార్యుడని "సప్తర్షి మండలము" "పంచర్షి మండలము" "జగచ్ఛిల్పము" మొదలగు గ్రంథములను వ్రాసిన కీ. శే కోల వెన్ను పరబ్రహ్మ తీర్థులువారు నిరూపించి ఉన్నారు.

శిల్పగ్రంథముల పట్టికను చూచినచో - "విమానాధి కరణము" "విమానాదిమానము" "విమానవిద్య" "కశ్యపసంహిత" (యంత్రశిల్ప సంబంధి) "సమరాంగణ సూత్రధారము" మున్నగు గ్రంథములు కలవని తెలియుచున్నది. ఇవి అన్నియు యంత్ర నిర్మాణ విధానములను సమగ్రముగా చర్చించునట్టి గొప్ప గ్రంథములే. కాని పై గ్రంథముల పేరులలోనున్న "విమాన" శబ్దము ఆకాశయానమను అర్థములోనిదా, ఇంక ఏదేనియా, అని సందేహము కలుగవచ్చును. "విమాన" శబ్దమునకు

"మేడ" అను అర్థముకూడ ఉండుటచేతను, శిల్పశాస్త్రములు భవన ప్రాసాదాది నిర్మాణమును గూర్చికూడ శాసించుట చేతను సౌధనిర్మాణము లనుగూర్చి పై గ్రంథములు చెప్పుచున్నవేమో అని కూడ శంకింప వచ్చును. ఈ సందేహము లన్నియు తీఱుటకు ఏ గ్రంథమునుండి యయినను ఆకాశయాన నిర్మాణ విధానమును నిరూపింప గలిగిననేకాని ఈ యంత్రశిల్పమునుగూర్చిన వాదము నెగ్గినట్లు కాదు.

ప్రాచీన గ్రంథములు కొన్ని చెదపురుగుల వాత బడగా మిగిలినవి ఇప్పు డిప్పుడు వెలువడు చున్నవి. కొలది కాలమునుండియు క్రొత్త క్రొత్త పరిశోధన శాఖలను నెలకొల్పి, వాటి మూలమున ప్రాచీన గ్రంథములను వెదకించి సాధ్యమయినంతవఱకు ముద్రించుచున్నారు. యంత్రశిల్పమునకు సంబంధించిన ప్రాచీన గ్రంథములలో "సమరాంగణ సూత్రధారము" ఒకటి. ఇది భోజదేవకృతమైనట్లు కలదుకాని, భోజ కృతము కాదు. భోజుని ఆస్థానమున ఉన్న "సమరాంగణ సూత్ర ధారుడు" అను మహాశిల్పాచార్యునిచే ఇది రచితమైనట్లు పలువురు శిల్ప శాస్త్రకోవిదులు తలంచుచున్నారు. కాశ్యపశిల్పమునకు ఉపోద్ఘాతము వ్రాసిన శిల్పకలానిధి అగు కృష్ణశర్మయను పండితుడు దీనినిగూర్చి "భోజనృపతేః సన్నిధౌ వసతా సమరాంగణ నామ్నా సూత్రధారేణ రచితః "సమరాంగణ సూత్రధారః" అని వ్రాసినాడు. పరికింపగా ఇదియే ఉచితముగా ఉన్నది. సమరాంగణ సూత్రధార రచితమగు గ్రంథము కావుననే తన పేరే దానికి గ్రంథకర్త పెట్టిఉండును. పలువురి గ్రంథములు గ్రంథకర్తల పేర్లతోనే వ్యవహరింపబడుట మన మెఱుంగనిది కాదు. భోజదేవ కృతమే అగుచో "సమరాంగణ సూత్రధార" మని పేరిడుటలో అర్థమగపడుట లేదు. సూత్రధారుడనగా శిల్పా చార్యుడను అర్థమును కలదు.("సూత్రధారం విశ్వకర్మాణం పూజయేత్,"

మున్నగు ప్రయోగములు కలవు.) సమరాంగణమునందు = యుద్ధప్రవేశమున, లేదా యుద్ధరంగమునకు ముందఱ, తన శిల్పచాతుర్యమును ఉపయోగించి వ్యూహములను పన్ని, శిల్పప్రాగల్భ్యమును ప్రకటించి శత్రువులను జయించుటచేత ఇతనికి ఈ పేరు కలిగినది. తన లోకోత్తర సామర్థ్యమును ప్రకటించునట్టి ఆ బిరుదనామమునే ఆతడు తన గ్రంథమునకును పెట్టుకొనినాడు.

విశ్వకర్మ తన నల్వురు తనయులకు ఈ శాస్త్రమును ఉపదేశించినాడట. ఇది ఎనుబది మూడు అధ్యాయముల గ్రంథము. దీనిని "గైక్వార్ ఓరియంటల్ సీరిస్" బరోడా, వారు ప్రకటించినారు. మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు గ్రంథమును సవరించి ఉపోద్ఘాతమును వ్రాసియున్నారు. శాస్త్రిగారు శిల్పశాస్త్ర సంపాదనములో చేసినకృషి అతిమాత్రము. శిల్పమాత వీరు చేయుచున్న సేవను హృదయముతో అభినందింప గలదు. ఈ గ్రంథమునందు వాస్తు శిల్ప విషయములు కూలంకషముగా చర్చింపబడి ఉన్నవి. యంత్రశిల్పమునుగూర్చి రెండు అధ్యాయములలో వివరింపబడి ఉన్నది. గజయంత్రము, వ్యోమచారి విహంగ విమానయంత్రము, ఆకాశగామి దారుమయ విమానయంత్రము, ద్వారపాలయంత్రము, మున్నగు పలుయంత్రముల విధానములు చెప్పబడి ఉన్నవి. కొన్నింటిని మాత్రమే ఇట ఉదాహరింపబడ యగుచున్నది.

> ''యన్త్రేణ కల్పితో హస్తీ నదన్ గచ్ఛన్ ప్రతీయతే,
> శుకాద్యాః పక్షిణః క్లృప్తా స్తాలస్యానుగమా న్మహాః,
> జనస్య విస్మయకృతో నృత్యన్తి చ పఠన్తి చ ''

యంత్రముతో నిర్మించిన యేనుగు ఘీంకరించును; నడచును. చిలుకలు మున్నగు పక్షులును యంత్రసామర్థ్యమువలన తాళానుసారముగ

ఆశ్చర్యము కలుగునట్లు నాట్య మాడగలవు: చదువగలవు. "పఠన్తిచ" అనుటవలన చదువునట్లు చేయుటకు ఎంత చాతుర్యమును ప్రయోగింపవలయునో విచారింపుడు. ఈ విధముగా కోతులయు, గుఱ్ఱములయు యంత్రములను చేయు విధానములు పెక్కులు ఈ అధ్యాయమున కలవు.

"లఘుదారుమయం మహావిహఙ్గమ్, దృఢ సుశ్లిష్ట తనుం విధాయ తస్య,
ఉదరే రసయంత్ర మాదధీత, జ్వలనాధార మధోఽస్య చాగ్నిపూర్ణమ్.
తత్రారూఢః పురుష స్తస్య పక్ష, ద్వంద్వోచ్చాలన ప్రోజ్ఝితే నానిలేన,

సుప్తస్యాన్తః పారద స్యాస్య శక్త్యా,
చిత్రం కుర్వ న్నమ్బరే యాతిదూరమ్."

తేలికైన చెక్కలతో గొప్ప పక్షిరూపముగా విమానమును నిర్మింపవలయును. దాని సంధిబంధములను, (చెక్కలు, తోక మున్నగునవి) దృఢబద్ధము లొనర్చి, మధ్యప్రదేశమున రసయంత్రమును నిక్షేపింపవలయును. ఆ రసయంత్రముక్రింద అగ్నిని ప్రజ్వలింప చేయవలెను. అప్పుడు మనుష్యుడు అందు కూర్చుండు నడిపినయెడల చెక్కలయొక్క చలనమువలన కలిగిన గాలిచేతను, లోపలనుంచిన పారదయంత్రముయొక్క శక్తిచేతను ఆ యంత్రము ఆశ్చర్యము కలుగునట్లు ఎంతదూరమైనను పయనింప గలదు. ఇది "వ్యోమచారి విహంగవిమానయన్త్రి" మనబడును.

"ఇత్థమేవ సురమన్దిర తుల్యం, సంచలత్యలఘు దారువిమానమ్,
ఆదధీత విధినా చతురోఽన్త, స్తస్య పారద భృతాన్ దృఢకుంభాన్.
అయఃకపాలాహిత మన్దవహ్నౌ, ప్రతప్త తత్కుంభభువా గుణేన,
వ్యోమ్నో ఝుగి త్యాభరణత్వ మేతి, సంతప్త గర్జ ద్రసరాజ శక్త్యా."

ఈ విధముగనే సురమందిరతుల్యమగు గొప్ప దారువిమానము కూడ నడచును. యన్త్రనిర్మాణ చతురుడైన శిల్పి శాస్త్రప్రకారము పారదకుంభములను లోపల పెట్టవలయును. అయః కపాలముల (ఇనుప బొచ్చెలు) క్రిందనుంచిన మందాగ్ని వలన రసకుంభములలోని పాదరసము ఉడికి శబ్దించుచుండగా ఆ రసకుంభములవలన కలిగిన గుణముచే ఆకాశమునకు ఈ విమానము అలంకారప్రాయమై చరచర పయనించును. ఇది "ఆకాశగామి దారుమయ విమానయంత్ర" మని చెప్పబడును.

యంత్రవిధానమును బాగుగా సాధించుటచేత అనేక ప్రయోజనము లను సంపాదించు కొనవచ్చును. భూచరులగు మానవాదులను ఆకాశ చారులను చేయుటకును, వ్యోమచారులను భూచరులను ఒనర్చుటకును యంత్రము మిక్కిలి ఉపకరించును. దేవతలచే రక్కసులు జయింప బడిన ప్రకారము, సముద్రము మథింపబడినరీతి, నృసింహునిచేత హిరణ్యకశిపుడు చంపబడిన దృశ్యము,పలువిధములగు ధారాగృహములు, ఉయ్యేలలతో ఆడునట్టి ఆటలు, చిత్రములగు రతిగృహములు, స్వయం వాహక సేవకులుగల కుటీరములు, సత్యములు, మాయామయములు అగు అనేక విధముల సభలు, మొదలగునవి ఎన్నియో యన్త్రములచే సాధింప వీలున్నది.

నరసింహ యంత్రమును నిర్మించి సింహనాదము చేయించినచో ఎట్టి మదవుటేనుంగు లయినను మావటివాని అంకుశపు దెబ్బనుకూడ లెక్కింపక పాఱిపోవును. కీలకవిధానమును అనుసరించి దారువుతో స్త్రీ విగ్రహమునుగాని, పురుషాకారమునుకాని నిర్మించి, వెలుపల అంతటను చర్మముతో తొడుపువేసి, ప్రత్యంగమునకు లోపలి భాగమునందలి రంధ్రముల ద్వారమున, నారాచయుక్తములగు సూత్రములను తగురీతిగా

కూర్పవలయును. ఇట్టి ఈ విగ్రహము తన సర్వావయవములను కదలింపగలదై చేయిపట్టుకొనుట, తాంబూలము ఇచ్చుట, నీరు చల్లుట మున్నగు పనులను ఆశ్చర్యకరముగా చేయగలదు. తాంబూలమిచ్చునట్టి ఒక విగ్రహమును చేమకూర వేంకటకవి విజయ విలాసములో ఇట్లు వర్ణించినాడు —

"ఒక మాణిక్యపుబొమ్మ యెట్టివగ కీలో జాళువాజాలవ
ల్లిక బాగాల్ కపురంపుటాకుమడుపుల్ వేతెచ్చి రాజన్నచా
యకు నందీయ నతండు లేనగవుతో నావేళ నావ్యాళక
న్యక కెంగేల నొసంగి కైకొనియె సయ్యాటంబు వాటిల్లఁగన్."

ఆ 1. పద్యం. 106 వ

కొయ్యతో నిర్మించిన పురుషవిగ్రహము వాకిటియందు స్థాపించబడి, తన హస్తమునందలి కఱ్ఱచేత ఇంటిలో ప్రవేశించువారిని నివారింపగలదు. అట్లే చేయబడిన మఱొక రకమైన పురుషాకార యంత్రము చేతిలో ఖడ్గము మొదలగు ఏదేని ఆయుధమును ఉంచినచో, రాత్రియందు ఇంట ప్రవేశించు దొంగలను చంపును. దొంగగాని, చోరగాని — నోరు తెఱచి పిలువకుండ వచ్చువానిని కొట్టునని తెలియుచున్నది.

ఇంకను పలు భేదములతో ఒప్పుచున్న జలయంత్ర విధానములు కలవు. ధారాగృహ నిర్మాణమునుగూర్చి సమరాంగణ సూత్రధారుడు అత్యాశ్చర్యముగ చెప్పియున్నాడు. ప్రవర్షణము, ప్రాణాలము, నంద్యావర్తము- అనెడి నామములుకల ఈ గృహవిశేషములు ప్రాకృత జనులకు కాక, రాజులకోసమై శిల్పాచార్యుడు నిర్మింపవలయునని చెప్పినాడు. ఈ ధారాగృహ విధానమును ఇరువదియైదు శ్లోకములలో అత్యాశ్చర్యకరముగా వర్ణించి, మండువేసవిలో ఏ రాజు అందులో కూర్చుండి నానావిధ

భోగములను అనుభవించుచు పలువిధములగు జలశిల్పములను చూచుచు ఆనందించి సౌఖ్యమునందునో, ఆతడు భూమిమీద నివాసము చేయుచున్న దేవేంద్రుడని — అనగా భూలోక దేవేంద్రుడని సమరాంగణుడు పలికి యున్నాడు.

ఇట్లు పలువిధములైన యంత్రములు ఇందు చెప్పబడినవి. దీనిని బట్టి చూచినయెడల, యంత్రశిల్పము పూర్వమున ఎంతగా ప్రకాశించినదో వ్యక్తము కాగలదు. సమరాంగణ సూత్రధారము అనేక విషయములను గూర్చి చర్చించునది అగుటచే, కొలదిపాటిగా మాత్రము యంత్రశిల్ప ప్రశంస చేసినది. ప్రత్యేకముగా యంత్రములకొఱకు — విమానముల కొఱకు వ్రాయబడిన "విమానాధికరణము" "విమానవిద్య" మున్నగు గ్రంథములలో విమాన నిర్మాణవిషయము ఎంత విపులముగా చెప్పబడి యుండునో మనము ఊహించుకొనవచ్చును. ఆ గ్రంథములు మన దేశమునుండి దేశాంతరములకు నడచినవని పెద్దలు చెప్పుచున్నారు.

భరద్వాజ కృత ''యంత్ర సర్వస్వము'' లో విమాన నిర్మాణ ప్రకరణము ఒకటి. దానిని వైదిక రీసర్చి స్కాలరయిన శ్రీ ప్రియ రత్న ఆర్షగారు హిందీలోనికి అనువదించినారు. ఆ భాగమును నెల్లూరు వాస్తవ్యులు శ్రీ పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులుగారు తెనుగు చేయగా కీ. శే. జిల్లెళ్ళ వీరబ్రహ్మాచార్యులుగారు ప్రకటించినారు. ఇందు 92 విమాన రహస్యములు కలవు. శత్రువిమానములను విధ్వంసము చేయునట్టి 5. ఆవర్తములు వివరింపబడినవి. ఇందలి యంత్రశిల్ప రహస్యములు ఎంతో ఆసక్తిదాయకములై ఉన్నవి. వాటిలో '' స్తబ్ధీకరణ రహస్యము''ను పరికింతము.

"విమానోత్తర పార్శ్వస్థ సంధిముఖనాళాత్ అపస్మారధూమం సంగ్రాహ్య, స్తంభనయంత్రద్వారా, తద్ధూమ ప్రసారణాత్ పరవిమానస్థ సర్వజనానాం స్తబ్ధీకరణం భవతి."

అనగా విమానమునకు ఉత్తర భాగమునకల సంధిముఖ నాళము నుండి అపస్మారధూమమును సంగ్రహించి, స్తంభన యంత్ర ద్వారమున ఆ పొగను వ్యాపింపజేసినచో, శత్రు విమానముమీది మనుష్యులను అందఱను చైతన్యరహితులనుగ స్తంభీభవింపజేయ వచ్చునట. అనగా ఈ పొగ వ్యాపించుటవలన వారు మూర్ఛ పొంది అపస్మారస్థితిలో ఉందురన్నమాట. ఈ అపస్మారధూమము ఈనాటి బాష్పవాయువును పోలి, అంతకంటె కూడ శక్తికలదై శత్రువులను మూర్ఛిల్లజేయునట్టి విశేషగుణము కలదని తెలుచున్నది కదా! ఇట్టి రహస్యములతో ఈ గ్రంథము "య ం త్ర శి ల్ప" సారస్వత సంపాదనకు మనలను ప్రోత్సహించుచున్నది.

విమానాధికరణము, లోహతంత్రము, మొదలగు గ్రంథములు మైసూరు మహారాజాస్థాన విద్వాంసులగు కీ॥ శే॥ టి. సుబ్బరాయశాస్త్రి గారు తమయొద్ద నుండినట్లు 1910 ప్రాంతమున గుంటూరుజిల్లాకు వచ్చినప్పుడు — తమ ఉపన్యాసములలో తెలిపిరి. కీ. శే. వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు కూడ తమ శిల్పగ్రంథాన్వేషణ సందర్భములో సుబ్బరాయ శాస్త్రిగారిని కలసికొని ఆ విధమైన యంత్రశాలలను మనదేశములో నెలకొల్పవలయునని ప్రయత్నము చేసిరి ఇట్టి ఉద్యమములకు ప్రభుత్వ సహాయము అవసరము కావున, అది దుర్లభమగుటచే అందు కృతకృత్యులు కారైరి. అప్పటికిని ఆంధ్రదేశములో ఆ కాలమున శిల్పాభివృద్ధికై కృషి చేయుచున్న "కృష్ణా గుంటూరుమండల విశ్వబ్రాహ్మణ

సభ" లకు సుబ్బరాయశాస్త్రిగారిని పిలిపించి వారిచే కొన్ని శిల్పరహస్యములను గూర్చి ఉపన్యసింప చేసిరి.

అత్యాశ్చర్యకరములగు ఈయంత్రములను నిర్మించు విధానములను మాత్రము సమరాంగణుడు వివరింపలేదు. అందులకు ఆతడు ఈ కారణమును వచించెను.

"యన్త్రాణాం ఘటనా నోక్తా-గుప్త్యర్థం నాజ్ఞతావశాత్,
తత్ర హేతు రయం జ్ఞేయో, వ్యక్తా నైతే ఫలప్రదాః."

ఈ శాస్త్రమునందు యంత్రములను నిర్మించెడు రీతులు చెప్పబడ లేదు. అందుకు కారణము ఆ యా రీతులు తెలియక పోవుటకాదు, రహస్యముగా ఉండవలయుననుటయే. ఆ రీతులు వాగ్రూపమున ప్రకట మొనర్చినయెడల సఫలములు కానేరవు. అనగా బోధ మాత్రముచే ఎఱుంగు సారస్వత విద్యవలె, శిల్పకర్మము మాటలతో నేర్వదగినది కాదనియు, చేయునప్పుడు చూచి నేర్వవలసినదనియు గ్రంథకర్త హృదయమైనట్లు తోచుచున్నది. కావుననే —

"పారమ్పర్యం, కౌశలం, సోపదేశం,
శాస్త్రాభ్యాసో, వాస్తుకర్మోద్యమో, ధీః,
సామగ్రీయం—నిర్మలా యస్య సోఽస్మిం
శ్చిత్రాణ్యేవం వేత్తి యంత్రాణి కర్తుమ్."

"ఎవనికి సదాచార్యోపదేశముతో కూడిన పారంపర్యము, నేర్పరితనము, శాస్త్రవిజ్ఞానము, వాస్తుకర్మలను చేయుసామర్థ్యము, శిల్పప్రతిభ అను నిర్మలమగు సామగ్రి ఉండునో, అట్టి శిల్పియే విచిత్రములగు ఈ యంత్రములను చేయ సమర్థుడు అగుచున్నాడని" సమరాంగణుడు నుడివెను.

మఱికొన్ని యంత్రశిల్ప రహస్యములు - పుష్పక విమానము.

దేవతలు విమానయానము చేసెడివారని వాఙ్మయములో మనము చదువుచున్నాము. అందుకే వారికి వైమానికులు అనెడి పేరు కూడ చెల్లుచున్నది. నానావిధములగు దేవతల విమానములలో పుష్పక విమానము మహాశిల్పచాతుర్యము కలది. దీనిపై ఎందఱెక్కినను ఇంకొకనికి స్థానము (Seat) సిద్ధమగుచునే ఉండును. ఒక ఆసనముపై ఒక వ్యక్తి కూర్చుండగనే దాని ప్రక్కనే మఱొక ఆసనము (Seat) సిద్ధమగు యంత్రశక్తి దీనియందు అమర్పబడి ఉండవచ్చును. కాని, ఇట్లు లెక్క లేనన్ని ఆసనములను ఈ విమానమునందు ఇమిడ్చిన ఆ శిల్పాచార్యుని చాతుర్యము ఎంత దొడ్డదో! కావుననే దీనియందలి అద్భుతశక్తి దివ్యమని ప్రశంసింపబడినది. బ్రహ్మదేవునికొఱకై ఈ పుష్పకమును విశ్వకర్మ నిర్మించెనని రామాయణములో కలదు.—

'బ్రహ్మణోఽర్థే కృతం దివ్యం, దివి య ద్విశ్వకర్మణా,
విమానం పుష్పకం నామ, సర్వరత్న విభూషితమ్.'

సర్వాశ్చర్యమయమగు ఇట్టి విమానము ఇంతవఱకును కనిపెట్టబడలేదు.

కేవలము ఆకాశములో ప్రయాణముచేసెడు విమానములే కాక, ఆకాశములో పక్షివలెను, పర్వతములమీద, నేలమీద, ఇప్పుడు మిట్టపల్లములందు నడచు మోటారు టాంకులవలెను, సముద్రముమీద ఓడవలెగాక, సీప్లెయిను (Sea plane) వలెను, నడచునట్టి యంత్రసామర్థ్యముగల యానములుకూడ పూర్వము ఉన్నట్లు కొన్ని దృష్టాంతములు వాఙ్మయములో కనబడుచున్నవి. కాళిదాసు రఘువంశములో రఘుమహారాజునకు ఈ విధమైన రథము కలదని వర్ణించి ఉన్నాడు.

"వసిష్ఠ మంత్రోక్షణజప్రభావా
దుదన్వ దాకాశ మహీధరేషు,
మరుత్సఖస్యేవ వ లాహకస్య
గతి ర్విజఘ్నే న హి తద్రథస్య."

సముద్రముమీద, ఆకాశమున, పర్వతములందు — వాయుసఖమైన (గాలి సహాయము గల) మేఘముయొక్క గమనమువలె, ఆ రఘు మహారాజు రథ గమనము మొక్కవోనిదై ఒప్పుచున్నదని శ్లోకార్థము. అయితే ఆ రథమునకు ఈ ప్రభావము యంత్రశక్తివలన ఏర్పడినట్లు వ్రాయలేదు. "వసిష్ఠ మంత్రోక్షణజప్రభావాత్" అనుటవలన అయ్యది వసిష్ఠ మహర్షి మంత్రప్రభావముచే కలిగినట్లు వ్రాసి ఉన్నాడు. కాని, శిల్పుల అభిప్రాయము మాత్రము అది యంత్ర సామర్థ్య మనియే: మహాద్భుత యంత్రములను నిర్మింపగల మన ప్రాచీనాచార్యులు సర్వత్ర సంచారము చేయు ఇట్టి యానమును సృష్టించినారనుట వింత కాదు సరి కదా, నూఱువంతులును సత్యమే. మఱియు వసిష్ఠుడు శిల్పశాస్త్రోపదేశకులలో లెక్కింపబడి ఉన్నాడు. అతడు కేవలము శాస్త్రోపదేష్ట మాత్రమే కాడు, శిల్పకారుడు సైతము. కనుక ఈ రథము వసిష్ఠ శిల్పప్రభావముననే స్థల, జల, పర్వతాకాశములయందు తిరుగగలిగినదని ఎంచుట యుక్తము.

కాళిదాసుని కాలమునాటికి యంత్రశిల్పము ప్రచారములో లేని కారణముననో, శిల్పశాస్త్రములో కాళిదాసునికి విశేష ప్రవేశము లేనందు వలననో, వసిష్ఠుడు శిల్పియని తెలియమిచేతనో మంత్రశాస్త్రమునందు తనకు కల గౌరవము పెంపుననో ఆతడట్లు వ్రాసియుండును కాని, యథార్థము ఆలోచించిన అది యంత్రశక్తి అనియే చెప్పవలయును. పిమ్మట వ్రాయబోవు అంశములును ఈ వాదమును ఇంక బలవత్తరము చేయగలవు.

ప్రస్తుత కాలమున ఆకాశములో పయనించుటకు గాలివిమానములు (Aero planes), మిట్టపల్లములయందు నడచుటకు మోటార్‌టాంకులు, సముద్రయానము చేయుటకు స్టీమర్‌లు, ఆ సముద్రమునందే శీఘ్ర ప్రయాణము చేయుటకు సీప్లెయిన్లు (Sea plane) ఏర్పడినను, వీటి అన్నిటియందును పయనించుటకు ఒక్క యానమునందే సర్వశక్తులు ఇమిడ్చిపెట్టిన మన పూర్వశిల్పుల మేధాశక్తి అగణ్యము! భాగవతములో దమఘోషుని కుమారుడును, శిశుపాలుని తమ్ముడును అగు సాళ్వునికథ ఉన్నది. ఇతనికి "సౌభకకము" అను పేరుగల విమానమును మయ బ్రహ్మ నిర్మించి యిచ్చినాడు. అది సౌధమును, నగరమును పోలి ఉండు విమానమట. ఆ విమానము ఇట్లు వర్ణింపబడినది.

"దేవాసుర మనుష్యాణాం, గంధర్వోరగ రక్షసాం,
అభేద్యం కామగమనం, విమానం వృష్ణిభీషణమ్.
తథేతి గిరిశాదిష్టో, మయః పరపురంజయః
పురం నిర్మాయ సాళ్వాయ, ప్రాదాత్ సౌధ మయోమయమ్."

—భాగవతమ్.

ఈ విమానముకూడ స్థల జలాకాశ పర్వతములమీద సంచరించ గలదనియే చెప్పబడినది.

"క్వచి ద్భూమౌ, క్వచి ద్వ్యోమ్ని, గిరిమూర్ధ్ని, జలే క్వచిత్,
అలాతచక్రవత్ భ్రామ్యత్, సౌభం తత్ దురవస్థితమ్."

అసలు విమానమునుగూర్చి ఇట్లు నిర్వచింప బడినది—

"పృథివ్యప్స్వన్తరిక్షేషు, ఖగవ ద్వేగతః స్వయం,
య స్సమర్థో భవే ద్గన్తుం, స విమాన ఇతి స్మృతః."

నేలమీద, నీళ్ళమీద, ఆకాశమున పక్షివలె తొందరగా పోవగలిగి నదే విమానము. ఈ నిర్వచనమునుబట్టి, కేవలము ఆకాశమునందే కాక, స్థల జలములమీద కూడ విమానము తిరుగజాలి ఉండవలయునని తెలియు చున్నది కదా! కనుక కాళిదాసు ఈ సౌభకమును దృష్టిలో ఉంచుకొనియే రఘువంశమున ఈ రథమును వర్ణించి ఉండును.

ఈ పరామర్శచేత స్థల జలాకాశములయందు నడువగల—"సర్వత్ర సంచారముగల రథయంత్రము" పూర్వమే ఉన్నదని లక్ష్యములను బట్టి తేలుచున్నదికదా! దీనికిశిల్పశాస్త్రములో లక్షణముకూడ దొరకినట్లైన, ఈ వాదము సుదృఢమని చెప్పుటకు ఆవంతయు శంక యుండదు. చిర కాలము వెదకుటచే లభ్యములైన శాస్త్రగ్రంథములలో విమాన (ఆకాశ యాన) నిర్మాణవిధానము పొడకట్టినట్లే, ఇదియు శాస్త్రములందు కలదనియే నమ్మవచ్చును. ఆ శాస్త్రము నష్టమో, లేక కష్టసాధ్యమో తెలియదు. అన్వేషణ ప్రయత్నములు చేయుటలో దోషము లేదు.

## అద్భుత శస్త్రాస్త్రాలు

ఇంతేకాదు, అద్భుతమైన ప్రభావముగల అస్త్రములుకూడ మనకు వేదశాస్త్ర పురాణేతిహాసములలో ప్రశంసింపబడి పొడకట్టుచున్నవి కాని నవ్యనాగరికతా దూషితచిత్తములుగల మనకు అవి సత్యదూరములుగాకను పట్టుట ఆశ్చర్యము కాదు. "ఆగ్నేయాస్త్రము" "వారుణాస్త్రము" "నాగాస్త్రము" "నారాయణాస్త్రము" "బ్రహ్మాస్త్రము" మున్నగా కల అసంఖ్యాకములగు దివ్యాస్త్రములను మనము వినియే ఉన్నాము. ప్రయోగోపసంహారములతో ఉన్న ఈ అస్త్రజాల మంతయు యంత్రశిల్పమయమే అనుట నిజము. 'ఆగ్నేయాస్త్రము' అగ్నిని వర్షించును. దానిని నాశము చేయుటకు వారుణాస్త్రము ఉన్నది. ఇది

ఆగ్నేయాస్త్రముచే విజృంభింప జేయబడిన మంటలమీద – లేక నిప్పుల మీద నీళ్లుకురిసి చల్లార్చును. అట్లే 'నాగాస్త్రము'ను నుఱుమాడుటకు 'గారుడాస్త్రము' కలదు. ఇచ్చట 'నాగ' 'గారుడ' శబ్దములకు కేవలము 'పాములు' 'గ్రద్దలు' అని అర్థము చెప్పికొని యంత్రబద్ధములైన అస్త్రములలో పాములు గ్రద్దలు ఉండుట ఎట్లని శంకింపవలదు. నాగాస్త్రములో పాములవలె బాధించి చంపు విషదిగ్ధములైన ములుకులు ఉండును. 'ఆగ్నేయాస్త్రము'లో అగ్నిపాషాణమునకు సంబంధించిన ఖనిజద్రవ్య విశేషములు ఇతర వస్తువుల సమ్మేళనముతో ఉండి ఉండవచ్చును. పాషాణాది ద్రవ్యములందును, ఓషధులయందును ప్రాణహారక, ప్రాణప్రద శక్తులు ఉన్నట్లు వైద్యశాస్త్ర పరిశీలనముచే తెల్లమగుచున్నది కదా ! పై విధముగనే "గారుడాస్త్రము"లో ఆ విషపు ములుకులను భస్మముచేయు శక్తిగల పదార్థ సంయోగముతోడి సాధన విశేషములు ఉండి యుండును. అస్త్రము ప్రయోగింపగనే అందలి మారక ద్రవ్యములు ఉక్కుములుకులతోకూడ వ్యాపించి, ప్రాణోపద్రవమును కల్పించును. ఈ విధమైన శక్తులతో అస్త్రజాలము అనూహ్య ప్రభావముగలదై ఒప్పుట విరుద్ధము కాదు.

నాగ గరుడములు పరస్పర విరోధము కలవి కనుక, ఇందు ఒక అస్త్రముయొక్క శక్తిని వేఱొక అస్త్రము వమ్ముచేయునను అభిప్రాయము సూచిత మగుచున్నది. ఈ విధమైన ఔచిత్యమును దృష్టిలో ఉంచుకొనియే వాటికి ఆ నామములు పెట్టినారనుట తగియుండును. అనేకములయిన ఔషధములకు పేరులు పెట్టుటలోకూడ మనవారు ఈ ఔచితిని పాటించి యున్నారనుట శాస్త్రపరిశీలనముచే తెలియును. చూడుడు : "వాత రాక్షసము" అనగా వాతమును హరించుటకు రాక్షసుని వంటిదని అభిప్రాయముకాని, ప్రత్యక్షముగా రాక్షసుడేవచ్చి యుద్ధముచేసి ఆ వాతమును

పారద్రోలవలెనని అనుకొనము కదా, ఇట్లే 'వసంతకుసుమాకరము' 'పూర్ణచంద్రోదయము' మున్నగునవియు. ఆ యా వస్తువులకు నామములు ఉంచుటలోకూడ భారతీయులు చక్కని ఔచితిని పాటించి గుణానుసారము ప్రవర్తించి ఉన్నారని చెప్పుట విస్తరమే. కావున ఆ యా అస్త్రముల స్వరూపమును ఈ రీతిని స్థూలముగా మనము ఊహింప వలయునేకాని, అవ్వాని నిర్మాణ ప్రచారములు ప్రస్తుతము లేమిచే, ఇదమిత్థమని యథార్థ స్వరూప నిరూపణము చేయుట దుష్కర మగుచున్నది. అయినను, పూర్వము ఊహించిన ఊహ సమంజసము కాకపోదు. ఆ వస్తు జాలమును జేయుటకు పూనినచో ఆచరణములో వాటి నిర్మాణ విధానము ఇదియని నిర్ణయించుకొనవచ్చును. యంత్ర నిర్మాణశాలలు నెలకొల్పి ప్రయోగములు చేసినయెడల, ఈ సాధనములను తయారు చేయవచ్చును. అందుకు సంప్రదాయజ్ఞత, ప్రయోగవిధాన నైపుణి, శాస్త్ర కౌశలము, నిర్మాణదక్షత, ఊహాచాతురి అవసరములని మాత్రము మఱువజనదు. ఈ నాడు పాశ్చాత్య దేశములందు వృద్ధి అయిన మారణయంత్ర విధానము, పై వాదమును వేయిరీతుల బలపఱచు చున్నది.

"బ్రహ్మాద్యస్త్రములు"ను ఊహించుటకు అలవికాని, లేదా — అతి కష్టముమీద ఊహింపదగిన యంత్రములచే అమర్చబడినవే కాని, ఇతరములు కావు. నేటి "ఆటంబాంబు"ను పూర్వపు మన బ్రహ్మాస్త్రముగా తలంపవచ్చును. ఈ అస్త్రములు ప్రయోగోపసంహారములతో ఉండుట ఒక అద్భుత విశేషము. పాశ్చాత్యుల అస్త్రములకు ఉపసంహారములేదు. మేఘములలో నిలబడి అత్యద్భుతముగా యుద్ధముచేసి, మేఘనాథుడని పేరొందిన ఇంద్రజిత్తు సంగ్రామ విశేషములును విజ్ఞుల సమాలోచనము నకు తావిచ్చుచునే ఉన్నవి. కాని ఆ యా విధానములను చర్చించి శాసించు శాస్త్రజాలముకూడ నష్టప్రాయమో, లేక కష్టసాధ్యమో అగుట

చేత మన వాఙ్మయములోని వ్రాతలు, శిల్పులఊహలు నిరాధారములని కొందఱు భావించుచున్నారు. అయినను పై వాదమునకు అనుకూలముగా లక్షణగ్రంథము ఒకటి ఉన్నట్లు పొడకట్టుచున్నది. అదే "శత్రుఘ్నీయము" అను శిల్పశాస్త్రము. "శత్రుఘ్న" శబ్దమునకు వైరులను చంపునట్టిది (అస్త్రశస్త్రాదిక మారణసాధనము) అని అర్థము కదా. "శత్రుఘ్నీయ" మనగా మారణ సాధనములగు ఆయుధాదులనుగూర్చి చర్చించు గ్రంథమని వ్యక్తమగుచున్నది. అంతేకాని, పాణిని ప్రోక్తమయినది "పాణినీయము" అయినట్లు శత్రుఘ్నుడు అను వాడు రచించినది "శత్రుఘ్నీయము" అని అర్థము కాదు. నరసభూపాలు నుద్దేశించి చెప్పినది "నరసభూపాలీయము" అయినట్లు శత్రునాశకములగు సాధనములను గూర్చి చెప్పునది "శత్రుఘ్నీయము" అనియే గ్రహించుట యుక్తము. పై గ్రంథనామమునకు ఉభయార్థములు చెప్పుటకు అవకాశము ఉన్నను, అయ్యది శిల్పగ్రంథముల పట్టికలో ఉండుటచేత మొదటి అర్థమే సమంజసమని తోచుచున్నది.

"శతఘ్ని" అను మారణ సాధనమును "ఫిరంగి" అనెడి అర్థములో మనము వాడుచున్నాము. దీనికి కొన్ని నిఘంటువులలో కొన్ని మణుగుల బరువుగల ముండ్లతోగూడిన ఇనుప మొద్దని అర్థము వ్రాసి ఉన్నారు. పేరునుబట్టి చూచినయెడల నూర్వురను జంపు సాధనము; లేదా శత శబ్దమునకు బహువచనార్థము మాత్రమే వివక్షితమైనచో, పలువురను జంపునట్టి యుద్ధసాధనమని అర్థమగుచున్నది. "శతఘ్ని" అను ఒక్క సాధనము మాత్రమే పలువురను చంపునట్టిది కాగా, ఇతరములగు శస్త్రాస్త్రముల మాట చెప్పిడిదేమి! అవి అత్యద్భుతములు కావా? ఈ విధములైన శతఘ్నులవంటి సాధనములు ఎన్నెన్ని "శత్రుఘ్నీయము"లో శాసింపబడినవో చెప్పలేము.

ప్రస్తుత గ్రంథము పేరునుబట్టి యుద్ధసామగ్రిని, అందును శత్రు జయసాధనములను మాత్రమే ప్రత్యేకముగా నిర్మించు విధానములను నిరూపించునట్టిది కావున, అందు సర్వాస్త్ర శస్త్ర విధానములు ఉండి ఉండునని తలంపనగు. ఈ గ్రంథము ఇంతవఱకు దొఱకినట్లు లేదు. ఇట్టి ఉత్కృష్టగ్రంథములు ఇంకను అనేకములు ఉన్నట్లు తెలియుచున్నది. సంప్రదాయానుసారము శిల్పము చేయుచున్న ఆచార్యులవద్ద పెక్కు గ్రంథములు అముద్రితములై పురుగుల వాతబడి ప్రచారమునకు, ప్రయోగమునకు దూరములయి కృశించుచున్నవి.

ఇంకను దూరదర్శన, దూరశ్రవణ యంత్రములుకూడ ఉన్నట్లు కొన్ని శిల్పగ్రంథములవలన తెలియుచున్నది. "శిల్పసంహిత" పదు నెనిమిదవ అధ్యాయములో మనువాక్యానుసారము దేవశిల్పి దూరదర్శన యంత్రమును నిర్మించినాడని దిగువ శ్లోకము పలుకు చున్నది—

"మనోర్వాక్యం సమాధాయ, దేవశిల్పీంద్ర శాశ్వతః,
యంత్రం చకార సహసా దృష్ట్యర్థే దూరదర్శనమ్."

—శిల్పసంహిత. 18 వ అధ్యాయము.

దూరదర్శన యంత్రములు పూర్వమే ఉండినవను అంశము సూర్యసిద్ధాంతమును బట్టియు తెలియుచున్నది. దూరశ్రవణ యంత్రము ఉన్నట్లు గుర్తులు కన్పట్టక పోయినను, దూరశ్రవణశక్తి ఉన్నట్లు తెలియు చున్నది కావున, ఆ శక్తి యంత్రసాధ్యమనియు, ఊహింపవచ్చును. "యంత్రకళా సాహిత్యము" అను గ్రంథమున పెక్కురహస్యములు ఉన్నట్లు తెలియుచున్నది. ఈనాడు పాశ్చాత్యదేశములందు వెలసిన పలుయంత్రములు మనకు ప్రాచీన కాలముననే ఉండెడి వనుటలో సందేహము లేదు.

"పండిత నారాయణ గౌడ్" అనువారు "ఇరువదవ శతాబ్ద సందేశము" (Message of Twentieth Century) అను తన ఆంగ్ల గ్రంథమునందు వేదములోని పెక్కు మంత్రములకు వైజ్ఞానిక (శిల్ప) పరముగ అర్థమును చెప్పి, పెక్కు మహారహస్యములను సోపపత్తికముగ నిరూపించి ఉన్నారు. ఇంకను చేయబడుచున్న పరిశోధనల వలన మనప్రాచీన విజ్ఞానసంపద తేటతెల్లమగు అవకాశములు ఏర్పడుచున్నవి.



నృత్యసుందరి – రామప్పగుడి
(నాసికా ప్రతిమ)

# శిల్పము - వాస్తువు - కళ

వేదవాఙ్మయములో శిల్పశబ్దము సృష్ట్యాత్మకమైన కర్మకౌశలము అను అర్థములో వాడబడినదని పూర్వము చదివి ఉంటిమి. "యేభి శ్శిల్పైః" "యత్తే శిల్పం కశ్యప రోచనావత్" "శిల్పాని శంసన్తి దేవశిల్పాని'' మున్నగు మంత్రములలో పైని మడివిన అర్థమే కన్పట్టు చున్నది. అనగా సృష్ట్యాత్మకమగు హస్తకర్మ కౌశలమును శిల్పముగా తలంపవలయును. ఈ దృష్టితో చూచినచో వాస్తువిద్యయును శిల్పాంత ర్భూతమే కాగలదు. వాస్తువు అనగా వాసయోగ్యమగు స్థలమున నిర్మించు గృహ భవన ప్రాసాదాదులని వ్యుత్పత్తి కనబడుచున్నది. ప్రాణులు దీనియందు వసింతురు గాన ఇది వాస్తువు. గృహనిర్మాణముకూడ శిల్పముచేతనే సాధ్యము కావున, శిల్పములోని ఒకభాగమే వాస్తువుకూడ అనుట సమంజసము. శిల్పమనగా ప్రతిమా నిర్మాణమునకే అర్థమని మనదృష్టిలో పొడకట్టి యుండుటచేత, దానికి భిన్నమగు వాస్తువు శిల్పము కానట్లు తోచినను, యథార్థమునకు వాస్తువిద్య శిల్పాంతర్భూతమే అగు చున్నది. కొందఱు ఆధునిక పండితులు వాస్తుశాస్త్రములోనే శిల్పము అంతర్భవించునని వ్రాసి ఉన్నారు. కాని స్థపతికర్మమగు స్థాపత్యము శిల్పమగుటచేత, స్థాపత్యవేదములోనే శిల్ప—వాస్తు శాస్త్రములు రెండును ఉన్నవి కావున, శిల్పవేదములోని ఒకభాగమే వాస్తువు అనుట ఉచితమని ఎన్నవలయును. స్థాపత్యవేదము కలదు కాని, వాస్తువేదములేదు కదా!

శిల్ప వాస్తు శబ్దముల అర్థములు ఈ విధముగా ఉన్నను, మన ప్రాచీన శాస్త్రకర్తలు ఆ రెంటినీ పర్యాయ పదములుగా భావించినట్లు తోచుచున్నది కశ్యపుడు తనగ్రంథమునకు "కాశ్యప శిల్పము''అని పేరు

పెట్టి, అందు—భవన ప్రాసాదాదుల లక్షణములుకూడ చెప్పినాడు. అట్లే సమరాంగణ సూత్రధారుడు తనది "వాస్తుశాస్త్రము" అని పేర్కొని (అతడు ప్రతి – అధ్యాయాంతమునను "…. సమరాంగణ సూత్రధారాపరనామ్ని వాస్తుశాస్త్రే మహాసమాగమో నామ ప్రథమోఽధ్యాయః" ఇత్యాదిగా అనుచుండును.) అందులో శిల్ప – వాస్తు విషయములను కూలంకషముగా చర్చించినాడు. అంతే కాదు. యంత్రశిల్ప విషయములను కూడ చెప్పినాడని చదివినాము కదా! మయబ్రహ్మకూడ తాను వ్రాసిన గ్రంథములకు "మయమతం" "మయశిల్పం" మయవాస్తు"—ఇత్యాదిగా పేరులు పెట్టుకొని శిల్ప – వాస్తు విషయములను కలిపియే వ్రాసినాడు. "భృగుసంహిత" లోని దిగువ శ్లోకమునుబట్టి చూచినచో, వాస్తువును శిల్పాంతర్భూతముగానే భావించినట్లు స్పష్టమయి పోవుచున్నది.

> "నానావిధానాం వస్తూనాం, యంత్రాణాం, శిల్పసంపదామ్,
> ధాతూనాం, సాధనానాం, చ వాస్తూనాం, శిల్పసంజ్ఞితమ్."

దీనినిబట్టి పలువిధములుగా నిర్మితములైన వస్తువులు, యంత్రములు, రాగి, వెండి, బంగారు - మొదలగు ధాతువులచే నిర్మితములైనవి, ఆ యా సాధనములు (గృహోపకరణాదు లన్నమాట) వాస్తువులు (గృహ భవన ప్రాసాదాదులు) శిల్పసంజ్ఞ కలవి అగుచున్నవి. దీనినిబట్టి ప్రాచీనశాస్త్రకారుల ఆంతర్యము తేటతెల్లమగుచున్నది కదా!

శిల్ప వాస్తు శబ్దములనుగూర్చి మనకు సందేహము లేదుకాని, శిల్ప కళాశబ్దములనుగూర్చి విచారింప బూనుకొన్నచో కొంత తికమక పడుదుము. అమరకోశకారుడు కళలు మున్నగు కర్మలెల్ల శిల్పశబ్దముచే పేర్కొనదగినవని వ్రాసి ఉన్నాడు. దీనినిబట్టి కళ లన్నియు శిల్పములే కావలసివచ్చును. కళలన్నియు శిల్పములు కావలయునన్నయెడల,

పూర్వము చెప్పుకొన్న శిల్పశబ్ద వ్యుత్పత్తికి కల రుచిరార్థమును అవి గూడ అనుసరింపవలయును. ఆ వ్యుత్పత్త్యర్థములకు భిన్నములగు భావములను ప్రదర్శించు కళలను శిల్పము అనుట అన్యాయ మగును.

పెక్కురు గ్రంథకారులు, శిల్పకళాశబ్దములను పర్యాయములుగా వాడి ఉన్నారు. కొందఱు రెంటిని జతపఱచి ఉపయోగించిరి. ఈ కళను గూర్చియు పలుమతములు కలవు. వాత్స్యాయనుడు తన కామశాస్త్రములో నృత్తము, గీతము, వాద్యము-మున్నగు అఱువదినాలుగు కళలుకూడ శిల్పములేయని చెప్పినాడు. అట్లే పెక్కుగ్రంథములయందును కనబడు చున్నది. వాత్స్యాయనుడు చెప్పిన నృత్య గీతవాద్యాది చతుష్షష్టి బాహ్య క్రియలును, ఆలింగన చుంబనాది చతుష్షష్టి ఆభ్యంతర క్రియలును కళ లనియు, ఆదిశబ్దముచేత స్వర్ణాది కర్మలకు గ్రహణమని, ఇదియంతయు శిల్పమేయనియు కొందఱు వ్యాఖ్యాతలు వ్రాసిరి. బౌద్ధుల 'లలితవిస్తర' మను గ్రంథము కళలను కర్మకళలనియు, కామకళలనియు, రెండు విధముల విభజించుచున్నది. ఈ విభాగము సమంజసమే కాని, ఈ కళలను అన్నింటిని శిల్పములని ఒప్పుకొనుట మాత్రము యుక్తిసహము కాదు. ఆలింగన చుంబనాదులు ప్రాణులకు సహజములైన కర్మలు. అవికూడ శిల్పములే అగుచో ఇక శిల్పములు కాని కర్మలేవి ? శిల్పులు కాని ప్రాణు లెవరు ? సహజకర్మలగు శ్వాసప్రశ్వాసలను, అన్నపానీయ స్వీకరణములను పోలినట్టివే ఆలింగ చుంబనాదులును కావున, అట్టివాటిని కళలలోచేర్చి, ఈ కళలన్నియు శిల్పములనుట ఎంతయో అన్యాయము కాదా ? ఇంకను కొన్ని సంస్కృత వ్యాఖ్యానగ్రంథములు సూపకారా దులను (వంటవాండ్రను)కూడ శిల్పులుగా పరిగణించినవి. ఇదికూడ ఉచితముగా తోపదు. శిల్పి, శిల్పశబ్దములకుగల సరియగు అర్థమును ఎఱుంగ వలెనన్న వేదవాఙ్మయములోని ప్రయోగములను, శిల్పాగమ

వాస్తుగ్రంథములలోని నిర్వచనములను అనుసరింప వలయునేకాని, అనుచితార్థములను చెప్పు గ్రంథముల నిర్వచనములపై ఆధారపడరాదు.

కల్పసూత్రములలో కళలు డెబ్బదిరెండని చెప్పబడెను. జైనుల గ్రంథమునందును అట్లే ఉన్నది. యశోధరుడు కామసూత్రములకు తాను వ్రాసిన వ్యాఖ్యానములో కళలు 512 అని వ్రాసినాడు. అతిప్రాచీన గ్రంథములనుబట్టి కళలు ఇన్నియని తెలియకున్నను, మనవారు సుందరమగు ప్రతికర్మమును కళగానే లెక్కపెట్టిరని వ్యక్తమగుచున్నది. విష్ణుపురాణమునందును, హరివంశమునందును, ఇంకను పెక్కు సంస్కృత గ్రంథములయందును కళలు అఱువదినాలుగని వ్రాయబడి ఉన్నది.

ఈ కళలను భోజరాజొకవిధముగను, వాత్స్యాయనుడు ఒకవిధముగను పేర్కొని ఉన్నారు. తెలుగులో శబ్దరత్నాకరమునందలి కళలు కూడ కొన్ని భేదించుచున్నవి. ఈ మూడింటిలో ఐక్యము లేదు. శబ్దరత్నాకరములోని కళలు ఇవి—

1. ఇతిహాసము. 2. ఆగమము. 3. కావ్యము. 4. అలంకారము. 5. నాటకము. 6. గానము. 7. కవిత్వము. 8. కామశాస్త్రము. 9. జూదము. 10. దేశభాషాలిపిజ్ఞానము. 11. లిపికర్మము. 12. వాచకము. 13. అవధానము. 14. స్వరశాస్త్రము. 15. శాకునము. 16. సాముద్రికము. 17. రత్నశాస్త్రము' 18. రథాశ్వగజ కౌశలము. 19. మల్లశాస్త్రము. 20. సూదకర్మము. 21. దోహదము. 22. గంధవాదము 23. ధాతువాదము. 24 ఖనివాదము. 25. రసవాదము. 26. జలవాదము 27. అగ్నిస్తంభము. 28. ఖడ్గస్తంభము. 29. జలస్తంభము. 30. వాక్స్తంభము. 31. వయస్తంభము. 32. వశ్యము. 33. ఆకర్షణము. 34. మోహనము. 35. విద్వేషణము. 36. ఉచ్చాటనము. 37. మారణము.

38. కాలవంచనము | 39 పరకాయ ప్రవేశము. 40. పాదుకాసిద్ధి. 41. వాక్సిద్ధి. 42. ఘుటికాసిద్ధి. 43. ఐంద్రజాలికము. 44. అంజనము. 45. దృష్టివంచనము. 46. స్వరవంచనము. 47. మణిమంత్రౌషధాదిసిద్ధి. 48. చోరకర్మము. 49. చిత్రక్రియ 50. లోహక్రియ. 51. అశ్మక్రియ. 52. మృత్క్రియ. 53 దారుక్రియ. 54. వేణుక్రియ. 55. చర్మక్రియ 56. అంబరక్రియ. 57. అదృశ్యకరణము. 58. దూతీకరణము. 59. మృగయ. 60. వాణిజ్యము. 61 పాశుపాల్యము. 62. కృషి. 63. ఆసవకర్మము. 64. ప్రాణిద్యూతకౌశలము.

## వాస్తు విద్య

"స్త్రీ పుత్రాదిక భోగ సౌఖ్య జనకం ధర్మార్థ కామప్రదం
జన్తూనాం లయనం సుఖాస్పద మిదం శీతాంబు ఘర్మాపహమ్,
వాపీ దేవగృహాది పుణ్య మఖిలం గేహా త్సముత్పద్యతే
గేహం పూర్వ ముశ న్తి తేన విబుధా శ్శ్రీవిశ్వకర్మాదయః."

విశ్వకర్మ మొదలగు విబుధులు ప్రాణులకు గృహము ముఖ్యమైనదని వచించినారు. గృహమునందు ఉండుటచేతనే మనుష్యుడు గృహస్థుడై (భార్యావంతుడుకూడ) తక్కిన ఆశ్రమములందు ఉన్న వారికిని, కుంటి, గ్రుడ్డి, మున్నగు వికలాంగులకును, అనాథులకును సాయపడుచు, తాను ధర్మార్థ కామములనెడి పురుషార్థములను సంపాదించుకొనుచు సర్వసౌఖ్యములు పొంది ఇహపరముల సాధించుకొనగలుగుచున్నాడు. కావుననే "నాల్గాశ్రమంబులలోనన్ గృహమేధి యాశ్రమము" ప్రధానమయి ఒప్పినది. ఇన్నివిధముల ప్రధానమైన గృహమును నిర్మించుటకు వాస్తు శాస్త్రము అనేక విధులను శాసించుచున్నది. భూపరీక్ష మొదలుకొని యజమానుడు ఇల్లుగట్టుటకు ఉద్దేశించిన స్థలమునందు

ఏమూల ఎట్టి గృహము ఎంత పరిమాణములో ఎట్లు కట్టవలయును అనెడి అంశములు వాస్తు శాస్త్రమున భూయిష్ఠముగా చెప్పబడినవి యజమానుని నామనక్షత్రమును, నామాక్షరములను అనుసరించి ఈ ప్రధాన మంతయు ఏర్పాటు కావలయును. శాస్త్రీయముగా ఆయముపెట్టి, ఆయువును నిర్ణయించి, తగిన లగ్నమునందు నిర్మించినచో, ఇంటి యజమానుడు ఎట్టి ఆపదలకు గురికాడు. గృహమునకు ఉండవలసిన గర్భవిస్తారము, వెనుకముందలి పంచల ఆయామ విశాలములు, దూలములు, వాకిండ్లు, గవాక్షములు — మున్నగు ప్రతిదాని విషయమునను శాస్త్రము సౌందర్యమును, వీలు (ప్రయోజనము)ను, దోషము వొసగకుండుటను దృష్టిలో ఉంచుకొని కడుజాగరూకతతో ఆ యా విధానములను శాసించినది. పాకశాల ఆగ్నేయ దిక్కునను, శయ్యాగారము దక్షిణదిక్కునను, భోజనశాల పడమరను, పూజామందిరము ఈశాన్యమునను, ధనాగారము ఉత్తరమునను, బావి ప్రాగీశాన్యోత్తరములలో ఏదేని ఒక దిక్కునను, ఇంక ఆ యా భాగములు ఆ యా దిక్కులయందును ఉండవలయునని చెప్పుటలో ఆ యా దిక్పాలురను, వారికి అభిమానములగు ఆ యా విషయములను అనుసరించి, ఆ యా విశేషములకు కొఱత కలుగనీయక, వర్ధిల్లుటకు ఎట్లు చెప్పిరో విచారించి చూచిన, అందలి రహస్యము ఆశ్చర్యమునుకొల్పి శాస్త్రముపై మనకు విశ్వాసమును దృఢపఱచును. వాస్తుశాస్త్రరీతిగా గృహనిర్మాణము చేసినయెడల, అందచందములకుకాని, వలసిన ప్రయోజనములకుకాని, ఆయురారోగ్యభాగ్యములకుకాని లోటు లేక యజమానుడు వర్ధిల్లుననుట పరమసత్యము. అశాస్త్రీయముగా ఇల్లుగట్టిన, మనకు స్థూలముగా కన్పట్టు గాలి, వెలుతురు సరిగా లభింపకపోవుటయే కాక, అదృష్టములగు సూక్ష్మశక్తుల (ఆ యా గ్రహ, నక్షత్ర, దేవతాదుల శక్తులు) సహకారముకూడ లభింపక, ఇంటియందుండువారు అప

మృత్యువు, వ్యాధులు, దారిద్ర్యము, కలహములు, సంతులేకుండుట — మున్నగు ఇక్కట్టులకును గుఱి కావలసివచ్చును గృహదోషములను అనుసరించి ఇట్టి యిబ్బందులకు లోనయి, వాస్తు శాస్త్రానుసారము ఆచార్యులచే ఆ దోషములు పరిహరింపచేయబడినప్పుడు గృహయజమానులు సౌభాగ్యోపేతులయి యుండుటయు మనము చూచుచునే యున్నాము. కావుననే గృహనిర్మాణ విషయమున మున్ముందు వాస్తోష్పతి (వాస్తోష్పతి ర్విశ్వకర్మా) పూజ ప్రాధాన్యమునంది, నవగ్రహమంటపారాధన, నక్షత్ర జపాదులతో సముచితరీతిని ప్రకృతిలోని దివ్యశక్తుల వశీకరణమునకు దోహదము ఏర్పడుచున్నది. గృహము అనునది ఇంత ప్రాముఖ్యము నందుటచేతనే పై శ్లోకము దాని ఆధిక్యమును అంతిగా ఉగ్గడించినది. మన శాస్త్రములయందును, దైవశక్తుల యందునుకల అంతర్గార్థమును ఎఱుంగక విశ్వాసమును కోల్పోవుటచేత ఈ దినములలో వాస్తుశాస్త్రము పట్ల పెక్కురు పాశ్చాత్య నాగరికతా వాసితులు నిరాదరణము చూపుచున్నారు. పాశ్చాత్యులకును వాస్తువు కలదు. అది కూడ ప్రకృతి నియమములకు, మానవప్రయోజనములకు అనుకూలముగా ఉండుటవలననే సంపదలకు ఆలవాలమై ఒప్పుచున్నది. ఈనాడు సంప్రదాయ సిద్ధముగా వాస్తువిజ్ఞానమును ఆర్జించి వైదిక విధానముతో గృహాదులను నిర్మింపగల శిల్పాచార్యులు విశ్వకర్మవంశ్యులలో కొందఱు ఉన్నారు మన సాంఘిక వ్యవస్థ ననుసరించి వారికి కూడ సరియగు ఆదరణ ప్రోత్సాహములు ఈ కాలమున అన్ని తావులందును లేవు. కావుననే "ప్రజల యిండ్లకు లచ్చి వచ్చి కూర్చొనదేల వాస్తు గౌరవపీఠి పగిలె నేమొ" అని ఒక కవిచంద్రుడు చింతించినాడు. ఎట్లైనను వాస్తుశిల్పములకు సంబంధించిన సాంప్రదాయిక రహస్యములు విశ్వకర్మ వంశ్యులలో ఉన్నట్లు ఇతరులలో లేవని పెక్కురి స్వాను

భవము చెప్పుచున్నది. శిల్పకళాకోవిద, విమర్శకాచార్య శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవి - మున్నగు వారు ఇప్పటి జీవవాస్తు విశారదులలో (ఆంధ్రదేశమున) గొప్పవారు।

భవన నిర్మాణమును గూర్చిన వాస్తుశాస్త్ర రహస్యములను విరివిగా వాకొనుటకు ఇక్కడ అవకాశము చాలదు. వాస్తుశాస్త్రములలో అనేక విధములగు గృహములను, భవనములను, ప్రాసాదములను, రాజగృహములను. నిర్మించు పద్ధతులు నానారీతుల చెప్పబడియున్నవి. నగరములను, గ్రామములను కట్టెడి రీతులు, ఆ నగరగ్రామాదులలోని పలు భేదములు శిల్ప విజ్ఞానముతోకూడ వాస్తుప్రయోక్త యెఱిగి యుండవలయును. ఒక్కొక్క మహానగరమును నిర్మించునప్పుడు అందలి రాజవీథులను, రథ్యలను, వీథులను నిర్మించుటలోను, ఆ యా వీథులకు తగిన గృహ భవన ప్రాసాదాదులను నిర్ణయించి, నగరశోభకు లోటు వాటిల్లనిరీతి అందమును పొందుపఱచుటలోను, రాజామాత్య సేనాపతుల భవనములను నిర్మించుటలోను, ఆ యా వర్గములవారిని, ఆ యా శాఖలయందు పనులు చేయువారిని పరస్పరము అనుకూలముగా ఉంచుటకు ఏర్పాటు చేయుటలోను, వాస్తుశాస్త్రము తగురీతిగా ప్రయత్నించుచున్నది. ముఖ్యముగా దుర్గనిర్మాణమున, రాజునకు సంబంధించిన పలుభవనములను, విహారశాలలను, అంతఃపురమును నిర్మించుటలోను వాస్తువిజ్ఞానము ఎంతయో అవసరము. ఇంతటి శాస్త్రపరిజ్ఞానము, నిర్మాణదక్షత, అనుభవము కలవాడే స్థపతి అగునని సమరాంగణ సూత్రధారుడు స్థపతిలక్షణమను 44 వ అధ్యాయములో వచించియున్నాడు. ఈ సందర్భమున ఒక కథ జ్ఞప్తికి వచ్చుచున్నది. బందరుకోటను కట్టినది శ్రీ కొండిపర్తి సుబ్బయ్యగారు అను శిల్పి ప్రముఖుడు. ఆంగ్లేయులు ఆ కోటను కట్టుటకు ప్రధాన శిల్పాచార్యుని ఎన్నుకొనునప్పుడు కొందఱు శిల్పులను రావించి ఏడు

కోడిగ్రుడ్లనిచ్చి "వీటిని ఒకదానిపై ఒకటిగా నిల్పవలసినదనియు, అట్టివారే కోటగట్టుటకు అర్హులనియు" ఒకపరీక్ష పెట్టిరి. అప్పుడు ఈ సుబ్బయాచార్యులుగారు, ఇంచుక ఆలోచించి తన రెండుచేతులకున్న ఉంగరములను తీసి, ఒకదానిని భూమిపై బెట్టి, దానిపై గుడ్డునుంచి, గ్రుడ్డుగ్రుడ్డునకు మధ్య ఒక్కొక్క ఉంగరమును ఉంచుచు, వరుసగా గ్రుడ్లను అన్నిటిని పేర్చి వైచెను. ఆతని అద్భుత యుక్తి చాతుర్యమునకు అచ్చెరువుపడి దుర్గనిర్మాణమునకు ప్రధాన శిల్పిగా చేసిరి. ఈ విధమగు యుక్తిశక్తులు శిల్పులలో అసంఖ్యాకములుగా ఉండెడివి కనుకనే, వారు మహాద్భుతము లగు దుర్గములను, అగడ్తలను, మహానగరములను నిర్మింపజాలిరి!

దుర్గము అనగా ప్రవేశించుటకు అలవికానిదని అర్థము. శత్రువులు చొరరానిరీతిని, వారికి భేదింప నలవిగాని వడువున కోటను కట్టుటకు శిల్పాచార్యునకు ఎంతటి శిల్పవాస్తు ప్రతిభలు ఉండవలయునో ఊహింపుడు. దుర్గములను జల, స్థల, పర్వతాదులమీద కట్టవచ్చును. శ్రీకృష్ణుని ద్వారకానగరము సముద్రములోగల జలదుర్గము కొండల మీది దుర్గములు—ఉదయగిరి, భువనగిరి, బెల్లంకొండ మొదలగునవి. స్థలదుర్గములు ఏకశిలానగరాదులయందు కలవు. పూర్వము మన శిల్పాచార్యులు అయస్కాంత శిలలతో దుర్గమును కట్టినారని చరిత్ర చెప్పుచున్నది. దానినే "స్కాంతజాతికోట" అని పిలిచెడివారు. "స్కాంత జాతికోట" అను నవలకూడ ఒకటి "పంచానన" పత్రికాధిపతులు ప్రకటించినది ఈ గ్రంథకర్త బాల్యమున చూచుటయైనది.

## సహస్ర శిల్పములు

"కర్తా శిల్ప సహస్రాణామ్"

విశ్వకర్మ వేలకొలది శిల్పములను సృష్టించినట్లును, వాటిని ఆధారముగా చేసికొని మనుష్యులు జీవించుచున్నట్లును పూర్వము చదివి

యుంటిమి. అట్టివాటిలో ముఖ్యములు పంచశిల్పములనియు ఎఱుంగు దుము. పంచశిల్పములను వేరుకూడ—ఉపయోగించెడు ఇనుము, కొయ్య, రాగి మున్నగు లోహములు, రాయి, బంగారు అను ద్రవ్యములనుబట్టియే కాని, ఒక్కొక్క ద్రవ్యముతో ఎన్నిరకముల శిల్పములో విస్తరిల్లినవి. మఱియు ఒకే శిల్పమునకు పలులోహములయొక్కయు, అగ్ని, వాయు, జల, భూములయొక్కయు తోడ్పాటు అవసరమగునని శిల్పశాస్త్రము చెప్పుచున్నది. సహస్ర సంఖ్యాకములగు శిల్పములలో రూపనిర్మాణమున శిలాశిల్పమువలె, చిత్రశిల్పముకూడ చెప్పతగినదై యున్నది. కళలలో ఇది సుకుమారమును, కౌశలపూర్ణమును అగు కళ.

## చిత్రశిల్పము

"రూపభేదాః, ప్రమాణాని, భావ-లావణ్య యోజనే,
సాదృశ్యం, వర్ణికాభంగ ఇతి చిత్రం షడంగకమ్."

— వాత్స్యాయన కామసూత్రములో యశోధరుడు.

చిత్రశిల్పము ఆఱంగములచే ఒప్పునని పై శ్లోకముచే తెలియు చున్నది. అందొకటి రూపభేదము. అనగా నానాకార విశేషములయందలి పరస్పర భేదము. దీనిలో పశు, పక్షి, క్రిమి, కీటకాది తిర్యగ్భేదములు, వృక్ష లతా నదీ పర్వతారణ్య భేదములు, మానవులలోకూడ రాజు, మహాపురుషుడు, వీరుడు, యోగి, పతివ్రత, విటి—మున్నగు ఆకార భేదములు - చూచిన తోడనే మనసునకు ఎక్కునట్లు రూపొందించుట. దీనికి శాస్త్రము, ప్రకృతి సహాయపడును. రెండవది ప్రమాణము. ఏ చిత్రమునకు ఏ అవయవములు ఎంతెంత ప్రమాణములో ఉండ వలయునో యెఱుంగుట స్త్రీయైన ముఖప్రమాణమునకు ఏడురెట్లకు మించిన పొడవు ఉండరాదు. పురుషుడైనచో ముఖ ప్రమాణమునకు

ఎనిమిది రెట్లకంటె విగ్రహప్రమాణము మిగుల రాదు. ఆ ప్రకారమే ఆ యా అవయవములను సాముద్రిక శాస్త్రానుసారముగా ఉండవలయును మూడవది భావము. ఇయ్యది చిత్రమునకు ప్రాణమువంటిది. చిత్రమును చూడగనే ఆంతరంగికమగు భావము సువ్యక్త మగుచుండవలయును. హృదయములోని వికారములు, భావావస్థలు ప్రకటములు కానియెడల, అది ఏ దశలో ఏ రసభావములను కలిగియున్నదియు తెలియక నిర్జీవప్రతిమయా, అనిపించును. ఈ భావయోజనమును రవివర్మ రచించిన శకుంతలాచిత్రములో మనము స్పష్టముగా కాంచగల్గుదుము. నాల్గవది లావణ్యము. భావము ఆంతరంగిక సౌందర్య మైనట్లు, లావణ్యము బాహ్యసౌందర్యము ముక్కు, కన్నులు, చెవులు మొదలగు ఇంద్రియములు—కాళ్లు, చేతులు, వక్షము మున్నగు అవయవములు ఆ యా జాతిని అనుసరించి రసభావావస్థలను అనుసరించి యెట్లు దిద్దిన అందము చిందునో చిత్రకారుడు గమనింపవలయును. రసోచితమగు ఈ లావణ్యమును శ్రీసిద్ధలింగస్వామిగారి ఈశ్వర పట్టాభిషేకములోను, కామేశ్వరునిలోను కాంచగలము! అయిదవది సాదృశ్యము. చిత్రము కల్పితముకానీ, యథార్థముకానీ, చిత్రము చూడగనే ద్రష్ట తన హృదయమునకు పూర్వపరిచితములైన భావములనుబట్టి "ఇది ఇట్టిది" అని గుర్తింపవలయును అనగా ప్రాచీనపు టితిహాసములలో తనకు పరిచయమైన పాత్రమును చిత్రములో కాంచినచో, "ఇది అదియే" అని స్ఫురణము కలుగవలెనన్నమాట ఈ అంశము చాలాముఖ్యము. కోడిని చిత్రించిన, గ్రద్దయా ? అనిపించ కూడదు. ఆఱవది వర్ణికాభంగము. అనగా ఎట్టి చిత్రమునకు ఎక్కడ ఏ రంగు వేసిన సౌందర్యము ఉట్టిపడునో, మెట్టపల్లములు, చీరల సౌందర్యములు ఎట్టి వర్ణములను మేళవించిన కలుగునో గమనింపవలయును. ఈ ఆఱంగములు పరిపూర్ణముగా పోషింపబడిన యెడల చిత్రము స్వర్గసౌందర్యమును సాక్షాత్కరింప చేయును.

"చిత్రశిల్పము అతిసుకుమారమైనది కావున, శిల్పి కడుజాగరూకుడై మనస్సు ఉత్సాహయుక్తమై ఉన్నప్పుడు మాత్రమే ఆ పని చేయవలసి యుండుననియు, శిల్పి చలచిత్తుడును, వ్యసనాసక్తుడును, అగుచో నేత్రములవీ దిద్దునప్పుడు చిత్రము చెడి, సహజ సౌందర్యమును ఆవిష్కరింపజాలదనియు, అందుకే శిల్పశాస్త్రము, శిల్పి నియమశీలుడు, సదాచార సంపన్నుడు కావలెనని చెప్పుచున్నదనియు" శ్రీసిద్ధలింగస్వామి గారు పల్కిరి.

ఈ చిత్రశిల్పములను - భిత్తిచిత్రములనియు, చిత్రపటములనియు, చిత్రఫలకము లనియు మూడువిధములుగా విభజింపవచ్చును గోడల యందు, తాలయందు చిత్రించునవే భిత్తిచిత్రములు. "జోగీమారా" "అజంతా" గుహలలోని శిల్పచిత్రములు ఈ జాతివే. హిందూదేశమున పదిరెండు వందలకు మించియే గుహాలయములు కలవు. వీటిలో నూరు మాత్రము పౌరాణికమత సంబంధులు. తొమ్మిదివందలు బౌద్ధమునకు చెందినవి. తక్కిన రెండువందలు జైనమత సంబంధమైనవి. వస్త్రములమీద, చర్మములమీద, వ్రాయబడినవి చిత్రపటములు. కాగితముల పైని, కొయ్యఫలకలు - దంతములు మున్నగు వాటిమీద వ్రాయునవి చిత్రఫలకములు.

ప్రాచీనకాలములో చిత్రములు ఆధ్యాత్మిక ప్రయోజనమునకై రచింపబడినట్లు గ్రహింపగలము. కావుననే ఇప్పటికి లభించిన ప్రాచీన చిత్రములు శివ, విష్ణ్వాది - దేవతలకు సంబంధించినవై ఉన్నవి. తరువాత ఐతిహాసిక పురుషుల చరిత్రలను, ఉదంతములను తెల్పు చిత్రములు వెల్వడెను. తరువాత శృంగారాది రసభావములను ఉద్దీపింపజేయు ప్రేమచిత్రములు—మున్నగునవి వెల్వడి గృహమును అలంకరించు కొనుటకు ఉపయోగించుచున్నవి. పై మూడుతరగతుల చిత్తరువులుకూడ

ఆ యా ప్రయోజనములను కోరెడి జనులకు ఆవశ్యకములై ఉపయోగించుచున్నవి. శిల్పములు అర్ధచిత్రములనియు, పూర్ణచిత్రములనియు రెండు విధములు. శిలాలోహాది ద్రవ్యములతో ముందు వెనుకలు, పార్శ్వములు కనపడునట్లు చేయబడునవి పూర్ణచిత్రములు. వీటిని అన్ని (నాలుగు) వైపులందును చూడ వీలగును. కాగితము, గోడలు, పలకలు-మొదలగు వాటిమీద రంగులతో వ్రాయబడునవి అర్ధచిత్రములు. వీటిని ఒకే ప్రక్క చూడగలముగాని, తక్కిన మూడు ప్రక్కలయందును చూడ లేము కదా. కావున వీటికి అర్ధచిత్రనామము సార్థకమైనది.

వంగదేశపు చిత్రకారులలో అవనీంద్రనాథఠాకూరు, నందలాల్ బోసు, అసితకుమార్ హల్దారు, ప్రమోదకుమార ఛటోపాధ్యాయ – మొదలగువారి చిత్తరువులు అగ్రేసరములై భారతీయుల పొగ త్తలను అందుకొన్నవి. మైసూరునందు శ్రీ సిద్ధలింగేశ్వరస్వామి, వెంకటప్ప-మున్నగువారి చిత్రములు కొనియాడదగినవి. పంజాబునందు అబ్దుల్ రహమాన్ చుగతాయి, హకీమ్ మహమ్మద్ ఖాన్ - మొదలగువారు అగ్రేసరులు. ఆంధ్రప్రదేశమున దామెర్ల రామారావుగారు ఉత్తమమైన కృషి చేసి రాజమహేంద్రవరమున "ఆంధ్ర భారతీయ చిత్రకళాశాల"ను నెలకొల్పి పనిచేయుచు అకాలమృత్యువు వాతబడిరి. తరువాత దానిని శ్రీ వరదా వెంకటరత్నముగారు కొంతకాలము నడపి మృతించినారు. ఇంకను దేవీప్రసాదరాయచౌదరి, అడవిబాపిరాజు, వి. వి భగీరధి, తలిసెట్టి రామారావు, ఎస్. బ్రహ్మం, గుఱ్ఱం మల్లయ్య, అంకాల వెంకట సుబ్బారావు, తిక్కనచిత్ర నిర్మాత వెంకటాచారి, చేమకూరి సత్యనారాయణ, మాధవపెద్ది - మొదలగువారు రచించిన చిత్రములు సంప్రదాయ సిద్ధమైన భారతీయ సంస్కార సౌందర్యములను నిరూపించుచుండును. మలయాళీయుడగు రాజా రవివర్మ చిత్రముల సొగసు ఆబాలగోపాలము తెలిసినట్టిదే!

ఇంకను వర్తమాన చిత్రకారులలో సర్వశ్రీ P. T. రెడ్డి, అమెరికాలో చిత్రకళాచార్యులుగా ఉన్న శ్రీరామారావు, వి. మధుసూదనరావు, కొండపల్లి శేషగిరిరావు, వెల్లటూరి పూర్ణానందశర్మ, బి. ఏ. రెడ్డి, పి. గౌరీశంకర్, సైయద్ బీన్ మహమ్మద్, కె. రాజయ్య, సూర్యప్రకాష్, మారేమండ శ్రీనివాసరావు, కె లక్ష్మగౌడ్, డి. దొరైస్వామి, విద్యాభూషణ్, C. S. N. పట్నాయక్, P. R. రాజు, ఉస్మాన్‌సిద్ధిక్, A. పైడిరాజు, P S. చంద్రశేఖర్, శ్రీహరిభోలేకర్, ఉల్చి, M S మూర్తి, ప్రభాకర్‌కట్టి, నజర్ మొహమ్మద్, Ch రాజభద్రయ్య విశ్వకర్మ, వై. బాలయ్య, ఫణిదపు నాగేశ్వరరావు, మహద్‌యాసిన్, నిర్మలాదత్, వి. వీరబ్రహ్మాచారి, డా॥ విశ్వనాథమ్, మాలతీవరదరాజన్, మొదలగువారు సంప్రదాయ చిత్రకళలోను, ఆధునిక చిత్రకళలోను అందెవైచిన చేతులు. ఇందు పెక్కరిదృష్టి ఆదునిక చిత్రకళమీద ఎక్కువగ ప్రసరించుట గమనింపదగినది. శ్రీ సంజీవదేవ్‌గారు చిత్రకారులేకాక, కళావిమర్శకులును, కవులును, రచయితలును అయి వాసికెక్కినారు. ఆంధ్రప్రదేశ ప్రభుత్వము లలితకళా అకాడెమీని నెలకొల్పినపిమ్మట చిత్రకళ మూడుపూలు అఱుకాయలుగా విలసిల్లుచున్నది. సంఘము, ప్రభుత్వము ఇంకను తగురీతిగా ప్రోత్సాహము ఇచ్చినచో చిత్రకళ బాగుగా అభ్యుదయమునందు అవకాశములు కలవు.

## శిల్పము—లోకప్రవృత్తి

శిల్పము లేనిది మానవజీవితము ఒక్క అడుగైనను ముందుకు నడవదు. జనుడు పుట్టినది మొదలు జగత్తులో సంచరించి, జీవిత విజయమును సంపాదించి, ఈశ్వరదర్శనము నంది, కృతార్థుడగు వఱకును శిల్పముతో ఎడతెగని సంబంధము ఉండియే యున్నది. పుట్టి

నప్పుడే బొడ్డుకోయుటకు కత్తి కావలసి వచ్చును. తరువాత, ఆహార సంపాదనమునకు కర్షకోపకరణములు అవసరమగుచున్నవి. అటు తరువాత, పచనమునకు అవసరములగు గృహోపకరణములు కావలయును. ఈ అన్నిటికిని, తనకును ఆధారమగు గృహమొకటి మొదటి నుండియు ఉండితీఅవలసినదే కదా! పొట్ట నింపుకొన్న పిమ్మట శరీర రక్షణకు వస్త్రములు అవసరము. జీవితమును సౌఖ్యసంపన్నముగా చేసికొనుటకు ఎన్ని సాధనములు కావలసియుండునో, అవియెల్లను శిల్పకర్మ సాధ్యములే అగుటచేత, ఎంతెంతగా జీవితములో సౌఖ్యము కోరబడుచుండునో అంతంతగా, శిల్పమును విస్తరిల్లు చుండవలయునని సులభముగనే మనము గ్రహింపగలము. ఈ నాటి పాశ్చాత్యుల సుఖజీవనమునకు వారి శిల్పవిజృంభణమే కారణమని సులభముగా తెలిసికొనవచ్చును.

మన ఆదిమశిల్పులు మానవ జీవితమును సుఖ సంపన్నము చేయుటకు కావలసిన సాధనములనెల్ల కనిపట్టి కృతార్థులైనారు. వారు గృహోపకరణములను సృష్టించిరి. కర్షకోపకరణములను కైసేసిరి. కుటీర పరిశ్రమలను నిర్మించిరి. వస్త్ర నిర్మాణమునకు మగ్గము మున్నగువాటిని అమర్చిరి. కుండలు చేయుటకు సారెను కల్పించిరి. దారము తీయుటకు రాట్నమును నెలకొల్పిరి. చమురు తీయుటకు గానుగలను చేసిరి. ఇవి అన్నియు చక్కని కుటీరపరిశ్రమలు కావా? నీరు తోడుటకు ఘటీయంత్రములను—ఏతాము, మోటవంటి సాధనములను సంతరించిరి. గొప్పశిల్పములమీదనే దృష్టి నుంచుకొని "ఇది చిన్న" దని మనవారు దేనివిషయమునను అశ్రద్ధ చూపలేదు. పిల్లకాల్వలకు వంతెనలు, తూ..ులు కట్టుట దగ్గఱనుండి, నదులకు ఆనకట్టలు కట్టియు, సముద్రమునకు వారధినిబంధించియు తమ అద్వితీయ శిల్పరచనా చాతుర్యమును వ్యక్తము చేసిరి. నదులమీదను, సముద్రములమీదను పయనించుటకు

పడవలు, ఓడలు మున్నగు యానములనే కాక, మత్స్యావతారమని ప్రసిద్ధి నందిన జలాంతర్గాములను (Sub Marines) కూడ సృష్టి చేసిరి.

రాజ్యాంగము విషయములోకూడ శిల్పపు తోడ్పాటు ఎంతయో అవసరము. శత్రు దుర్భేదములైన దుర్గములను, దుస్తరములైన అగడ్తలను కట్టుటలోను, పలువిధములైన భూగృహములను నిర్మించుటలోను, యుద్ధమునకు సిద్ధము చేయవలసిన అస్త్ర శస్త్ర కవచ కార్ముకాదుల నిర్మాణములోను శిల్పప్రతిభ ఎంతయో అవసర మగుచున్నది. పూర్వము అద్వితీయ శిల్పప్రతిభగల ఆచార్యులు రాజాస్థానములందుండి, రాజులకు విజయము కూర్చుటలో సర్వవిధముల సాయపడు చుండెడివారు. అట్టి వారిలో భోజుని ఆస్థానమునందుకల సమరాంగణ సూత్రధారుడు అద్భుత శిల్పి అని పూర్వము చదివి యున్నాము. మహారాష్ట్ర సింహమగు శివాజీ మహారాజునకు గురువును, ఆస్థాన శిల్పాచార్యుడును అగు "తుకా బ్రహ్మానందస్వామి" వారి శిల్పచాతుర్యముచేతను, యుక్తిప్రాభవము చేతను శివాజీ మహమ్మదీయులతోడి పోరాటములందు విజయము నందెనని పలువురు శిల్పజ్ఞులు, చారిత్రకులు వచించుచున్నారు. హైందవ రాజ్యాంగములో శిల్పమునకు ప్రాధాన్యము ఉన్నంత వఱకును హిందూ జయపతాకలు ఎగురుచునే యున్నవి. శిల్పముతోకూడ శిల్పులు ఏనాడు నిరసింపబడిరో, అప్పుడే దేశ–ఔన్నత్యమును దేశ–ఐశ్వర్యమును తగ్గిపోయినవి. ఈ అంశమును ఒక కవి యిట్లు వర్ణించినాడు—

"శిల్పి యేదేశమున సమర్చితుఁడొ హితుఁడొ,
సిరియు సౌఖ్య మక్షీణమై చెలఁగు నచట;
శిల్పి యేదేశమున అలక్షితుఁడొ హతుడొ,
చిందులిడు నందు ఇనుపగజ్జియలతల్లి!."

— శ్రీ పున్నయ్యగారి "కళాతపస్వి"

సనాతన భారత దేశములో వైదిక యుగమునందును, ఐతిహాసిక యుగమునందును, శిల్పము సంపూజితమై నానావిధముల విస్తరిల్లినది. ప్రాక్కాలపు హిందూరాజులు సమున్నతమగు స్థానమును శిల్పమున కిచ్చి ఆరాధించిరి. యజ్ఞప్రయోజనములకును, ఆధ్యాత్మిక ప్రయోజనములకును శిల్పము ఎక్కువగా ఉపయోగపడి జనాదరపాత్ర మైనది. తరువాత బౌద్ధయుగములో శిల్పదేవి రతనాల గద్దియపై ఎక్కి ముత్యాలపల్లకిలో ఊరేగినది. బౌద్ధులకాలమున వెలసిన శిల్పము ఇంతింతయని చెప్ప జాలము, బౌద్ధవిహారములను, చైత్యములను, జాతకకథలను రూపొందించుటలో శిల్పులు అద్భుత శిల్పచాతుర్యమును అగపఱచి బౌద్ధరాజుల కళోపాసనలను పండింపచేసిరి దక్షిణదేశమున, అత్యద్భుతములగు దేవాలయములు, నటరాజ విగ్రహమును, కళాకేతనములను ఎత్తగా, ఉత్తరమున, బుద్ధవిగ్రహములు శిల్పధ్వజములను నాటినవి. నేటికిని "రాయల్ సొసైటీ ఆఫ్ ఆర్ట్సు" వారిచే గొప్పగా కొనియాడబడిన బుద్ధ విగ్రహము "జావా" ద్వీపములో ఉన్నది. బౌద్ధులనాటి శిల్పప్రతిభ ఉజ్జ్మాత్రముగనేని సూచించుటకు ఈ చిన్ని పొత్తమున చోటు చాలదు. మహమ్మదీయయుగములో అక్బరుతప్ప, గజనీమహమ్మదు—మున్నగు వారు హైందవశిల్పములను పాడొనర్చుటకే కృషిచేసిరని చెప్పవలయును. కాని, కొందఱు మహమ్మదీయ ప్రభువులు మాత్రము శిల్పముమీది ప్రీతిచే హైందవ శిల్పులను ఆదరించి, తమ సంప్రదాయానుకూలములగు శిల్పములను రచింప జేసికొన్నారు. లేకున్న "తాజ్‌మహల్" వంటి కట్టడములు ఎట్లు వెలసెడివి ? కృష్ణదేవరాయలయు, నాయకరాజులయు కాలమువఱకును శిల్పము సాటిలేనిరీతుల పెంపొందినది. ఇటీవలి కృతక భారతదేశములో భారతీయశిల్పము వృద్ధిపొందెడి అవకాశములు దూర దూరములయినవి. శిల్పులయెడను సరియగు ఆదరణము చూపబడుట లేదు. పై అంశములనే శ్రీశరభాచార్య మహాకవి యిట్లు వెలిబుచ్చెను.

"ఇతిహాసంబులు పూలసేసలిడె నోయీ! బౌద్ధరాజన్య సం
తతు లానందము కందళించెడు "అజంతాచిత్ర" నీరాజన
ప్రతతిం దేల్చె, నికం దురుష్క రణసంరంభంబులో-స్వార్థభూ
పతి మంత్రాంగములోనం బడ్డయవి నీపైనిన్ శిలావర్షముల్."

— కల్హారమాల.

## మన శిల్ప సంపద

### ( శిల్ప క్షేత్రములు )

"ఈ సనాతనోర్వీఖండ మెల్లయెడల
పెళ్ళ పెళ్ళను విటిచి చూపింపఁగలను
నా కళాదేవి చరణచిహ్నములు కొన్ని!
నా ప్రశంసనఫలక వర్ణములు కొన్ని!!."

— శ్రీశరభాచార్యులుగారి "కల్హారమాల"

'మెక్సికో', 'అమెరికా' ద్వీపములలో మయులనెడి ఒక తెగవారు ఉన్నారనియు, వారి ఆచారవ్యవహారములు, కట్టు మున్నగుపద్ధతులు భారతీయములై ఉన్నవనియు "చమన్‌లాల్" మహాశయుడు ప్రకటించిన "హిందూ అమెరికా" అను ఆంగ్ల గ్రంథముచే తెలియుచున్నది. అతిప్రాచీన కాలముననే అనగా వేలసంవత్సరములకు పూర్వమే — పసిఫిక్ మహాసముద్రము, ఇంత విస్తీర్ణము కాకమునుపే హిందూదేశము నుండి మయబ్రహ్మ సంతతివారగు శిల్పులు అచ్చటికి పోయి, భారతీయ శిల్పములను వెలయించినట్లు పైగ్రంథమున సప్రమాణముగ ఉదాహరణములు చూపబడినవి. ఇంకను జావా సుమిత్రా మున్నగు ద్వీపములందును, భారతీయుల సంస్కారములు, శిల్పములు వ్యాపించినవి.

హిందూదేశములో సుప్రసిద్ధ శిల్పక్షేత్రములు అనేకములు కలవు. వాటిలో కాలానుసారముగా చూచిన "మెహంజోదారో, హరప్పాలు" లోని కట్టడములు, విగ్రహములు మున్నగు శిల్పకృతులు అతి ప్రాచీనములు. అద్భుత శిల్పక్షేత్రములుగా వన్నె కెక్కిన వాటిలో రామేశ్వరము, కంచి, కాళహస్తి, శ్రీరంగము, మధుర, అరుణాచలము, తిరుపతి, సోమనాథపురము, హాలేబీడు, శ్రావణబెలగులము, బేలూరు, పూరి, జగన్నాథము, భువనేశ్వరము, శ్రీశైలము, అహోబలము, దాక్షారామము, భీమవరము, సింహాచలము, రామతీర్థము, అజంతా, ఔరంగాబాద్, ఎల్లోరా, ఎల్ఫెంటా, నాసిక, కార్లీకన్హేరీగుహలు, సాంచి, సారనాథము, కోనూరు, కొలనిపాక, మంగళగిరి, భద్రాద్రి, వరంగల్, పాలంపేట, విజయవాడ, అల్లూరు, గరికపాడు, ఘంటశాల, అమరావతి, నాగార్జునకొండ, ఎత్తిపోతల, మాచెర్ల, చేజెర్ల, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, గోలి, రామిరెడ్డిపాలెం, వేంగి, ఆరుగొలను, గుంటుపల్లి, రాజమహేంద్రవరము, శాలిహుండము, రామతీర్థము, సంఘారామము, విజయనగరము, ముఖలింగము, కోణార్కము, బాపట్ల, కొండవీడు, చెన్నపట్టణము, తాడిపత్రి, గుత్తి, హంపి, పెనుగొండ, లేపాక్షి, మహాబలిపురము, పక్షితీర్థము, తంజావూరు, తిరుచునాపల్లి, తిరువళ్లూరు, సోమపాలెం, బెంగుళూరు, మైసూరు-మున్నగునవి సుప్రసిద్ధములు. వీటిలో పెక్కులు దైవక్షేత్రములు, బౌద్ధవిహారములును కలవు. మహాబలిపురమునందలి రాతిరథములు, హంపీ క్షేత్రమునందలి విఠోభా స్తంభము, విరూపాక్షుడు, గణేశుడు, ఉగ్రనరసింహుడు — మున్నగునవి చూడదగిన దృశ్యములు. విఠోభా స్తంభమునందు ఏడు శిలా స్తంభములు చెక్కబడినవి. వాటిని మ్రోగించినయెడల 'స, రి, గ, మ, ప, ధ, ని' అను సప్తస్వరములు మ్రోగును. ఈ స్తంభమునుగూర్చియే కొడాలి

వెంకట సుబ్బరాయకవి "సరిగమపధనిస స్వనవల్లకీతుల్య రవ విరోభా స్తంభ రాగఫణితి" అని గానము చేసి యున్నాడు. ఇట్టి స్తంభములు రాయల కాలమున వెలసిన పలుదేవాలయముల యందు కలవు. ఇంకను అనేకములగు విశేషములు హంపీ శిల్పములందు కలవు. చిత్తూరు జిల్లాలోని మదనపల్లికి సమీపమునగల 'సోమపాళెము' దేవాలయమున ఏక శిలా నిర్మితమగు అఱువదియడుగుల ధ్వజ స్తంభము కలదు. ఇక 'లేపాక్షి బసవయ్య' గణుతి కెక్కినవాడు! లేపాక్షి-సోమపాళెము లందలి శిల్పములు కృష్ణదేవరాయల కాలమున ప్రఖ్యాతిగన్న వెంకణా చార్య శిష్యులగు శిల్పాచార్యులు నిర్మించినారు. లేపాక్షి శిల్పవిశేషములను ఈ రచయిత వ్రాసిన "లేపాక్షి" నవలలోను, అహోబల శిల్పవిశేషము లనుగూర్చి "మోహనాంగి" నవలలోను చదువవచ్చును.

వివిధ దేశముల చిత్రశిల్పులకు గురుపీఠమై చెన్నారుచున్న అజంతాగుహలలోని చిత్రకళావైభవము చూచి తీఱవలసినదేకాని, వ్రాయ నలవికాదు. అజంతాకొండలలో ఇరువదితొమ్మిది గుహలు ఉన్నవి. వాటిని నూతేండ్లనాడు ఒక పాశ్చాత్యుడు కనిపట్టునప్పటికి పదునాఱు గుహలు మాత్రము చిత్రాలంకారములచే ఒప్పుచున్నవి. ఈనాడు ఆఱు గుహలలో మాత్రమే మనము ఆ దివ్యచిత్రకళను సందర్శింపగలము. వీటిలో బౌద్ధచైత్యములు, విహారములు, స్తంభములు, బుద్ధదేవుని శిల్ప మూర్తులు, జైనగుహలు - అత్యద్భుత కౌశలముతో నిర్మింపబడినవి.

తరువాత ఎల్లోరాకొండగుహలు శిల్పమునకు ప్రసిద్ధి కన్నవి. ఈ కొండలలో అర్ధచంద్రాకారములో ముప్పదిరెండు గుహలున్నవి. ఈ గుహలలోని శిల్పసంపద చెప్పతరముకానిది. అందును పదునాఱవదగు కైలాస గుహ లోకోత్తరము. ఇది ఏనుగులమీదను, శరభములమీదను నిలిచియున్నట్లు నిర్మింపబడినది. గర్భాలయమునుండి మండపములోనికి,

ప్రాంగణమునకు పోవుటకు ఈవలావలమెట్లమర్పబడినవి. ఆలయము లోని ముఖ్యదేవునికి ఉపదేవతలకు ప్రత్యేకములగు గుళ్ళు కలవు. గుడి ముందట ఇటు అటు పెద్ద యేనుగులు, రెండు ధ్వజములు, తొలువబడిన ప్రదేశము చుట్టునున్న కొండలోని జాతిగోడలో యాత్రికులకు ''ముసాఈఫర్ ఖానా'' గుహలు, గుడికి ముందు గోడ, అన్నింటిమీదను త్రివేణి, రావణ కైలాసచరిత్ర, శివలీలలు, విష్ణులీలలు, రామాయణము, ఆ యా ఉపదేవతలు అద్భుత శిల్పచాతుర్యముతో చెక్కబడినవి. ఇందు రావణ కైలాస చరిత్ర అద్భుతము. ఒక గుహకు''విశ్వకర్మ గుహ'' అనిపేరు. ఈ శిల్పసంపద వైశ్వకర్మణులదే అనుటకు ఇది నిదర్శనమేమో।

ఈ గుహాలయ శిల్పనిర్మాణమునకు ఇసుక రేణువంత జాతిని గూడ ఆ శిల్పులు వెలుపలినుండి తేలేదు. సమస్త శిల్పము కొండలోనే శిల్పించ బడినది. అజంతా—ఎల్లోరా గుహల శిల్ప విశేషములు ఈ రచయిత వ్రాసిన "శిల్పకళాక్షేత్రముల"లో కాంచవచ్చును.

నాసికాక్షేత్రమున భృగుసంహిత ననుసరించి నిర్మింపబడిన సుందర నారాయణ దేవాలయము, కశ్యపసంహిత ననుసరించి కట్టిన మహాదేవుని గుడి, మయసంహిత ననుసరించి నిర్మించిన శ్యామలారామ దేవాలయము చూడ దగినవి. వీటియందు శిల్పసంపద కంటెను ఆకార విశేషము, శాస్త్రవ్యవస్థ పరామర్శింపదగి యున్నవి. మైసూరు రాష్ట్రములో సోమనాథపుర దేవాలయము చూడదగినది. శిల్ప సమ్రాట్టు జక్కణాచార్యులు నిర్మించినదే ఈ దేవళము. కేశవస్వామి ప్రధాన దైవతము ఎడమప్రక్క విష్ణువిగ్రహము, కుడిప్రక్క గోపాలస్వామి ప్రతిమయు వేఱు వేఱు గర్భాలయములలో ప్రతిష్ఠింపబడి యున్నవి. కేశవస్వామి ప్రతిమ శిల్పిప్రతిష్ఠించినది లేదు. మహమ్మదీయుల దండ

యాత్రలలో అది పగుల గొట్టబడినది. ఆలయముయొక్క ప్రతి శిలా ఖండమును శిల్పకళామండితము. భారత రామాయణ గాథలు చిత్రింపబడియున్నవి. ఇతర దేవతా విగ్రహములు శాస్త్రీయముగా తీర్చబడియున్నవి. ఆలయాంతర్భాగములో భువనేశ్వరీ మండపములు (వితానములు) లోకోత్తరములు. ప్రతి విగ్రహముగూడ ముక్కో మొగమో చెక్కబడి యున్నది. అయినను అందమునకు లోపము లేదు "శిథిల విగ్రహ నఖశ్రీ రేఖలోగూడ విశ్వమోహనశక్తి వీడలేదు" అన్న పద్య పాదము స్ఫురించి సార్థకమైనదని తోచెను.

ఇంకను "తాజమహలు" "నెమిలిపీఠము" మున్నగునవి కూడ దర్శనీయములై సౌందర్యారాధకులను ఆకర్షించుచున్నవి తాజమహలు నిర్మాతలు బందరు శిల్పులని ప్రసిద్ధి అజంతాలోనిది ఆంధ్ర శిల్పమనుట నిర్వివాదము దీనినిబట్టి ఆంధ్రశిల్పులు తమ శిల్పమును ఎంతవఱకు విస్తరింప జేసిరా అని ఆశ్చర్యము కలుగకపోదు.

హిందూదేశమునందలి శిల్పకృతులలో ఆశ్చర్యకరములగు ఉదంతములు ఎన్నియో కలవు. కుతుబుమినారు స్తంభముయొక్క లోహపు కూడికను ఇంతవఱకు ఎవ్వరును కనిపట్టలేదు. హంపీ విజయనగరములోని అంతఃపురము అతి విచిత్రముగా కట్టబడినది. అంతఃపుర కాంతలకు రాజుగారి దర్బారునందలి విశేషములన్నియు చూచునవకాశము ఉండునట్లు ఈ అంతిపురి నిర్మింపబడినదట కాని అస్థానమునందున్నవారికి మాత్రము అంతఃపురమువారు కానరారు. టిప్పుసుల్తానునకు నడుమునకు ఒక పట్కాకత్తి ఉండెడిదట అది యుద్ధసమయములందు ఖడ్గముగను: ఇతర వేళల నడుము పట్కాగను ఉపయోగించుచుండెడిది. విఠోభా స్తంభపు సంగీతమును వినియే యున్నాము. ఇంకను సైకతలింగము, వాయులింగము, ఆకాశలింగము మున్నగునవి అద్భుత శిల్ప ప్రభావము కలవి కదా!

ఈ నాడు ప్రభుత్వపు తోడ్పాటు ఉన్నయెడల మన శిల్పములు, కళలు చక్కగా పరిపుష్టిని పొందు అవకాశములు కలవు. నేటి శిల్పికి అన్నవస్త్రముల సమృద్ధి ఉన్నయెడల దేశమున ఎల్లెడలను ఆతడు శిల్ప కళాతోరణములను కట్టి భారతాంబను బంగారు పల్లకిలో ఊరేగింప గలడు.

"ఒకనాటి భారతా భ్యున్నతికి నీ కళా
ప్రకటరోచిస్సులబ్రిపుకారణాలౌట
తలపునకు తెచ్చుకొనరా !
ఆ గాథ వలన హృదయము పొంగురా !!

— తోరణము.

— ॥ —



నగ్ననాగిని — రామప్పగుడి
(నాసికా ప్రతిమ)

# కొన్ని శిల్పాగమములు

విశ్వకర్మ నిర్మితములైన శిల్పగ్రంథములు 20 వఱకు కలవు. అందు "విశ్వకర్మ ప్రకాశిక" ఒకటి. ఇది పరమ ప్రమాణ గ్రంథము ఇందు 13 అధ్యాయములు, 1425 శ్లోకములు కలవు. వాస్తువిశేషములనే ఈ గ్రంథము ఎక్కువగా ప్రస్తావించుచున్నది. పుర, దుర్గ, ప్రాసాద, దేవాలయాదులను గూర్చి సంగ్రహముగా మాత్రమే ఇందు చెప్పబడినది. మొత్తము మీద శతాధిక వాస్తువిషయములను గూర్చి వివరించిన ఈ గ్రంథము వాస్తు విద్యార్థులకే కాక, వాస్తు విద్వాంసులకు కూడ కల్ప వృక్షము వంటిదని చెప్పవచ్చును.

"అథ సువిమల విద్యో, విర్వకర్మా మహాత్మా,
సకల గుణ వరిష్ఠ స్సర్వ శాస్త్రార్థ వేత్తా,
సకల సురగణానాం సూత్రధారః కృతాత్మా,
భువన నివసతాం సచ్ఛాస్త్ర మేత చ్చకార"

"సకల సద్గుణ సంపన్నుడును, సర్వశాస్త్రవేత్తయు, విమల విద్యా రహస్య కోవిదుడును, సర్వదేవతలకు శిల్పాచార్యుడును, మహాత్ముడును అగు విశ్వకర్మ గృహస్థుల క్షేమము కోసమై ఈ సచ్ఛాస్త్రమును నిర్మించెను." అను శ్లోకముతో ఈ గ్రంథము ముగియుచున్నది ఈ శ్లోకమును బట్టి కూడ ఇది గృహవాస్తు విషయ ప్రధాన శాస్త్రమే అని తెలియుచున్నది.

2. విశ్వకర్మ వాస్తుశాస్త్రము : ఇది 87 అధ్యాయముల గ్రంథము. కొన్ని అధ్యాయములందలి శ్లోక సంఖ్య మిక్కిలి తక్కువ. అయినను అనేక గృహ వాస్తు విశేషములను ఈ గ్రంథము చెప్పుచున్నది. దీనిని

T. M. S. S. M. లైబ్రరీ తంజావూరు వారు సవ్యాఖ్యానముగా ప్రకటించినారు. శ్రీ కె వాసుదేవశాస్త్రిగారు దీనిని సంపాదించి విపులమగు పీఠిక వ్రాసినారు. ఇది దేవశిల్పియగు విశ్వకర్మ వ్రాసినట్లే చివరి అధ్యాయమునందు కలదు కాని, శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవి ప్రభృతి మహాశిల్ప వాస్తు విద్వాంసులు ఈ గ్రంథమును విశ్వకర్మ కృతమని నమ్ముట లేదు

3. విశ్వకర్మ శిల్పమ్ : దీనికి "విశ్వకర్మీయ" మని కూడ ఇంకొక పేరు ఉన్నది ఇందు 22 అధ్యాయములు కలవు. తంజావూరు గ్రంథాలయమున లిఖిత ప్రతి మాత్రమే దొరకినది. దీనిలో విశ్వకర్మాది పదముల నిర్వచనములు ఇట్లున్నవి—

అథ విశ్వం కరోతీతి, విశ్వకర్మా భవత్ స్వయమ్."

విశ్వమును నిర్మించువాడు కావున "విశ్వకర్మ" అనుపేరు సార్థకమగుచున్నదని పై శ్లోక భాగమునకు భావము. విశ్వసృష్టి అనునది స్థితిలయాదులైన తక్కిన సర్వకార్యములకు ఉపలక్షణమని గ్రహింపవలయును. అనగా సృష్ట్యాది సర్వకర్మలుచేయు దేవుడు విశ్వకర్మ అని సారాంశము. లోకములోని 'శిల్పి' అను నప్పుడు సర్వ శిల్పకర్మలు చేయువాడని అర్థము చేసికొనవలయును.

"సర్వలక్షణత శ్శుద్ధ స్తస్మా త్తక్షక ఈరితః"

శిల్పాచార్యునకు ఉండవలసిన సర్వలక్షణములు కలిగి పరిశుద్ధుడైనందున 'తక్షకుడు' అనబడుచున్నాడు. 'తక్షణ' మనగా చెక్కుట. అనగా ముడివస్తువులైన (Raw Materials) అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణాదులను చెక్కిగాని, కరగిగాని, కావలసిన రూపములను కల్పించువాడు తక్షకుడన్నమాట.

"దేవాలయాదికాన్ సర్వాన్ వర్ధయే దితి వర్ధకిః."

దేవాలయములను, మనుష్యాలయములను (గృహ, భవన, ప్రాసాదాదులను) తన నిర్మాణ కౌశలముచేత వృద్ధి పొందించువాడు "వర్ధకి" అగుచున్నాడని శ్లోకభాగార్థము. 'వర్ధన' మనగా వృద్ధిచేయుట, చెక్కుట— అని రెండర్థములున్నవి. కొయ్య మొదలగు వాటిని చెక్కి రూపకల్పనము చేయువాడని కూడ కొందఱు భావించిరి.

"త్రిపురం దగ్ధుకామస్య శివస్య పరమేష్ఠినః,
రథం తు జగదాకారం, కృతవాన్ పరమం శుభం,
రథకార ఇతి ప్రోక్తో విశ్వకర్మా స ఏ వ హి.''

త్రిపుర దహనమునకు పూనిన శివునకు జగద్రూపమైన రథమును చేసి యిచ్చినాడు కావున విశ్వకర్మకు ''రథకారుడు'' అను పేరు కలిగినది. రథమను చేయువాడు రథకారుడని వ్యుత్పత్తి. ఋగ్వేదములో భృగువులు, ఋభువులు— మొదలగువారు రథములనుజేసి రథకార ప్రసిద్ధి నందినట్లు అనేక మంత్రములు చెప్పుచున్నవి. మానవ శిల్పి పక్షమున రథశబ్దము తక్కిన సర్వ శిల్పములకు ఉపలక్షణమని భావింపవలయును. రథకారుడు—అనగా శిల్పి, ఒక్క రథమునే చేసి ఊరకుండడు కదా! "అహం రుద్రాయ ధను రాతనోమి'' అని పూర్వము (చూడు 211—వ, పుట) చదివియున్నాము రుద్రునకు త్రిపుర వినాశార్థము ఆ ధనువును చేసినదియు విశ్వకర్మయే. ఆ విశ్వకర్మయే రథమునుకూడ నిర్మించి, యౌగికముగా రథకారుడైనాడు. ఆయన సంతానమైన సానగాది బ్రహ్మ ఋషులును, తత్సంతతి వారైన శిల్ప బ్రాహ్మణులును రథకారులగుటకు గూడ తండ్రియొక్క రథకరణత్వమే కారణమని ప్రాజ్ఞులు గ్రహింప

వలసియున్నది. ఇది వేదవాణి వచించిన సత్యము. రథకారశబ్దమునకు ఆధునిక గ్రంథములు చెప్పెడి అనుచితార్థములు నిరాకరణీయములు.

4. మయమతమ్ ; దీనిని మయమతశిల్పశాస్త్రము అనియు, మయ శిల్పశాస్త్ర మనియు కూడ పిలుచుచుందురు. దీనిని తిరువనంతపురము (తిరువేంద్రం) లోని "అనంతశయన సంస్కృత గ్రంథావళి" వారు ప్రకటించి యున్నారు. ఇందు అనేకములైన శిల్ప వాస్తు విషయములు చెప్పబడియున్నవి. సంగ్రహాధ్యాయము మొదలుకొని - భూపరీక్షాదులతో శిల్ప వాస్తు విషయము లన్నియు సంపూర్ణముగా ఈ గ్రంథమున కలవు. ఇది సమగ్రమును, ప్రాచీనమును అగు శిల్పశాస్త్ర గ్రంథమని చెప్ప వచ్చును. శిల్పాచార్యుని లక్షణములను, శాస్త్రప్రజ్ఞను, సదాచారమును గూర్చి మయబ్రహ్మ చెప్పిన దిగువ విషయములను ఇచ్చట ప్రస్తావించుట ఆధునిక శిల్పి సత్తములకు ప్రబోధకమై ఉండగలదు —

"విశ్వకర్మకులశ్రేష్ఠో ధర్మజ్ఞో వేదపారగః,
సాముద్ర గణితానాం చ జ్యోతిశ్శాస్త్రస్య చైవ హి.
లోహ పాషాణ కాష్ఠానా మిష్టకానాం చ సంకలే
సుధానాం చిత్రకానాం చ చతుష్షష్టిక మర్మగః.
సూత్ర శాస్త్ర క్రియాప్రాజ్ఞో వాస్తువిద్యాబ్ధిపారగః
శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్యాని బౌద్ధకమ్.
కాపాలికం చ షడ్ధర్మం నిర్మితం స్థాపితం తథా
శ్రౌత స్మార్త క్రియాప్రాజ్ఞో మంత్రతంత్రార్థ కోవిదః.
సంకల్పం చానువాకం చ మార్జనం చాఘమర్షణమ్.
పంచాంగలక్షణం స్నానం సంధ్యాది జపతర్పణమ్.
పంచయజ్ఞో మహాధ్యానం వైశ్వదేవం చ సంతతమ్

సత్యవాక్య స్సదాచారో విద్యా కుశల బుద్ధిమాన్.
సర్వలక్షణ సంపన్న స్సర్వావస్థా సుశోభితః
ఆరోగ్యే చాప్రమాదే చ సప్తవ్యసన వర్జితః.
వేదకర్మా సదాచార ఏకపత్నీవ్రత స్తథా
మనుసూత్రాది శాస్త్రజ్ఞో గుణవాన్ సత్యవాచకః.
ఏవం గుణగణై ర్యుక్త శ్శిల్పాచార్య స్సదోచ్యతే."

"విశ్వకర్మ బ్రాహ్మణవంశమున శ్రేష్ఠుడును, ధర్మమును తెలిసిన వాడును, వేదములను తుదిముట్ట చదివినవాడును, గణిత, సాముద్రిక, జ్యోతిర్వాస్తు శాస్త్రములను కూలంకషముగ చదివినవాడును, సువర్ణాది లోహములు, పాషాణములు, దారువులు, ఇటికలు, గచ్చులు, చిత్రములు మొదలగు పనులు నేర్చినవాడును అఱువది నాలుగు కళల మర్మములు తెలిసినవాడును, సూత్రశాస్త్రక్రియలయందు ప్రవీణుడును, శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య, బౌద్ధ, కాపాలికాది మతముల నెఱింగినవాడును, శ్రౌత, స్మార్త, మంత్ర, తంత్ర నిపుణుడును, సంకల్పము, అనువాకము, మార్జనము. అఘమర్షణము, స్నానము-అను పంచలక్షణములు గల స్నాన, సంధ్యా, జప, తర్పణ, పంచయజ్ఞ మహాధ్యాన, వైశ్వదేవాదికర్మలు నిత్యము చేయువాడును, సత్యవచనుడును, సదాచార సంపన్నుడును, విద్యలయందు, కుశలబుద్ధి యున్నవాడును, సలక్షణము లగు అవయవములున్నవాడును, సర్వావస్థలయందు వెలుగువాడును, ఆరోగ్యశాలియు, ప్రమాదరహితుడును, ద్యూతాది దుర్వ్యసనములు లేనివాడును, వేదధర్మములను ఆచరించువాడును, ఏకపత్నీవ్రతుడును, మనుమయ త్వష్టృప్రముఖుల సూత్రశాస్త్రముల నెఱిగినవాడును, గుణవంతుడును, సత్యవంతుడును అగునట్టి మహావ్యక్తి శిల్పాచార్యుడు అని చెప్పబడుచున్నాడు."

ఇట్లనుటచేత మహాశిల్పాచార్యునకు ఎన్ని ఉత్తమలక్షణములు, ఎన్నెన్ని శాస్త్రముల పరిజ్ఞానము, కర్మదక్షత ఉండవలయునో వ్యక్తమగు చున్నది. ఇంచుమించు ఇట్టి లక్షణములనే కశ్యప మానసారాదులును శిల్పి బ్రాహ్మణునకు ఉండవలయునని చెప్పినారు. ఇటీవల ప్రకటించిన మయమత శిల్పశాస్త్రాది గ్రంథములలోను, కొన్ని పురాణములందును శిల్పాచార్యాధిక్యమును ప్రతిపాదించు ఇట్టి శ్లోకములు అగపడుటలేదని శ్రీ పెదపాటి నాగేశ్వరరాయాదులు అనుచున్నారు. ఇట్టి భాగములను తొలగించి ఆయా గ్రంథముల సంపాదకులు ప్రకటించు చున్నారేమో చెప్పజాలము - అట్లే అయినచో, అది మహా సారస్వత ద్రోహము, సత్యవంచనము అనక తీఱదు. ఈ మయబ్రహ్మనుగూర్చి ఈ దర్శనము 113 వ పుటలో కొంత వ్రాయుటయైనది.

5. మయవాస్తువు : ఇది 4 అధ్యాయములు, 105 శ్లోకములు మాత్రమే గల చిన్నిగ్రంథము. దీనిని 1891 వ సంవత్సరములో చెన్నపురిలోని "రాధా రాణి అండ్ కంపెనీ"వారు ప్రకటించినారు. పిమ్మట, 1925 వ సంవత్సమున "వేలూరు కుప్పుస్వామి మొదలారి వారు" చెన్నపురియందే ముద్రించినారు. దీని ముఖపత్రముమీద "శ్రీమయవిశ్వకర్మ పరబ్రహ్మణేనమః. సాక్షా ద్దేవశిల్పాచార్యుడగు మయపరబ్రహ్మచే సకల లోకోపకారముగ రచియింపబడిన మయవాస్తు శాస్త్రము" అని ఉన్నది. దీనినిబట్టి మయబ్రహ్మ దేవశిల్పాచార్యుడు అనియు తెలియుచున్నది కదా! తరువాత 1935 లో వావిళ్ళవారు ప్రకటించినారు. దీని ముఖపత్రమున "మయబ్రహ్మ విరచిత మయ వాస్తు శాస్త్రము" అని ప్రకటితము. దీని పేరు వాస్తు శాస్త్రమనియే కాని, చెప్పబడిన విషయములు శిల్పశాస్త్ర సంబంధులు. ఇందులో నవ తాళ ప్రమాణముతో విగ్రహములను చేయురీతులు, లింగ, దేవ ప్రాసాద,

ప్రాకారాదుల లక్షణములు, ప్రతిమాగత దోషములు, మూర్తులకు ఉండవలసిన ఊర్ధ్వాధ స్సమ దృష్టులు, వాటిఫలములు, వివరింపబడి, చివరకు గోపుర నిర్మాణమునుగూర్చి చెప్పుచూ ఈ గ్రంథము ముగియుచున్నది. మానసారాదుల తంత్రములకంటెను మయమతాగమము శ్రేష్ఠమని ఈ గ్రంథమనుచున్నది. శిల్పిలక్షణ, శిల్పిపూజా పురస్కారాదులను గూర్చి ఈ పుస్తకము చక్కగా చెప్పినది. కొన్ని శ్లోకములు ఈదర్శనపు 84 వ పుటలో చూడవచ్చును. మఱికొన్ని శ్లోకములు ఇట ఉదాహరింపబడుచున్నవి—

"దృష్టినిర్మాణకాలే చ, ప్రాణసంస్థాపనే తథా,
మంత్రతంత్రేణ సంయుక్తం కారయే చ్ఛిల్పికోత్తమః.
స్థూపికాస్థాపనం చైవ మాచార్యో వైశ్వకర్మణః
ఆచార్యో విశ్వకర్మాచ ఆదిబ్రహ్మకులోద్భవః."

3 వ అధ్యాయము. 20, 21 శ్లో.

ఇందలి తుదిపాదము వావిళ్ళవారిప్రతిలో "యజమానో విశకర్మాచ ఆదిబ్రహ్మకులోద్భవః" అని ఉన్నది. అర్థము మాత్రము శిల్పాచార్యుడును, కర్త (యజమానుడు) యు – విశ్వబ్రహ్మయగు ఆది బ్రహ్మకులమున పుట్టినవారని తెలియ వలయును" అని వ్రాయబడినది. మఱియు—

"పూర్వం శిల్పీ ప్రతిష్ఠాప్య, ద్వితీయా బ్రాహ్మణైః కృతా,
అన్యథా కీర్తితం తత్తు రూపం నిర్జీవ మేవ హి."

శిల్పాచార్యుడు ముందు దేవుని ప్రతిష్ఠించి, ప్రాణప్రతిష్ఠ చేయవలయును. అనంతరము విప్రులు అర్చనాదులు జరుపుకొనవలయును.

ఇట్లు చేయనియెడల ఆ ప్రతిమ యొక్క స్వరూపము నిర్జీవమని తెలియ వలయును. శిల్పి ఆదిబ్రహ్మకులోద్భవుడే కావున, "బ్రాహ్మణైః" అను పదమునకు శిల్పము చేతకానిబ్రాహ్మణులని భావము. ఇంకను —

"జల ధాన్యాధివాసం చ శిల్పాచార్యేణ కారయేత్,
అన్యజాత్యా న కర్తవ్యం కర్తా భర్తా వినశ్యతి."

జల ధాన్యాధివాసాది కార్యములుకూడ శిల్పాచార్యుడే చేయవల యునుగాని, ఇతరుడు చేయరాదు. అట్లు చేసినచో, కర్తయు భర్తయు నశింతురు.

"శిల్పీ మాతా, శిలా పుత్రో, దాసత్వం సర్వపూజకాః,
కర్తవ్య ఇంద్రభోగశ్చే తీదం త్రివిధ లక్షణమ్."

శిల్పకారుడు తల్లివంటివాడు. శిల పుత్రుడు. పూజకులు దాసులు. ఇవి యన్నియును చక్కగా తటస్థించినయెడల ఇంద్ర భోగమే యగును. ఇదియే త్రివిధలక్షణ మనబడుచున్నది. అతి ప్రాచీనములైన శాస్త్రగ్రంథములు, శిల్పాచార్యుడే ఆలయమున దేవతా మూర్తిని ప్రతిష్ఠించి, ప్రాణప్రతిష్ఠ – నేత్రోన్మీలన సంస్కారాదులు జరిపి, యజమానునకు బింబమును ధారపోయ వలయుననియు, అప్పుడు యజమానుడు అనగా దేవాలయమును నిర్మింపచేసిన వ్యక్తి, అర్చకుని నియమించి నిత్యార్చనాకలాపము నిర్వర్తింప చేయుచుండవలయుననియు చెప్పుచుండ, నేటికాలమున కొందఱు స్వార్థపరులు, శిల్పాచార్యునకు ప్రతిష్ఠాధికారము లేదనియు, గర్భాలయమునందు ప్రవేశింపనే రాదనియు, వితండవాదములు చేయుట ఎంత దారుణమో విజ్ఞులగు వారు విచారింతురు గాక! సందర్భము కనుక ఇచ్చట ఈ విషయమును కొంచెము విస్తరింతము.

తపస్సు, శ్రుతము (జ్ఞాన - విజ్ఞానములు) పుట్టినజాతి - అనునవి మూడును బ్రాహ్మణత్వమును కలిగించు ననియు, అందు తపోజ్ఞాన విజ్ఞానములు లేనివాడు జాతిమాత్ర బ్రాహ్మణుడే యనియు — "శబ్దార్థ చింతామణి" లోని దిగువ శ్లోకము వక్కాణించు చున్నది—

"తపః, శ్రుతం చ, యోని శ్చ త్రయం బ్రాహ్మణ్యకారణమ్,
తపః శ్రుతాభ్యాం యో హీనో జాతిబ్రాహ్మణ ఏవ సః."

విశ్వబ్రాహ్మణుడైన శిల్పాచార్యుడు శిల్పాగమ వైదికశాస్త్ర జ్ఞానమునే కాక, స్వయముగా శిల్పము చేయగల నేర్పు సైతము కలిగి యున్నందున, అతడు పూర్ణమైన బ్రాహ్మణ్యము కలవాడగు చున్నాడు. ఈ విధముగా జాతిచేతను, తపః శ్రుతములచేతను, శిల్పముచేతను అతడు పూర్ణుడు కావున, ప్రతిష్ఠాతంత్రమును నడపుటకు అతనికే అర్హత యున్నది. భగవద్గీత —

"శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞానం మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్."

అను చున్నది. ఇందలి విజ్ఞాన శబ్దమునకు - శిల్పమునకు, ఆ యా శాస్త్రములకు సంబంధించిన జ్ఞాన మనియు, జ్ఞానశబ్దమునకు మోక్షసంబంధముగల బుద్ధి యనియు అమరుడు వ్రాసినాడు—

"మోక్షే ధీర్ జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః" అని. తదనుగుణముగానే మహాభారతము సైతము "శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణలక్షణమ్" శిల్పాధ్యయనములు రెండును బ్రాహ్మణ లక్షణములని చెప్పియున్నది. కొందఱగు ప్రతికక్షుల దుర్వాదములను పరాస్తము చేయుటకు శిల్పాచార్యుని గూర్చియు, తద్వంశ ప్రతిష్ఠను

గూర్చియు ఈ విశేషములు వ్రాయవలసివచ్చినది.

మయవాస్తు శాస్త్రము విశ్వకర్మ పరమేశ్వరునిగూర్చి ఇట్లను చున్నది—

"అశేష భూతోదయ కర్మ కర్తా
సురాసురాణాం చ గురు స్తథైవ
విశ్వస్య సృష్టి స్థితి నాశ హేతుః
శ్రీవిశ్వకర్మాఖిలదేవ ముఖ్యః."

"విశ్వముయొక్క సృష్టి స్థితి లయములకు హేతువైనవాడును, సురాసురులకు గురువైనవాడును, సర్వభూతముల అభ్యుదయము కోసమైన శిల్పకర్మలకు కర్తయుఅగు విశ్వకర్మ సర్వదేవతలలో ముఖ్యుడు."

6. కాశ్యపశిల్పము : కశ్యప శిల్పాచార్యునిగూర్చి ఈ దర్శనము నందలి 139 వ పుటలో కొంత వ్రాయబడినది. కశ్యపకృతము కావున "కాశ్యపశిల్ప" మను పేరు ఈ గ్రంథమునకు సార్థకము. ఇతడు సర్వలోకైక నాయకుడగు మహాదేవుని ప్రార్థించి ఆయనచేత ఈ గ్రంథార్థము ను ఉపదేశింపబడినట్లు గ్రంథాదిని సూచింపబడినది. దీనికి "అంశుమద్భేద తంత్రము" అనియు మఱియొక పేరు గలదు బహుశః అంశుమానకల్పము, అంశుమద్భేద తంత్రములు ఒకే గ్రంథమేమో అనియు తోచుచున్నది. కాశ్యపశిల్పము 88 పటలములుగా విభజింపబడినది. ఈ పటలములలో కర్షణాద్యర్చనాంతమగు శిల్పక్రియా సర్వస్వము సంపూర్ణముగా వివరింపబడినది. ఈ గ్రంథము శివోపదిష్టముగా ఉన్నందున కాటోలును శివతత్త్వప్రధానముగానే చివరివఱకు పొగిపోయినది. ఆ యా దైవ కార్యములు శివమంత్రములతోనే జరుపవలయుననుట ఏతద్గ్రంథాశయము. దేవతామూర్తులలోకూడ ఎక్కువగా

శివప్రతిమలను గూర్చియే ఇందు లక్షణము చెప్పబడినది. ఇది పక్షపాతముకాదు, వైఖానస, పాంచరాత్రాగమములు విష్ణుతత్త్వ ప్రధానములు గానే ఉండును కావున, కాశ్యపశిల్ప మిట్లు శివవిషయ ప్రధానముగా ఉండుట సమంజసమే. నానావిధములైన స్తంభభేదములను మనదేశపు శిల్పములలో కాంచగలము. మొదటినుండి చివరివఱకు నాలుగు పలకలుగా నుండిన స్తంభమునకు బ్రహ్మకాంతమని పేరు. అష్ట కోణములుగలది విష్ణుకాన్తము. ఆఱు కోణములుగలది ఇంద్రకాంతము, ఇట్లే రుద్రకాంత, చంద్రకాంతాది స్తంభభేదములు కలవు. దిగువ చతురశ్రముగాను, మధ్య భాగము అష్టాశ్రముగాను, ఊర్ధ్వభాగము వృత్తాకారముగాను ఉన్నచో, దానిని శివచ్ఛంద స్తంభము అందురు. ఇంకను–శ్రీవజ్రము, క్షేపణము మున్నగు స్తంభభేదములు చెప్పబడినవి.

దేవ. మానవ ప్రాసాదములన్నియు నాగర, ద్రావిడ, వేసరము లని ముప్విధములుగా ఉండును. ఈ మూడు భేదములును సత్వ రజస్తమోగుణములకు చిహ్నములు అగుటచేత, వాటికి వరుసగా విష్ణువు, బ్రహ్మ. రుద్రుడు - అధిపతులన్నాడు కశ్యపుడు.

"జన్మాది స్తూపిపర్యన్తం యుగాశ్రం నాగరంభవేత్,
వస్వశ్రం శీర్షం కంఠం వా ద్రావిడం భవనం భవేత్,
వృత్త గ్రీవ శిరోపేతం వేసరం హర్మ్య మీరితమ్."

మొదటినుండి చివరివఱకు చతురశ్రముగా ఉన్నదానిని నాగర భవనము అందురు. అష్టకోణములతో ఉండుదానిని ద్రావిడహర్మ్యము అందురు. వర్తులాకారముగా నుండుదానిని వేసరప్రాసాదము అందురు. కొన్ని శిల్పగ్రంథములు ద్రావిడమను షట్కోణమనియు చెప్పినవి. వీటిలో "వేసర" శబ్దమునకు 'వ్యస్ర' మని పర్యాయ పదము ఉన్నది.

విగతములగు అశ్రులు (కోణములు) గలది కావున దానికి వ్యశ్రమని పేరు. "కాశ్యపశిల్పము"ను గూర్చి ఈ గ్రంథకర్త వ్రాసిన విపుల వ్యాసము 1967 సం॥ అక్టోబరు 1 వ తేది ఆదివారము "ఆంధ్రప్రభ"లో ప్రకటితమైనది. విశేష వివరములు అందు కాంచనగు. ఈ కాశ్యప శిల్పమును పూనా యందలి" "ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి" వారు 95 వ పుస్తకముగా ప్రకటించినారు.

7. మానసారము: దేవ,మానవ భవనములయు,దేవతామూర్తులయు మానము(కొలత)ల సారములు ఈ గ్రంథమున వివరింపబడుటచేత దీనికి మానసారమను పేరు సార్థక మగుచున్నది. దీనిని వ్రాసినది మానసార ఋషియే. మానములసారములను—అనగా దేవాలయ—దేవతామూర్త్యాదుల లక్షణములను నిర్వచించినవాడు కాన మానసారుడను పేరుకూడ బిరుద ముగా కలిగినట్టిదే యని తోచుచున్నది. ఇందు-సంగ్రహము, శిల్పిలక్షణ పూర్వకమానోపకరణము, వాస్తుప్రకరణ, భూపరీక్ష, గ్రామ, నగర, అధి ష్ఠాన, విమానలక్షణ, ఏకతలాది — ద్వాదశతలవిధాన, ప్రాకార, గోపుర, మండప, శాలా, ద్వారస్థాన, రాజహర్మ్య, విధానములును, త్రిమూర్తి, లింగ, ముని, యక్ష, గరుడ, వృషభాదుల లక్షణములును, ఉత్తమ మధ్యమ దశతాళ పద్ధతులును, అంగభూషణ, నయనోన్మీలనాది లక్షణము లునుగల 70 అధ్యాయములు ఉన్నవి. 71 వ దగు పరిశిష్టాధ్యాయములో కొన్ని విశేషములు చెప్పబడినవి. ఈ గ్రంథమున జైన, బౌద్ధ శిల్ప లక్షణములుకూడ ఉండుట మానసారుని మతసమదృష్టికి నిదర్శన మన వచ్చును. అలహాబాదు విశ్వవిద్యాలయమున చరిత్ర - శిల్పాచార్యులుగా నున్న డా॥ శ్రీప్రసన్నకుమారాచార్యులుగారు ఈ గ్రంథమును సంస్క రించినారు. శిల్పసిద్ధాంతి శ్రీ సిద్ధలింగేశ్వరస్వామివారు (మైసూరు) మానానుగుణములైన చిత్తరువులను వేసిరి. ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాల

పక్షమున దీనిని భారతదేశముననే ప్రకటించినారు. ప్రసన్నకుమారాచార్యులుగారు సంస్కరించినను, శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు మఱికొన్ని తప్పులను పట్టుకొని దిద్దుబాట్లు సూచించినారు. అవి వారి భారతీయ మహాశిల్పము, అనెడి గ్రంథమునగాని ముద్రితములు కావు.

8. యంత్ర సర్వస్వము: ఇది భరద్వాజ విరచితము. సమగ్ర గ్రంథము దొరకలేదు. "వైమానిక ప్రకరణము" ను మాత్రము బోధానందుడు వ్రాసిన వృత్తితో బరోడా గ్రంథాలయమువారు ప్రకటించినారు.

"నిర్మథ్య వేదదుగ్ధాబ్ధిం, భారద్వాజో మహామునిః,
నవనీతం సముద్ధృత్య, యంత్రసర్వ స్వరూపకమ్.
ప్రాయచ్ఛ త్సర్వలోకానా మీప్సితార్థ ఫలప్రదం,
నానా విమాన వైచిత్ర్య రచనాక్రమ బోధకమ్.
అష్టాధ్యాయై ర్విభజితం శతాధికరణై ర్యుతమ్,
సూత్రైః పంచశతై ర్యుక్తం వ్యోమయాన ప్రధానకమ్.
వైమానికాధికరణ ముక్తం భగవతా స్వయమ్."

భరద్వాజముని వేదక్షీరాబ్ధిని మథించి యంత్రసర్వస్వ మనెడి వెన్నపూసను లోకులకు అందించినాడట. అది అష్టాధ్యాయములతోను, నూఱు అధికరణములతోను, 15 వందల సూత్రములతోను వ్యోమయాన ప్రధానమై "వైమానికాధికరణము" అను పేరుతో ఒప్పుచున్నదని భావము. ఇందు చెప్పబడిన "విమాన" మనగానేమో ఈ దర్శనము 222 వ పుటలో చదివినాము. ఈ గ్రంథమున చెప్పబడిన యాన రహస్యములను ఎఱుంగనివాడు విమానమును నడపజాలడట. ఇందు కృతక రహస్య మొకటి— "కృతకరహస్యో నామ విశ్వకర్మ, ఛాయాపురుష, మను, మయాది శాస్త్రానుష్ఠానద్వారా తత్తచ్ఛక్త్యను సంధాన

పూర్వకం తాత్కాలిక సంకల్పానుసారేణ విమానరచనాక్రమ రహస్యమ్."

"విశ్వకర్మ, ఛాయాపురుష, మను, మయాది విమానశాస్త్రకారుల గ్రంథములను పరిశోధించి, ఆ యా శక్తులను అనుసంధించి, ఆ యా ధాతువులలోని సామర్థ్యమును అలవఱచుకొని తన యిష్టానుసారముగా విమానములను నిర్మించవలసియున్నది.'' ఈ సూత్రమునుబట్టి భరద్వాజుని కంటె ముందే విశ్వకర్మ ఛాయాపురుష మనుమయాదులు విమాన శాస్త్రములను రచించిరనియు, వాటిని కాంచియే భరద్వాజముని తన గ్రంథమును రచించినాడనియు స్పష్టమగు చున్నది కదా!

ఈ గ్రంథమున - గూఢరహస్యము, సర్పగమన రహస్యము, రూపాకర్షణ రహస్యము, పరశబ్ద - రూపగ్రాహక రహస్యములు, దిక్ప్రదర్శన రహస్యము, కర్షణరహస్యము - మొదలగు రహస్యములు కలవు. "అపరోక్షరహస్యము"లో "శక్తితంత్ర" మనెడి గ్రంథములో చెప్పినట్లు "రోహిణీ విద్యుత్తు'' ను ప్రసరింప జేసినచో విమానము నెదుటనున్న వస్తువులను ప్రత్యక్షముగా చూడవచ్చునని చెప్పబడినది. దీనినిబట్టి ఆనాటికే విద్యుత్తును స్వాధీనపఱచుకొని యంత్ర నిర్మాణములకు ఉపయోగించుచున్నారని తెలియుచున్నది. అంతియే కాదు. ఈ విమానమును రోహిణీ విద్యుత్సహాయమున రాత్రులందుగూడ నడపింప వచ్చునని ఊహింప వీలు కలుగు చున్నది కూడ! యంత్రసర్వస్వములోని వైమానిక ప్రకరణమునుబట్టి ఎన్నియో రహస్యములు, ఎందఱో శాస్త్రకారులు తెలియబడుచున్నారు.

9. సమరాంగణ సూత్రధారము : దీనినిగూర్చి ఈ దర్శనము 212, 213 పుటలలో కొంత వివరింపబడినది. ఈ మహాసూత్రధారుడు

భోజ భూపాలుని ఆస్థాన శిల్పాచార్యుడగుటచేత క్రీ. శ. 11 వ శతాబ్ది వాడని తేలుచున్నది. తనకు పూర్వమునగల సమస్త శిల్ప వాస్తు గ్రంథములను చదివి ఈ తడీ పుస్తకమును రచించినట్లు గ్రహింపవచ్చును. అట్లు కాకున్న ఈ గ్రంథము ఇంత సంపూర్ణము అగుటకు అవకాశము ఉండదు. ఇందు చెప్పబడని శిల్ప వాస్తు రహస్యములు లేవన్నచో, అది అతిశయోక్తి కాదు. కావుననే సమరాంగణ సూత్రధారము చదివిననే కాని శిల్ప వాస్తు రహస్యముల సమగ్ర విజ్ఞానము ఏర్పడదని అనేకులు భావించుచున్నారు.

10. అపరాజితపృచ్ఛ : ఇది సమరాంగణ సూత్రధారము తరువాత వ్రాయబడిన మహాశిల్ప శాస్త్రగ్రంథము. దీనికర్త భువనదేవాచార్యుడు. ఋగ్వేదములో భువనుడను పేరుగల మంత్రద్రష్టయగు ఋషి యొకడు కలడు. ఐతరేయ బ్రాహ్మణములో భువనఋషి ఒక విశ్వకర్మకు తండ్రిగా వర్ణింపబడినాడు. ఆతడే భౌవనవిశ్వకర్మ, మహా సమ్రాట్టు; అనేకాశ్వమేధయాజి. ఆ భువనుని పేరునే ఈ శిల్పాచార్యుడు తనకు పెట్టుకొనినాడు. ఈ గ్రంథకర్త తనకు విశేషణముగా "సూత్రసంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్తృ" శబ్దమును వాడుకొనినాడు. ఇది ప్రతిసూత్రాన్తమునను భువనదేవాచార్యుని పేరునకు ముందు విశేషణముగా ఉండును. "పృచ్ఛ" అనగా ప్రశ్న అని భావము. జయుడు, విజయుడు, సిద్ధార్థుడు, అపరాజితుడు అని విశ్వకర్మ భగవానునికి నల్వురు తనయులున్నారు. వారిలో కనిష్ఠుడగు అపరాజితుడు తండ్రిని ప్రశ్నించుచుండగా, తండ్రియగు విశ్వకర్మ సమాధానములను చెప్పినట్లు ఈ గ్రంథము సాగుచుండును. కావుననే దీనికి "అపరాజితపృచ్ఛ" అను పేరు సార్థకమగుచున్నది. ఇందలి భాగములకు సూత్రములని గ్రంథకర్త పేరిడినాడు. ఇట్టి సూత్రములు ఇందు 239 కలవు. సూత్రములు అన్నమాటయే కాని,

అవి కొన్ని శ్లోకముల సమూహమే. సూత్రమనగా అధ్యాయము వంటి దని గ్రంథకర్త భావము. ఇందు దాదాపు 8600 శ్లోకములలో ఇంచు మించు 1150 విషయములు బోధింపబడినవి. శిల్పము లేనిది సృష్టి లేదు కావున, ఈ గ్రంథమున తొలుత బ్రహ్మాండోత్పత్తి ప్రకారమే వర్ణింప బడినది. ఇందు చెప్పబడని విషయ మేదియు లేదనుట అతిశయోక్తి కాదు. వైదిక, శాస్త్రీయ, పౌరాణిక, చారిత్రక, శైల్పికాదులైన నానా విషయములకు ఈ గ్రంథము ఒక విజ్ఞానసర్వస్వము వంటిది అనవచ్చును. ఈ గ్రంథము శివునికే సర్వాధిక్యము నిచ్చుచున్నది. సాధారణముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు రజస్సత్వ తమోగుణ యుక్తులుగా వర్ణింపబడుచుందురు. కాని, ఇందు దానికి భిన్నముగా విష్ణునకు తమస్సును, మహేశ్వరునికి సత్వమును చెప్పబడుట విశేషము— "రజో బ్రహ్మ, తమో విష్ణుః, సత్వం చైవ మహేశ్వరః" అని 14 వ పుటలో కలదు. ఇందుకు తగినట్లే—

"శివ శక్తి సమాయుక్త ముద్భవే ద్రుద్రరూపకమ్,
శంభూ రుద్రోద్భవః ప్రోక్తో, బ్రహ్మవిష్ణూ తదుద్భవౌ."

"శివశక్తి సమాయోగముచే రుద్రరూపము ఉద్భవించుచున్నది. ఆ రుద్రునినుండి శంభుడును, ఆ శంభునినుండి బ్రహ్మ విష్ణువులును పుట్టినారు" అని భావము. దీనినిబట్టి శివ, శంభు, రుద్రులు అనెడివారు వేర్వేఱు వ్యక్తులని ఊహింపవలసి వచ్చుచున్నది. లేదా భిన్నావతారములై నను కావలయును. ఋగ్వేదములో రుద్ర దేవునిగూర్చి 4, 5 సూక్తములు ఉన్నవి. మొత్తముమీద అనేకములైన క్రొంగ్రొత్త విషయములను తెలి యుటకు ఈ గ్రంథము అవశ్యపఠనీయముగా నున్నది. ఈ గ్రంథమును GAEKWAD'S ORIENTAL SERIES పక్షమున బరోడా విశ్వ విద్యాలయమువారే ప్రకటించినారు.

11. మండన సూత్రధారుని గ్రంథములు : క్రీ. శ. 15 వ శతాబ్దిని మేవాడుదేశమును కుంభరాణా పాలించునప్పుడు, ఆయన ఆస్థానమున మండనుడనెడి సూత్రధారుడు (శిల్పాచార్యుడు) ఉండెడివాడు. సమరాంగణ సూత్రధారుని పేరువంటిదే మండన సూత్రధార నామము కూడ. ఇతడు తన పేరు కూడ గ్రంథములకు కలసివచ్చునట్లు "వాస్తు మండన, ప్రాసాదమండన, రూపమండన, కోదండమండన రాజవల్లభాది" గ్రంథములను సంస్కృతమున రచించి యున్నాడు. ఆ పుస్తకముల నామములనుబట్టియే అందలి విషయములు స్పష్టములగుచున్నవి.

12 శిల్పరత్నము : దీనికర్త క్రీ. శ. 16 వ శతాబ్దికి చెందిన శ్రీకుమారుడు అను శిల్పాచార్యుడు. తనకంటె పూర్వపు శిల్పగ్రంథములను చక్కగా చదివి మననము చేసికొని ఈతడీ గ్రంథమును రచించి యున్నాడు ఇది పూర్వభాగము, ఉత్తరభాగము - అని విభజింపబడి యున్నది. పూర్వభాగమున 46 అధ్యాయములలో మానసాధన, భూమిలక్షణ, ఆయాది లక్షణములు, ఉపపీఠ, ప్రాసాద, మండప, ప్రాకార, గోపుర, ధ్వజాది లక్షణములు వివరింపబడినవి. 46 వ అధ్యాయమున చిత్రలక్షణము ఉన్నది. ఉత్తరభాగము బింబాది సాధన విధానముతో ఆరంభమయి, లింగ, సకల బింబోత్సేధ, తాళ, కిరీట, మృల్లేపనాదులను, శైవ, వైష్ణవ, శాక్తేయాది మూర్తి లక్షణములను చెప్పుచు - బింబ (మూర్తి) దోషములను, ప్రతిష్ఠా విధానమును, జీర్ణోద్ధార, మనుష్యాలయ, శస్త్రలక్షణములను వచించి ముగియుచున్నది. సాధారణముగా శిల్ప, వాస్తు, వైద్య, జ్యోతిష, సంగీతాదులకు చెందిన గ్రంథములు నిర్దుష్టమగు భాషకు అంతగా ప్రాధాన్య మీయవు. శ్రీకుమారుడు సంస్కృతమున మహాపండితుడును, ఆధునికుడును అగుటచేత అనన్వయ, క్లిష్టాన్వయాది దోషములు లేక ఇందలి శ్లోకములు హాయిగా సాగిపోయినవి. నేటి

కాలమున ఈ గ్రంథమునకు ఎక్కువగా ప్రచారము ఉన్నది. దీనిని తిరువేంద్రములోని "అనంతశయన సంస్కృత గ్రంథావళి'' వారే ప్రకటించినారు.

13. శ్రీతత్త్వనిధి : ఇది మహీశూర (మైసూరు) పురీ సంస్థానాధీశ్వరులగు ముమ్మడి కృష్ణరాజ ఒడయార్‌గారు అనేక శాస్త్ర పురాణాగమములను పరిశీలించి సంగ్రహించి వ్రాసిన మహోత్కృష్ట గ్రంథరాజము. బొంబాయిలోని శ్రీ వేంకటేశ్వర స్టీమ్ ప్రెస్ వారు దీనిని ముద్రించినారు. ఈ గ్రంథము– "శక్తినిధి, విష్ణునిధి, శివనిధి, బ్రహ్మనిధి, గ్రహనిధి, వైష్ణవనిధి, శైవనిధి, ఆగమనిధి, కౌతుకనిధి - అని నవనిధులుగా విభజింపబడి యున్నది. నిధులు తొమ్మిది కావున, ఈ విభాగము సమంజసమే. నిధులలో ధనమునకు కొఱత లేనట్లే ఈ గ్రంథమునను దేవతావిషయ పరిజ్ఞానమునకు కొదవలేదని భావము. "రాయల్ సైజున" 416 పుటలుగల ఈ గ్రంథములో చెప్పబడని విషయము లేదనుట అతిశయోక్తి కాదు ఆస్తికులైనవారు తెలిసికొని ఆచరింపదగిన సర్వవిషయములు ఇందు ప్రస్తావింపబడినవి. సహస్రాధిక దేవతాభేదములు, ధ్యానలక్షణాదులు ఇందు వివరింపబడినవి. ఈ గ్రంథకర్త పరిశ్రమ ప్రశంసనీయము

14. నారదీయ సంహిత : దీని పేరునుబట్టియే ఇది నారదుడు చెప్పినదని తెలియుచున్నది. దీనికి ఆద్యోపదేశకుడు నారాయణుడని కలదు ఇందు పాంచరాత్ర సంప్రదాయమున గల అనేక విషయములు సంగ్రహముగా చెప్పబడినవని తలంపవచ్చును. 30 అధ్యాయములు, 519 పుటలు గల ఈ గ్రంథమును "కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము" తిరుపతి వారు 15 వ పుస్తకముగా ప్రకటించినారు. అష్టాదశ శిల్ప

సంహితలలో నారదీయ సంహితయు ఒకటి. తక్కినవి- విశ్వకర్మ సంహిత, శిల్పసంహిత (కశ్యపుడు) అగస్త్యసంహిత, భృగుసంహిత, కశ్యపసంహిత, కపింజలసంహిత, హారిసంహిత, కౌమారసంహిత - మొదలగునవి.

15. VAISHNAVA ICONOGRAPHY : ఇది వివిధ పాంచ రాత్ర గ్రంథములను అనుసరించి ఇంగ్లీషు అర్థములతో వ్రాయబడిన గ్రంథము. సంస్కృతగ్రంథ సంపాదకుడు శ్రీ K. K. A. వెంకటా చారిగారు. ఆంగ్లవ్యాఖ్యాత H. డానియల్‌స్మిత్‌గారు. బొమ్మలు వేసినది మహాబలిపురములోని శిల్పశిక్షణకేంద్రమున ప్రధానాచార్యులు (Suparin- tendent)గా నున్న శ్రీ V. గణపతి స్థపతిగారు. మద్రాసు పాంచరాత్ర పరిశోధనా సంస్థవారు ఈ గ్రంథమును 1969 లో ప్రకటించినారు. ఇందు అనేక వైష్ణవ దేవతామూర్తి లక్షణములు సచిత్రముగా నిరూపింపబడినవి ఈ గ్రంథమున దాదాపు 20 పాంచరాత్ర సంహితలనుండి విషయములు సేకరింపబడినవి.

16. భారతీయ మహాశిల్పము : ఇది విమర్శకాచార్య, శిల్పకళా కోవిద - శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవీంద్రులు అనేక శిల్పశాస్త్రములను క్రోడీకరించి వ్రాసిన గ్రంథము. దీనిని 16 కళలుగా గ్రంథకర్త వింగ డించినాడు. ఇందు సమస్త శిల్ప, వాస్తు, ప్రతిష్ఠా, యంత్ర, మంత్రాది విషయములు వివరింపబడినవి. ఆంధ్రప్రదేశ ప్రభుత్వ విద్యాశాఖవారి విరాళముతో 3 కళలు మాత్రమే (సచిత్రముగ) ఒక భాగముగా ప్రకటింప బడినవి. తక్కిన భాగములు ముద్రణమును అపేక్షించుచున్నవి.

17. విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము : ఇది కవిశేఖర, కులోద్ధారక కీ. శే. వడ్డెపాటి నిరంజనశాస్త్రి మహోదయులు సంగ్ర

హించిన గ్రంథము. ఇందు 1. విశ్వకర్మకాండము, 2. త్వష్టృపకాండము, 3. విశ్వరూపోపాసకాండము, 4. శిల్పకాండము, 5 రథకారకాండము, 6. శాసనకాండము — కలవు. వేదములు మొదలుకొని నాలుగువందల సంఖ్య వఱకు గల ప్రమాణగ్రంథములను పరిశోధించి ఈ గ్రంథము సమకూర్పబడినది. విశ్వకర్మ పరమేశ్వరుని యొక్కయు, తత్సంతానమగు సానగాదుల (మనుమయాదుల) యొక్కయు, చరిత్రములును, శిల్పముయొక్క, శిల్పాచార్యులయొక్క జనన, చరిత్ర, ప్రభావాదులును ఇందు విస్తరముగా వర్ణింపబడి యున్నవి. ఈ గ్రంథమునుగూర్చి—

"వేద శాస్త్రాంబునిధి మున్గి వెదకి తెచ్చి
నట్టి రతనాలరాశి వంశాగమంబు;
ఒక మహీయః ప్రకాశంబు నొసగు మాకు।
ఇది మఱువజాల మెన్నటికేని సుకవి।"

అని ఈ దర్శనకర్త స్తుతించినాడు.

## ఆగమములు

"ఆగమ" శబ్దములో మూడు అక్షరములు ఉన్నవి. 'ఆ' అనగా శివుని ముఖములనుండి ఆగతము (వచ్చినది) అని అర్థము. 'గ' అనగా పార్వతీదేవి చెవిని గతము (పొందినది) అని అర్థము. 'మ' కారమునకు వాసుదేవుని మతమని అర్థము. సారాంశము - పరమశివునిచేత పార్వతీదేవికి ఉపదేశింపబడిన వాసుదేవమతము అని దిగువ శ్లోకము చెప్పుచున్నది—

"ఆగతం శివవక్త్రేభ్యో, గతం చ గిరిజాశ్రుతౌ,
మతం చ వాసు దేవస్య తస్మాదాగమ ఉచ్యతే."

ఇందలి మకారార్థము వాసుదేవమతమని శ్లోకమనుచున్నది కాని, అది విశ్వకర్మ మతముకాని, శివ - శక్తుల మతములు కాని ఏల కాకూడదు? అట్లు కానిచో, శివ, శక్తి, విశ్వకర్మాదుల తత్త్వములను ప్రతిపాదించు గ్రంథములకు ఆగమశబ్దము చెల్లకపోవలసివచ్చును. కావున మకారమునకు భగవన్మతమని అర్థము చెప్పికొన్నచో - అప్పుడు శైవ, వైష్ణవ, శాక్త, వైశ్వకర్మణాది మతము లేవైనను ఆగమములలో ప్రతిపాద్యములు కావచ్చును. ఇట్టి ఆగమములు విశ్వకర్మ, శివ, శాక్త, వైష్ణవ పరములుగా పెక్కులు కలవు. పరశివ విశ్వకర్మాగమము, గార్గేయాగమము మొదలైనవి విశ్వకర్మ తత్త్వ ప్రధానము లైనవి

1. సృష్టిక్రమము, 2. ప్రళయప్రకారము, 3. దేవతార్చనవిధి, 4. సర్వకార్యనిర్వహణప్రకారము, 5. పురశ్చర్యావిధి, 6 షట్కర్మ విధానము, 7. చతుర్విధ ధ్యానయోగవిధానము — అను ఈ ఏడింటిని ప్రతిపాదించునది ఆగమమని మఱియొక నిర్వచనము కలదు ఇట్టి ఆగమములు, రుద్రయామిళము, కులార్ణవము — మొదలగు తంత్ర గ్రంథములు. శైవులకు 28 ఆగమములు ప్రమాణములు. అందు శైవ, సుప్రభేదాదులైన ఆగమములు ప్రధానములు.

18. గార్గేయాగమము : విశ్వకర్మ తత్త్వమును సంపూర్ణముగా ఎఱిగినవాడు గార్గ్యమహర్షి. ఆ గార్గ్యేయునినుండియే తరువాత నారదాదులు విశ్వకర్మ తత్త్వమును. మహిమోదంతములను తెలిసికొని కృతకృత్యు లైనట్లు స్కాందపురాణాంతర్గత నాగరఖండాదులు చెప్పుచున్నవి—

గీ॥ మఱియు నచ్చట నే గార్గ్యమౌనివలన
విశ్వకర్మపురాణంబు విని యదియును
బదియు రెండగు లక్షలపైని గ్రంథ
సంఖ్య పదుమూడు వేలుగఁ జదివినాఁడ.

— ఆంధ్రనాగరఖండము. ఆశ్వా. 2 — పద్యము. 25

ఆదిమసృష్టికర్త మహిమనిట్లు సాంతముగా నెఱిగినవాడు గర్గ పుత్రుడగు గార్గేయుడు. ఈగార్గేయమహర్షి తనశిష్యులగు మునులకు ఉప దేశించినదే గార్గేయాగమము.

ఈ ఆగమమున 16 అధ్యాయములును, 689 శ్లోకములును గలవు. ఇందు అంకురారోపణము మొదలుకొని ప్రతిష్ఠావిధానము సంపూర్ణముగా వివరింపబడినది. దీని నాధారముగా చేసికొని ప్రతిష్ఠావిధానమును శాస్త్రీయ ముగా నిర్వహింపవచ్చును. కర్తృ కారయితలేమి, శిల్పాచార్యులేమి, ఉపాసకులేమి ఈ ప్రతిష్ఠాపద్ధతి ననుసరించి ఐహికాముష్మిక దివ్యఫలము లను అందగలరు. ఈ గ్రంథమున గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ, శచీ, సంజ్ఞా పీఠములనుగూర్చియు, తదాచార్యులనుగూర్చియు ప్రశంస కలదు. ఆ యా యుగయులయందలి ఆచార్యులనుగూర్చి ఈ ఆగమము—

"త్వష్టా కృతయుగాచార్యః, త్రేతాయాం గీష్పతి స్తథా,
ద్వాపరే విశ్వరూప శ్చ, కలౌ బోధాయనః స్మృతః"
—అధ్యా. 2. శ్లో. 71.

కృతయుగమున త్వష్టయు, త్రేతయందు బృహస్పతియు, ద్వాపర మున విశ్వరూపుడును, కలియుగమున బోధాయనుడును ఆచార్యులని చెప్పుచున్నది. రెండవ అధ్యాయములోని దిగువ శ్లోకము—

"అత ఏవ ప్రతిష్ఠాయాం స్థపతి ర్ముఖ్యకారణం,
తస్మా త్తద్వంశజాతానా మాచార్యత్వం ప్రచక్షతే."

శిల్పబ్రాహ్మణులే దేవతాప్రతిష్ఠా తంత్రమున ప్రాధాన్యము వహింతురనియు, కావుననే, తద్వంశమువారు ఆచార్యులై ఒప్పుచున్నా రనియు చెప్పుచున్నది. ప్రాణప్రతిష్ఠ, నేత్రోన్మీలన సంస్కారము,

కళాన్యాసము మొదలగు కార్యములు ఏ యే మంత్రములతో ఎట్లు చేయవలసినదియు ఈ ఆగమము చక్కగా వివరించుచున్నది. నేత్రోన్మీలన సంస్కారము జరిగినపిమ్మట శిల్పాచార్యుడు బింబదక్షిణకర్ణమున 108 సార్లు ఓంకారమును ఉచ్చరింపవలయును. దానితోగాని ఆతని గురుత్వము సంపూర్ణమగుటలేదు.

"జ్యోతి ర్నిర్మాణత శ్శిల్పీ, బింబస్య గురు రిష్యతే,
జ్యోతిర్మండల మాలిఖ్య, శిల్పాచార్యో మహాతపాః,
బింబస్య దక్షిణే కర్ణే ఓంకారాష్టోత్తరం శతం,
ఉచ్చరే ద్బ్రహ్మనిష్ఠ స్సన్ స ఏవ గురుర్దైవతమ్."

ఇట్లు శిల్పి మూలవిరాణ్మూర్తికి గురుత్వము పొందినను, బింబమునకు ప్రథమనమస్కారము శిల్పియే చేయవలయునని ఆగమకర్త శిల్పీశ్వరుని ప్రథమ భక్తత్వమునుకూడ దిగువశ్లోకమున స్పష్టము చేసినాడు—

"ప్రథమం శిల్పకాచార్యో నమస్కృత్వా యథావిధి,
తత్పరం వేదపాఠశ్చ సర్వశాస్త్ర సమన్వితః."

శిల్పాచార్యుడు దైవమూర్తికి తగినశిలను ఎన్నుకొని, శాస్త్రీయముగా విగ్రహమును నిర్మించి, స్వయముగా జలధాన్యాధివాసములుచేయించి, ప్రాణముపోసి, కన్నులు తెరపించి, కళాన్యాసము చేసి అప్పుడు యజమానునికి ధారపోయవలయును. ఆ పిమ్మటనే యజమానుడు (ధర్మకర్త) నిత్యపూజార్థము అర్చకుని నియమించుకొనవలసియున్నది. ఈ విషయములనే దిగువ శ్లోకములు చెప్పుచున్నవి—

"బింబస్య దక్షిణం హస్తం, గృహీత్వా శిల్పికోత్తమః,
యజమానస్య హస్తేతు, స్థాప్య బింబం విసర్జయేత్-

"దత్తం బింబం తవాధీనం, పూజా నైవేద్య ముత్సవః,
కర్తవ్యం భవతా సమ్యగ్ జాగరూకతయా సదా."
ఏతత్ శ్లోకం సముచ్చార్య శిల్పాచార్యో మహాతపాః.
యజమాన స్తు తద్దేవ మర్చకాయ సమర్పయేత్."

ఈ విధముగా శిల్పాచార్యుని కర్తవ్యములను, ప్రతిష్ఠావిధానములను నిరూపించి, ఇంక జీర్ణోద్ధారాది పద్ధతులను చెప్పుచు ఈ ఆగమము ముగియుచున్నది. అనేక సనాతన రహస్యములకు ఈ గ్రంథము నిధి అనుటలో సందేహము లేదు. ఈ దర్శనకర్త గార్గేయాగమమునుగూర్చి 1974 సంవత్సరమున శ్రీకాళహస్తీశ్వర దేవాలయమువారు, "మహా కుంభాభిషేక సందర్భము"న ప్రకటించిన సంచిక (SOUVENIR) లో ఒక వ్యాసమును వ్రాసియున్నాడు. తద్గ్రంథ విశేషములను ఇంక విస్తరముగా అందు కాంచవచ్చును.

19. వైఖానసాగమము: సర్వవేద సమష్టి రూపమైన ఈ ఆగమమును విష్ణుమూర్తి స్వాంశభవుడైన విఖనోమునికి ఉపదేశించినాడని ఇందు వ్రాయబడినది. ఆ విఖనసుడు భృగ్వాది మునీంద్రులకు చెప్పినాడట. ఇందు 1 అర్చనాధికారము, 2. ఖిలాధికారము, 3. వాసాధికారము, 4. యజ్ఞాధికారము, 5. క్రియాధికారము - అని అయిదు అధికారములు కలవు. ఈ ఆగమము పటలములుగా విభజింపబడి యున్నది. కర్షణాది ప్రతిష్ఠాన్తము వఱకు గల విశేషములు, అవతారలక్షణములు, అనుష్ఠాన విధానములు, తత్త్వజ్ఞానోపదేశము, శాస్త్రమహిమానువర్ణనము - మొదలగు అనేక విషయములు ఇందుకలవు. తెలుగులిపిలోని వైఖానసాగమము

విమానార్చనాకల్పము పంచదశపటలమున గర్భిణీశిలనుగూర్చి యిట్లు చెప్పబడినది—

"శిలాచ్ఛేదనే, తక్షణేఽపి మండూకం దృశ్యతే
యది, సా శిలా గర్భిణీతి జ్ఞాత్వా తాం వర్జయేత్."

ఱాతిని పగులగొట్టునప్పుడుగాని, విగ్రహముగా చెక్కునప్పుడు గాని ఱాతిలో మండూకము అగపడినచో, అది "గర్భిణీశిల" అని యెంచి దానిని వర్జింపవలయు ననినాడు. నాగరిలిపిలో నున్న ప్రతిలో "మండూకం దృశ్యతే యది" అన్నవాక్యము "మండలం దృశ్యతే యది" అని కలదు. కాని, మండూకమనెడి పాఠమే సరియైనది. కలియుగవిశ్వకర్మ బిరుదాంచితుడు జక్కణాచార్యుడు చెక్కిన బేలూరు లోని చెన్నకేశవస్వామిమూర్తిలో బొడ్డునగ్గఱ కప్ప యున్నందువలననే ఆతడు కుమారుడైన డక్కణాచార్యునిచేతిలో ఓడిపోయినాడు కదా! కనుక, ఱాలలో కప్పలు ఉండుటయే సహజము. ఈ ఆగమము దేవాలయ భాగములను — 1. గర్భాలయము, 2. అంతరాళము, 3. సుఖనాస (శుక నాస) 4. ముఖమండపము, 5. అర్ధమండపము, 6 ఆస్థానమండపము, 7. తటాకము — తటాకతీరాస్థానమండపము, 8. తీర్థమండపము, 9. మహామంటపము, 10. సభామంటపము, 11. నృత్యమంటపము - ఇత్యాదిగా విభజించుచున్నది. ప్రాకారములు ఒకటినుండి ఏడువఱకు ఉండవచ్చును. సప్తప్రాకారాలయము ఉత్తమోత్తమము.

వైఖానసాగమము 20వ పటలమున, తృతీయావరణములో గంగాది దేవతల స్థాపనమును చెప్పుచు త్వష్టృదేవునిగూర్చి ఇట్లు చెప్పబడినది —

"త్వష్టా - ప్లోతవస్త్రోత్తరీయాది సంచయ
స్థానే హేమాభ శ్శుకపింఛాంబరధర శ్చతు

ర్భుజః కలశాక్షమాలాపాణి ర్జటాధరో
హంసవాహనో రూపాద్యక్షరబీజ స్సావిత్రీ
పతి రభిజిజ్జాతః కమండలుధ్వజో ?
హుంకారరవ స్త్వష్టా .... త్వష్టారం రూప
జాతం నిధిజం ప్లోతాధిపతి మితి ''

ఇందు త్వష్టృదేవుని స్వరూపాది విశేషములను వర్ణించుచు ఆయనను ''సావిత్రీపతి'' అని చెప్పుట గమనింపదగియున్నది. సావిత్రి అనగా గాయత్రీదేవియే కదా. త్వష్టృపదమునకు విశ్వకర్మ యని వేద భాష్యకర్తలు అర్థము వ్రాయుచుందురు అంతియే కాక, పురుషసూక్తము ''విశ్వకర్మణ స్సమవ ర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూప మేతి.'' త్వష్ట విశ్వకర్మ స్వరూపుడే అనియు, లేదా, విశ్వకర్మావతారమే త్వష్ట అనియు చెప్పుచున్నది. కనుక గాయత్రీ విశ్వకర్మలకు పత్నీపతి ధర్మమును ఈ వైఖానసాగమ ప్రమాణము నిర్ణయించుచున్నది. ఉభయులును ప్రకృతి పురుషస్వరూపులగుట, పంచాననములు కలవారగుట—మొదలగు విశేష ములుకూడ వారి ఆదిమ దంపతిత్వమునకు సాక్ష్యములే కదా ! త్వష్టృ దేవుడు హంసవాహనుడు అనుటకూడ ఆయన సావిత్రీ పతిత్వమునకు సూచనమే. బ్రహ్మయు, విశ్వకర్మయు హంసవాహనులే. విశ్వకర్మ హంసవాహనత్వమును శ్రీపరబ్రహ్మతీర్థులువారు చక్కగా నిరూపించి యున్నారు. నవవిధ పరివారములు, నవవిధార్చక పరిచారకులు మున్నగు విశేషములను ఇందు వివరింపబడినవి. ఈ విధముగా వైఖానసాగమము అనేక మహారహస్యములకు నెలవై యున్నది.

20. పాంచరాత్రాగమములు : పాంచరాత్ర ధర్మమును సాత్వత ధర్మము అనియు చెప్పుదురు. సాత్వత శబ్ద సంకేతము ఐతరేయ

బ్రాహ్మణము (8—3—14) లో కలదు. శతపథ బ్రాహ్మణము (13— 6 —1) లో పాంచరాత్ర సత్రముయొక్క వర్ణనము కలదు. నారదపాంచరాత్రము — "రాత్రం చ జ్ఞానవచనం, జ్ఞానం పంచవిధం స్మృతమ్." రాత్రశబ్దమునకు జ్ఞానము అర్థమనియు, ఆ జ్ఞానము అయిదు విధములు అగుటచే "పాంచరాత్ర" పదము సార్థకమగుచున్న దనియు చెప్పుచున్నది. అనగా 1. పరమతత్త్వము, 2. ముక్తి, 3 భక్తి, 4 యోగము. 5. విషయము (సంసారము) అను అంశములనుగూర్చి వివేచించుటచేత దీనికి పాంచరాత్రమనుపేరు కలిగినదన్నమాట. ఈ పాంచరాత్రములో బహుగ్రంథములు ఉన్నవి. అవి 25 సంహితలని అనుచున్నారు. ఈశ్వరసంహిత, విష్ణుసంహిత, అహిర్బుధ్న్యసంహిత, బృహద్బ్రహ్మసంహిత, సాత్వతసంహితలు మిక్కిలి ప్రశస్తములందురు. ఇంకను పాద్మసంహితాదులు అనేకములు ఉన్నవి. ఈ సంహితలకు ముఖ్యాతి ముఖ్యములైన చర్చనీయాంశములు నాలుగు. అవియే జ్ఞాన, యోగ, క్రియా, చర్చలు. 1. జ్ఞానము - బ్రహ్మము - జీవుడు, జగత్తత్వము, ఆధ్యాత్మిక తత్త్వనిరూపణము, సృష్టితత్త్వ సముద్ఘాటనము. 2. యోగము — నామము, మోక్షప్రాప్తి, సాధనభూతయోగము, యౌగికక్రియల వర్ణనము. 3 క్రియ — ప్రాసాదరచన, (దేవాలయ నిర్మాణము) దేవమూర్తి విజ్ఞానము మూర్తిస్థాపనాదికము. 4. అర్చ — పూజాపద్ధతి, అర్చ్య - అర్చాపద్ధతి, అర్చకుని ఆహ్నికచర్యాదులు. ఇక్కడ అర్చకుడనగా ఉపాసకుడని భావము. ఈ పాంచరాత్రాగమములకన్న వైఖానసాగమమే మిక్కిలి ప్రాచీనమైనదని విజ్ఞుల అభిప్రాయము. అయినను నేడు దానిప్రచారము చాలవఱకు తగ్గినది. ఆంధ్రప్రదేశమున తిరుపతిలోని వేంకటేశ్వరుని వైఖానసాగమ ప్రకారమును, భద్రాద్రి యందలి శ్రీరామచంద్రుని పాంచరాత్రాగమ ప్రకారమును పూజించు

చున్నారు. "శిల్పదర్శనము" లో ఆగమముల ప్రశంస ఏల అందురేమో, ఆగమములుకూడ ఆనుషంగికముగా దేవాలయ, దేవమూర్త్యాదుల నిర్మాణ ప్రకారములను చెప్పుచున్నందుననే యని సమాధానము. అట్లే కొన్ని శిల్పగ్రంథములుకూడ పూజావిధానములను శాసింపక పోవుటలేదు.

21. శైవాగమము : దీనిని మచిలీపట్టణములోని శ్రీ చల్లా లక్ష్మీ నరసింహశాస్త్రిగారు తెలుగు లిపిలో ప్రకటించినారు. ఇది శివ ప్రతిష్ఠా విషయములనుగూర్చి చెప్పుచున్నది. శైవప్రతిష్ఠలు అనేకములు దానిని అనుసరించియే ఆంధ్రప్రదేశమున జరుగుచుండును.



విశ్వకర్మ గుహాలయం 10 (ఎల్లోరా శిల్పం)

# కొందఱు శిల్పాచార్యులు

"స్వీయవంశంబు సొంతంబు చెప్పికొనిరి
కావ్యనిర్మాత లేచిన్ని కావ్యమందు;
ఏమి యౌదార్యమోయి, నీ నామ మైనఁ
దెల్పవైతివి నీమహా శిల్పకృతుల!"

—గోనుగుంట పున్నయ్యగారి 'విస్మృతశిల్పి' నుండి

భారతదేశమునందు అద్భుతమగు శిల్పమును వెలయించిన శిల్పాచార్యుల చరిత్రములుకాని, చిట్టచివఱకు వారి నామధేయములుకాని మనకు చిక్కుటలేదు. శిల్పి ఎంత అద్భుత శిల్పమును వెలయించినను తన పేరునైనను సూచించి కీర్తిని సంపాదింప దలంచినట్లు పొడకట్టుటలేదు. నిరాడంబరుడై దేశాభ్యుదయమునే దృష్టియందుంచుకొని, తన శిల్పకళా కౌశలమును వెల్లడించి కృతార్థుడైనాడు సనాతన భారతీయశిల్పి. "ఆత్మ నామ ప్రకాశాభిలాషయులేని" ఆ ఘనశిల్పుల త్యాగము ఎంత కొనియాడ దగినది! అటనట కొన్ని శాసనములందును, ప్రజాసమూహము చెప్పెడి కథలయందును కొందఱు శిల్పుల నామములును, కొన్ని చరిత్రములును గోచరించుచున్నవి. నిస్వార్థులైన ఈ శిల్పుల ఉజ్జ్వల చరిత్రములను గ్రంథకర్తలు గ్రంథస్థము చేసియున్నయెడల, ఎందఱు మహనీయ శిల్పాచార్యులు జగదాదర్శమూర్తులై, విశ్వశ్రేయములగు కావ్యములందు వర్ణనీయు లయ్యెడి వారో చెప్పలేము.

## రాజాస్థాన శిల్పాచార్యులు

ఈ నాటికి చరిత్రకు అందినంతలో మొట్టమొదటి శిల్పాచార్యుడు శాతవాహనుల ఆస్థానమునందుకల ఆనందుడు (ఆనంద

స్థపతి) గణనీయుడు. ఆయనతోపాటు ఆనాడు పెందోట (బృహద్వని)లో ఎందఱు శిల్పాచార్యులు సుప్రసిద్ధులై అమరావతీ శిల్పరచనకు నడుములు కట్టినారో ఏ శాసనముగాని, ఏ చరిత్ర గాని చెప్పుటలేదు. ఇక్ష్వాకుల కాలమున ప్రసిద్ధి వహించిన శిల్పాచార్యులలో నాగార్జునాచార్యునిది అగ్రస్థానము. ఇతడు నాగార్జునునికొండకు 10 మైళ్ళ దూరమునందుగల పెందోట నగరమునకు చెందిన మహాశిల్పులవంశము లోని వాడనుటకు సందేహింప పనిలేదు. ఇతడు బాల్యముననే స్వనగర మును విడిచి యావద్భారత సంచారముచేసి, మహాపండితుడును, మహా శిల్పియునై బౌద్ధమతమును స్వీకరించి, అందు మహాయానశాఖను నెల కొల్పి మాధ్యమక బౌద్ధమునకు ప్రవర్తకుడై వాసికెక్కిన మహాచార్యుడు. అంతవఱకు శ్రీపర్వతమని వాసిగన్న పల్నాటిలోని కొండ ఇతని నివాసముచేత "నాగార్జునుని కొండ" అని ప్రసిద్ధిగన్నది. ఇక్ష్వాకుల అండదండలతో ఈ ఆచార్యుడు నాగార్జునునికొండ అభ్యుదయమునకు కృషి చేయుటయేకాక, అమరావతీ స్తూపము చుట్టును ప్రాకారమును కట్టించి, దానిని దివ్య శిల్పాభిరామము చేసినాడని కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతి చరిత్రవేత్తలు చెప్పుచున్నారు. ఇతడు ఎవరి ఆస్థానమునను ఉన్నవాడుకాడు. మతాచార్యుడు కాన, అందఱను శిల్ప మతాభ్యుదయములు చేయుడని ప్రోత్సహించుచు బహుగ్రంథములు వ్రాసినాడు. ఈ మహాచార్యుని చరిత్రమును "మహాయానము" అను నవలగా ఈ గ్రంథకర్త రూపొందించుచున్నాడు.

జయప్రభాచార్యుడు : మద్రాసు మ్యూజియములో శిథిలమైపోయిన ఒక బుద్ధ విగ్రహమున్నది. ఇది జగ్గయ్యపేట శిల్పములకు చెందినట్టిది. ఈ విగ్రహమునకు దిగువనున్న పద్మములో ఒకశాసనము చెక్కబడి యున్నది. దానినిబట్టి నాగార్జునాచార్యుని శిష్యుడు జయప్రభాచార్యుడు

అనియు, ఆతని యాజమాన్యముననే ఈ విగ్రహము నిర్మింపబడినట్లును "గుంటూరు మండల సర్వస్వము" 228 వ పుటలో వ్రాయబడియున్నది. బహుశః ఇతడే ఇక్ష్వాకురాజుల ఆస్థాన శిల్పాచార్యుడై జగ్గయ్యపేట, ఘంటసాల — మొదలైన తావులయందలి శిల్పములను వెలయించియుండునని ఊహింప వీలగుచున్నది

ఈ సందర్భమున ఘంటశాలలో కూడ అనేకులగు శిల్పాచార్యులు ఉన్నట్లు "ఘంటశాలాపురీ కలితపూర్వాంధ్ర శిల్పాచార్యులకు తల్లియైన యదియు" అనెడి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "ఆంధ్రప్రశస్తి" లోని పద్య పాదము వలన తెలియుచున్నది.

పదోజు, బమ్మోజు: *ప్రాచీనశాసన విమర్శనలనుజేయుచు శ్రీ కృష్ణశాస్త్రిగారు "హోలాలు" నందలి ఒక శిల్పాచార్యుని పేర్కొనిరి. ఆతడే బమ్మోజు శిల్పాచార్యుడు హోలాలునందలి అమరేశ్వరాలయమును నిర్మించినది ఈ ఘనశిల్పియే. ఈ ఆలయమునందలి శ్రీకర స్తంభములు ఎంతయో సుందరముగను, నిపుణముగను రచింపబడినవి. పదోజు శిల్పాచార్యుని ప్రియశిష్యుడే బమ్మోజు. "కలియుగ విశ్వకర్మ" యని ఈతడు వర్ణింపబడెను ఈయన అఱువదినాలుగు కళలను, శాస్త్రములను నేర్చి, అఱువదినాలుగు విధములగు నగరముల నిర్మాణమున కుశలుడై, నాగర, కళింగ, విశర, ద్రవిళములను నాల్గురీతుల భవన విశేషములను కల్పించిన మేటియట! కృష్ణశాస్త్రిగారీ విషయమును తెల్పుచు ఇట్లు కూడ వ్రాసిరి "64 విధములగు నగరములును, నాల్గువిధములగు భవనములును ఎట్టివో తెలియరావు. అయినను వాటి ఉదాహరణమువలన పదవ

---

* ఈ చరిత్రాంశము కీ. శే. నిరంజన శాస్త్రిగారు సంపాదించిన "ప్రబోధినీ" పత్రిక ఎనిమిదవ సంపుటమునుండి గ్రహింపబడినది.

శతాబ్దము నాటికే శిల్పము స్థిర శాస్త్రముగ ఏర్పడి గణనీయములగు సిద్ధాంతములతోడను, వివిధ విధానములతోడను వెలయుచుండెనని తెల్లమగుచున్నది."

బమ్మోజు కలియుగ విశ్వకర్మ యని ఆనాటి శిల్పులలోను, శాస్త్రకారులలోను, మహారాజుచే గౌరవింపబడినాడన్నచో, అతని శిల్ప కౌశలము, శాస్త్రపరిశ్రమ ఎట్టిదని చెప్పగలము! ఇంతటి మహాచార్యునకు గురువైన పదోజు శిల్పాచార్యుడు ఎంత మహత్తరుడు!

అలంపురములోని నవబ్రహ్మేశ్వరాలయములను నిర్మించిన కొందఱు శిల్పాచార్యుల పేర్లు అదృష్టవశమున ఆ దేవాలయముల కుడ్యములమీద చెక్కబడి యున్నవి. వారు రసాది తంత్రసిద్ధులను పొందిన శైవమహాపురుషులని వారి నామధేయములు సూచించుచున్నవి. బాల బ్రహ్మేశ్వరాలయమునకు బహిఃప్రాకారమును నిర్మించిన శిల్పి ఈశానాచార్యుడు. క్రీ. శ. 712 లో చాళుక్య విజయాదిత్యుడు దీనిని కట్టించి, ఈశానాచార్యుని గొప్పబహుమతులతో సత్కరించినాడట! ఇక్కడ ఒక్కొక్క దేవాలయమును ఒక్కొక్క శిల్పి తన ప్రధానాచార్యత్వమున నిర్మించినట్లు తెలియుచున్నది. వారు — శ్రీకంఠాచార్య, మారదూర, సంసారభీత, లోకభీత, శ్రీమారనయన ప్రియన్ — మొదలగువారు. ఇందలి చివరిశిల్పి, తమిళుడని ఊహింపవచ్చును. ఆ నాటి శిల్పాచార్యులు, శైవగురువులు కులభేదములను పాటింపక సమదృష్టితో శిల్పకళాభ్యుదయములకు పాటుపడినారు.

కారెంపూడి శిల్పులు : "పాడుగ్రామే బదిత టాకదక్షిణభాగే ఆదిత్య నిర్మిత దేవప్రాసాదాయ నాపోజు లపోకోజు తిప్పోజు నామ్నే శిల్పికాచార్యాయ దేవప్రతిష్ఠావేళాయాం సింధుమాన్యరూపతయా నివర్తన షష్టి పరిమితాం ప్రాదాత్—

శ్లో. బ్రహ్మాబ్రహ్మసుతః ప్రయోగనిపుణా జీవన్తి యద్విద్యయా
విశ్వంయస్య బభూవ కర్మసతతోయో విశ్వకర్మాఽభవత్,
తిగ్మాంశోః శ్వశుర స్తమేవ తరణిం సంరోప్య చక్రభ్రమౌ
చక్రే చక్రముఖామరాయుధవరా న్వ్యాచ్ఛిన్న తత్తేజసా.

శ్లో. తద్వంశే తత్సమో జాతో ఉల్లపాచార్య సంజ్ఞకః
బాణాచార్య స్సుత స్తస్య తద్వంశాంభోధి చంద్రమాః.

శ్లో. నాగాచార్య స్సుత స్తస్య సూత్రధారీ శుభావహః
ద్వితీయః పోకనాఖ్య స్తు తృతీయ స్త్రిపురాంతకః.

శ్లో. లింగేఽథ ప్రతిమాసు చాతినిపుణా స్తత్తత్ప్రయోగేషుచ
ప్రాసాదేషు చతుర్విధేష్వథ నిజై ర్భేదై రసంఖ్యేష్వపి
వాస్తుక్షేత్రవిదః ప్రశ స్తవచన శ్శ్రీభద్రహస్తా శ్శుభాః
నిర్వోఢార ఇమే త్రయోపి సతతం ప్రారబ్ధకార్యాదరాః

హాలమోజన జిల్లోజన ఛాత్రరుసాపోజునుం తిప్పోజును మల్లియ సూత్రధారిగళ్.

శ్లో. శాకాబ్దే శరవహ్నిఖేందుగణితే జ్యేష్ఠాభిధే వై జయే
మాసే నాగదినే సితే భృగుయుగే మేడాంబికానందనే
పృథ్వీం శాసతివీరకామనృపతౌ శక్రేందుతుల్యక్రమే
నాగ స్తంభ సమున్నతిం సదుచితా మాదిత్య నామాకరోత్.

—నాపోజు తిప్పోజు సూత్రధారౌ."

ఇది గుంటూరు మండలమునందలి మాచర్ల దేవాలయమునందుకల శిలాశాసనము. సంగ్రహముగా దీని తాత్పర్య మిది. "పాడుగ్రామము దగ్గఱ బదితటాకమునకు దక్షిణభాగమున ఆదిత్యనిర్మిత దేవప్రాసాద

మూర్తి ప్రతిష్ఠాసమయమున నాపోజు లపోకోజు తిప్పోజు నామకశిల్పాచార్యునకు సింధుమాన్య రూపముగ అఱువదియెకరముల భూమి ఒసంగబడెను.

ప్రయోగనిపుణులగు బ్రహ్మయు, బ్రహ్మసుతుడును ఏ(శిల్ప)విద్యచే కాలము పుచ్చుచున్నారో, ఏశిల్పవిద్యచే విశ్వమంతయు కర్మభూయిష్ఠమాయెనో, అట్టి శిల్పవిద్యకు నాయకుడును, సూర్యుని మామయునగు విశ్వకర్మ సూర్యునిచక్రమునవేసి తఱిమెన పట్టగారాలిన ఆతేజపుపొడితో దేవతలకు చక్రము మున్నగు ఆయుధముల నొనర్చెనో, అట్టి విశ్వకర్మ వంశమున ఆయనతో సమానుడగు ఉల్లపాచార్యుడు జన్మించెను. ఆయనకు బాణాచార్యుడును, బాణాచార్యునకు నాగాచార్యుడను సూత్రధారియు, పోకన, త్రిపురాంతకులు నను ముువ్వురు కొమరులు గల్గిరి. వీరు లింగ నిర్మాణము నందును, ప్రతిమలను నిర్మించుటయందును, వాని ప్రతిష్ఠా విషయముననుగడునేర్పరులు. నాల్గువిధములగు ప్రాసాదములందును, ఇంక ననేక భేదములతో గూడిన వాస్తు శిల్పరచనలయందును సమర్థులు. వాస్తుక్షేత్ర పరిజ్ఞానముగల్గి, ప్రశస్తవాక్పాండిత్యము గలవారై సంపచ్ఛుభములగూర్చు హస్తనైపుణ్యముతో నొప్పుచు ప్రారంభించిన పనులను నిర్వహించుటలో కుశలులై యీ ముగ్గురును బ్రకాశించుచుండిరి.

శాలివాహనశకము 1035 విజయసంవత్సర జ్యేష్ఠ శుక్లచతుర్థి శుక్రవారమునాడు మేడాంబిక కుమారుడు వీరకామరాజు రాజ్యమేలు కాలమున ఆదిత్యుడు నాగస్తంభమును స్థాపించెను.'' ఈ శాసనమువలన క్రీ. శ. 1113 వ సంవత్సరము నాటి సుప్రసిద్ధ శిల్పాచార్యులు మూర్తి ప్రతిష్ఠాకాలమున రాజులచే మాన్యక్షేత్రాది సత్కారములను స్వీకరించి పూజింపబడుచున్నట్లు తెలియుచున్నది.

జక్కణాచార్యుడు: క్రీ. శ. 13 వ శతాబ్దిలో కన్నడదేశమున జైన మతస్థుడగు హొయసల వీరబల్లాణుడు రాజ్యమేలు చున్నపుడు జక్కణాచార్యుడను మహాశిల్పి సుప్రసిద్ధుడై చెన్నొందెను. మగధనుండి కన్యాకుమారివఱకు ఆ కాలమున ఈయన చేయి తగులకుండ నిర్మింపబడిన దేవళములేదు ముఖ్యముగా దక్షిణ దేశమునందు సోమనాథపురము, హళేబీడు, బేలూరు మున్నగు పలు తావులందుగల జగన్మోహన శిల్పములు ఈ మహాచార్యునిచే నిర్మింపబడినవే.

వైష్ణవమతమును విస్తరింపజేసిన రామానుజాచార్యుడు జక్కణాచార్యుని సాహచర్యమును సంపాదించి, మతవిస్తరణములో ఆతని శిల్ప సహాయమును పడసెను వీరబల్లాణుని వైష్ణవు నొనర్చి, ఆయనకు విష్ణువర్ధనుడను క్రొత్తపేరుపెట్టి పెక్కు వైష్ణవాలయములను నిర్మింప జేసెను. ఆ యాలయములన్నియు జక్కణాచార్యునిచే నిర్మితములయినవే. జక్కనవలె ఆతని కుమారుడును లోకోత్తరశిల్పియై అనేక నిర్మాణముల నొనర్చి తండ్రికికూడ పరాజయము నొడగూర్చెనని ఉదంతములు కలవు.

భోజరాజు నాస్థానమున సమరాంగణసూత్రధారుడును, కుంభరాణా కొలువున మండనసూత్రధారుడును కలరని చదివియే యున్నాము. విద్యారణ్యుల కాలమున హరిహరబుక్క భూపాలురవద్ద గాయత్రీ పీఠాధిపతియైన నాగనాచార్యుడుండి విద్యానగర నిర్మాణ మొనరించినాడు.

శిల్పములో "దశక్రియా పరిజ్ఞానము" అనునది ఒక మహాశిల్పాచార్యలక్షణముగా అగపడుచున్నది. అట్టి దశక్రియా పరిజ్ఞాతలగువారు శాసనములందును, విశ్వకర్మపురణాదులయందును పెక్కురు అగపడుచున్నారు. అట్టివారిలో పాటూరిని పరిపాలించిన విశ్వబ్రాహ్మణ ప్రభువగు బసవాపాత్రుడును, ప్రౌఢదేవరాయల ఆస్థానమునందు కవిగను,

ధర్మాధికారిగను ఉన్న గాయత్రీ పీఠాధిపతి ముమ్మనాచార్యుడును గణనీయులు.

కన్నడ శిల్పులు : దక్షిణదేశమున - అందును కర్ణాటకమునకు చెందిన కొందఱు శిల్పాచార్యుల నామధేయములు శాసనములందు అగపడుచున్నవి. 1—10—945 వ తేదిగల "అరుణోదయ" పత్రికలో శ్రీ చిట్టావూరు నాగభూషణాచార్యులుగారు "దక్షిణదేశపు ప్రాచీన శిల్పాచార్యులు" అని ఒక వ్యాసమును వ్రాసినారు. అందుండి కొందఱి నామ బిరుదాదికములు ఇక్కడ ప్రస్తావింపబడుచున్నవి.

1. విశ్వకర్మాచార్య:- క్రీ. శ. 7 వ శతాబ్దిని దక్షిణమున కొంతభాగమును పాలించిన గంగవంశరాజుల ఆస్థాన శిల్పాచార్యు డీతడు. తన శిల్ప చిత్రకళాచాతుర్యముచే ఎల్లరిని మెప్పించి "సర్వకలాధారభూత చిత్ర కళాభిజ్ఞ" బిరుదము నందినవాడు. ఈతని శిల్పచిత్రములు మైసూరు చిత్ర వస్తు ప్రదర్శనశాలయందు కలవు.

2. పల్లవాచార్య :- (క్రీ. శ. 7 వ శతాబ్ది) ఇతడు విశ్వకర్మాచార్యుని సమకాలీనుడు. దేవమూర్తి దేవాలయముల నిర్మాణమున కడు సమర్థుడు. దాక్షిణాత్య దేవాలయశిల్పములు అనేకములు ఈతని రచనములే!

3. ధనపత్యాచార్య :— గొప్ప చిత్ర లేఖకుడు. ఎంగ్రేవింగుపనిలో నిపుణుడు. 8 వ శతాబ్దిని 'నో ల ం బ' భూపాలుని కొలువున ఉండెడివాడు.

4. శిల్పి మధురోజ : ఇతడు క్రీ. శ. 828 ప్రాంతమునగల సుప్రసిద్ధ శిల్పాచార్యుడు. 'ఓజ' (ఒజ్జ) పదము ఆచార్య శబ్దమునకు పర్యాయ పదముగా వాడబడినది.

5 వర్ధమానాచార్య :— 1118 వ సంవత్సరమునాటి యీతడు మహాశిల్పి హొయలాచార్యుని కుమారుడు. ఇతనికి పెక్కు బిరుదములు కలవట.

6. గంగాచార్య — కామరాచార్య శిల్పిసోదరులు : 1229. వీరు గొప్ప శిల్పకలాకుశలులై, అప్పటి జైనగురువగు శుభచంద్ర సిద్ధాంతదేవునిచే బలవంతము చేయబడి ఆయనకు శిష్యులైనారట.

7. బేలూరి దేవాలయ నిర్మాతలు :— 1117. దాసోజు, తత్పుత్రుడు చావన్నాచార్య, చిక్కహంపాచార్య, మల్లియన్నాచార్య, మాయనాచార్య, కుమారమాచార్య, పదిరిమల్లోజ, కెంచ మలియన్నాచార్య, మసదాచార్య, వీరాచార్య, నాగోజు అనువారలు. వీరిలో చావన్నాచార్యునికి "రూపకారి మదన మహేశ" అనియు "రూపకారి శరభ భేరుండ" అనియు బిరుదులు కలవు. చిక్కహంపాచార్య - మల్లియన్నాచార్యులిద్దఱును త్రిభువనమల్లదేవ విష్ణువర్ధన మహారాజుగారి ఆస్థాన శిల్పులని వ్రాయబడినది. వీరి శిల్పములందు—భావోన్మీలనము, రసపుష్టి, ఆధ్యాత్మికతేజము, రేఖావిన్యాసము, రచనానైపుణ్యము — అనుపమానములని పేర్కొనబడినది. పదరిమల్లోజకు "రూపకారి గళగండ గత్తెర" బిరుదు ఉన్నది. వీరికి ప్రధానాచార్యుడు జక్కణాచార్యుడని ఇందు వ్రాసినట్లులేదు.

8. హొయసలేశ్వరాలయ నిర్మాతలు : 1141. బల్లన్నాచార్య, బోచన్నాచార్య, దాసోజు, కాళిదాసాచార్య, కేదారోజ, దేవోజ, మానాచార్య మొదలగువారు. వీరిలో కాళిదాసాచార్యుడు మకరతోరణ నిర్మాణమున ప్రతిభాశాలియట. దేవోజ కేదారేశ్వరాలయ నిర్మాత యని వ్రాయబడినది.

9. కలియుగ విశ్వకర్మ, మహాశిల్పి మాచోజ: 1159. ఆనాటి శిల్పులలో ఈతడు అగ్రగణ్యుడు. అనేక జైనాలయములు ఇతనిచే నిర్మితములట.

10. మల్లితమ్మయాచార్య: 1249. ఇతడు 16 ఏండ్ల వయస్సుననే అమృత పురమున అమృతేశ్వర దేవాలయ నిర్మాత యైనాడు. ఇతడు యోగ శక్తిచే నూటేండ్లు జీవించి శతాధిక దేవాలయములు నిర్మించి ప్రశస్తి గనినాడట; తన 72 వ యేట సోమనాథపుర దేవాలయము నారంభించి 88 వ సంవత్సరమువఱకు పనిచేసిన శిల్పోపాసకుడు. ఇతనికి సహ శిల్పులుగా పనిచేసినవారు — చౌడయాచార్య, భ్రమరాచార్య, తమ్మాచార్య, నంజయాచార్య ప్రభృతులు.

11. జక్కణాచార్య :— 1260. మూలశరభేశ్వర దేవస్థాన నిర్మాతగ ఇతడు పేర్కొనబడినాడు హొయసల వీరభల్లాళుని, కాలమున వెలసిన ఆలయము లన్నింటను ఈతని చేయి తగిలియే యున్నదట. జక్కణాచార్యులు ఇద్దరు ముగ్గురు ఉన్నట్లు తెలియుచున్నది.

12. మల్లోజ—మానియోజలు;— 1113. మైసూరులోని సుప్రసిద్ధ మహ లక్ష్మి దేవాలయమును నిర్మించిన శిల్పులు వీరు. వీరు విశ్వకర్మ భగవానుని శక్తిని పుణికి పుచ్చుకొని పుట్టినారని ప్రశంసింపబడినారు. వీరికి శిల్పశాస్త్రములన్నియు కంఠస్థములేయట. ఈ శిల్పులందఱును కన్నడ దేశమునకు - అందును ఆనాటి మైసూరు ప్రాంతమునకు చెందినవారుగనే అగపడుచున్నారు. వీరు తమ పేర్లను ప్రకటించుకొని శిల్పులకు మార్గదర్శకు లయినారని చెప్పవచ్చును.

నేటికాలమున కర్ణాటకమున — బెంగుళూరు, మైసూరు, నాగ మంగళములందు అనేకులు శిల్పులు సుప్రసిద్ధులై ఉన్నారు. వారిలో మైసూరునందలి శ్రీమహాదేవస్వామియు, బెంగుళూరునందలి శ్రీశ్యామా

చార్యులుగారును సహస్రాధిక శిల్పములు నిర్మించి గణుతికెక్కినవారు. మహాదేవస్వామి పీఠాధిపతి కూడను.

రామప్ప : ఇతడు ఆస్థానశిల్పి అగునో కాదో తెలియదుకాని, పాలంపేటవద్ద శిల్పాభిరామమైన రామలింగేశ్వరాలయమును నిర్మించినాడు. ఇది రామలింగేశ్వరాలయ మైనను, రామప్పశిల్పి శిల్పవైభవ విశేషము చేత రామప్ప దేవాలయ మనియే ప్రసిద్ధమైనది. ఈ రామప్ప దేవాలయమునుగూర్చి "శి ల్ప క ళా క్షే త్రా లు" 2 వ భాగమున చదువవచ్చును. రామప్పనుగూర్చి తెలుగు దేశమున ఎన్నోకథలూ, గాథలూ వ్యాపించి యున్నవి. అభినవమురారి కవిరాజశేఖర శ్రీ దురిశేటి వెంకటరామాచార్యులుగారు రామప్పకథను "శి ల్ప శ్రీః" అను పేర సంస్కృత కావ్యముగాను, శ్రీ శోభిరాల సత్యనారాయణ M. A. గారు "రాగమయి" అను పేర ఆంధ్ర పద్యకావ్యముగాను వ్రాసియున్నారు.

శ్రీ ఎఱ్ఱోజు మాధవాచార్యులుగారి పూర్వులు నూ జి వీ టి ఆస్థాన శిల్పాచార్యులుగానే రాణించినారని ఆచార్యులుగారు ప్రకటించిన "శోభనాద్ర్యాచార్య వైభవము" అను గ్రంథమునుబట్టి తెలియుచున్నది. ఈ పద్మనాయక ప్రభువుల ఆస్థానములు అనేక విశ్వబ్రాహ్మణ శిల్పాచార్యులకు నెలవులని ఎన్నియో కథలవలనను తెలియుచున్నది.

నన్నయభట్టు కాలమున రాజరాజనరేంద్రుని ఆస్థానశిల్పాచార్యుడై నందంపూడి శాసనము చెక్కిన గుండాచార్యుడు, శ్రీమదనంత చోడగంగ దేవునికి శిల్పాచార్యుడై తెంబూరు తామ్రశాసనమును చెక్కిన చాళుక్య గంగాచార్య జామాత (అల్లుడు) మాంకనాచార్యుడు, (చూడు : 1938 ఆగష్టు భారతి పత్రిక) శాసనములలో పేర్కొనబడిన–జక్కన, మారన, బయ్యనలు ప్రాతస్స్మరణీయులు ! "శాసనాధారములను అనుసరించి

ప్రఖ్యాత శిల్పులైన జక్కన, మారన, బయ్యనలు - తెలుగువారేననీ — కాకతీయరాజ్యంలోని వారేననీ చెప్పక తప్పదు." ("ఆంధ్ర జ్యోతి" దిన పత్రిక 6-7-75 లో టి. రాజేశ్వరరావుగారి వ్యాసం) ఇంకను "దక్షిణ దేశపు శాసనములలో దర్శనమిచ్చుచున్న శ్రీశైలాచార్యుడు, శ్రీమతు మల్లాచారి, పోతోజు, చాళుక్యసుందరయాచార్యుడు, చెన్నాచార్య, రాజనాచార్య, మారాచార్య, నాగోజు, కోసూరి పాపయ, పర్వతాచార్య, సరణోజ, రామాచార్య, యన్నాచార్య, కొమరాచార్య, నాగాచార్య, లోకాచార్య, ప్రోలాచార్య, అయ్యమాచార్య, భీమాచార్య ప్రభృతులు వందలసంఖ్యలో శాసనములయందు పొడకట్టుచున్నారు. ఈ శిల్పు లందఱనుగూర్చి ప్రత్యేక గ్రంథము వ్రాయవలసి యున్నది.

"దక్షిణదేశపు శాసనములు" 438 వ పుటలో నెం. 1293. శా.శకం. 1685 — శంకరాచార్యుడనెడి శిల్పి కనబడుచున్నాడు —

"శ్రీశంకరాఖ్యం రథకారమాశు
సమాహ్వయామాస సురామతీర్థాత్,
తేనైవ సర్వోత్తమ శిల్పసంవిదా
స కారయామాస సులక్ష్మణాకృతిమ్."

రామతీర్థమనెడి గ్రామమునుండి శంకరుడను శిల్పిని పిలిపించి శ్రీ కూర్మక్షేత్రములో లక్ష్మణస్వామిమూర్తిని నిర్మింపజేసినట్లు దీనినిబట్టి తెలియుచున్నది. దిగువపద్యమునుబట్టి ఆ శిల్పి వాకలపూడి శంకరాచార్యు డని గ్రహింపవచ్చును.

క॥ కాకుత్స్థవంశజానుజు
చేకొని హరిభక్తు లెల్ల సేవించుటకై
శ్రీకూర్మ క్షేత్రంబున
వాకలపుడి శంకరుండు వరుస సృజించెన్."

"మండరాజు శాసనము క్రీ. శ. 1118. ఇందు మండరాజు మహా ప్రధాని విశ్వకర్మ కులజుఁడు సూరుడని యున్నది—

చ॥ తన విభవంబు లోకవిదితంబుగఁ బ్రోచిన మండధారుణీ,
జనపతి ప్రస్తవంబున, భృశస్థితి నబ్బెజవాడ నన్యసా
ధన సుభటావళిం దునిమి తమ్ములు దానును బోరిలోనఁ బే
ర్కొని గెలిపించె నాఁడు నధికుండగు సూరుడు శౌర్యసారుఁడై."

—"ఆంధ్రప్రభ" దినపత్రిక. 24—11—68 ఆదివారం సంచిక.

ఈ సూరనాచార్యుడే కాక, ఆతని తమ్ములును అరివీరభయంకరులై యుద్ధము చేసినట్లు ఈ పద్యమువలన స్పష్టమగుచున్నది. వీరు ఆను వంశికముగా వచ్చిన శిల్పవిద్యలోకూడ ఘనులై యుందురని ఊహించు టలో దోషముండదు. ఈ విధముగా ఎందఱో శిల్పాచార్యులు ప్రధానులు, సేనాధిపతులు, దండనాయకులు – అయి యున్నారన్న సంగతులు ఎందఱకు తెలియును? కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఎందఱెందఱు శిల్పాచార్యుల చరిత్రములనో తాను సేకరించి యుంచినట్లు ఒకతూరి చెప్పియున్నారు. పెందోటను పాలించిన మార్కండేయ ప్రభుని చరిత్రమును, పాటూరి ప్రభువుల ఉదంతమునుగూర్చి ఈ గ్రంథకర్త భారతి పత్రికలో రెండు వ్యాసములను ప్రకటించియున్నాడు.

శ్రీకృష్ణదేవరాయల కాలమున ఒెంకణాచార్యుడు, పురుషోత్తమ స్థపతి - అను మహాశిల్పులు కలరు. ఒెంకణ తన శిల్పకౌశలముచే కృష్ణరాయని మెప్పించి రత్నహారమును బహుమానముగా పడసిన లోకోత్తరుడు. నాగలాపురము, లేపాక్షి, సోమపాళెము మున్నగు తావులయందలి మహాశిల్పములు ఈ ఆచార్యద్వయముచే నిర్మితములైనవే. వీరి చరిత్రములను లేపాక్షి, మోహనాంగి నవలలో చదువగలము.

అరుణాచలాచార్యుడు : ఈతడొక మహాశిల్పి. నెల్లూరు మండలమునందలి వెంకటగిరిలోని విశ్వేశ్వరాలయము ఈతడు నిర్మించినదే. ఇందలి శిల్పము సౌందర్యోజ్జ్వలమై ఈతడొక శాస్త్రవేత్తయగు మహాశిల్పియని తెల్పుచున్నది. ఈతనిపేరు ఆ దేవాలయమున ఒక ఱాతి పలకపై చెక్కబడియున్నది. అనర్ఘ రాఘవ నాటకకర్తయగు మురారి గొప్ప శిల్పియైనట్లు ఆతని గ్రంథములోని చిహ్నములనుబట్టి తెలియుచున్నది. తిరువళ్లూరు శిల్పి, వేమన గురువగు అభిరామయ్య, తరిగొండ వేంకమాంబ గురువగు సుబ్రహ్మణ్యుడు, మంగళగిరి-సింహాచల ప్రతిష్ఠాతలు, కాంస్యకారవీరులు మొదలగువారినిగూర్చియు, వారి శిల్ప ప్రతిభను గూర్చియు ఎన్నియో కథలను సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు వాటిలో కొన్నిమాత్రము గ్రంథస్థములు. తక్కినవాటి విషయమున గ్రంథకర్తలు శ్రద్ధ పూనకున్న శిల్పులకును, దేశమునకును ఎగ్గుచేసిన వారగుదురు. పరిశోధనలు చేసిన ఇంక కొందఱు శిల్పుల నామములైనను దొరకగలవు.

సిద్ధలింగేశ్వరస్వామి : ఈయన మైసూరు మహారాజాస్థాన శిల్పాచార్యుడు. శిల్పశాస్త్రములో అఖండపాండిత్యము ఉన్నది. చిత్ర శిల్పమునందును, శిలాశిల్పమునందును సాటిలేని కౌశలము కలవాడు. అమెరికా, ఇంగ్లండు మున్నగు దేశాంతరములలోగూడ వీరి కీర్తి వ్యాపించినది. వేదాంతశాస్త్రములో అందెవేసినచేయి. ఆచరణములో సనాతన శిల్పర్షులను పోలినవాడు కావుననే యోగానుష్ఠానాది విషయములందు మహారాజునకు ఉపదేశకుడును కాగల్గెను. ఈ మహాశిల్పిలో ఉత్తమ శిల్పాచార్యుని లక్షణము లన్నియు కాంచగలము. మైసూరు సంస్థానమునకు శిల్పముచే వీరు చేకూర్చిన వన్నె చిన్నెలనుగూర్చి కొన్ని కథలును కలవు.

ఫణిభూషణాచార్యులు : సుప్రసిద్ధ శిల్పాచార్యులగు తక్కెళ్ళపాటి వీరేశలింగముగారి కుమారుడు. ప్రకాశంజిల్లా కొప్పెరపాడు నివాసియగు ఈయన ఆంధ్రదేశములో వన్నెకు వాసికి ఎక్కిన మహత్తర శిల్పాచార్యుడు వేదశాస్త్రములను పుక్కిలించి, అరిపండితుల గుండెలు అదఱునట్లు శాస్త్రవాదము చేయగల ధీమంతుడు. పెక్కుతావుల వాదములు సల్పి గెలుపొందెను. వీరి శిలాశిల్పము, దేవాలయ, గోపుర, ప్రతిమానిర్మాణాది చాతుర్యము ప్రశంసనీయములు. వీరు కీర్తిశేషులైన పిమ్మట, వీరి వంశమునకే చెందినవారును, తద్గ్రామ నివాసులును అగు శ్రీతక్కెళ్ళపాటి షణ్ముఖాచార్యులుగారు దేవాలయశిల్ప నిర్మాణమున ప్రసిద్ధులైనారు. వీరికి వలసిన శిల్ప, వాస్తు, జ్యోతిర్విజ్ఞానమును కలదు. ఇంకను ఆంధ్రదేశములో కీ. శే. నూతలపాటి నరసింహచౌదరి, శ్రీధూపాటి హనుమత్ స్థపతి(సత్తెనపల్లి)మొదలగువారును సుప్రసిద్ధులే. తంజాపురమున శ్రీ కాణా వెంకటరమణ స్థపతి అద్భుతమగు శాస్త్రజ్ఞానముగల శిలా శిల్పాచార్యుడు. బొంబాయిలో నందలాల్ సీతారాం (పుత్లీవాలా) అను శిల్పి విగ్రహ నిర్మాణమున కడు కుశలుడు.

## వర్తమాన శిల్పులు

దుర్గిగ్రామ శిల్పులు : అమరావతీ నాగార్జునుని కొండల శిల్పములను తీర్చుటకు దివ్యశిల్పులను అందించిన "పెందోట" పల్నాటి సీమకు చెంగటిదే. అట్టి పల్నాటి సీమలో నాటికీ నేటికీ శిల్పులకు కొదవ లేకున్నది. పల్నాటి ప్రాంతమునందు నేటికిని 'పెందోట' 'నాగార్జున' అను ఇంటి పేర్లు కలవారు శిల్పబ్రాహ్మణులలో పెక్కురు ఉన్నారు. కార్యమపూడి శిల్పుల వృత్తాంతమును చదివియే యున్నాముకదా! ఈనాటికిని మహాశిల్పాచార్యులకు నెలవుగానున్నగ్రామము దుర్గి. ఇక్కడ ఉన్న శిల్పులు నివురుగప్పిన నిప్పులు. తమ శిల్పములకు, తమకు సరియైన

ఆదరణ ప్రోత్సాహములు లేక వీరు ఎన్నో ఇక్కట్లకు గుఱి యగు చున్నారు. ఇచ్చటి శిల్పులలో ఎన్నదగినవారు శ్రీ ఈశ్వరరక్షమా చార్యులుగారు. వీరు దేవాలయ శిల్ప నిర్మాణములయందు అసమాన ప్రజ్ఞ కలవారు. వీరి సహశిల్పులుకూడ అట్టివారే నరసరావుపేట తాలూకాకు చెందిన శ్రీ సిద్ధి వేంకటేశ్వరస్థపతిగారు కూడ శిలాకళయందు మంచినేర్పు గలవారు. వీరికి న ం దు ల ను చెక్కుటలో ప్రత్యేక ప్రావీణ్యము కలదు.

ఆళ్ళగడ్డ శిల్పులు : ఆంధ్రప్రదేశమున అహోబల క్షేత్రము సుప్రసిద్ధమైనది. ఇక్కడి శిల్పములుకూడ ఎన్నదగినవే. ఈ ఆలయమున కొన్ని శిల్పములను నిర్మించినవారు ఇప్పటి ఆళ్ళగడ్డ శిల్పుల పూర్వులు. అంతేకాదు, రామేశ్వరములోకూడ వీరి పూర్వులు శిల్పనిర్మాణము చేసినారట. వీరి మొదటి నివాసము కర్నూలు జిల్లాలోని "గుంపరమానుదిన్నె". అటనుండి వచ్చి, ఆళ్ళగడ్డలో వీరు స్థిరపడినారు. వీరు నలుగురు సోదరులు. 1. వీరభద్రాచార్యులు, 2. వీరాచార్యులు, 3. బాలవీరాచార్యులు, 4. పోతులూరయాచార్యులు. వీరు సుపర్ణ ఋషి గోత్రులు. శిలాశిల్పమున అగ్రగణ్యులు. అందఱును మహాశిల్పులని చెప్పదగిన ప్రతిభా సంపత్తి కలవారే. వీరి శిల్ప ప్రతిభ చాగలమఱ్ఱి, మహానంది, శ్రీశైలము, బ్రహ్మంగారిమఠము, జమ్మలమడుగు, రాజంపేట, ఆళ్ళగడ్డ, నంద్యాల, గిద్దలూరు, తాడిపత్రి — మొదలగు ప్రదేశములలో ఎన్నెన్నో దేవాలయ, గోపుర, మండపములను—దైవమూర్తులను నిర్మించి వన్నెకెక్కినది. స్తంభశిల్పములో వీరిది అగ్రస్థానమని చెప్పవచ్చును వీరిలో అగ్రజుడు వీరభద్రాచార్య మహాశిల్పి కొలదికాలము క్రిందటనే పరమపదించినారు. శ్రీ బాలవీరాచార్యులుగారుకూడ అన్నగారియంతటి మహాశిల్పియే. ఈయన ఆళ్ళగడ్డలో ''శారదా శిల్పకళామందిరము''ను నెలకొల్పి ఎందఱకో శిక్షణ

ఇచ్చుచున్నారు. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వీరిని ప్రభుత్వము సన్మానించినది. ఈ సోదరులు నిర్మించిన శిల్పములు ఆంధ్రప్రదేశేతర రాష్ట్రములకు - బొంబాయి మొదలైన తావులకుగూడ పోయి, కళావిమర్శకుల మన్ననలను అందుకొన్నవి. వీరిలో ద్వితీయ చతుర్థులు అర్ధాయుష్కులై ఈశ్వర సాయుజ్యమును అందుకొన్నారు. వీర భద్రాచార్య బాలవీరాచార్యుల కుమారులుకూడ తండ్రులయంతటి శిల్పులు అగుట అదృష్ట విశేషము. ఆళ్ళగడ్డ శిల్పులనుగూర్చి 5–6–1960 వ తేది ఆంధ్రప్రభలో విస్తృతమగు వ్యాసము వెలువడినది.

పెంబర్తి శిల్పులు : తెలంగాణమునందలి పెంబర్తి గ్రామము ఇత్తడి, కంచు - మొదలగు లోహములతో చేయు శిల్పములకు ప్రశస్తి కాంచినది. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున కళాకారులకు బహూకరింపబడిన శిల్ప ఫలకములు వీరు నిర్మించినట్టివే! వీరిలో అయిలాచార్యులుగారు మేటిశిల్పియై కళాభ్యుదయమునకు ఎంతగానో పాటుపడుచున్నారు. కరీంనగరములో కొంతకాలముక్రిందట వెండితీగతో జిలుగుపనులు చేసెడి శిల్పులు కొందఱు వెలసినారు. వారు చేసిన తీగ శిల్పములుకూడ భారతదేశమునందేకాక, తదితర దేశములందును వ్యాపించి, మనదేశమునకు కీర్తిని సంపాదించి పెట్టినవి.

మైలాపూరు శిల్పులు : తిరుపతికి సమీపమునగల తిరుచానూరు (అలిమేలు మంగాపురము) సుప్రసిద్ధ శిల్పాచార్యులకు పుట్టినిల్లు. పూర్వ కాలమున అచ్చట కాళహస్తివా రనెడి గృహనామముగల శిల్పులు ఉండెడివారు. వీరు కశ్యపబ్రహ్మఋషి గోత్రజులు. వీరొకప్పుడు కాళ హస్తిలో నివాసముండి శ్రీకాళహస్తీశ్వరాలయ శిల్పములు చేసినందున "కాళహస్తివారు" అనెడి ఇంటిపేరుతో పిలువబడ జొచ్చినారు. పిమ్మట

వీరు తిరుచానూరుకువచ్చి శిల్పములు చేయుచుండెడివారు.తరువాత ఈకాళ హస్తివారు చెన్నపురియందలి మైలాపూరునకు ఆహూతులై అచ్చటి కపాలేశ్వరస్వామికి సర్వాంగ, వాహన, గోపుర, ప్రాకారాదులు నిర్మించినారు. అంతియే కాక, చెన్నపట్టణమునకు చుట్టుప్రక్కలనున్న దేవళములకు కూడ అనేక శిల్పములను నిర్మించినారు నాటినుండి కాళహస్తివా రనెడి వీరి యింటిపేరు మైలాపూరువారుగా మాఱిపోయినదట. ఇది దాదాపు 2, 3, శతాబ్దములనాటి కథ।

వీరి పూర్వులలో మైలాపూరు పంచాక్షరాచార్యులుగారు కార్వేటి నగర సంస్థాన శిల్పాచార్యులై రాజసత్కారముల నందినారు. అట్లే తారకేశ్వరాచార్యులుగారు కాంచీపురసంస్థాన శిల్పాచార్యులై సింహలలాట, గండపెండేరాది సత్కారములను అందియున్నారు. పిమ్మట మైలాపూరు శిల్పులలో కొందఱు చెన్నపురమునుండి మఱల ఆంధ్రదేశమునకు వచ్చి, నూజివీటికి చెందిన శనివారపుపేట జమీందారుగారివద్ద ఆస్థాన శిల్పాచార్యులైనారు. ఇంతటి గౌరవముగల సద్వంశమున జన్మించినవారే ఈనాడు విజయవాడలో ప్రకాశంబరాజ్‌వద్ద-కనకదుర్గాలయ సమీపమున, "గంగాధర శిల్పశాల"ను నెలకొల్పి శాస్త్రీయముగా శిల్పరచనము చేయుచున్న మహాశిల్పి శ్రీ మైలాపూరు శివగంగాధరాచార్యులుగారు. వీరు జగన్నాథాచార్యులు, షణ్ముఖాచార్యులు, శివగంగాధరాచార్యులు — అని ముప్వురు సోదరులు. పెద్దవారు ఇరువురును కీర్తిశేషులైనారు. శ్రీ శివగంగాధరాచార్యులుగారు తమ శిల్పశాలలో శిల, కంచు, ఇత్తడి, వెండి, పంచలోహము-మొదలగువాటితో దేవాలయములకు సంబంధించిన మూలవిరాణ్మూర్తులను, ఉత్సవ విగ్రహములను, సర్వాంగములను, వాహనములను, ఇంక పోతపనులు, నగిషీపనులు - మొదలగునవి అన్నియు చేయుచుందురు. వీరికి అనుచరులుగా వీరి అన్నకుమారుడు

చి॥ వెంకటజగన్నాథాచార్యులును, శ్రీ వేముల శ్రీనివాసరావుగారును తోడ్పడుచుందురు. వేములవారు వితక్షబ్రహ్మఋషిగోత్రులు. విజయవాడ లోని సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ వేముల కామేశ్వరరావుగారు శ్రీనివాస రావుగారికి పినతండ్రియే.

గంగాధర శిల్పశాలనుండి ఆంధ్రప్రదేశము నలుమూలలకు దైవ మూర్తులు నిర్మితములై పంపబడుచుండును. అంతియే కాదు బిలాస్ పూర్ (మధ్యప్రదేశ్) గౌంగైగాం (అస్సాం రాష్ట్రం) బదరీనాథ్ — మొదలగు అన్యరాష్ట్రములకు కూడ వీరు నిర్మించిన మహాశిల్పములు ప్రయాణము చేయుచుండుట, ఆంధ్రప్రదేశమునకే గర్వకారణమును, వీరి అత్యద్భుత శిల్పనిర్మాణ చాతుర్యమునకు నిదర్శనమును అనవలయును. 1977—78 సంవత్సరమున ఢిల్లిలో ప్రతిష్ఠించుటకై వీరు శిల్పించి పంపిన "సీతా, కోదండరామ, లక్ష్మణస్వాముల" విగ్రహములు మిక్కిలి పెద్ద వియును, సర్వలక్షణ సంపన్నములును. వీరు దేవాలయ శిల్పములను నిర్మించుటయందే కాక, మనుష్యుల ఆకారములను చూచి వాటి ప్రతి కృతులను శిలాలోహాదులలో నిర్మించుటలో కూడ కడు నేర్పరులు ఈ శిల్పులనుగూర్చి 1960 ప్రాంతమున 'ఆంధ్రప్రభ' లో ఒక వ్యాసము వెలువడినది ఇంకను తిరుచానూరులోని మైలాపూరు తిరుమలాచార్యులు, చెంగల్రాయాచార్యులు మొదలగువారు సుప్రసిద్ధ శిల్పులు. వీరివద్ద తాళ పత్రలిఖితములైన శిల్పగ్రంథములను ఈ రచయిత 1936 సం॥ ప్రాంత మున చూచియున్నాడు. ఈ మైలాపూరు శిల్పుల పూర్వులు కులభేదము లను పాటింపక, విశ్వబ్రాహ్మణేతరులకు కూడ శిల్పవిద్యాదానము చేసిన ఉదారులు! వీరి శిష్యులలో మహమ్మదీయులు కూడ ఉండుట విశేషము.

విజయవాడ రాజేశ్వరీపేటలో శిల్పసాగర బిరుదాంకితులు కీ. శే. తాటికొండ వెంకటరాఘవాచార్యులుగారు పలుతరగతులైన ప్రాచీన శిల్పములనే కాక, నేటికాలపు యంత్రశిల్ప విశేషములనుకూడ చేయుటలో ఘటకులై ప్రసిద్ధికన్నారు. వీరు "వీరాచార్య చరిత్రము" అను పేరున బ్రహ్మంగారి ఉదంతమును వ్రాసిన సంద్గ్రంథకర్తలుకూడ. మైలాపూరు వారివలెనే విజయవాడలోనున్న శ్రీ పిల్లేడ అప్పలాచార్యులుగారు కూడ అన్నిరకముల దేవాలయశిల్పములను నిర్మించుటలో అందెవేసిన చేయియే. ఇంకను సర్వశ్రీ కంది పైడయ్యనాయడు, వెల్లాల వెంకయ్య (దారుశిల్పి) బందరులోని పైడిపాటి రామారావునాయడు, భట్టిప్రోలు నివాసి కీ. శే. బిత్రా సుబ్రహ్మణ్యము, సుప్రసిద్ధ శిఖరనిర్మాణశిల్పి బాములపాటి ముత్తయ్య (మైలవరము) మున్నగువారుకూడ ఇప్పట్టున పేర్కొనదగినవారే.

తెనాలితాలూకా సంగంజాగర్లమూడిలో శిల్పులకు ప్రసిద్ధిచెందిన మైలవరమునుండి వలస వచ్చిన కీ. శే. బ్రహ్మశ్రీ అద్దంకి సంగయ్యగారు ఇత్తడి, కంచు, పంచలోహములతో దేవాలయ శిల్పములను చేయుటలో నేర్పరులు. వీరి కుమారులు - కీ. శే. వరదాచార్య, బ్రహ్మయాచార్య, వీరయాచార్యులు గారలు పోతపనిలోను, రేకు నగిషీపనిలోను, సర్వాంగ, వాహనాదుల నిర్మాణములోను దిట్టలు. వీరు కేవలము శిల్పులే కాక, శిల్పాగమ, వేదాది విద్యలలో విశారదులు కూడ. వీరి కనిష్ఠ సోదరుడు శ్రీ నాగాచార్య సిద్ధాంతిగారు ప్రస్తుతము శిల్పమును వదలిపెట్టి, వాస్తు, మంత్ర, యంత్ర కలాపములందు నిమగ్నులై ప్రజాసేవ చేయుచున్నారు. ఈ దర్శనకర్త శ్రీ వరదాచార్యులుగారివద్దనే వేదాధ్యయనము చేసినాడు. గుంటూరులో 'వాహనాల బ్రహ్మయ్య'గారని ప్రసిద్ధిచెందిన దేవాలయ శిల్పాచార్యుడు ఈ అద్దంకివారి బంధువే.

తెనాలికూడ మహాశిల్పులకు నివాసమైనదే. 1920 ప్రాంతమున తెనాలిలో కీ. శే. శ్రీ అరసవల్లి భీమలింగాచార్యులు గారనెడి మహాశిల్పి ఉండెడివారు. ఈయన వెండి బంగారు రేకులమీద జిలుగునగిషీపనులు చేయుటలో కడునేర్పరి. ప్రస్తుతము శ్రీ చింతాడ రాఘవాచార్యులుగారు సుప్రసిద్ధులైన నగిషీపనివారు. వీరు నిర్మించిన సుందరశిల్పము కల 'జడ' ఒకటి ఢిల్లీ మ్యూజియమును అలంకరించి యున్నది. వీరుసింహాలలాటములు, గండపెండేరములు, కుంకుమ బరిణెలు మొదలగువాటిని చక్కని నగిషీలతో రూపొందింపగలరు. ఈ సందర్భమున నరసాపురములోని శ్రీ పెదగాడ వీరాచార్యులుగారుకూడ జిలుగు నగిషీపనిలో అందెవైచినవారే అని చెప్పవలసియున్నది. వర్ధమానులగు "ఎంబోజింగు ఆర్టిష్టు"లలో పేర్కొనదగినవారు కృష్ణాజిల్లా గుడివాడలోని శ్రీ దర్శి జ్వాలాచార్యులుగారును. చందలూరివారు, వీరికి మంచి భవిష్యము కలదని భావించవచ్చును. తెనాలిలో కీ. శే. ఉప్పు వీరవెంకయ్యగారని ఒక శిలాశిల్పి ఉండెడివారు. వీరు శ్రీ మైలాపూరు శోభనాచలముగారి శిష్యులు. ఈయన చెక్కిన సుందర నందిమూర్తి ఒకటి తెనాలి కన్యకాపరమేశ్వరీ దేవాలయమునందు ఉన్నది. వీరవెంకయ్యగారి బంధువును, శిష్యుడును అయిన శ్రీ చిన్నాల రంగారావుగారు తెనాలిలో శిల్పశాలను నెలకొల్పి ఆంధ్రప్రదేశము నలుమూలలకు దైవమూర్తులనునిర్మించి పంపుచున్నారు. వర్ధమాన శిల్పికుమారుడు చి॥ ఉప్పు యదునాథరావుగారు వీరవెంకయ్యగారి పౌత్రుడే వీరందరును ఆంధ్రశిల్ప కలాపరిషత్తువారు జరిపిన "పంచశిల్ప కలాప్రదర్శనము"లలో బహుమానములను అందినవారే.

ఈ సందర్భమున పొన్నూరులో ఆంజనేయస్వామి విగ్రహమును నిర్మించిన మహాశిల్పి శ్రీ పొన్నంబలాచార్యులుగారిని స్మరింపకుండజాలము. ఈమూర్తి నిర్మాణమునకు మొట్టమొదట పూనివారు పురు

షోత్తమపట్నం నివాసులైన శ్రీషేక్ హుస్సేన్‌సాహేబ్‌గారు. కారణాంతరములచేత ఆ బృహన్మూర్తి శ్రీ పొన్నంబల మహాశిల్పాచార్యులచేత నిర్మితమై వాసికెక్కినది. పొన్నూరువెళ్ళినవారు ఈ మూర్తిని చూచితీరవలయును. శ్రీ పొన్నంబలశిల్పి కొన్ని జన్మములనుండియు మహాశిల్పి అనియే ఎన్నవలసి యున్నది. అతడు ఉలి చేతబట్టినచో శిల గడగడలాడుచు వెన్నముద్దయై కోరిన అందచందములలో ఒదిగిపోవును.

తెనాలితాలూకా వేమూరులో కీ. శే. దేవు మహామయాచార్యులు గారనెడి శిల్పి యుండెడివారు. ఈయన పంచశిల్ప ప్రవీణుడు. వీరిని గూర్చి ఆంధ్రప్రభలో ఒకవ్యాసముకూడ వెలువడినది. వీరు శ్రీ కంచి కామకోటిపీఠాధిపతులచేత రాజమండ్రిలో జరిగి న''శిల్పాగమసదస్సు"లో సువర్ణకంకణ ప్రదానముచేత సత్కరింపబడినారు. వీరు నిర్మించిన విచిత్రమగు దీపస్తంభము ఎందఱి ప్రశంసలనో అందుకొన్నది.

రాజమహేంద్రవరమున ''మారుతీ శిల్పనిలయము"ను నెలకొల్పి దైవశిల్పములను చేయుచున్న శ్రీ కోరుమిల్లి మహాలింగాచార్యులుగారును, ఎన్నదగిన శిల్పులే. శారదా శిల్పనిలయమున పనిచేయుచున్న శ్రీ బి. రంగారావు, భీమవరములోని శ్రీ పిల్లేడ సీతారామాంజనేయులు, ఆంధ్ర శిల్పకళాపరిషద్బహూకృతులను అందుకొన్న సర్వశ్రీ యం. వీరబ్రహ్మం, పెదపాటి కామేశ్వరరావు,(ధవళేశ్వరం) కొసనా బ్రహ్మానందం మున్నగువారు కూడ పేర్కొనదగినవారే.

విశాఖపట్టణం ఆకాశవాణి కేంద్రమున తెలుగు ప్రవచనశాఖాధిపతులుగా నున్న శ్రీ పి విజయభూషణశర్మ M. A. గారు కవులూ, విమర్శకులూ, చిత్రశిల్పులుకూడ. వీరి చిత్తరువులు ఢిల్లీలో ప్రదర్శితములై కళాకోవిదుల సంస్తుతులను అందుకొన్నవి. వీరు త్రిభాషాకవు

లును, చిత్రకారులును అగు మహాకవి శ్రీ శరభాచార్యులుగారి కుమారు లగుటచేత పితృదత్తముగా వీరికి కవితా కళావిద్యలు సంక్రమించిన వన వచ్చును. ఆంధ్ర విశ్వవిద్యాలయమున లలితకళల శాఖాధిపతిగా నున్న శ్రీ Y. V. లక్ష్మయ్యగారు ఇటలీ మొదలగు దేశములకేగి పాశ్చాత్యశిల్పములనుకూడ అవగాహన చేసికొన్న ఆంధ్ర శిల్పి. నేడు వీరి శిక్షణమున ఎందరో శిల్పములను నేర్చుకొనుచున్నారు. శ్రీ కొండి పర్తి శేషగిరిరావుగారు (నాగార్జునసాగర్) అనువంశిక శిల్పి. వీరు కొత్త కొత్త శిల్పరహస్యములను వెల్లడింపగల కళావిమర్శకులు. కళారహస్య ములనుగూర్చి వీరి వ్యాఖ్యావ్యాసములు 'భారతి' మొదలగు పత్రికల పాఠ కులకు అపరిచితములు కావు. మొన్నటివఱకు మఱుగునపడిన మాణిక్య ముగా ఉన్న శ్రీ తాడికొండ లక్ష్మణాచార్యులుగారు (తాడికొండ) సర్వశిల్ప కళానిధి ఈ సందర్భమున తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ విమాన నిర్మాతలు, మహాస్థపతులు, మధురై (తమిళనాడు) నివాసులు అగుశ్రీ S. M. చొక్కలింగాచార్యులుగారు, శ్రీకాకుళ నివాసి, చిత్రశిల్ప కళానిపుణులు శ్రీ వీరభద్రరావుగారు మఱువదగనివారు. ఈ దర్శనకర్త పితృపాదులు కీ. శే. కోటీశ్వరాచార్యులుగారు పంచశిల్ప ప్రవీణులే కారు, వీరికి తెలియని శిల్పరహస్యములు లేవన్న అతిశయోక్తి కాదు. అందుచేతనే ఈ గ్రంథకర్తకు అనువంశికముగను, తండ్రివద్ద నేర్చుకొనుట చేతను పంచశిల్పములు పట్టుబడినవి. కొయ్య, శిల, కంచు, ఇత్తడి, వెండి, బంగారులతో సర్వశిల్పములను చేయు నేర్పు ఈయనకు బాల్యముననే చక్కగ అలవడినది. ఆ శిల్పవిద్యకు శిల్పశాస్త్రాధ్యయ నము వన్నెపెట్టినది. అయినను, జీవనోపాధికి ఉపాధ్యాయ వృత్తిని అవలంబించుటచేతను, గ్రంథరచన, ప్రధానకార్య మయి నందునను శిల్పిగా ప్రసిద్ధి రాలేదు. ఆంధ్ర శిల్పకళాపరిషత్తు ద్వారా

ఈయన కలాజగత్తునకు చేయుచున్న సేవ ప్రజామోదమునుపొంది శిల్పోద్ధరణమునకు ఉపయోగించుచున్నది. గుంటూరులో స్త్రీల ప్రభుత్వ కళాశాలలో శిల్పోపన్యాసకులుగానున్న శ్రీ C. S. N. పట్నాయక్‌గారు లోహములను మూర్తులుగా పోతపోయుటయందేకాక, తదితరములతో విగ్రహములను మలచుటయందును, ఆధునిక శిల్పములు చేయుటయందును నిపుణులు.

ఆంధ్రశిల్పకళాపరిషత్తు నెలకొన్న తరువాత, ఆంధ్రప్రదేశమున శిల్పమునకు గొప్ప జాగృతి కలిగినదని చెప్పవచ్చును. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు దేవాలయ శాఖామాత్యులుగా నున్నప్పుడు పరిషత్తు ప్రోత్సాహముచేత తిరుపతిలో శిల్పకళాశాలను నెలకొల్పినారు. దానికి ప్రథమాచార్యుడుగానుండి రూపురేకలు దిద్దినవారు శ్రీ దేవషణ్ముఖనాథాచార్యులుగారు (వరంగల్లు). ఈయన శాస్త్రములందును, శిల్పములందును అసమానుడే. వీరు ఆచార్యులుగా నున్నప్పుడు తిరుపతి శిల్పకళాశాలలో పెక్కురు శిల్పులుగా శిక్షణనంది ఇప్పుడు ఉద్యోగములు చేసికొను చున్నారు. వీరిలో శ్రీ శ్రీరాం కాశీప్రసాద్, శ్రీ వి. అమరలింగాచార్యాదులు మంచిశిల్పులు. అమరలింగాచార్యులుగారు (చంద్రగిరి) శిల్పిగానే కాక, ఆర్టిష్టు (చిత్రకారుడు)గా కూడ గణుతికెక్కినారు సహృదయుడుగానేకాక, శాస్త్రజ్ఞుడుగను, సత్వగుణ సంపన్నుడుగను, భగవద్భక్తుడుగను రూపొందిన కళాకారుడీయన. ఆంధ్ర శిల్పకళాపరిషత్తు తర్వాత పేర్కొనదగినది శ్రీ చిట్టావూరు నాగభూషణాచార్యులుగారు నెలకొల్పిన "శిలాశిల్పుల మహాసభ". ఇది కూడ ఏటేటా శిలాశిల్పప్రదర్శనములు చేయుచు శిలాశిల్పులకు ప్రోత్సాహ మిచ్చుచున్నది.

శ్రీ ఎస్. ఎమ్. గణపతిస్థపతిగారు: వీరి జన్మభూమి తమిళ దేశము. శిల్పశాస్త్రమునను, శిల్పనిర్మాణమునందును తరతరములను

ప్రసిద్ధమైన విశ్వబ్రాహ్మణ కుటుంబములో జన్మించిన మహాశిల్పులు. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు దేవాలయ శాఖామాత్యులుగా నున్నప్పుడు భద్రాద్రి దేవాలయ పునర్నిర్మాణము, కల్యాణమండప రచనము కావించుటకు వీరిని ఆంధ్రప్రదేశమునకు రప్పించినారు. స్థపతిగారు భద్రాచలమునకు వచ్చిన పిమ్మట చంద్రమౌళిగారు ఈ గ్రంథకర్తను పిలిపించి వీరిచేత గణపతిగారి శాస్త్రకౌశలమును, శిల్పప్రౌఢిమను పరీక్షింపచేసి వీరు 'ఔ' నన్నపిమ్మటనే స్థపతిగారిని ఆలయ పునర్నిర్మాణాది కార్యములకు వినియోగించినారు. గణపతిస్థపతిగారుకూడ ఎందఱో అనుచర శిల్పులను తోడుచేసికొని భద్రాద్రిలోని సీతారాముల కల్యాణమండపమును శిల్పవిధానము కావించిరి పిమ్మట స్థపతిగారిని మనప్రభుత్వము రాష్ట్ర దేవాలయములమీద శిల్పాచార్యుని (ఇంజనీరు) గా నియమించినది. క్రమముగా తిరుమల - తిరుపతి దేవస్థానములకుకూడ వీరు శిల్పాచార్యులయిరి అటనుండి మన ప్రభుత్వము అమెరికాలో హిందూ దేవాలయములను నిర్మించుటకుకూడ వీరిని, వీరిసహశిల్పులను పంపి పనిప్రారంభించినది. దీనినిబట్టి దాక్షిణాత్య శిల్పప్రభ అమెరికాలోకూడ అడుగుపెట్టినదని గ్రహింపవచ్చును. శ్రీ గణపతిస్థపతిగారు శిల్పరచనములో ఎంత దిట్టలో – శిల్పముపై శాస్త్రీయ ప్రసంగములు చేయుటలోకూడ అంత నేర్పరులు! రెండేండ్లనాడు కేంద్రప్రభుత్వము వీరిని ఉత్తమ కళాకారులుగా గుర్తించి బహూమానించినది. ఈ శిల్పాచార్యుడు యావద్భారత దేశముకూడ గర్వింపదగిన వ్యక్తి యనుటకు ఎట్టి శంకయు లేదు: వీరివలెనే మహాబలిపుర శిల్పశిక్షణకేంద్రమున ప్రధానాచార్యులుగా నున్న శ్రీ వి. గణపతిగారును మహాశిల్పాచార్యులే.

కొలదికాలముక్రిందట ఆంధ్రప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖవారు తమ యాజమాన్యమున ఒక శిల్పకలాశాలను స్థాపించినారు.

దానికి శ్రీ యస్. యం. గణపతిస్థపతిగారు ప్రిన్సిపాల్‌గాను, శ్రీ పెద పాటి నాగేశ్వరరావు యం. ఎ. గారు వైస్ ప్రిన్సిపాల్‌గాను వ్యవహరించుచున్నారు శ్రీ నాగేశ్వరరావుగారు సంస్కృతాంధ్ర,తమిళ, కర్ణాటక, హిందీ, మహారాష్ట్రి భాషలలో పరిచయము కలవారు. "శ్రీనాథుని పంచ ప్రాణములు" అను తెలుగు గ్రంథమును, "శ్రీశైల గద్యము" అను సంస్కృత గ్రంథమును వ్రాసి ప్రసిద్ధి వడసిరి. శిల్పశాస్త్రములను మూలమట్టుగా చదివి కాశ్యపశిల్పాది గ్రంథములను అనువదించు ప్రయత్నములో ఉన్నారు. వీరికి ప్రభుత్వమువారి తోడ్పాటు దొరకినచో తెలుగులో శిల్పశాస్త్ర గ్రంథములులేని కొఱత తీఱగలదు.

ఇంకను ఎందఱో శిల్పులు, మహాశిల్పులు దేశమున కలరు. గ్రంథవిస్తరభీతి వారి నందఱను ఇచ్చట పరిచయము చేయనిచ్చుట లేదు. జ్ఞప్తిలో నున్న కొందఱనుగూర్చి మాత్రమే ఇందు సంగ్రహముగా ప్రస్తావించుట యైనది. ఈ శిల్పాచార్యులనుగూర్చి సమగ్రమగు ఒక బృహద్గ్రంథమును వ్రాయవలసిన అవసరము కలదనికూడ మనము గ్రహింపవలసియున్నది.

## శిల్పగ్రంథకర్తలు

డాక్టరు ఆనందకుమారస్వామి భారతీయ శిల్పములను, సింహళ శిల్పములను పరిశీలించి వాటిపై గొప్ప గ్రంథములను రచించియున్నారు. వీరు అమెరికా మున్నగుదేశములందుకూడ ఉద్యోగించి భారతీయ శిల్పమునకును, చిత్రకళకును కల ప్రత్యేకతను ప్రచార మొనర్చిన వ్యక్తి. వీరు వ్రాసిన "ఇంట్రోడక్షన్ టు ఇండియన్‌ఆర్టు" (మద్రాసు 1923) "హిస్టరీ ఆఫ్ ఇండియన్ అండ్ ఇండొనీషియన్ ఆర్టు" డ్యాన్స్ ఆఫ్ శివ" మున్నగు గ్రంథములు ఎన్నదగినవి. ఇంకను "విన్సెంట్‌స్మిత్"

"ప్రొఫెసర్ హావెల్'' మున్నగు ఆంగ్లేయ శిల్పకలాకోవిదులు భారతీయ శిల్పముపై మంచి గ్రంథములను ప్రకటించిరి.

అలహాబాదు విశ్వవిద్యాలయమున ప్రొఫెసర్‌గానున్న కీ. శే. డా. ప్రసన్న కుమారాచార్యులుగారు సుప్రసిద్ధ శిల్పశాస్త్ర వేత్తలు. వీరు మానసారమును సంపాదించి ప్రకటించిరి. గొప్పశిల్ప నిఘంటువును, ''భారతీయ శిల్పశాస్త్రము'' (ఆంగ్లములో)ను వ్రాసి శిల్పశాస్త్రమునకు గొప్ప సేవ చేసియున్నారు.

మహామహోపాధ్యాయ కీ. శే. టి. గణపతిశాస్త్రిగారు, రామరాజు, రాజేంద్రలాల్‌మిత్ర, టి. ఎ. గోపీనాథరావు (తిరువాన్‌కూరుస్టేటు) ఓ. సి గంగూలీ, అవనీంద్రనాథఠాగూర్, ఫణీంద్రనాథబోస్, ఎ. కె. మిత్ర — మొదలగువారు శిల్పశాస్త్ర సేవలో ఆరితేరిన మహావ్యక్తులు. ఆంధ్రదేశములో కీ. శే. వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు అద్భుతమగు పరిశోధనలు చేసిరి. కీ. శే. డా. మారేమండ రామారావు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు శ్రీ అడివి బాపిరాజు మున్నగువారు యథాశక్తి పరిశోధనాత్మకమగు కృషి చేసినవారే.

## ఉపసంహారము

సనాతనమగు భారతీయార్షదృష్టితో చూచినయెడల శిల్పవేదోద్దేశ్యము, మానవునకు ఈ సృష్టిరహస్యమునుతెల్పి, అతని ఐహికాముష్మిక పారమార్థిక క్రియా తంత్రములకు అత్యంతము ఉపయుక్తమయి, ఈశ్వరదర్శనము ద్వారా జన్మసంసిద్ధిని చేకూర్చుటయని సువ్యక్తమగుచున్నది. అత్యున్నతమగు ఈ భావము ప్రాచీన భారతీయశిల్పకృతుల యందు ప్రతిపదమునను స్పష్టమగుమనే యున్నది. కావుననే శిల్పము

ముద్దేశించిన మనదర్శనము బాహ్యతత్త్వగ్రహణముతో ఆగిపోక, అంత స్తత్త్వ సమ్యక్పరిశీలనానుభవములతో ఆత్మదర్శనమునకు హేతుభూత మగుచున్నది. అట్లగుటచేతనే అతి నిగూఢమగు ఈశ్వర శిల్పమును సందర్శనీయమును, సంభావనీయమును ఐ శిల్పానందసాగరములో శిల్ప సౌందర్యారాధకులను తన్మయులను ఒనర్చి కైవల్యమును అభివ్యక్తము చేయుచున్నది.

"ఏకో వశీ సర్వభూతాంతరాత్మా,
ఏకం రూపం బహుధా యః కరోతి,
త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా,
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్."

నీ కళాకిరణాలు నిఖిలదిక్కులలోన
నిండింపరా శిల్పి, పండుతవి భాగ్యాలు,
నిదురమైకము వీడరా!
భారతాభ్యుదయమ్ము కావింపరా!

—తోరణము.

లోకా స్సమస్తా సుఖినో భవన్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



శిల్ప, వాస్తు, కళా, తంత్ర, ఆగమ, సంహితా గ్రంథముల పట్టిక:

విశ్వకర్మకృతములు

1 ఆయతత్వము
2 మహావిశ్వకర్మీయము
3 విశ్వకర్మీయము
4 విశ్వకర్మవిద్య
5 విశ్వకర్మప్రకాశము
6 విశ్వకర్మశిల్పము
7 విశ్వకర్మరహస్యము
8 విశ్వకర్మసిద్ధాంతము
9 విశ్వకర్మసంహిత
10 విశ్వకర్మవాస్తు
11 విశ్వకర్మాగమము
12 వాస్తుశాస్త్రము
13 విశ్వకర్మావతారము
14 వాస్తువిచారము
15 పరశివవిశ్వకర్మాగమము
16 అపరాజితవాస్తుశాస్త్రము
17 జ్ఞానరత్నకోశము
18 వాస్తుప్రకాశము
19 క్షీరార్ణవము
20 విశ్వకర్మమతము

**మయరచితములు.**

21 మయశిల్పము
22 మయవాస్తు
23 మయమాయ
24 మయజయము
25 మయవిద్యాప్రకాశము
26 మయదీపిక
27 మయసంగ్రహము
28 శిల్పశాస్త్రవిధి
29 గురుదేవపద్ధతి
30 మనుతంత్రము
31 మానవసూత్రము } మను
32 మనుసారవాస్తువు } బ్రహ్మ
33 మనుసారము
34 త్వష్టృతంత్రము (త్వష్ట)

**మండనసూత్రధార కృతములు**

35 వాస్తుమండనము
36 ప్రాసాదమండనము
37 రూపమండనము
38 రాజవల్లభమండనము

39 గృహవాస్తుసారము
40 తారాలక్షణము
41 దారుసంగ్రహము
42 నిర్దోషవాస్తు

43 ప్రాసాదకల్పము
44 మూర్తిధ్యానము
45 వాస్తురాజవల్లభము
46 శిల్పకళాదీపిక (అగస్త్యుడు)
47 శిల్పసూత్రము (నగ్నజిత్తు)
48 శిల్పోపనిషత్తు
(కౌమారభాష్యసహితము)
49 శిల్పసాహిత్యము
50 శిల్పరత్నాకరము
51 శిల్పవతంసము(గోవిందానంద)
52 శిల్పశాస్త్రజ్ఞానము
53 శిల్పసంహిత (కశ్యపుడు)
54 శిల్పజ్ఞానము
55 శిల్పసంగ్రహము
56 శిల్పప్రకాశము
57 శిల్పసర్వసంగ్రహము
58 శిల్పార్థసారము
59 శిల్పసారము
60 శిల్పశాస్త్రసారము
61 శిల్పలేఖ
62 శిల్పగ్రంథము
63 శిల్పదీపిక
64 శిల్పవిషయము
65 శిల్పతంత్రము (కుమారభట్టు)
66 శిల్పశాస్త్రము
67 శిల్పసర్వస్వసంగ్రహము
68 శిల్పనిఘంటు
69 వాస్తుబోధము
70 వాస్తుమంజరి
71 వాస్తువిచారము
72 వాస్తుసముచ్చయము
73 వాస్తుపద్ధతి
74 వాస్తుశాస్త్రము (భోజదేవుడు)
75 వాస్తుతంత్రము
76 వాస్తుసారము
77 వాస్తుమాహాత్మ్యము
78 వాస్త్వధికారము
79 వాస్తుకోశము
80 వాస్తురత్నావళి
81 వాస్తుప్రకాశము
82 వాస్తుచక్రము (వీక్షాచార్యుడు)
83 వాస్తుశాస్త్రము
84 వాస్తురాజము
(రాజసింహశిల్పి)
85 వాస్తుకరణము
86 వాస్తుపురుషము
87 వాస్తువిధి
88 వాస్తునిర్మాణము

133 అంశుమానభేదకల్పము (కశ్యపుడు)
134 గౌతమము (గౌతముడు)
135 ప్రబోధకము (ప్రబోధకుడు)
136 భోజమతము (భోజుడు)
137 మహాసారము
138 సౌరము (సూర్యుఁడు)
139 పరావచిత్రకము
140 ఉలూకకల్పము
141 కేసరిరాజము
142 కుండమండపదర్పణము
143 గార్గేయాగమము (గర్గుడు)
144 విశ్వేశము
145 విస్తారకము
146 మహాతంత్రము
147 చైత్రికము
148 బహుశ్రుతము
149 అగస్త్యసంహిత
150 కార్పార్యము (కృపుడు)
151 నారదీయము
152 భృగుమతము
153 మార్కండేయము
154 ఆయాదిలక్షణము
155 ఉద్వాస్థానయనము
156 కుండమార్తాండము
157 కేసరీవాస్తు
158 గాంధర్వవిద్య
159 చిత్రశాలము
160 ఛాయాపురుషలక్షణము
161 నిర్దోషము క్తవాస్తు
162 ప్రమాణమంజరి
163 ప్రతిష్ఠాసారసంగ్రహము
164 ప్రతిష్ఠామయూఖము
165 విశ్వసారము
166 విరంత
167 కపిలకాలయాపము (కపిలుడు)
168 మనోబోధము
169 గోపానవము
170 నగ్నసిద్ధకల్పము
171 బ్రాహ్మీయము (బ్రహ్మ)
172 మానవిజ్ఞానము
173 ఇంద్రవరుణీకల్పము
174 కలానిధి (గోవిందస్థపతి)
175 కుమారవాస్తు
176 గుంజకల్పము
177 చిత్రకుండము
178 జలాయనజ్ఞానము
179 ద్వారదీపిక (గోవిందస్థపతి)

180 నానావిధకుండప్రకాశము (నకుల శిల్పి)
181 ప్రాసాదకర్తనము
182 ప్రాసాదకేసరి
183 విశ్వబోధము
184 భానుమతము
185 మానసారము (మానసార ఋషి)
186 సాద్ధికము
187 సౌమశిల్పము (సోముడు)
188 కాలయూపము
189 అపరాజితపృచ్ఛ (భువనదేవాచార్యుడు)
190 కశ్యపసంహిత
191 చిత్రబాహుళ్యము
192 సింధువు
193 జలార్గళము (వరాహమిహిరుడు)
194 కాష్ఠశాల
195 కాష్ఠసంగ్రహము
196 కుండప్రదీపము
197 గద్యచింతామణి
198 చిత్రలక్షణము
199 ధాతుకల్పము
200 నందిఘనము
201 నలతంత్రము (నలుడు)
202 పద్మసంహిత
203 ప్రాసాదలక్షణము
204 పాషాణవిచారము
205 విశ్వధర్మము
206 అరుటిక
207 ఐంద్రమతము (ఇంద్రుడు)
208 బృహస్పతీయము
209 లావణ్యము
210 సాకము
211 ఉద్ధారధోరణి (గోవిందస్థపతి)
212 కుండతత్వప్రదీపము
213 కపింజలసంహిత
214 గ్రహపీఠమాల
215 తత్వమాల
216 ధ్యానపద్ధతి
217 నక్షత్రకల్పము
218 ప్రయోగమంజరి
219 ప్రాసాదాలంకారమాల
220 ప్రాసాదవిచారము
221 ప్రాసాదనిర్ణయము
222 భువనదీపిక
223 విహారకారిక

224 విమానాదిమానము
225 జ్ఞానరత్నకోశము
226 తంత్రసముచ్చయము
227 పాంచరాత్రాగమము
228 బృహత్సంహిత
(వరాహమిహిరుడు)
229 విశ్వసారోద్ధారము
230 శత్రుఘ్నీయము
231 సాతకసారము
232 సమరాంగణము
(సమరాంగణ సూత్రధారుడు)
233 సనత్కుమారవాస్తు
234 జ్ఞానప్రకాశదీపిక
235 భాస్కరీయము
(భాస్కరాచార్యుడు)
236 ప్రతిష్ఠాతంత్రము
237 కుండమండపసిద్ధి
238 మంజుశ్రీసాధనము
239 యుక్తికల్పతరువు
240 వర్ణసంగ్రహము
241 సారసంహిత
242 సిద్ధాంతశిరోమణి
243 సుప్రభేదప్రతిష్ఠాతంత్రము
244 కులార్ణవతంత్రము
245 కామికాదీప్తము
246 రత్నావనసారము
(మార్కండేయుడు)
247 పాద్మతంత్రక్రియ
248 యంత్రచింతామణి
249 రుద్రయామళవాస్తుతంత్రము
250 విశ్వంభరవాస్తు
251 సూత్రధారణము
252 సూత్రసంతానము
253 హేమాద్రిప్రతిష్ఠాతంత్రము
254 జయమధ్యమానము
255 రత్నపరీక్ష
256 మహావజ్రభైరవతంత్రము
257 ప్రతిమాలక్షణము (నగ్నజిత్తు)
258 మూలస్తంభనిర్ణయము
259 మృత్సంగ్రహము
260 రూపవిధి
261 రాజగృహనిర్మాణము
262 వ్యద్యానసము
263 లగ్నశుద్ధి
264 వాపీచక్రము
265 విమానవిద్య
266 శక్తిసూత్రాణి (అగస్త్యుడు)
267 సౌదామనీకళ (ఈశ్వరుడు)

268 వాయుతత్త్వప్రకరణము (శాకటాయనుడు)
269 ఆకాశశాస్త్రమ్ (భరద్వాజుడు)
270 వైశ్వానరతంత్రం (నారదుడు)
271 ధూమప్రకరణం (నారదుడు)
272 వ్యోమయానచంద్రిక (నారాయణుడు)
273 వ్యోమయానార్కప్రకాశం (దండినాథుడు)
274 వ్యోమయానతంత్రము (శౌనకుడు)
275 ఖేటయానప్రదీపిక (చాక్రాయణి)
276 యంత్రకల్పము (గర్గుడు)
277 యానబిందువు (వాచస్పతి)
278 విశ్వామిత్రశిల్పము
279 పారాశర్యశిల్పము
280 రత్నలక్షణము
281 మణిపరీక్ష
282 రత్నశాస్త్రము
283 సకలాధికారము (అగస్త్యుడు)
284 సూర్యసిద్ధాంతము
285 హరిసంహిత
286 ప్రాసాదదీపిక
287 సుఖానందవాస్తు
288 కౌమారసంహిత
289 హనుమత్కల్పము
290 రూపావతారము
291 గోభిలగృహ్యసూత్రము
292 ప్రాసాదానుకీర్తనము
293 రాజవల్లభటీక
294 క్రియాసంగ్రహపంజిక (కులదత్తుడు)
295 రత్నపరీక్ష (బుద్ధభట్టాచార్యుడు)
296 పాదపవివక్ష
297 వృక్షదోహదము
298 వృక్షాయుర్వేదము
299 సస్యానందము
300 విశ్వకర్మోపనిషత్తు
301 రత్నాదిపరీక్ష
230 అంకణశాస్త్రము
303 కాశ్యపీయము
304 కూపాదిజలస్థానలక్షణము
305 క్షేత్రనిర్మాణవిధి
306 గృహపథిక
307 గోపురవిమానాదిలక్షణము

308 చక్రశాస్త్రము
309 చిత్రపటము
310 జలార్గళము (వరాహమిహిర)
311 జలార్గళయంత్రము
312 దేవాలయలక్షణము
313 ద్వారలక్షణపటలము
314 పక్షిమనుష్యాలయలక్షణము
315 ప్రాసాదలక్షణము
316 ,, (వరాహమిహిరుడు)
317 ప్రాసాదాలంకారలక్షణము
318 బలిపీఠలక్షణము
319 మనుష్యాలయలక్షణము
320 మనుష్యాలయచంద్రిక
321 మరీచిపటలము
322 మానకథనము
323 మానవవాస్తులక్షణము
324 మానవసారము (మనుబ్రహ్మ)
325 మానసము
326 రథలక్షణము
327 పద్విదిక్సంధానము
328 పీఠలక్షణము
329 ప్రతిమాద్రవ్యాదిరచన
340 కౌతుకలక్షణము
331 చత్వారింశద్విద్య
332 అంశుమానకల్పము
333 అగారవినోదము
334 జయమాధవమానసోల్లాసము
335 భారలక్షణము
336 మణిపరీక్ష (అగస్త్యుడు)
337 ఆగమాదిప్రతిష్ఠా పద్ధతి
338 గ్రహనిరూపణసంక్షేపము
339 చిత్రకర్మ శిల్పశాస్త్రము
340 నవరత్నపరీక్ష
341 మయూరచిత్రక
342 మూర్తిలక్షణము
343 రత్నసముచ్చయము
344 లోహరత్నాకరము
345 లోహార్ణవము
347 లోహశాస్త్రము
347 వైఖానసము
348 శాస్త్రజలాధిరత్నము
349 సర్వవిహారీయయంత్రము
350 సారస్వతీయశిల్పశాస్త్రము
351 రత్నదీపిక (కందేశ్వరుడు)
352 విశ్వవిద్యాభరణము (బసవాచార్య)
353 విశ్వబ్రహ్మకులోత్సాహ (నారాయణశాస్త్రి)

354 రథకారాధికరణము (బసవాచార్యుడు)
355 ప్రతిష్ఠాతంత్రము
356 కృషివిషయము
357 రత్నమాల (పశుపతి)
358 మానసోల్లాసవృత్తాంత ప్రకాశము
359 పంచరత్నదీపిక
360 గృహనిర్మాణవిధి
361 రెట్టమతము (భాస్కరుడు)
362 అంశుమత్కాశ్యపీయము
363 క్షేత్రగణితశాస్త్రము
364 అభిలషితార్థచింతామణి
365 రత్నశాస్త్రము
366 నౌశాస్త్రము
367 దేవతాశిల్పము
368 గోసూత్రము
369 గోశాంతి
370 గోవైద్యశాస్త్రము
371 గోశాస్త్రము
372 కళాశాస్త్రము
373 చిత్రభారతము
374 శిల్పరత్నము (శ్రీకుమారుడు)
375 వాస్తుప్రకరణము

376 మయమతవాస్తుశాస్త్రము మ
377 మయవాస్తుశాస్త్రము యు
378 మయశిల్పశాస్త్రము డు
379 ఆత్రేయతంత్రము
380 కోదండమండనము (మండనసూత్రధార)
381 ఆగమకల్పద్రుమము
382 మహానిర్వాణతంత్రము
383 శాక్తానందతరంగిణి
384 మాయాతంత్రము
385 గంధర్వమాలిక
386 విశ్వకర్మాన్వయప్రదీపిక
387 స్వతంత్రతంత్రము
388 బృహత్ శ్రీక్రమము
389 కాశ్యూర్ధ్వామ్నాయము
390 తంత్రజీవనము
391 కంకాళమాలినీతంత్రము
392 మాహేశ్వరీసంహిత
393 బాలావిలాసతంత్రము
394 లింగార్చనాతంత్రము
395 గోరక్షసంహిత
396 కౌలికతంత్రము
397 స్వచ్ఛందసంగ్రహము

398 కాళికాపురాణము

399 విశ్వకర్మబ్రాహ్మణ వంశా
గమము (నిరంజనశాస్త్రి)

400 భారతీయ మహాశిల్పము
(శ్రీస్వర్ణసుబ్రహ్మణ్యకవి)

ఈ గ్రంథములపేర్లు "విశ్వబ్రహ్మకులోత్సాహ" అను మహారాష్ట్ర గ్రంథము "Studies in Indian History and culture" (By Dr. Narendra Nath law) అను ఆంగ్ల గ్రంథము — ఇంక తదితర గ్రంథములనుండియు గ్రహింపబడినవి. విస్తరభయమున ఇంకను కొన్ని గ్రంథముల పేరులు వ్రాయలేదు.

---

## భారతీయమూర్తులను సంగ్రహించి యుంచిన కొన్ని ప్రదర్శన శాలలు.

తక్షశిల, (పంజాబ్) లాహోరు, మధుర, లక్నో, అలహాబాద్, బెనారస్ (కాశిలోని 'భారతకళాభవనము సారనాథ్) పాట్నా, నాలంద, కలకత్తా (ఇండియన్ సంగ్రహాలయము, వంగీయసాహిత్యపరిషత్తు,) రాజశాహి, (నరేంద్రరిసర్చి సొసైటి) బొంబాయి (ప్రిన్స్ ఆఫ్ వేల్సు సంగ్రహాలయము) మద్రాసు, కొలంబో, లండన్ (బ్రిటిష్ సంగ్రహాలయము, సావుధ్ సింగటన్ సంగ్రహాలయము) బోష్టన్ (అమెరికా)

## చిత్రసంగ్రహాలయములు (Museums)

అలహాబాద్—మునిసిపల్ సంగ్రహాలయము. ఔంధ్ — రాజకీయ సంగ్రహాలయము. కలకత్తా— ఇండియన్ సంగ్రహాలయము, విక్టోరియా మెమోరియల్, హాల్. వంగీయ సాహిత్యపరిషత్తు. చంబా - భూరిసింహ సంగ్రహాలయము. త్రివేంద్రం—శ్రీ చిత్రాలయము. ఢిల్లీ-ఆర్కిలాజికల్

సెంట్రల్ ఏషియన్ సంగ్రహాలయము. పాట్నా- ఖుదాబక్ష్ పుస్తకాలయము, పాట్నా సంగ్రహాలయము. పూనా - భారతీయ ఇతిహాస సంశోధకమండలము. బొంబాయి—ప్రిన్స్ ఆఫ్ వేల్స్ సంగ్రహాలయము. బరోడా— రాజకీయ సంగ్రహాలయము. బెనారస్—భారతకళాభవనము. బోల్‌పుర్ కళాభవనము (శాంతినికేతనము) లాహోరు - కేంద్రీయ సంగ్రహాలయము. హైదరాబాద్ (దక్కన్).



# శిల్పబ్రహ్మఋషిపంచకము

## ప్రవర ఋషులు

1. సానగఋషి : ఉపసానగ, బిభ్రాజ, కశ్యప, మనువిశ్వకర్మ, విశ్వాత్మక — ఋషులు. పంచార్షేయ ప్రవర. ఋక్శాఖ. మనుసూత్రము.

2. సనాతనఋషి : ఉపసనాతన, వామదేవ, విశ్వచక్షు, ప్రతితక్ష, సునందన-ఋషులు. పంచార్షేయ ప్రవర. యజుశ్శాఖ. మయసూత్రము.

3. అహభూనఋషి : ఉపాహభూన, భద్రదత్త, కాండవ, విశ్వాకార, శ్రీముఖ — ఋషులు. పంచార్షేయ ప్రవర. సామశాఖ. త్వష్ట్రసూత్రము.

4. ప్రత్నఋషి : ఉపప్రత్న, రుచిదత్త, వాస్తోష్పతి, కౌశల, సనాభ — ఋషులు. అథర్వశాఖ. దైవజ్ఞ (శిల్పి) సూత్రము.

5. సుపర్ణఋషి : ఉపసుపర్ణ, విశ్వజ్ఞ, పరిత, సూరసేన, సాంఖ్యాయన-ఋషులు. ప్రణవశాఖ. విశ్వజ్ఞసూత్రము.

బ్రహ్మర్షి పండిత శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రిసంపాదిత విశ్వబ్రహ్మోపనిషత్తు—గోత్రకాండములనుండి ఈ భాగము గ్రహింపబడినది.

# ఉపయుక్తగ్రంథములు
## (సంస్కృతము)


1 ఋగ్వేదసంహిత

2 కృష్ణయజుర్వేదసంహిత

3 తైత్తిరీయ బ్రాహ్మణము

4 యజురారణ్యకము

5 ఐతరేయబ్రాహ్మణము

6 ఏకాగ్నిమంత్రకాండము

7 పురుషసూక్తము

8 ఈశ, కఠ, ముండక, ఐతరేయ, తైత్తిరీయ, చాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు - శంకరభాష్య సమేతములు

9 శిల్పోపనిషత్తు - కౌమారభాష్య సహితము

10 బ్రహ్మసూత్రశాంకరభాష్యము

11 పద్మ, మత్స్య, అగ్ని, స్కాంద, బ్రహ్మాండ, భాగవత, విశ్వకర్మ – మహాపురాణములు

12 వసిష్ఠోపపురాణము

13 మహాభారతము

14 వాల్మీకిరామాయణము – తిలకవ్యాఖ్య

15 భగవద్గీత

16 వాక్యపదీయము

17 వాత్స్యాయనకామసూత్రం

18 సౌందర్యలహరి

19 వేదాన్త పంచదశి

20 పరశివ విశ్వకర్మాగమము

21 గార్గేయ ప్రతిష్ఠాగమము

22 వైఖానసాగమము
23 పాంచరాత్రాగమములు
24 విశ్వకర్మ వాస్తుశాస్త్రము
25 విశ్వకర్మప్రకాశిక
26 విశ్వకర్మీయశిల్పము
27 విశ్వబ్రహ్మకులోత్సాహ
28 మయమతశిల్పము
29 మయవాస్తుశాస్త్రము
30 వాస్తుశాస్త్రము
31 కాశ్యపశిల్పము
32 భృగుసంహిత
33 రుద్రయామళవాస్తుతంత్రము
34 కులార్ణవతంత్రము
35 మానసారము
36 శిల్పసంహిత
37 శబ్దార్థచింతామణి
38 సమరాంగణసూత్రధారము
39 అపరాజితపృచ్ఛ
40 చరణవ్యూహము
41 శిల్పరత్నము
42 శ్రీతత్త్వనిధి
43 యంత్రసర్వస్వము
44 మండనసూత్రధారగ్రంథములు
45 నారదీయసంహిత
47 శైవాగమము

48 కుమార సంభవము 49 మేఘదూతము

(తెలుగు)

1 ఆంధ్ర నాగరఖండము
2 నన్నయ భారతము
3 ఆంధ్ర విశ్వకర్మపురాణము
4 ఆంధ్ర ప్రశస్తి
5 హంపీక్షేత్రము
6 విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము
7 శ్రీశరభాచార్యులుగారి కావ్యములు
8 కీ శే. గోనుగుంట పున్నయ్యగారి కావ్యములు
9 తోరణము
10 యోగదర్శనము
11 శిల్పకళాక్షేత్రాలు 1, 2 భాగములు
12 శోభనాద్ర్యాచార్య వైభవము
13 1934 సం॥ ఫిబ్రవరి భారతిలోని "హరిజనులు హిందువులు కారా ? మహాత్ముడు హిందువు కాడా?" అన్న కీ.శే. చిలుకూరి వీరభద్రరావు గారి వ్యాసము
14 ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతులలోని కొన్ని వ్యాసములు
15 'భారతి,' అరుణోదయ, సంచికలు

(ఇంగ్లీషు)

1. South Indian Inscriptions
2. Hindu America. (Chmanlal)
3. The Art of Indian Asia.

4. Studies in Indian History and Culture
(By Dr. Narendra Nath Law)

(హిందీ)

1. भारतीय मूर्ति - कला
2. भारत की चित्र कला
3. विश्वब्रह्मकुलोत्साह (మహారాష్ట్రీ)

సందర్భానుసారము అచ్చటచ్చట పేర్కొనబడిన అనేకాంశములు గల గ్రంథములు మఱికొన్ని కూడకలవు,

---

## గ్రంథ ముద్రణకు సాయపడిన ఉదారులు

శ్రీ తాడికొండ కోటీశ్వరరావుగారు B. Sc. (Agrl.)
Director Intigrated Tribal Development Agency.
Khammam. నెల్లూరుజిల్లా వర్తకసంఘముద్వారా రు. 500/-
పంచశీల జ్యూయలరీ కంపెని అండ్ వర్క్సు ప్రొప్రయిటర్సు:
శ్రీ తమిరి మల్లికార్జునరావు అండ్ సన్సువారు-విజయవాడ. రు. 216

రు. 116 లు. ఇచ్చినవారు

శ్రీ వెలగలేటి అమరలింగాచార్యులుగారు B. A. B. Ed. విజయవాడ
శ్రీ మైలాపూరు శివగంగాధరాచార్య స్థపతిగారు శిల్పశాల-విజయవాడ.
శ్రీ చింతమనేని శివరామయ్యచౌదరిగారు B. A. B. L.
లాయర్, తెనాలి.
Lion శ్రీ కె. రవీంద్రప్రసాద్‌గారు, B. Sc. తెనాలి.

శ్రీ కొండూరు ఓంకారంగారు B. A. B. L.
రిటైర్డు డెప్యూటి కలెక్టర్, అడ్వొకేట్ హైకోర్ట్, హైదరాబాద్.
కుమారి చిట్టిమళ్ళ బృందావనంగారు M. A. Lecturer,
College of Education usmania university, Hyderabad.
శ్రీ రాచగుండ్ల చంచలరావుగారు,
తాలూకా ఆఫీస్ డెప్యూటి తహసీల్దారు, ఉదయగిరి.
శ్రీ ఎ. సి. రామాచారిగారు, స్టాటిస్టికల్ అసిస్టెంట్,
మునిసిపల్ ఆఫీస్, గుంటూరు.
కుమారి కొండూరు సుశీలాంబగారు M. A. తెలుగు లెక్చరర్
ప్రభుత్వ స్త్రీలకళాశాల - చీరాల.
శ్రీ పేరేచర్ల సూర్యనారాయణగారు, పోష్టుమాష్టర్ – పెదకాకాని.
శ్రీ వెగ్గళం బాలరత్నంగారు.
శ్రీసత్యనారాయణ డైమండ్ మర్చంట్ - కరీంనగరం
శ్రీ సజ్జన సత్యనారాయణరావుగారు, B. Sc. LL. B. అడ్వొకేట్,
కరీంనగరం.
శ్రీ గారోజు వెంకట రత్నాచార్యభాగవతార్‌గారు, కరీంనగరం
శ్రీ కలికోట చంద్రమౌళిగారు, వెండి బంగారముల వ్యాపారం. ,,
శ్రీ చేపూరి సత్యనారాయణగారు, శ్రీశంకర బాలాజీసామిల్ ,,
శ్రీ నాంపల్లి చంద్రయ్యగారు వెల్డింగ్ ఇండస్ట్రీస్ - ,,
శ్రీ యాస్వాడ బ్రహ్మయ్యగారు శ్రీలక్ష్మినారాయణ
అండ్ కంపెని సామిల్ టింబర్ మర్చంట్. ,,
శ్రీ రామోజు వెంకటాద్రిగారి కుమారుడు లక్ష్మణాచార్యులుగారు
వెండి బంగారముల వ్యాపారం – బట్టలకొట్టు, ,,
శ్రీ కనపర్తి రామస్వామిగారు బ్రహ్మంగారి దేవస్థాన
నిర్మాణ సంఘం అధ్యక్షులు, ,,

శ్రీ శ్రీరామోజు సుందరమూర్తిగారు రేడియో ఇంజనీర్,
ప్రిన్సిపాల్ : వీనస్ రేడియో అండ్ టెక్నికల్ కాలేజి, „
శ్రీ తొగిటి ధర్మయ్యగారు P. W. D. కంట్రాక్టర్–వెల్లుల్లి P. O.
మెట్టుపల్లి తాలూకా - కరీంనగరంజిల్లా.
శ్రీ గోలి ధర్మయ్యగారు భాగ్యలక్ష్మి ప్రింటింగ్ అండ్ డైయింగ్
వర్క్సు, సిరిసిల్లా. కరీంనగరం జిల్లా
శ్రీ చొప్పదంటు నరసయ్యగారు వెండి బంగారముల వ్యాపారం, సిరిసిల్లా.
శ్రీ నాగళ్ళ లక్ష్మీకాంతంగారు B. A. రిటైర్డు తహసీల్దారు
దొడ్డవరప్పాడు. పెదకొత్తపల్లి పోస్టు, ప్రకాశంజిల్లా.
శ్రీ గోళ్ళమూడి హరనాథబాబాగారు B. A. డెప్యూటి తహసీల్దారు
సత్తెనపల్లి.
శ్రీ ఎన్. భాస్కరాచార్యులుగారు. ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటి
సింగరేణి కాలరీస్ కో–ఆపరేటివ్ సెంట్రల్ స్టోర్సు, కొత్తగూడెం,
శ్రీ ఆరెపాక నాగభూషణంగారి కుమారుడు సుబ్బారావుగారు
Draughts Man the K. C. P. Ltd. వుయ్యూరు.
శ్రీ కనగపాటి మధుసూదనరావుగారు
Retd. Superintendent, P. W. D. Work Shop
సీతానగరం.
కీ. శే. సుతారి వేంకటసుబ్బయ్యగారి భార్య శ్రీమతి అచ్యుతాంబగారు
తెనాలి.
కీ॥ శే॥ జగ్గాపాత్రుని వీరభద్రాచార్యులుగారి భార్య అనసూయమ్మగారు,
శివాలయంవీధి, విజయవాడ – రు. 58
శ్రీ కలిదిండి నారాయణరాజుగారు, ఆర్టిస్టు, పెదపుల్లేరు-వయా ఉండి
పశ్చిమ గోదావరిజిల్లా, రు 50
శ్రీ వెదురుపర్తి వీరాచార్యులుగారు, బాపట్ల, రు 50

## శ్రీ వీరరాఘవ గ్రంథావళి :

| | | |
|---|---|---|
| 1. యోగదర్శనము | | రు. 15—00 |
| 2. లేపాక్షి | (చారిత్రకనవల) | ,, 6—00 |
| 3. మోహనాంగి | ,, | ,, 5—00 |
| 4. వీరరాఘవ వ్యాసావళి | | ,, 12—00 |
| 5. మిత్రశతకము (కబీరు భావధారా సహితము) | | ,, 2—00 |
| 6. మిత్రసాహస్రి (నీతివేదాంత ప్రతిపాదకములైన ఆట వెలదులు) | | ,, 10—00 |
| 7. శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతం (విశ్వకర్మాష్టకాది) | | ,, 2—00 |
| 8. మనగురుదేవుడు (బ్రహ్మంగారి సంగ్రహ చరిత్ర) | | ,, 4—00 |
| 9. ఆత్మదర్శనము (అచ్చులో) | | |

• పునర్ముద్రణ కావలసినవి •

అమరావతి (ఖండకావ్యము)
తోరణము ,,
శిల్పకళాక్షేత్రాలు (1, 2 భాగములు)
మూడు కావ్యములు (రామాయణ, భారత, భాగవతముల సమీక్ష)
కళారాధన (జక్కణాచార్య చరిత్ర—నవల)
సాహిత్య వ్యాసములు (1వ భాగము)
నిరంజన విజయము (కీ. శే. వ. నిరంజనశాస్త్రి జీవితము)
ఆసియా జ్యోతులు (బుద్ధ, క్రీస్తు, మహమ్మద్, మహాత్ముల జీవితములు)

• ముద్రణ కావలసినవి •

1. సాహిత్య దర్శనము. 2. ఋగ్వేద దర్శనము. 3. మహాయానము 4. పెందోట. 5. రుద్రకవి. (3, 4, 5 నవలలు) 6. వేదాంత వ్యాసములు. 7. శిల్ప వ్యాసములు

